# ఉపోద్ఘాతము.

ఈ విష్ణుపురాణమును దెనిఁగించిన కవి భావనారాయణ. ఆశ్వాసాంత గద్యముల నీతని యింటిపేరు కలిదిండివారని కలదు. కాని కృత్యాదిపద్యములలో స్వవిషయమును జెప్పుకొన్న.—

"సీ॥ సమధికస్ఫూర్తి కృష్ణాగౌతమీమధ్య, దేశంబునకు భవ్యతిలకమగుచుఁ,
బొగడొందు కలిదిండిపురమున కధిపతి, సుగుణుఁడాపస్తంబ సూత్రుఁడధికుఁ
డసమశాలంకాయనసగోత్రుఁడడవిరా, చయమంత్రి వెలయుఁనయ్యనఘమతికిఁ
దనయుండు మంత్రిరాజనఘుఁడాతఁడుగాంచె, విమలచారిత్రుని వేంకటాద్రి;
గీ॥ నమ్మహాత్మునకును సూరమాంబికకును, నందనుఁడఁ బూరుషోత్తమనాథపాద।
ఘంద్వనానంద మహిమ జీవాతుజీవ, నాథ్యుఁడను భావనారాయణాభిధుఁడను॥"

ఈ పద్యమునుబట్టి యింటిపేరు 'అడవి' వారనుటయుఁ గలిదిండియనునది యీతని నివాసగ్రామము పేరేకాని యింటిపేరు కాదనుటయు స్పష్టము. కాని యితని ముత్తాత, రాచయమంత్రి కలిదిండికధిపతియైయుండుటను బిమ్మట మూఁడు తరములు కడచునప్పటికి (భావనారాయణుని నాఁటికి) మొదటియింటిపేరు పోయి చిరకాలనివాసమువలన గ్రామనామమే గృహనామముగా సిద్ధించె నేమో? అట్లు జరుగుటయుఁ బెక్కుచోట్లఁగలదు.

"తరములేఁ నోల్గయిదెందు నెందునగుఁ, దత్తత్ గ్రామనామంబులన్
బరగున్ వంశములెల్లఁబూర్వపునిజ ప్రఖ్యాతిమాయరిగ"

అను పింగళి సూరనార్యోక్తి యిప్పట్లఁగూడ సార్థక మైనదేమో? అట్లుగాక గద్యలో 'కలిదిండి' అనిపడుట వ్రాయసకాండ్ర ప్రమాదమైనఁ గావచ్చును. 'కలిదిండి' ప్రస్తుతము 'బందరు' పట్టణమునకు సుమారిరువదిమైళ్ల దూరమునఁ గలదు. ఆయూర నిప్పటికిని గోటయను పేర వ్యవహరింపఁబడు నొక ప్రదేశము కలదు. అచ్చటఁ బూర్వమొకదుర్గముండెనఁట. ఉండెనను టకుఁ దార్కాణముగా నా ప్రదేశమున నిప్పటికిని గోడలయు, బురుజులయు జాడలుగలవు. రాచయ మంత్రియాదుర్గాధిపతియో, లేక, కేవలము గ్రామ కరణకుఁడో యయియుండును.

కాలము:— ఈ కవికాలమును నిర్ణయించుటకు గ్రంథస్థ నిదర్శనము లేమియుఁ గానరావు. కాని యితర గ్రంథములో నొకదానింబట్టి కొంత యాధారము

ఈపురాణమునకు ముందీకవి పురుషోత్తమఖండమను నొక ప్రబంధము వ్రాసెనఁట.

"గీ॥ ఘనత శ్రీపురుషోత్తమ ఖండమాంధ్ర,
నవ్యపదబంధముల బ్రబంధంబుచేసి।
యెన్నఁగలదైవమైయున్న వెన్నముద్ద,
ముద్దుకృష్ణున కంకితంబుగనొనర్చి ॥

(ఆ 1 ప 11)

ఈ పురాణమును మూలముతోడను, వెన్నెలగంటి సూరన విష్ణుపురాణముతోడను బోల్చి చూచితిమి. తఱచిచూడఁగాఁ దెనుఁగుపురాణములలో నింతయథామాతృకమైన రచనయేకన్పట్టదు. వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము భారతాదులవలె మూలమునకు యథోచితానుసరణమేగాని దీనివలె యథామాతృకముకాదు. తనకుఁ బూర్వము సుప్రసిద్ధమైన యొకవిష్ణుపురాణము తెనుఁగుననుండగాఁ దానును నాగ్రంథమే రచింపఁబూనుటలో నీకవి సంకల్పము స్పర్థాహంకార ప్రేరితముగాక మూలవిధేయతను సంపాదించు కోర్కెవలనఁ గలిగియుండును. నేఁడు బ్ర॥ శ్రీ. వే. కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గార్కి భారత రచనా సంకల్పమువంటిదే యీ భావనారాయణకవి సంకల్పమై యున్నది. ఇందీతఁడు కృతార్థుఁడయ్యెననియే చెప్పవచ్చును. ఎడనెడఁగొలఁది మూలాతిక్రమణములున్నను నవియంతగాఁ బాటింపఁదగినట్లుగా నగపడవు. అయినను నెచ్చో స్వతంత్రరచనలున్నవో, వానినన్నిటినేరి యీ క్రిందఁ బొందుపఱచెదము.

(1) యజ్ఞవరాహావిర్భావఘట్టమున మూలములోలేనితన్మూర్తి విశేషవర్ణనమిందుఁగలదు. మూలమున.—

" సామస్వరధ్వనిః శ్రీమాన్, జగర్జ పరిఘుర్ఘురః "

అని యున్నయేకవాక్యమును బురస్కరించుకొని యీకవి,

"సీ॥ తనువువిసర్పసంస్తబ్ధతనూరుహా, ద్ధతి నజాండంబురంధ్రములు వ్రోవ,
వాలధి త్రిప్ప దుర్వారవాతాహతి, నబ్దముల్ వలయాద్రియవలి కేగ।
ఘుర్ఘురధ్వనిచేయఁ గోటిసంఖ్యాక, నిర్ఘాతారభటిశంక గడలుకొనఁగ,
యడుగువెట్టిన బలోదగ్రఖురాది ఘట్టన నగేంద్రములైనదునిసిపోవ ॥
గీ॥ శ్వారియొయజ్ఞత్రయీమయంబైన ఘోణిరూపధేయంబు దాల్చియారూఢమహిమ।
దనుజనస్థానవాసులై మునులువొగడ, సంభృతోల్లాసభాసియై జలధిఁజొచ్చె ॥

(ఆ 1 ప 98)

అనుపద్యము బెంచి వ్రాసెను.

చిక్కినది. దీనిని బట్టియైనను సిద్ధాంతముచేయ సాహసింపక బలవత్తర యాధారము లంభించువఱకు నిదియేయుపాదేయముకావచ్చునని కైకొం

సుదక్షిణా పరిణయకర్తయైన తెనాలి అన్నయ్యకును, నీ భావ నారాయణ గురుస్థానమొకటియే.

క॥ కందాళ-భావనార్యుల, నందను శ్రీరంగగురుని నతబుధరతు।
మందారంబు నుతింతును, మందారమరందబిందు మధురారభటిన్ ॥

(సుదక్షిణా పరిణయ

కందాళభావనార్యుని కుమారుడైన శ్రీరంగాచార్యులే మనయడవిభావన యణకవికిని గురువని యూహించుట కాధారము, రెంటను దండ్రి పేరుక సరిపోవుటయే.

ఈ సుదక్షిణాపరిణయకృతీశ్వరుడు కోనేటిరామరాజుమంత్రియైన పులిజాలస నామాత్యుడు. ఈ కోనేటి రామరాజు, సదాశివరాయలకు బ్రతినిధి విజయనగర సామ్రాజ్యము పాలించి 1565 లో దల్లికోట యుద్ధమ గతించిన అళియరామరాజునకు బెదతండ్రికొడుకు మనుమడు. అళి రామరాజు చిరకాలజీవి. అతనికి మరణకాలమునాటికే యెదిగిన మనవ కలరు. కాన నాతని పెదతండ్రికొడుకునకును నాతల్లికోటయుద్ధము నా మనుమడుండియుండవచ్చును. ఆ మనుమడు (కోనేటి రామరాజు)రాజా పత్యము వహించుటకు గొంత యెక్కువకాలమే పట్టినదనుకొన్నను, స క్రీ॥ శ॥ 1600, సంవత్సర ప్రాంతముల జరిగియుండవచ్చును. కనుక సుదక్షి పరిణయకృతీశ్వరుని ప్రభువు క్రీ॥ శ॥ 1600 సంవత్సర ప్రాంతముల వా కాగా సుదక్షిణాపరిణయకర్తయు నాకాలమువాడే యగును. మనభావనా యణయు నాతనికి సమకాలికుడగుటచే నప్పటి వాడేయైయుండును. అన క్రీ॥ శ॥ 16 శతాబ్దితుది భాగమువాడని మాత్రమే చెప్పవచ్చును.

భావనారాయణ శ్రీ పురుషోత్తమస్వామిభక్తుడు. సుభద్రాదేవతోపాసకు కావుననే "సుభద్రా కరుణాకటాక్ష వీక్షాలబ్ధకవిత్వతత్వ పవిత్రుండ" చెప్పికొనెను. (ఆ 1 ప 10) కందాళ శ్రీరంగాచార్యులీతని గురువు వనగా గులగురువేగాక, విద్యాగురువని కూడ నూహించుట కాధారము "కందాళ శ్రీరంగ గురుని మద్గురుని భజింతు నభీష్టార్థరూఢికొఱకు"

(ఆ 1 ప

అని గురుశబ్దము రెండుమార్లు ప్రయుక్తమైనది. గురుదేవతాభక్తి కల డగు నీకవి విద్యాగురు నొకని వేఱుగా బేర్కొనకపోవుటయు నీ యూహాక బోద్బలముగానున్నది.

శ్రీకుక్తైన దేవతలు, బ్రహ్మనుపురస్కరించుకొని పాల్కడలిచేరి విష్ణుని
స్తోత్రముచేయఁగా భగవంతుఁడు వారికి దర్శనమిచ్చు సందర్భమున మూల
ములో.—

తందృష్ట్వా తే తదా దేవాః, శంఖచక్రగదాధరమ్ ।
పూర్వరూప సంస్థానం, తేజసాంరాశి మూర్జితమ్ ॥

అను శ్లోకము కలదు.— ఈ శ్లోకార్థమును నీ కవియెంతగాఁ బెంచెనో
చుఁడు.—

ఎదబొదల్ సిరిమేననొదుగు నుంజాయల మక్కడించిన పైడిమణుఁగువాని
ఘుకుదంతముల నిద్దపురుచిచ్ఛటలని, న్మడిమైన కలికిలే నగవువాని ।
పలిడాల్బల్లు కెంగేలిచిందపుతేట, నీలైనచుట్టు వాల్మెఱుగువాని
తెలికన్నుగొనల చూపులఁ జాలకళ లెక్క, నక్రకుండల సమున్నతులవాని॥
నతురకలశాంబునిధి సుధాసౌధవీధి, జిలుగుతరగల ముత్యాలచేర్లుసిరుల ।
లరు ఫణిరాజు తూగుటుయ్యాలఁదూగువాని, శ్రీజానిఁగనిరి వాగ్వరుఁడుసురలు॥

(ఆ 1-ప 208.)

లగంటి సూరనగ్రంథములో నిట్టిదే యొక వర్ణనకలదు. ఇది వానియను
రణమని తోఁచెడిని.

శతకోటి భాస్కర సందీప్తతేజునిఁ, బ్రావృట్పయోధర భవ్యగాత్రు
శంఖసుదర్శన శార్ఙ్గగదా హస్తుఁ, బీతకౌశేయశోభిత కటీరు ।
లలిత శ్రీవత్సలాంఛన లాంఛితుఁ గౌస్తుభస్ఫూర్తి వేయక ప్రభావు
మందిరామందిరా యతపీనవక్షునిఁ, దారుణ్యకోటి కందర్పమూర్తి ॥
పుండరీకాక్షు జగదేక పూతచరితు, సతతకరుణాకటాక్ష వీక్షణసమస్త ।
యోగినిర్మల హృదయపయోజనిలయు, విష్ణుఁబొడగాంచి సంతోషవివశులగుచు॥

(వె. సూ. విష్ణుపురాణ, ఆ 1 ప 166.)

పాల్కడలిని లక్ష్మి యావిర్భవించు ఘట్టమున మూలములో లేనివర్ణన మిందు
చాలఁగలదు. (ఆ 1 ప 224-230) ఇట్టి వర్ణన వెన్నెలగంటి సూరన గ్రంథ
ములోను లేదు.

ధ్రువచరిత్ర.

కథయంతయు యథామాతృకమే గాని తపము చేయఁబోవు ధ్రువుఁడు
తల్లితో.—

అమితపరాభవానల శిఖావృతిగందిన నింకనుత్తమో
త్తమపద లాభమొందెద వృథావచనంబులు వల్కనీసప ।

ఈపురాణమునకు ముందీకవి పురుషోత్తమఖండమను నొకప్రబంధము వ్రాసెనఁట.

"గీ॥ ఘనత శ్రీపురుషోత్తమఖండమాంధ్ర,
నవ్యపదబంధములఁ బ్రబంధంబుచేసి।
యెన్నఁగలదైవమైయున్న వెన్నముద్ద,
ముద్దుకృష్ణున కంకితంబుగనొనర్చి॥

(ఆ 1 ప 11)

ఈ పురాణమును మూలముతోడను, వెన్నెలగంటి సూరన విష్ణుపురాణముతోడను బోల్చి చూచితిమి. తఱచిచూడఁగాఁ దెనుఁగుపురాణములలో నింతయథామాతృకమైన రచనయేకన్పట్టదు. వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము భారతాదులవలె మూలమునకు యథోచితానుసరణమేగాని దీనివలె యథామాతృకముకాదు. తనకుఁ బూర్వము సుప్రసిద్ధమైన యొకవిష్ణుపురాణము తెనుఁగుననుండగాఁ దానును నాగ్రంథమే రచింపఁబూనుటలో నీకవి సంకల్పము స్వార్థాహంకార ప్రేరితముగాక మూలవిధేయతను సంపాదించు కోర్కెవలనఁ గల్గియుండును. నేఁడు బ్ర॥ శ్రీ. వే. కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి భారత రచనా సంకల్పమువంటిదే యీ భావనారాయణకవి సంకల్పమైయున్నది. ఇందీతఁడు కృతార్థుఁడయ్యెననియే చెప్పవచ్చును. ఎడనెడఁగొలఁది మూలాతిక్రమణములున్నను నవియంతగాఁ బాటింపఁదగినట్లుగా నగపడవు. అయినను నెచ్చో స్వతంత్రరచనలున్నవో, వానినన్నిటినేరి యీ క్రిందఁ బొందుపఱచెదము.

(1) యజ్ఞవరాహావిర్భావఘట్టమున మూలములోలేనితన్మూర్తి విశేషవర్ణనమిందుఁగలదు. మూలమున.—

"సామస్వరధ్వనిః శ్రీమాన్, జగర్జ పరిఘుర్ఘురః"

అని యున్నయేకవాక్యమును బురస్కరించుకొని యీకవి,

"సీ॥ తనువువిదర్చ సంస్తబ్ధతనూరుహరోఁ, ద్ధతి నజాండంబురంధ్రములు వ్రేవ,
వాల్లధిత్రిప్ప దుర్వారవాతాహతి, నబ్దముల్ వలయాద్రియవలికేఁగ।
ఘుర్ఘురధ్వనిచేయఁ గోటిసంఖ్యాక, నిర్ఘాతారభటిశంక గడలుకొనఁగ,
యడుగువెట్టిన బలోదగ్రఖురాది ఘట్టన నగేంద్రములైనడునిసిపోవ॥
గీ॥ హరియయజ్ఞత్రయీమయంబైన ఘోణిరూపధేయంబు దాల్చియారూఢమహిమ
దనుజనస్థానవాసులై మునులువొగడ, సంభృతోల్లాసభాసియై జలధిఁజొచ్చె

(ఆ 1 ప 98)

అనుపద్యముఁ బెంచి వ్రాసెను.

మదికి విస్మయంబొదవఁ జెల్లముతండ్రియుఁ బొందనోపఁడు
ముఁడన నెంతయంచువిబుధ ప్రవరుల్వినుతించునట్లుగన్ ॥

ండినమాట మూలములో లేదు. ఈ యతిక్రమణమువల్ల నేమేని గుణము
ంచినదాయన్న, ధ్రువునకహంకారము కూర్చినదే కాని గుణముకూర్ప లేదు.
కథకు మూలమున లేని వన్నె తెచ్చినవాఁడు వెన్నెలగంటి సూరన. రస
పాద నార్థమాతఁడీ కథను గొంత విపులముగఁ బెంచి వ్రాసి సంకల్ప
ఁడయ్యెను. సర్వథా యీ ఘట్టమున సూరనయే మేలుచేయి యనవచ్చును
ాహరణార్థ మొక సందర్భము చూపెదము. సవతి తల్లిచే బ్రేటువడి బిన్న
ంగముతో ధ్రువుఁడు తల్లిచెంతకుఁ బోవుటను.—

్రువుఁడపుడవిరళకోపో, ద్భవుఁడై యచ్చోటువాసి తనునొందుపరా ।
ము తనతల్లికెటేఁగిం, చ వడిందగ్ధేహమునకుఁ జయ్యనఁబోయెన్ ॥

భవ పీడితుసీవత్, స్ఫురితాధరుఁ దనయునపుడు చూచి జననియా ।
మునసంకస్థలినిడి, శిరమాఘ్రాణించియనియెఁ జిత్తము చెదరన్ ॥

ాన నారాయణ చిత్రించెను. దీనినే సూరన.—

ంగవనశ్రుపూరములు గ్రమ్మగ పీడిన కాకపక్షముల్
ుకకుపీల దైన్యరసవేదన నిల్వఁగలేక యేడ్చుచున్ ।
ని నికేతనంబునకుఁ జయ్యనఁబోయి ధ్రువుండు దీనుఁడై
పెదతల్లి సేతయును దండ్రియుపేక్షయుఁ జెప్పఁజెప్పినన్ ॥

ుకుకన్నుల బాష్పముల్ తుడిచి తల్లి, శిరముమూర్కొని కౌగిటఁ జేరియేడు।
ఃపితనకునుగన్ను నీరొలుకుచుండ, నతనితో గద్గద స్వరయగుచుననియె ॥

రళ తాసుందరములును, హృదయంగమములు నైన పద్యములలో
ంచెను.

ుముని చరిత్ర.

ితపము సేయదొరకొనఁగాఁ వత్క్షోభ కోఱకు సురేంద్రునిచేఁ బ్రమ్లో
మను నప్సరస ప్రయుక్తయై యామునిని గలఁచెనఁట.

ు తేపే సుమహత్తపః,
త్క్షోభాయసురేంద్రేణ ప్రమ్లోచాఖ్యావరాప్సరాః ।
ప్రయుక్తాక్షోభయామాస తమ్మృషింసాశుచిస్మితా ॥" మూలము.

్రము వర్ణనానుకూల విషయముగాన నీకవి యాముని చేయుతపము వేఁడిమి
వ్యాప్తమై లోకముల బెగ్గిడిలఁ జేసెననియు, నంత దేవేంద్ర ప్రేరితయై
ు ప్రమ్లోచ యా మునిమ్రోల శృంగారచేష్టా విలాసములు నెఱపె

ననియు, నంత నాతని తపము కలతవడి చెడెననియు, నేమేమో పెంచి కొన్ని రసవంతములైన పద్యములు పొందుపఱచినాఁడు, (1 ఆ ప 406—412) ఇది మూలాతిక్రమణమే యైనను రససంపాదన హేతువే యైనది. మఱియుఁ గండుముని మరల నెఱుక గలవాఁడై యప్సరస నుజ్జగించి కాలక్రమమున శ్రీ పురుషోత్తమ క్షేత్రముచేరి స్వామిని సందర్శించు సందర్భమున నిందు గల పద్యములకు మూలమున నాధారములేదు. (ఆ 1—450—477 ప.) కవి యిచ్చట నింత విపుల వర్ణనముచేయుట కేవల మిష్టదేవతా పక్షపాత గ్గరిమచేతనే యనవచ్చును.

5. ప్రహ్లాదచరిత్ర.

భాగవత ప్రసిద్ధమైన నృసింహావిర్భావము విష్ణుపురాణమున లేనేలేదు. హిరణ్యకశిపుఁ డనుతప్తుఁడై కుమారునిఁ బ్రేమ పూర్వకముగాఁ గైకొని శేషించిన జీవితకాలము సుఖముగా గడపినట్లొక శ్లోకమున నున్నది. అట్లయ్యును దరువాతి శ్లోకమునఁ బ్రహ్లాద రాజ్యాభిషేకమునకుఁ గారణముగాఁ దంష్ట్రి నృసింహునిచే నంత మొందింపఁ బడఁగాఁ బ్రహ్లాదుఁడు రాజయ్యెనని కలదు. ఇది సందర్భ రహితముగానున్నది.

“ఇత్యుక్త్వాఽంతర్దధే విష్ణుః, తత్ర మైత్రేయపశ్యతః ।
సచాపి పునరాగమ్య వవందే చరణౌ పితుః ॥
తంపితా మూర్ధ్న్యుపాఘ్రాయ, పరిష్వజ్యచ పీడితమ్ ।
జీవసీత్యాహ, వత్సేతి బాష్పార్ద్ర నయనో ద్విజ ॥
ప్రీతిమాంశ్చా భవత్తస్మిన్, అనుతాపీ మహాసురః ।
గురుపిత్రోశ్చకారైవ, శుశ్రూషాం సోపిధర్మవిత్ ॥
పితర్యుపరతంనీతే, నరసింహ స్వరూపిణా ।
విష్ణునా సోఽపి దైత్యానాం, మైత్రేయా భూత్పతి స్తతః ॥”

మూలమున నిట్లుండఁగా నీ తెనుఁగు సేఁతలో నృసింహరూపము మాటయే వదలి జనకుఁడు దివికేగఁ బ్రహ్లాదుఁడు రాజయ్యెనని కలదు.

“సీ॥ జనకుండు దివికిఁబోయిన దైత్యపతియయ్యెఁ బ్రహ్లాదుఁడంత.”
(ఆ 1—ప 657).

వెన్నెలగంటి. సూరన్న గ్రంథములో నింకను భిన్నముగానున్నది.
(ఆ 2—ప 329 etc)

6. జడభరతోపాఖ్యానము,

ఈ గాథ యిందు మూలమును సూరనరచనను గూడ ధిక్కరించుచున్నది. భాగవతముతోఁ గూడఁ బోల్చిచూడ భావనారాయణ రచనయే సర్వాతిశాయియై

కనుపట్టినది. ఒక తార్కాణము, భరతాశ్రమమున లేడి పిల్ల సంచారము వర్ణించుపట్టు.

మూలము. "చచారాశ్రమపర్యంతే తృణాని గహనేషుసః।
దూరంగత్వా చ శార్దూల త్రాసాదభ్యాయయాపునః ॥
ప్రాతర్గత్వాతి దూరంచ సాయమాయాత్తదాశ్రమమ్।
పునశ్చభరతస్యా భూత్ ఆశ్రమస్యోటజాజిరే ॥

సూరన.

సీ॥ పూరిమేయగదప్పపోయి బెబ్బులిపిండు, దిగులునఁగ్రమ్మఱఁ దిరిగివచ్చు
సారెసారెకుఁదదాశ్రమ సమీపమ్మున, వేడ్కతోఁగంతులు వేయుచుండు।
మలయుచువచ్చికోమల యుగ్మశృంగంబు, చేతనెమ్మేని కండూతిఁదీర్చు
యోగాసనంబునబాగు మీరగనుండ, మవ్వంపుతొడలపైఁ బవ్వళించు ॥

గీ॥ పర్ణశాలచుట్టు పరువులువెట్టుచు, లేతయైనపూరి మేతమేయు।
ననుదినంబునిట్టు లామృగశాబంబు, ముద్దుచూపుచుండు మునివరునకు ॥

భాగవతము.

చ॥ గురువులువ్రాఁటి, బిట్టుఱికికొమ్ములజిమ్ముచునంతకంతడ
గ్గఱచునుగాలుద్రవ్వుచు నఖంబులగీఱుచు గాసిసేయుచు।
న్నొఱగుచుధారుణీశ్వరునియూరువులన్నయ నించియంతలోఁ
నఱకడయెక్కుచున్ బొదవియాడుచు నాహరిణంబులీలతోఁన్ ॥

(పంచమస్కం॥ 106-ప॥)

భావనారాయణ

సీ॥ నటనగా నుటజాంగణమున గంతులువేయు, మురియుచు నవకుశముష్టిమేయు
కండూతివ్రాఖురాగ్రములనంగముగోకు, వెఱమృగంబులఁజూచిబెదఱిపఱచు।
తరుణరసాలపోతముల ప్రక్కలురాయు, పలుమారుకుంజ గర్భములుదూరు
దూరంబుగానటవీరాజిఁబడిపోవు, వేవేగమగుడి యావిర్భవించు ॥

గీ॥ కెలనఁదనసీడఁగన్గొని క్రేళ్లుదాటు, నేలమూర్కొని పలుమారునింగిచూచు।
నలసిశయనించిరోమంథమాచరించు, తరుణమృగశాబమారాచతపసియెదుట ॥

పైనుదాహరించిన పద్యములలోనీపద్యము లలితలలితమై,స్వభావోక్తిగుంభితమై యెంతరసా మనోహరముగా నున్నదనుటకు సంశయములేదు,

### 7. రామచరితము.

రామునిపుట్టుక, రామునిమహిమ, దక్షిణాపథము, ఋషిజనస్తోత్రము మొదలగు విషయములు మూలమున లేనివియిందు కల్పించి వ్రాయఁబడినవి.

(ఆ 4-వ 165 ... 193)

ఈయాశ్వాసము నందే పరశురామవర్ణనగల 276 పద్యమునకు మూలాధారము లేదు, గ్రంథమంతయు మూలముతోఁ బోల్చిచూడఁగా స్వకల్పితములని చెప్పం ందగిన ప్రకరణము లివిమాత్రమే. గ్రంథబాహుళ్యమును బట్టియీస్వల్పము పేక్షించితిమేని, రచనమొత్తముమీఁద యథామాతృక మనుట సత్యేతరము కాఁజాలదు. ప్రాసంగికముగా సూరనవిష్ణుపురాణమునుగూడఁ దడవి ప్రకరణ వశమునఁ జెప్పఁ దగిన తారతమ్యములఁ దెల్పితిమి. కాని యింకొక్కవిష యము. సంస్కృతపురాణ మాఱంశలుగలది. సూరనదాని నంతయు నెనిమిది యాశ్వాసములుగాఁ దెనిఁగించెను. ఈ గ్రంథమున నాల్గంశలు మాత్రమే గలవు. తక్కు రెండును నీకవి తెనిఁగింపనే లేదో, యట్లుగాక గ్రంథమేనష్ట మైనదో, యుభయపక్షముల నేదియైనను నిదిమాత్ర మసమగ్రగ్రంథమే యైనది.

### శైలి-:

సాధారణముగాఁ బురాణముల యందలిశైలికిని, ప్రబంధముల శైలికిని స్థూల దృష్టికిఁగూడ గోచరించు వాసియుండును. మొదటిది ప్రసన్న గంభీరమైన శరన్నదీ ప్రవాహమువంటిది. రెండవది దరులొరసి కొనుచు, తరంగితమై పొంగిపొరలు ప్రావృట్ప్రవాహమువంటిది. తెనుఁగున భాగవతమువంటి యేయొకటి రెండో తక్క, తక్కినపురాణము లన్నియు నీప్రమాణమునకు విధే యములే. తెనుఁగునఁ బ్రబంధ రచనయుఁ, దత్పఠనమును మిక్కిలిగా సాగిన పిమ్మట బయలుదేరిన పురాణములు కాలధర్మమతిక్ర మింపఁజాలక ప్రబంధ ఫక్కినే నడచినవి. కంకంటి పాపరాజకృతోత్తర రామాయణ మిందుకుఁ దార్కాణ. ఈ భావనారాయణ విష్ణుపురాణమును నిట్టిదియే. వెన్నెలగంటి సూరనగ్రంథము నకును దీనికిని ముఖ్యభేదమిచ్చటనే కలదు. సూరనశైలి సర్వథా పురాణవిలక్షణ శోభితము. ఇది ప్రబంధల లక్షణసంయుతము.

### 8. శబ్దప్రయోగవిశేషములు.

కొన్ని వ్యాకరణములను ప్రమాణములుగా గైకొని యీగ్రంథమును బరీక్షించి నచోఁ దప్పులని చెప్పఁదగిన ప్రయోగములు కొన్ని పొడగట్టును, కాని

ఎముపానికిఁ దప్పులనక ప్రయోగవిశేషము లందుము. ఏమనస్వతంత్రుఁడును, పొ గ్రంథ కర్తయూనగు కవినినసమగ్ర లక్షణమునకు విధేయునిఁ జేయుట స్త్రవిరుద్ధము అట్టి ప్రయోగ విశేషముల నీక్రిందఁ బొందుపఱచు స్నాము.—

ప — విశేషము.

23 — కార్నొగుల్ పసగెల్వ (కార్నొగుల పసలనియర్థము)
481 — కార్నొగుల్ నిగనిగల్ (కార్నొగుల నిగనిగలు)
538 — మిక్కిలీ భూవలయంబునన్. (మిక్కిలి యీభూవలయంబునన్)
64 — మిక్కిలయ్యున్.
578 — గట్టియుండన్ - (కట్టియైయుండన్)
105 — ఒనరుదేను (ఒనరుదున్, ఏను)
111 — కేశవాచ్యుత (కేశవ ! అచ్యుత !)
182 — చేసిటు - (చేసి+ఇటు)
చుట్టిచ్చి - చుట్టి+ఇచ్చి)
190 — ఎక్కక - ఎక్కకొని.
208 — ఎదబొదల్ - ఎదబొదలు.
206 — చొరవఁగా - చొరఁగా.
408 — నతులవెయ్యింటిఁ గనియె, - వేయిమందిని అనుట.
568 — అని దైత్యేంద్రుని సమ్మతించి - సమ్మతింపఁజేసి.
71 — 2పా॥ సంపూర్ణస్ఫూర్తి-ర్ణ-లఘువు చేయబడినది.
78 — క్రొవ్వునఁ గోడలిఁగూఁతురుఁ గలిసిన.
235 — తనయుకు - (తనయునకు)
74 — పథ్యుకు - పథ్యునకు.
184 — తీసుక - తీసికొని.

స్వలిఖిత పుస్తకభాండాగారమున నీగ్రంథము ప్రతియొక్కటి యేకలదు. ంచెక్కడు తప్పులు గాని గ్రంథ పాతములుగాని లేవు. ఇదిగాక డాక్టర్. భట్టా శేషగిరిరావు పంతులుగారు యమ్, ఏ. పిహెచ్, డి. (ఆంధ్రభారతీ ధ్యాధ్యక్షులు (విజయనగరము) వారియొద్దఁగల వేఱొకప్రతి యాదరమున) సంగిరి. మాయొద్దనున్న ప్రతిలో సందిగ్ధములై యున్న కొన్ని పాఠముల గానినిబట్టి చక్కఁజేసితిమి. ఈ రెంటనుతీరని సందేహములను మూలమునుబట్టి

సంస్కరించితిమి. ఈ రెండు ప్రతులలోనుగూడ సర్వథా శుద్ధము కానటువంటి గాంబోలును తఱచుగా విసంధిపాటింపఁబడినది. ఇది వ్రాయసగాని యజ్ఞత వలనఁ గలిగినదిగాఁ దోపకుండుటచేఁ జెక్కుస్థలముల యథామాతృకముగా దానినట్లే యుంచినారము గాని సంస్కరింప సాహసింపలేదు.

ఆంధ్రశాఖ.
ప్రాచ్యపరిశోధనాలయము.
లిమ్డీ గార్డన్సు
మద్రాసు. 15-9-1929.

కోరాడ — రామకృష్ణయ్య ఎమ్. ఏ.
రీడరు.
పింగళి — లక్ష్మీకాంతం, బి.ఏ.
ఫెల్లో.

1930-వ సంవత్సరము జులై మాసారంభమున నీప్రాచ్యపరిశోధనాలయ విషయమున జరిగిన మార్పులనుబట్టి, యాంధ్రశాఖలో నంతకుఁబూర్వము ఫెల్లోగానుండిన పింగళి - లక్ష్మీకాంతం. బి. యే. గారికి ప్రతిగా వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిలుగారు వచ్చియుండుటచే, నీగ్రంథమున 3-వ యాశ్వాసము 150-వ పద్యము మొదలు కొన్ని ప్రూఫులు వీరిసాహాయ్యమున సరిచూడఁబడినవి.

కోరాడ — రామకృష్ణయ్య.

శ్రీరస్తు.

# విష్ణుపురాణము.

భావనారాయణకృతము.

## ప్రథమాంశము.

శ్రీనీలాచల శృంగభాగమున, సంశ్లిష్యత్సుభద్రాలతా
వ్యానద్ధత్వమెలర్ప, నాశ్రితమనోవాంఛావిధానావధా ।
నానూనంబగు పూరుషోత్తమ సుపర్వానోకహస్వామి, మా
కానందప్రదకామితార్థ ఫలవర్గావాప్తిఁగావించుతన్ ॥ 1

సీ॥ తనుభజించఁగనేర్చు జనులకోర్కెలఁదీర్చు, సిరిఁగూర్చు కేలికెంజిగురులలర ।
అధికమాధురిఁదెచ్చు నమృతపూరముమెచ్చు, పసహెచ్చు కెమ్మోవిపండువెలయ ।
సౌమనస్యమునించు, చక్కఁదనముమించు, తులకించు గుబ్బగుత్తులువెలుంగఁ ।
జెవులసేదలుదేర సింగారములుమీఱ, నినుపాఱఁబల్కు తేనియలుచిలుక ॥

గీ॥ నీలగిరివాస నృహరి వక్షోలవాల, దేశమునవృద్ధిఁబొంది యర్థితములొసఁగు ।
ఘనతరశ్రీసుభద్రాఖ్యకల్పలతిక, లీల నే గోరు ఫలము ఫలించుఁగాత ॥ 2

మ॥ కలధౌతాచల చాకచక్య హసదంగచ్ఛాయతో, గండమం
డల నృత్యన్మణికుండల ప్రతిభతో నవ్యాసితోద్యన్నిచో
లలసద్దీధితితో, మనోజ్ఞవనమాలాలంకృతోరస్థలీ
విలుఠద్ధారలతాభతో వెలయుసద్వేద్యుం, బలుం, గొల్చెదన్ ॥ 3

చ॥ మెలఁగునినాగ్నులుట్టిపడు మిణ్గురు లుద్ధతయుద్ధబద్ధదో
హలబలవన్నిశాటు లెదురై పడు సాంద్రపతంగకోటిగా
సొలఁదిడరాని తేజములకుప్ప, కకుప్పతిపాలకంబు, శ్రీ
నిలయుమహాసుదర్శనము, నిచ్చలు, నన్ గరుణించుఁగావుతన్ ॥ 4

సీ॥ ప్రకటప్రభావ మార్కండేయశంకర ప్రముఖాష్టకము, క్షేత్రపాలనికర ।
మావవణత్రయాధ్యక్షత్వమునమించు దీపించువిమలాది దేవతలును ।

దలఁచినమాత్రఁ బాతక జాలములఁ ద్రుంచు పటువైభవము తీర్థపంచకంబు ।
త్రిభువనశాసనోద్దీపితుండు గ్రసేన సమాహ్వయుండు సేనావిభుండు ॥

గీ॥ కమలనేత్రుని దేహమక్షయవటంబు, సిరులు శ్రీపురుషోత్తమ క్షేత్రమునకు ।
నఖిలఘనమునునగువీరయస్మదీయ,కృతికిశుభ మొసగుదురుగాకయతులమహిమ॥

సీ॥ తనను మ్రొక్కిన మ్రొక్కు, జనురనోకహ వినిర్దళన ప్రచండపరశ్వధంబు ।
తనసేవ పాతకోదకగభీరత్వ దుస్తరసంసరణవార్ధితరణతరణి ।
తనశ్రీమదంఘ్రి తీర్థము, ముక్తిసామ్రాజ్య పట్టాభిషేకసంభారజలము ।
తనసంశ్రయణము, సౌధాయిత మహనీయ కైవల్య నిశ్రేణికాశ్రయంబు ॥

గీ॥ గాంగ వాధూలగోత్ర సాగరశశాంక, భావనాచార్య తనయుఁడై ప్రబలు, నపర ।
హరిని, కందాళశ్రీరంగ గురుని, మద్గురునిభజింతు నభీష్టార్థరూఢికొఱకు ॥ 6

సీ॥ పూర్ణభక్తిభజింతుఁ బోయిగపూదత్త పేయాళువారుల చరణాంబుజములు ।
సేవింతుమదిలోన శ్రీభక్తిసార భట్టాధిప కులశేఖ రార్యవరులఁ ।
బ్రణుతింతు మునివాహభక్తాంఘ్రిరేణు ద్విపద్దండధరుల నిశ్చలమనీష ।
వరివస్యగూర్తు మధురకవిశఠగోప భాష్యకర్తలకు సౌభాగ్యరేఖ ।

గీ॥ నాథయామునముని కూరనాథపుండరీక, దృగ్రామ మిశ్రాదిలోకవిశ్రు । [కు॥
తాద్యగురుసంఘములకుసాష్టాంగనతులు, సేయుదు మదీయకృతికి క్షేమసేయుకొఱ

సీ॥ తారకబ్రహ్మ మంత్రరహస్య సంవేదిఁ బ్రాచేతసుని మనః పదవిఁగొలిచి ।
చిదచిదీశ్వర తత్త్వపద వినిర్ణయశాలి శ్రీపరాశరుని సద్భక్తిభజించి ।
గీతోపనిష దర్థజాత నిర్ణేతయౌ బాదరాయణు పదాబ్జముల కెఱఁగి ।
శ్రీకృష్ణ పాదరాజీవ చంచచ్చంచరీకాత్మశుకుని సంప్రీతిఁబొగడి ॥

గీ॥ ఆంజనేయ కయాధుసు తాంబరీష, నారద విభీషణాది పుణ్యస్వరూప ।
పరమభాగవతాంఘ్రి పంకరుహములకు, సవినయాధిక సద్భక్తి,సాఁగి మ్రొక్కి॥

సీ॥ సమధికస్ఫూర్తిఁ గృష్ణా గౌతమీమధ్య దేశంబునకుభవ్య తిలకమగుచుఁ ।
బొగడొందు కలిదిండిపురమున కధిపతి సుగుణుఁడాపస్తంబసూత్రుఁడధికుఁ ।
డసమశాలంకాయనసగోత్రుఁ డడవిరాచయమంత్రి వెలయు,నయ్యనఘుమతికిఁ ।
దనయుండు,మంత్రి రాజనఘుఁ డాతఁడుగాంచె విమల చారిత్రుని వేంకటాద్రి ।

గీ॥ నమ్మహాత్మునకును సూరమాంబికకును, నందనుఁడఁ బూరుషోత్తమ నాథపాద
వంద నానందమహిమ జీవాతుజీవ, నాథుఁడను భావనారాయణాభిధుఁడను ॥

వ॥ శ్రీసుభద్రా కరుణాకటాక్ష వీక్షాలబ్ధ కవిత్వతత్త్వ పవిత్రుండనై యుండి
మున్ను॥ 10

మనత, శ్రీపురుషోత్తమఖండ మాంధ్ర, నవ్య పదబంధములఁ బ్రబంధంబుచేసి।
మెన్న(గుల దైవమైయున్న వెన్నముద్ద, ముద్దుకృష్ణున కంకితంబుగ నొనర్చి॥ 11

మఱియు నొక్క పురాణంబు తెనుంగుచేసి శ్రీజగన్నాథునకు సమర్పింపవలయు
ని తలంచి॥ 12

మునీంద్రునితాత తామరసాసన, చోద్య సంయమ వసిష్ఠుఁడు, వసిష్ఠుఁ।
మునీంద్రుని తండ్రి భౌమాంతరిక్ష విస్మయకృన్మహా తపశ్శక్తి శక్తి।
మునీంద్రునిపుత్త్రుఁ డిద్ధ జగద్రక్ష ణాయతాఖ్యుఁడు బాదరాయ ణాఖ్యుఁ।
మునీంద్రునిపౌత్త్రుఁడామోదిహృత్క్రంజనుఖితకార్తస్వరాంశుకుఁడు శుకుఁడు
గతిఁబొగడొందునతఁడుజాజ్వల్యమాన నవనవాఇతవహావాఇతపరాశరుఁడుభక్త
స్యసుఖ కృద్ఘనకటాక్ష జనికృపాప, రం పరాశరుఁడగు శ్రీపరాశరుండు॥ 13

ట్టి శ్రీపరాశర మునీంద్రుం డానతిచ్చిన పురాణరత్నంబైన శ్రీవిష్ణు పురా
ం బశేష పురాణంబులకు రాద్ధాంతంబని విబుధ ప్రకరంబులవలనవిని,
నుంగుసేయ నమకట్టి, యవిఘ్న పరిసమాప్తికి శ్రీసుభద్రా వల్లభుండైన
జగన్నాథుండ కలండని కృతనిశ్చయుండనై, కడంగి॥ 14

నపదబంధబంధుర తరకథిత ప్రసవమాల్యతతి శ్రీహరికిన్।
విమ, సమర్పించుచు నిహ, పరసుఖములు గన్న సుకవిపతుల నుతింతున్ ॥15

నమున్ శ్రీపురుషోత్తమాధిపతికిం దేదీప్యమాన ప్రసూ
నఫ్రొాద్యద్వనమాలికా ఫలవిమానంబుల్ సమగ్రంబులై।
రన్, దోటలు క్షేత్రరాజమునఁ జెంతన్నిల్పి, యప్పద్మలో,
మఁడే తానగు రామకృష్ణభటు గోసాయిం బ్రశంసించెదన్॥ 16

తి, శ్రీవిష్ణుపురాణము, కృతికినధీశ్వరుఁడు నీలగిరిపతి, కవితా
తిధాత్రి శ్రీసుభద్రాసతి, యహహా! మదీయభవము సఫలముగాదే॥ 17

ళ్లవెళ్లఁ బెనంగి పళ్లాలదరిఁబాలుమాలుచుఁ గూయుమార్జాల కవులు।
వణాదుస్సహదుష్టశబ్ద సంగతిఁ బోగుగట్టి వాపోవు సృగాల కవులు।
ంమారు చులుకగాఁ బలికి తోలినఁ బోక కావుకావను కృష్ణకాక కవులు।
ప్పుడువిని గుండె జంకి గొందులు దూరఁ జలపట్టి పట్టు పిశాచ కవులు।
బివత్తురె, యింతైనఁ జక్రహస్త, శస్త గుణవర్ణ నాపూర్ణ సరసకవితఁ,
వితతోభయలోక వైభవము, శబ్దరమ్యసత్క్రవివరశిరోరత్నములకు॥ 18

నత్తయుక్ మృదుత్వమును జక్కదనంబు, నలంక్రియాపరి
రక్షణము గల్గి, శ్రీవిభుని బొందినచోఁ గృతి, సాధ్వియండు రా।

సతయుక్ మృదుత్వమును, జక్కదనంబు, నలంక్రియాపరి
స్ఫురణము గల్గియుం బగులఁ బొందిన దుష్కృతియందు రెండునన్ ॥

ఉ॥ లాలితకావ్యసీమ నొకలక్షణ మొప్పక యున్న సత్కవుల్
మేలు గ్రహింపఁ గోరుదురు మించినసత్కృపఁ, గాకవుల్ గడున్;
గ్రేలుడురింతెగాక, సవరింపఁగ నేర్తురె, యంచకై వడిన్
బాలునునీరు నేర్పఱచు పాకము కాకముపొంద నేర్చునే ॥

వ॥ అని యిష్టదేవతా నమస్కారంబును, శిష్టజనపురస్కారంబును దుష్టకవి తిరస్కారంబునుం జేసి యేతత్ప్రబంధ భూషణంబునకు నాయకరత్నంబైన శ్రీరఙ్గనాథు దివ్యావతారం బభివర్ణించెద॥

చ॥ జగములు చేసి వేసరి, ప్రజాపతి, సర్వజగంబు లెల్ల ము
క్తిగనిన, నింక నీయిడుమ తీరి సుఖించెదనంచు నెంచి, స
త్త్వగుణగరిష్ఠుఁడై హృదయవారిజసీమ నికామభక్తి ని
ష్ఠఁ గదురఁ శ్రీశపాదవిలసత్కమలద్వయినిల్పి కొల్చినన్ ॥

సీ॥ కమలారినేలు చక్కని నెమ్మొగమునకు మొలక వెన్నెల తేట కలికి నవ్వు।
కార్మొగుల్పస గెల్వఁగల తమచ్ఛాయకుఁ బసిమి మించిన మించు, పసిడిశాలు
మానసీయోరువక్షోనభోవీధికి హరిధనూరుచి, రమాతరుణికాంతి ।
మండితప్రభ నేత్రపుండరీకములకు మాకరందఝరం బమందకరుణ ।

గీ॥ సొగసుపుట్టించఁ ద్రొక్కనిచోట్లు ద్రొక్కి, తేజుగలవాగె తెక్కనేవాజిరాజు।
నెక్కి గ్రక్కున నిందిరాధీశ్వరుండు, తామరసగర్భు నెదుటఁ బ్రత్యక్షమయ్యె 2

వ॥ అప్పుడు॥

గీ॥ అజుఁడు మ్రొక్కి, యిష్టమర్థించుటయు, శ్రుతిస్మృతిపురాణతతులు చతురవంది
సముదయములభంగి, నమితభక్తినుతించు, మహితపూరుషోత్తమంబు దెలిపి ॥

క॥ కమలభవ! నీవుగోరిన, క్రమమున జంతూత్కరములు గాంచు విముక్తి।
ప్రమదం బచటికిఁ జనుమని, కమలాధీశ్వరుఁడు వల్కఁ గ్రక్కున నజుఁడున్ ॥

ఉ॥ పొంగుచు, నగ్రభాగమునఁ బూనికనిల్పిన యాపవాహ్యచ
క్రాంగము నెక్కియేగి, చెలువారఁగఁగన్గొనె, నీలభూమిభృ
త్తుంగవభూషితక్, విబుధపూజితదక్షిణవారిరాశివా
స్తుంగతరంగరావపరిశోభిత, శ్రీపురుషోత్తమస్థలిన్ ॥ 27

ఉ॥ కాంచి, విరించి, మున్ను తనకన్నులకుం బొడగట్టి నట్టియ
భ్యంచితమూర్తి శ్రీవిభుని నచ్చటఁజూచి కృతార్థవృత్తితా

చితుఁడై, యనేకనిగమార్థముల న్వినుతించి యుండ, నే
చెఁ బిపాసనోరిగురఁ దివ్రతతో, నొకకాకి గ్రక్కున్ ॥ 28

ణవారిపూరితసుఖ ప్రదరోహణానామకుండవి
ఖరజలంబు ద్రావి, సులభస్థితి సంగముదోచి, తత్సర
ధరాస్థలిన్ బొరలి, దేహమువీడి, చతుర్భుజత్వ శ్రీం
శరీరియై సురలుగన్గొన దివ్యపదంబు చేరినన్ ॥ 29

ధరాధరవరశిఖ, రాలయగతనీలమాధవాగ్రస్థలసం,
తరోహణకుండజ, లాలఘుమహిమలు జగములన్నియు నిండెన్ ॥ 30

డుదండధరుండు, నిజాధికార సంశయము మానసమ్మున సందడింప ।
బోయిన మోము,నిట్టూర్పువడల బడల, నోడలెల్ల సంతాపభరితముగను ॥
ద్రికరిగి యిందిరఁగూడియున్న శ్రీ నీలమాధవుగాంచి నిభృతభక్తి ।
తించి ప్రార్థింప, విశ్వంభరాధరుం డతని వంచించి తానప్పటికిని ।
రసంతర్ధాన మొంది క్రమ్మఱ మాళ వేంద్రుఁడింద్రద్యుమ్నుఁడిద్ధమహిమ ।
మేధసహస్రమాహరింపఁ దదంతమున నవభృథవేళవనధిలోన ॥

జమాంజిష్ఠకాంతిసంపదలఁబొదలు, కల్పభూజాతమై, తరంగములఁదేలి ।
నధర్మాధిపుఁడు తెచ్చి పర్ణసీయ, తరమహావేదిపై నిడఁ, దక్షిణాంబ ॥ 32

మొగము, వాలుకన్నులు, మృగనాభిసదృశమైన మేచాయ, మణి ।
గితదివ్యభూషలు, తగటువలువ వెలయఁ జక్రధరుఁడై నిలిచె ॥ 33

తకుండలనీలనిచోళధవళ, దేహవనమాలికోజ్జ్వలదీప్తిత్తులు ।
సర్వంసహాధురావహానదీప్త సప్తఘణుఁడు, బలుం డహిస్వామియయ్యె॥

జరుచినేలు, తనకటాక్షేక్షణాంచలము లెక్కుడుసిరుల్ సంఘటింప ।
మద్యుతులనెగ్గులువట్టు తనమేనిచాయ సద్దిక్కులఁజొకళింప ।
వప్రతిభఁ గాదను, తనధమ్మిల్ల కాంతులు కటికచీకటిఘటింప ।
నుప్రభకు మించులుచూపు తనమణిభూషణద్యుతులు విస్ఫూర్తిమాప

దాజ్జాతములు గొల్చుమనుజతతికిఁ, గల్పతరుశాఖయగుచు, సంకల్పితార్థ
పయములిచ్చుకలశాబ్ధిజాత, శ్రీసుభద్ర, భద్రప్రదాత్రియై ప్రౌఢి,నిలిచె ॥

వన శుభదాయి, రవి। ప్రభము దనుజకోటిహరము భాస్వరలాలిమ్ ।
, సుదర్శనము, మహారభసము ప్రాదుర్భవించె, రథాంచనామై ॥ 36

వ॥ ఇట్లు దైత్యసంహారి చతురూపధారియై నిలిచిన, మొలచినహర్షోత్కర్షంబ
నింద్రద్యుమ్నమహీమహేంద్రుండు, రత్నప్రభాధురంధరంబగు మహోన్న
ప్రాసాదవివరంబు నిర్మించి ॥

ఉ॥ నారదుఁగూడి బ్రహ్మసదనంబునకుం జని, తత్ప్రతిష్ఠకై ।
వారిజసంభవుం బిలువ, వచ్చి ప్రతిష్ఠయొనర్చె నప్పుడ ।
వ్వారిజనేత్రు, భక్తజనవత్సలు, సంశ్రితదీనలోకమం ।
దారు చతుర్విధాకృతి నుదారవిహారునిఁ బూరుషోత్తమున్ ॥

వ॥ ఇవ్విధంబున ॥

సీ॥ సకలవేదపురాణశాస్త్రేతిహాసముల్ వందురై యేక్షేత్ర వరముఁ బొగడు ।
నాంబుజభవకీటకాంతజీవులకు నే క్షేత్రంబు మోక్షలక్ష్మీప్రదంబు ।
సకృదుచ్చరణమాత్ర వికలీకృతాఘసంహతికమై, యేక్షేత్రమతిశయిల్లు ।
కమలభవాండసంఘములు, వ్రాయిననైనఁ జెక్కుచెమర్ప దేక్షేత్రరాజ ॥

గీ॥ మట్టి శ్రీపూరుషోత్తమాహ్వాయవిముక్తి, దాయకక్షేత్రమున నీలధరమునందు
శ్రుతివినుతదారుదేహమున్నతిధరించి, శ్రీజగన్నాథుఁడుండు వాంఛితములిడుచు॥

## షష్ఠ్యంతములు.

క॥ ఏతాదృశగుణమణిఖద్యోత, ద్యోతప్రతానతోషితలోక ।
వ్రాతనవపద్మునకు, వి,ఖ్యాతోరస్స్థమధ్యగతపద్మునకున్ ॥

క॥ శుభమతికి, దివ్యతరబోధభరితసామ్రాట్సహస్రతమహాయమేధా ।
వభృథసమయార్ణవావిః ప్రభవద్ధారవతనుప్రభాసంహతికిన్ ॥

క॥ సకృదురిచ్చతనిజాఖ్యా ప్రకటితచాంద్రమసకిరణపాళీబహుళా
వికలీకృతాజవంజవ నికరాంధతమసవివృతికి నిఖిలాకృతికిన్ ॥

క॥ కళ్యాణగుణికి, మోచితఖల్యాదుర్యోచపాపకంచుకబలసా ।
కల్యాతికల్యఘనసౌ, శీల్యమహానీలశైలశేఖరమణికిన్ ॥

క॥ వైహాయసవీధిగమ, నాహామహమికాప్రవర్ధితాతిపిపాసా ।
మోహావదరిష్టమోచన రోహణవ్యాప్తతికి, నిగమరూఢాగతికిన్ ॥

క॥ కరుణాకల్పన, కురువృష్ణి, తరుణారుణబింబవిశ్రుతస్ఫుటవిలస ।
త్కిరణాలూనోగ్రతమః, పరిణామఫణాఢ్యభుజగపతితల్పునకున్ ॥

క॥ బహుళబ్రహ్మహననపా,పహరణచణనిత్యతావిభాసిచ్ఛాయా ।
సహితసదాత్మనపల్లవ, బహుపాద్రూపునకు దళితభవతాపునకున్ ॥

## ప్రథమాంశము.

సభక్తిప్రణామపూర్వకంబుగా, నే నొనర్చి సమర్పింపంబూనిన శ్రీ విష్ణుపురాణంబునకనుక్రమణిక యెట్లనిన :—

శ్రీపరాశరుండు, జగద్ధితార్థంబుగా నంశషట్కసమేతంబైన శ్రీవిష్ణుపురాణంబు నంగషట్కసమేతంబైన నిగమంబునుబోలె నిర్మించిప్రియశిష్యుండైన మైత్రేయమహామునికిం జెప్పె. తత్ప్రకారంబు॥ 48

తళుకుమెఱుంగుకోరలు, నుదగ్రమహావివృతాస్యగహ్వర
జ్వలితకరాళజిహ్వ,జలజాతభవాండము తూట్లుబుచ్చు ను।
జ్జ్వలితసటాచ్ఛటల్, ప్రళయసంజనితస్తనితోద్భటార్భటిన్
గలఁచు ఘనాట్టహాసములుగల్గిన శ్రీనరసింహుఁగొల్చెదన్ ॥ 49

తెలివి పౌర్వాహ్ణికక్రియల్,దీర్చియధిక,గరిమనాసీనుఁడగుపరాశరమునీంద్రుఁ।
గాంచిమైత్రేయుఁ డత్యంతగౌరవంబు, తనరసాగిలిమ్రొక్కియిట్లనుచుఁబలికె ॥

అమితమనీష, వేదములు నంగచయంబులు సర్వశాస్త్రముల్
క్రమముననభ్యసించితి, సలక్షణయుక్తి, భవత్కృపారసం।
బు మహిమ నెల్లశాస్త్రములఁబూని పరిశ్రమమెక్కుడంచు, సం
సమయిగ మనీషులెన్నఁగ మనంబుల నన్నతిధీప్రసన్నతన్॥ 51

కలిగె నేలీజగంబు,క్రమ్మఱ నెట్లుకలుగు యన్నయమయి కానుపించుఁ?
బొడము నెచ్చట,నెందు పొడవఱియడఁగు భూతముల ప్రమాణంబు తలఁపనెంత?
జే వాదిసంభవం బొ వసుధాచలసాగరప్రమితి సంస్థానసరణి।
పవిత్రృప్రభృతికసంస్థానప్రమాణముల్ దేవాదివంశసంస్థితులు, మనువు।

న్ని మన్వంతరములు,కల్పాదికముల,వరుసయుగధర్మములును, చేసిర్షి రాజ।[యు॥
వరితములు,వేదశాఖావ,తరణమహిమక్రమము,వర్ణాశ్రమములధర్మములు తెలి

ఁన తెయిమ్మని, నిజ పాదానతుఁడై వేడుకొనిన యమ్మైత్రేయున్ ।
గానికఁజూచి పరాశరుఁ, డ సందరసార్ద్రహృదయుఁడై యిట్లనియెన్॥ 53

ళిఖళి, లెస్సతలంచితి, వలఘుఁడుమాతండ్రితండ్రియైన వసిష్ఠుం।
లవునఁజెప్పినదిప్పుడు, తలఁపునకున్ వచ్చెనీవు తలఁచుటకతనన్ ॥ 54

స్తారగతి కౌశికునిచే, ప్రేరితుఁడగుదనుజుచేత, మృతిబొందెను, వి।
గ్గారతపోనిధి శక్తి యు,దారుఁడుమాతండ్రి యనుచునంతయువింటిన్ ॥ 55

ని, వినివిష్టకోపశిఖివిహ్వాలచిత్తత, దుష్టదైత్యనా
నమునకొక్కసత్రము, విశంకటలీలనొనర్ప, నగ్నిలో।

ననిమిషవైరికోటి డెగటార, మదీయపితామహుండు క్ర
న్ననననుజూచి యిట్లను, మనంబు కృపారసమిశ్రమై తగన్ ॥

ఉ॥ కోపముమాను, రక్కసులకున్ మనకున్ బనియేమి, నీకుసుం
డా పతితుండు గాఁడు, దివిజారులచే నిటులౌట, పూర్వజ।
న్మాపరిమేయకర్మఫల, మట్లగుటన్ విను, మూఢునట్లు క్రో
ధోపహతుండుగాఁడు, ఘనుఁడున్నతబోధముకల్మి పౌత్రకా ॥

క॥ ఎవ్వరినెవ్వరుచంపెద, రెవ్వరుచచ్చెదరు జనులకెల్ల నియతమై।
యివ్వటిలు పూర్వకర్మం, బెవ్వలనికిఁజనినఫలమునిచ్చుచు నుండున్ ॥

గీ॥ మనుజకోటి బహుక్లేశమునఘటించి, నట్టికీర్తితపంబుల నడఁగఁజేయు।
క్రోధమెన్ని తెరంగుల, క్రోధియౌట, పాతకంబని చెప్పిరి పరమమునులు ॥

క॥ వాసిన్ స్వర్గశ్రేయో, వ్యాసేధనిదానమనుచువర్ణింతురు పు।
ణ్యాసదృశులు, పరమర్షు, లుదాసీనత కోపముడుగవయ్యకుమారా ॥

గీ॥ అనపరాధులు దైతేయులగ్నిలోనఁ, గాలిరింతట చాలు నీకర్మమనని।
సాధుజనములు నిత్యక్షమాధనాఢ్యు, లనఁగవిందుముగాదె యెందును గుణాఢ్య ॥

వ॥ అని యిట్లు మహాత్ముండైన, అస్మత్పితామహుం డనునయించినఁ దద్వాక్య
గౌరవంబున, నపహృతసత్రయాగుండనైతి. వసిష్ఠుండును సంతుష్టుండయె
నంత॥

ఉ॥ వారిజసంభవాత్మజుఁడవారితదివ్యతపోధనుండు దే
వారులకెల్లఁ గర్తయగునట్టి పులస్త్యుఁడు వచ్చినన్ మహో।
దారుఁడు మత్పితామహుఁడు నర్ఘ్యమొసంగి, మహార్హపీఠిపై
ధీరతనుంచ, నుండి, సముదీర్ణతతో, ననుజూచి యిట్లనున్ ॥

ఉ॥ వైరము మిక్కిలయ్యును, నవార్యతపోధన ! యివ్వసిష్ఠువా।
గ్గౌరవమూది, తాల్మి మదిఁగైకొని నిల్పితిగాన నీవు, స।
ర్వోరుపురాణవర్గములు యుక్తినెఱింగెదు, మత్కృపారస
స్ఫారకటాక్షవీక్షణవశంబున భాసురధీసమగ్రతన్ ॥

సీ॥ సన్మునీంద్ర ! మదీయసంతతిపైఁగడు, నల్కగల్గియుఁ దెగవైతిగాన।
పరమిత్తుఁగొనుము, భవ్యపురాణసంహితా, కర్తవయ్యెదు లెస్సగాఁగ, దేవ
తాపారమార్థ్యమంతయు నెఱింగెదు, ప్రవృత్తనివృత్తకర్మసంతతులయందు।
నీమతివిమలమై నెగడెడు మత్ప్రసా, దాతిశయంబున, ననిపులస్త్యుఁ!

ానతీయ వసిష్ఠుఁడిట్లనియె నిష్ఠ, హాత్ముఁ డానతియిచ్చిన యట్లునీకు ।
ర్వమును నగుననియె, నాచందమెల్లఁ, దలఁపునకువచ్చెనిపుడు నీపలుకువలన॥

ుప్పురాణసంహిత నీకెఱింగించెద ఇజ్జగంబు శ్రీవిష్ణునివలన నుద్భవించె;
తనియందె నిలిచె ; ఇజ్జగంబునకు స్థితిసంయమకర్త యతండ ; ఇజ్జగంబులు
విష్ణుఁదేవుండని చెప్పి యప్పరాశరమునీంద్రుఁడిట్లనియె॥ 66

వికారుఁడై శుద్ధుఁడై నిత్యుఁడై పర, మాత్ముఁడై సర్వజీవాత్ముఁడగుచు ।
త్యైకరూపుఁడై నీరజగర్భుఁడై పద్మాయతాక్షుఁడై భర్గుఁడగుచు ।
వుఁడై శ్రీవాసుదేవుఁడై ప్రణవమై, భూరిసృష్ట్యవనాంతకారియగుచు ।
వ్యక్తమై వ్యక్తమై స్థూలసూక్ష్మాత్ముఁడై, యేకరూపుఁడై, యాద్యుఁడగుచు॥
గములకుమూలభూతుఁడై, సకలలోక, ములకునాధారమై, సర్వమునకు నంత।
త్మమై,యణువులకును నణువగుచును, వెలయునేదేవుఁడాదేవు విష్ణుఁగొలుతు॥

విధంబున జగదీశ్వరుఁడగు శ్రీ విష్ణుదేవునకు మ్రొక్కి చెప్పెద. తొల్లి దక్షాది
ునులకు పితామహుండు చెప్పె. ఆ దక్షాదిమునులు నర్మదాతటంబున సార్వ
ముండగు పురుకుత్సునకుం జెప్పిరి. అప్పురుకుత్సుండు, సారస్వతునకుం జెప్పె
సారస్వతుండు నాకుం జెప్పె॥ 68

ఁడు,పరులకుఁబరముఁడై, ప్రబలమహిమఁ,జెలఁగుపరమాత్ముఁడాత్మసంస్థితుఁడు,
నాది వినిర్దేశవర్జితుండు, సిద్ధగతి నూర్మిషట్కంబుచెందకుండు॥ [రూప ।

## వాసుదేవతత్త్వము.

ములలోపలతా, న, జ్జగములుతనలోపలను ప్రశస్తినిలుచుటఁ ।
వ్యూంతవేదులెన్నుదు, రగణితగతి"వాసుదేవుఁ"డనిమునినాథా ॥ 70

వాసుదేవతత్త్వంబు నిత్యంబును, నజంబును, నక్షరంబును, నవ్యయంబును
స్వరూపంబును, వ్యక్తావ్యక్తస్వరూపంబును, హేయగుణప్రతిభటంబును,
లంబుననగు పరబ్రహ్మంబు. ఆ బ్రహ్మంబునకుఁ బురుషుండును, ప్రధా
బును, వ్యక్తంబును, కాలంబును ననునాల్గురూపంబులు, వీనికన్న పరంబయి
ంబైన యవ్విష్ణుపరమపదంబును సూరిజనంబులు చూతురు; ఇప్పురుష
ధానవ్యక్తకాలంబులను బ్రహ్మరూపంబులు ప్రతిసర్గంబునందును వ్యక్తి
్భావహేతువులై వర్తిల్లు. విష్ణుదేవుండు క్రీడించు బాలకుండునుంబోలె
ధంబున బహురూపంబులఁ జేష్టించు ॥ 71

నయము నిత్యమై సదసదాత్మికమై, యతిసూక్ష్మమైకడున్
పగుచున్న తత్ప్రకృతి పెద్దలుచెప్పుదురాగమార్థముల్ ।

గనుఁగొనుచున్ బ్రధానమని, కావుననింతయుఁ గారణమ్మునౌ స
జ్జనసుత యా ప్రధానము, నిజంబు తలంపఁ బ్రపంచకోటికిన్ ॥

క॥ అవ్యక్తమనెడునామము, సువ్యక్తంబగుచుఁదనకుఁ జొప్పడఁగా, స।
ర్వవ్యాపియై ప్రధానము, దివ్యమహిమ వెలయుచుండు ధీరప్రవరా ॥ 7

వ॥ ఆప్రధానతత్వంబక్షయంబు, నాన్యధాధారం బమేయం బచలంబు, ధ్రువంబు శబ్దస్పర్శరూపరసగంధరహితంబు, త్రిగుణంబు, జగత్కారణంబు; అనాదిప్రభవాప్యయంబు, వ్యాప్తంబునునని బ్రహ్మవాదులు చెప్పుదురు॥ 7

ఉ॥ కేలుఁబగల్లునాకసము, పృథ్వి, తమంబు వెలుంగుఁగాక యు
ద్వేలత కేంద్రియంబులకుఁ దెల్లముగాక, నిజప్రధానలీ।
లాలలితుండు పూరుషుఁడు శ్లాఘ్యత బ్రహ్మసమాఖ్యనొప్పు భ
వ్యాలఘుచిత్స్వరూపమహిమాస్పదమై మునిలోకపూజితా ॥

క॥ వెలయుఁగవ్యక్తమతీత, ప్రలయంబున నణఁగి మగుడఁ బ్రకృతిభవంబై ।
నిలుచుట నిసర్గమదితా, నలవడు ప్రాకృతమనంగ, నధికస్ఫూర్తిన్ ॥

మ॥ కమలాధీశుఁడు సుమ్ము మౌనివర! యిక్కాలంబు చర్చింప, నం
తము లేదాదియు లేదు, దీనికి ననూనత్వంబునన్ సర్గసం।
యమసంస్థానము లిందుచే నెపుడు సమ్యక్ప్రౌఢి నచ్ఛిన్న భా
వములై వర్తిలుఁ జువ్వె యెల్లపుడు దివ్యల్లీలసంధిల్లగన్ ॥ 7

## సృష్టిక్రమము.

వ॥ ఇట్లు ప్రవర్తిల్లుచుండ గుణసామ్యంబున నప్పురుషుండు పృథక్సంస్థితుండై యుండ విష్ణుస్వరూపంబైన కాలంబు పరివర్తించు. అప్పుడు పరబ్రహ్మంబును పరమాత్మయు జగన్మయుండును, సర్వభూతేశ్వరుఁడును, సర్వాత్మయుఁ బరమేశ్వరుండును నగు శ్రీహరి సర్గకాలంబున స్వేచ్ఛాప్రధానపురుషుల యందుఁ బ్రవేశించి క్షోభంబు నొందించును. అట్లు క్షోభంబునొంది క్షేత్రజ్ఞాధిష్ఠితంబైన ప్రకృతివిశేషంబువలన మహత్తత్త్వంబు పుట్టె. గుణమేళనంబునఁ ద్రివిధంబయ్యె. త్వక్కుచేత బీజంబువలె బ్రధాన తత్త్వంబుచేఁ మహత్తత్త్వం బావరింపంబడు. అమ్మహత్తత్వంబువలన వైకారికంబును తైజసంబును, భూతాదియు నన గుణమేళనంబున నహంకారంబు త్రివిధంబై వర్తిల్లును. అందుఁ దామసంబైన భూతాదియను నహంకారంబు వికృతినొంది శబ్దతన్మాత్రంబువలన శబ్దలక్షణంబైన యాకాశంబు పుట్టె. భూతాదిచేఁ నావరింపఁబడు నయ్యాకాశంబు వికృతినొంది స్పర్శమాత్రంబు పుట్టించె

దానివలన మహాబలవంతంబై స్పర్శగుణంబైన వాయువుపుట్టె. ఆకాశంబుచే నావరింపఁబడు నావాయువు వికృతినొంది రూపతన్మాత్రంబు పుట్టించె. దాని వలన రూపగుణంబైన తేజంబుపుట్టె. వాయువుచే నావరింపఁబడు నాతేజంబు వికృతినొంది రసతన్మాత్రంబు పుట్టించె. దానివలన రసగుణంబులైన జలంబులు పుట్టె. తేజంబుచే నావరింపఁబడి యాజలంబు వికృతినొంది గంధమాత్రంబు పుట్టించె. దానివలన గంధగుణంబైన పృథివిపుట్టె. ఇది తామసాహంకారంబువలనఁ బుట్టిన భూతతన్మాత్ర సృష్టియనంబరగు॥ 78

సీ॥ అనఘాత్మ తైజసంబను నహంకారంబు, వలన నింద్రియములు గలిగెనవియుఁ।
జెప్పెద, శ్రోత్రంబు జిహ్వాయు నేత్రంబు, నాసిక త్వక్కు-మనంబు ననఁగ।
నాఱును బుద్ధీంద్రియంబులు శ్రవణాదిసిద్ధికై కలిగె నూర్జితము లగుచుఁ।
బరిపాటి వాక్పాణిపాదపాయూపస్థ, ములగు కర్మేంద్రియంబులు మునీంద్ర!
గీ॥ యుక్తి శిల్పాదిసిద్ధికై యొనరు నివియు, వినుము వైకారికం బన విశ్రుతిగను।
నయ్యహంకారమునఁ బుట్టె నఖిలమైన, దేవతాసర్గమీరీతి తెలిసికొనుము॥ 79

వ॥ ఇట్లు వైకారికాహంకారంబు వలన నింద్రియాధిదేవతలుపుట్టిరి. ఆకాశవాయుతేజస్సలిలపృథువులు శబ్దాదిగుణసంయుతంబులై శాంతంబులును, ఘోరంబులును, మూఢంబులును, విశేషంబులును నై పృథగ్భూతంబులై యుండు, అన్యోన్య సంయోగంబు నొంది ప్రజల సృజించు॥ 80

సీ॥ తెలివితోఁ బూరుషాధిష్ఠితత్వమున, నవ్యక్త మహానుగ్రహంబువలన।
మహదాదు లత్యంత మహిమ నండంబు నుత్పాదించు,నది పరిపాటి పెద్ద।
యగుచు బుద్బుదతుల్యమై భూతసమితిచే, నభివృద్ధమగు జలాభ్యంతరమున।
బ్రహ్మస్వరూపమై పరగు విష్ణున కది, తలపోయ ప్రాకృతస్థాన మయ్యె॥
గీ॥ నందుఁజతురాననుండయ్యెనబ్జనేత్రుఁ, డుల్బముసురాచలముజరాయువున గాని।
గర్భజలము సముద్ర సంఘములు నయ్యె,నధికవిస్మయ మొదవ బ్రాహ్మణవరేణ్య!॥
క॥ గిరిసాగరాంతరీప, స్ఫురితసురాసురమనుష్యపూర్ణములై భా।
సురలీల జగములెల్లన్ ; బరిపాటిం గలిగెనందుఁ బరమమునీంద్రా॥ 82

వ॥ అయ్యండంబు బహిర్భాగంబున నుత్తరోత్తరదశగుణితములైన వారివహ్నివాయువ్యోమభూతాదిమహదవ్యక్తంబు లనెడు సప్తావరణంబుల చేతను నారికేళఫలాంతర్బీజంబు బాహ్యోదకంబులచేతంబోలెఁ బరివృతంబగుచు నుండు ; అందు రజోగుణకలితుండై విశ్వేశ్వరుండైన హరి బ్రహ్మత్వంబుదాల్చి యీజగత్సృష్టియందుఁ బ్రవర్తించు. సత్త్వగుణకలితుండై సృష్టంబైన

జగంబు విష్ణుత్వంబునం బాలించు; తమోగుణకలితుండై యతి భీషణుండై
రుద్రరూపంబు దాల్చి యఖిలభూతంబుల భక్షించు; ఇవ్విధంబున॥

సీ॥ అఖిలంబు మ్రింగి యేకార్ణవంబున, నాగ పర్యంకతలమునఁ బవ్వళించి।
యోగనిద్రారూఢినొంది మేల్కనిపున, సృష్టి గావించు స్రష్టత్వ మొంది
సృష్టిరక్షణనాశకృత్యంబులకు బ్రహ్మ, విష్ణు రుద్రాఖ్యలుద్వృత్తిఁదాల్చు।
ప్రమదంబుతోడుత భగవంతుఁడగుజనార్దనుఁ డొక్కరుఁడెసువ్వె మునివరేణ

గీ॥ భూతములునింద్రియమ్ములుపూరుషుండు,కూడఁగనుపట్టు,జగమునుగుణచయఁ
మహదహంకారములును శ్రీమత్పయోజ,పత్రనేత్రుండెసుమ్ముతప్పదునిజంబు॥

వ॥ అని చెప్పిన మైత్రేయుం డిట్లనియె॥

గీ॥ అప్రమేయంబు నిర్గుణం బమలతరము, వరము శుద్ధంబు నైనట్టి బ్రహ్మమునఁ
కలిగెనేలీల సృష్ట్యాదికర్తృకత్వ, మానతీయంగవలయు సంయమివరేణ్య॥

వ॥ అనినం బరాశరుం డిట్లనియె॥

సీ॥ యత్నంబు చేయు బ్రహ్మమునకు శక్తులు, సర్వభావము లెడ సంభవించు।
కొలఁదిడఁగారాక, గోచరింపఁగరాక, సర్గాదివైభవ శక్తులమరుఁ।
బావకునకునెట్లు పరగునుష్ణత యట్లు, బ్రహ్మంబునకు శక్తి పటిమసువ్వె।
నారాయణుండు తా నలినాసనుండను, భూమికతాల్చె సంపూర్ణమహిమ॥

గీ॥ నాతనికి నిజమానంబుచేత వర్ష, శతము పరమాయువది రెండు సగములై
నొకటిపూర్వ పరార్థమా, నొకటియెన్నిఁకొన ద్వితీయపరార్థమా,మునివరేణ్య

## కాలవిభాగము.

చ॥ కనుఁగొన విష్ణురూపమగు కాలము సుమ్మిటులై ప్రవర్తిలున్
మునుపు తదీయవైభవము మోదముతో నెఱిగించినాఁడనీ।
కనఘ! చరాచరంబులకు నన్నిటికిన్ పరిణామకారియై
వినుతికి నెక్కు తత్క్రమము, విస్తరలీల నెఱుంగఁగాఁదగున్॥

వ॥ పదేను నిమేషంబు లొక్కకాష్ఠ, ముప్పదికాష్ఠ లొక్కకళ, ముప్పదికళలొ
ముహూర్తంబు. ముప్పది ముహూర్తంబులు మనుష్యమానంబున నొ
యహోరాత్రంబు. పదియేనహోరాత్రంబు లొక్కపక్షంబు, రెండుపక్షఁ
లొక్కమాసంబు. ఆఱుమాసంబు లొక్కయయనంబు. అవిదక్షిణో
సంజ్ఞలం గలరెండు సంవత్సరంబు. అందు దేవతలకు దక్షిణాయనఁ
రాత్రియు, నుత్తరాయణంబు పగలునునగు. ఇట్లు దేవతా పరిమాణంబ

బండ్రెండువేల వర్షంబులు కృతత్రేతాద్వాపరకలిసంజ్ఞితంబైనయొక్క చతుర్యుగంబగు. అందు కృతయుగంబునకు నాల్గువేలు. త్రేతాయుగంబునకు మూఁడువేలు. ద్వాపరంబునకు రెండువేలు. కలియుగంబునకు వేయిదివ్య సంవత్సరంబులని చెప్పుదురు. కృతయుగపూర్వసంధ్య నన్నూఱు, తత్సంధ్యాంశంబు నన్నూఱు, త్రేతాయుగ పూర్వసంధ్యమున్నూఱు, తత్సంధ్యాంశంబుమున్నూఱు, ద్వాపరయుగసంధ్య యిన్నూఱు, తత్సంధ్యాంశంబు నిన్నూఱు, కలియుగపూర్వసంధ్య నూఱు, తత్సంధ్యాంశంబు నూఱు దివ్యవర్షంబులు. ఇట్లు యుగసంధ్యా సంధ్యాంశంబులు పండ్రెండువేలు దివ్యవర్షంబులు నొక్క చతుర్యుగంబగు. సంధ్యా సంధ్యాంశంబుల మధ్యకాలంబు యుగాంతం బనంబరగు. ఇట్లు కృతత్రేతాద్వాపరకలిసంజ్ఞలంగల నాల్గుయుగంబులు నొక్క చతుర్యుగంబనంబరగు. అట్టి చతుర్యుగ సహస్రంబు బ్రహ్మకు నొక్క దివసంబగు. అట్టి దివసంబునందు చతుర్దశమనువులు పుట్టుదురు. వారికాలంబు వినుము. సప్తఋషులు సురలుఁమనువునకును బుత్త్రులైన నృపతులు నేకకాలంబున సృజింపంబడి యేకకాలంబున సంహృతులగుదురు. వీరలకాలంబు డెబ్బదియొక్క దేవతాయుగంబు. అది మనుష్యమానంబున ముప్పదికోట్లునరువదియేడు లక్షలు నిరువదివేలు వత్సరంబు లవిచతుర్దశగుణితంబైన బ్రహ్మకు నొక్క పగలు. అప్పగటి చివుర, నైమిత్తికప్రళయం బనంబరగు, అందు॥ 90

చ॥ విలయదవానలచ్ఛటల, వేఁడిమి భూర్భువరాదిలోకముల్
కలయఁగఁ బర్వె, తాపమునఁ గ్రాగి, మహర్నిలయుల్ వడిన్ జను।
స్థలమున కేగి రంత, నతిదారుణలీల మహానిలోత్కరం
బులజగ మెల్లముంచె, పరిపూర్ణ మహార్ణవవారిపూరముల్ ॥ 91

క॥ ఆయేకార్ణవమున ఫణి, నాయకశయనమున బద్మనాభుఁడు నెలయున్।
దోయజభవసంజ్ఞ జగం, బాయతగతి మ్రింగి, యోగులభినుతిసేయన్ ॥ 92

వ॥ దినప్రమాణమైన రాత్రిచనినఁదదంతంబున నెప్పటియట్ల జగంబుల సృజించు. ఇట్లు బ్రహ్మకుఁ దత్ప్రమాణంబున వర్షశతంబు పరమాయువగు. అందునగంబు పూర్వపరార్థంబు నతిక్రమించె. తదంతంబున పద్మకల్పంబన విశ్రుతంబయ్యె. ఇప్పుడు ద్వితీయపరార్థంబునఁ బ్రవర్తిల్లుచున్నది. కల్పంబు వారాహంబనం బరగు ననిచెప్పి మైత్రేయునకు శ్రీపరాశరుం డిట్లనియె॥ 93

గీ॥ అనఘచరిత ! యతీతకల్పావసాన, మున నిశాసుప్తుఁడై లేచి వనజభవుఁడు।
సత్త్వసమధికుఁడగుచుశూన్యత్వమందు, లోకమీక్షించితనయాత్మలోఁదలంచి॥

వ॥ బ్రహ్మస్వరూపియైన నారాయణుంగూర్చి యమ్మంత్రంబుదాహరించె॥ 95

శ్లో॥ ఆపోనారా ఇతిప్రోక్తా ఆపోవై నరసూనవః ।
అయనంతస్య వాః పూర్వం తేన నారాయణ స్స్మృతః ॥

క॥ ఆరయ నరసూనులగుట, నారములన జలములమరు, నారములయనం
బై రాజిల్లుకతంబున, నారాయణుఁ డనఁగఁ బద్మనాభుఁడు వెలయున్

వ॥ అనితలంచి విశ్వంభర యంభోంతర్గత యగుట యెఱింగి నప్పుడు॥

సీ॥ తనువు విదర్చి సంస్తబ్ధ తనూరుహాళిఁ, దతి సజాండంబు రంధ్రములు
వాలధి త్రిప్ప దుర్వారవాతాహతి, నబ్దముల్ వలయాద్రి యవలికేగ
ఘుర్ఘురధ్వనిచేయఁ గోటిసంఖ్యాకని, ర్ఘాతారభటిశంక గడలుకొనఁగ ।
అడుగువెట్టిన ఖలోదగ్రఖురాధిఘ, ట్టనన గేంద్రములైనఁ దునిసిపోవ।

గీ॥ హరియె యజ్ఞత్రయీమయంబైన ఘోణి, రూపధేయంబుతాల్చి, యా
దనుజనుస్థానవాసులై మునులుపొగడ, సంభృతోల్లాసభాసియై జలధిఁ

వ॥ ఇట్లు మత్స్యకూర్మాదిరూపంబులుదాల్చి జగద్ధితంబొనర్చు నీశ్వరుండు
వరాహరూపంబుదాల్చి రసాతలగతియైన విశ్వంభరఁజూసిన నద్దేవియ
మిల్లి భక్తివినయవినమితోత్తమాంగయై యిట్లని నుతించె॥

గీ॥ శంఖచక్రగదాధరా! సర్వభూత, మయ! జగన్నాథ! నీకునమస్కరిం
ప్రేమతొల్లియు నను నుద్ధరించితి వను, కంప నిప్పుడు నను నుద్ధరింప

క॥ ఏమొదలగు భూతంబులు, దామోదర! తావకాంశధరములుగావే।
వేమరునీ కిదె మ్రొక్కెద, శ్రీమహిళానాథ యుద్ధరింపుమునన్నఘా॥

సీ॥ పరమాత్మ! ప్రకృతిరూపక! పూరుషాకార,! మహదహంకారతన్మాత్ర
కాలేంద్రియాత్మక! కలుషనాశన! జనా, ర్దన! సర్గవిలయసంస్థానకా
నిపుణ! గోవింద! మానితగుణాధార,! నిర్గుణైక్యక! కొనునాదుమ్రొక్కు
తల్లివిదండ్రివి దాతవు భర్తవు, పోషకుండవు జగంబులకునెల్ల ।

గీ॥ లీలనేకార్ణవంబైనవేళ భోగి, భోగపర్యంకతలమునఁ బూర్ణమహిమఁ ।
బవ్వళింతువునీకన్న పరముఁడొకఁడు, కలఁడె, చర్చించిచూడ, జగన్ని

క॥ వనజాక్ష! వాసుదేవా,! నినుఁగొలువక దొరకనేర్చు నేమర్త్యనఘా!
వినుతవిముక్తివధూసం, గనికామసుఖానుభవవికస్వరలీలల్॥

క॥ కనునవి, వినునవి, మనమున ననయముఁదలపోయఁ గొలఁదినైనవి, బు
బనుపడనిశ్చితమైనవి, మునినుతభవదీయరూపములుచర్చింపన్॥

గీ॥ అరయనాధారమై, స్రష్టవై యుపాశ్ర, యంబవై, యాత్మవై నాకునప్ర
యుండుదువు నీవు, దానిచేనొసరుదేను, మాధవియునంగనత్యంతమహిమ

క॥ జ్ఞానస్వరూప జయ! విజ్ఞానుపమానందగుణ! జయ! నిరుపమదయా!
దీనమనోంబుజ! జయ! లక్ష్మీనారీరమణ! జయ! సమేధితశౌర్యా॥ 107

వ॥ యజ్ఞంబును, వషట్కారంబును, ఓంకారంబును, అగ్నులును, వేదంబులును,
తదంగంబులును, యజ్ఞపురుషుండును, సూర్యాదిగ్రహంబులు, నఖిలనక్షత్రం
బులును, మూర్తామూర్తంబులును, దృశ్యాదృశ్యంబులును నీవ, యిట్లు సర్వే
శ్వరుండవైన, నీకు నమస్కారంబు॥ 108

చ॥ అని వసుధాపురంధ్రి, వినయాతిశయంబునఁ దన్ను నీగతిన్
వినుతులు సేయ మెచ్చి, పృథివీధరుఁ డుద్ధత శుద్ధసామని।
స్స్వనఘనఘుర్ఘురారభటి సారెకుఁ జేయుచు దంష్ట్రికాంచలం
బునవడి నెత్తి తెచ్చె నతిమోదమెలర్ప వసుంధరాసతిన్॥ 109

చ॥ సురుచిరదంష్ట్రిచే, ధరణి సుస్థితఁ జేసి రమావధూమనో
హరుఁడు విదిర్చె వేదమయమైన శరీరము స్తబ్ధతాతిభీ।
కరవరరోమఘూతములఁ గంజభవాండము తూఁట్లు వ్రావనా
హరి, నెదనీయ రోమనిచయాంతర సంస్థితులైన సన్మునుల్॥ 110

వ॥ జనస్థాననివాసులైన సనందనాదులు భక్తినమ్రకంధరులై ధీరతరోద్ధతేక్ష
ణుండైన యద్ధరాధరుని నిట్లని స్తుతియించిరి॥ 111

॥ పరమేశ! కేశవాచ్యుత,! వరశంఖగదాసి చక్రవర్ణితబాహా।
పరిఘ! జగదుద్భవస్థితి, పరిహృతికారణచరిత్ర పాలించుమముల్॥ 112

॥ వేదములు పాదముల్, విశదదంష్ట్రికలు యూపములు, యజ్ఞములు దంతములు, చితులు।
వక్త్రంబు, జిహ్వ పావకుఁడు రోమంబులు, కుశసముత్కరము, లక్షులు, దివంబు।
రాత్రియు, స్థూలశిరంబు బ్రహ్మపదంబు, సకలసూక్తంబులు సటలు, ఘ్రాణ।
మతులహవిస్సు, గండతలముల్ స్రుక్కులు, మహితనాదంబు సామస్వరంబు॥

॥ తనువు ప్రాగ్వంశ, మఖిలసత్రములు సంధు, లిష్టములు పూర్తములు, చెవులిద్ధమహిమ
వెలయు దేవరవారికి వేదవేద్య,! యజ్ఞపూరుష! వికచపద్మాయతాక్ష॥ 113

॥ పన్నగశాయి! భక్తజనపాలనఖేలనలోల! లీల నీ
యున్నత దంష్ట్రికాగ్రమున నున్న వసుంధర చూడనొప్పె, సం।
పన్నపయోరుహాకరనిమజ్జనకేళిక వేళఁ గోరపై
నున్న సమున్న పంకిలపయోరుహిణీనవపత్రమో యనన్॥ 114

॥ వింతగ భవత్పదక్రమాక్రాంతమయ్యె, నంతయు, ననంతపదము, శ్రీకాంత కాంత!।
తావకీనవపుర్వ్యాప్తమై వెలసెను, రోదసీగహ్వరంబు నిరూఢ మహిమను॥ 115

వ॥ దేవా! నీవొక్కరుండవే పరమార్థంబవు. నీప్రభావంబున చరాచరాత్మ
జగంబు వ్యాప్తంబయ్యె, జ్ఞానాత్మకుండవైన నీరూపంబైన జగంబు
బుద్ధిలేక యర్థస్వరూపంబుగాఁ జూచి మోహంబున మునుంగుదురు. క
జ్ఞానవిదులు శుద్ధచేతస్కులై యిజ్జగంబు జ్ఞానాత్మకంబుగాఁ జూతురు. స
కుండును, పరమేశ్వరుండును నైన నీవు ప్రసన్నుండవై యిద్ధర
మాకు సుఖంబు సేయుమనిరంత ॥

చ॥ మొనసి, సనందనాది మునిముఖ్యులు తన్నునుతింపఁ, బద్మలో
చనుఁడు మహార్ణవంబుపయి సాగరమేఖలనిల్పె, నద్ధ మే।
దినియు మునుంగదయ్యె, నతిదీర్ఘవిశాలత, నంబురాశిలో
ననువుగ నెప్పటట్ల సమమై తగె, ద్వీపసరిద్ధరాఢ్యయై ॥

మ॥ మును, సర్గాంతమునన్, లయాగ్నిశిఖలం, మోఘక్రియం, గాలి పో
యినభూమీధరకోటి, దివ్యతరభూయిష్ఠప్రభావంబునన్ ।
వనజాతాక్షుఁడు తొంటియట్ల, చెలువొందన్ నిల్పెఁ, బద్మోద్భవుం
డనునామంబు ధరించి తాన మహనీయామోఘసంకల్పుఁడై ॥

వ॥ ఇట్లమోఘవాంఛితుండైన, ధరాధరుండు, బ్రహ్మరూపధరుండును
గుణావృతుండునై, భూవిభాగంబుచేసి, సప్తద్వీపంబులు యథాప్రకా
నేర్పరించి, భూరాదిచతుర్లోకంబులు తొల్లిటి యట్ల యేర్పరించి, సృజ్య
ప్రధానకరణీభూతంబులుగా, సమస్తజనంబుల సృజించెనని శ్రీప
డానతిచ్చిన మైత్రేయుం డిట్లనియె.

క॥ దేవఋషిపితృదనుజమ, ర్త్యావళులన్, వృక్షతిర్యగాదుల నా రా।
జీవభవుఁ డే విధము వాఁ, డై వెలయ సృజించె, చెప్పుమయ్యా, తెలియ

మ॥ అనినన్, శక్తికుమారుఁడిట్లనియెఁ గల్పాదిన్ సిసృక్షుత్వచిం
తనఁబద్మాసనుఁడుండ సర్గమపుడుద్ధంబయ్యె, నుద్యత్తమో ।
ఘనమై, బుద్ధివివర్జితంబయి, సమగ్రంబై నగాఖ్యాకమై
వినుతప్రక్రియజూడఁ బెంపెసఁగియుర్వీదేవచూడామణీ! ॥

వ॥ తమంబును, మోహంబును, మహామోహంబును, తామిస్రంబును,
తామిస్రంబును, అనునైదు పర్వంబులుగల యవిద్య ప్రజాపతివలనఁ
వించె. అదియ పంచధావస్థితంబై బహిరంతరంబుల, అప్రకాశంబై,
తాత్మకంబై, నగాత్మకంబైన సర్గంబై పుట్టి, ముఖ్యసర్గంబునంబర్గె.
బులుగదా నగాదులు, అప్పుడప్పితామహుం డాముఖ్యసర్గంబవ

మఱియు సాధకంబైన సర్గాంతరంబు తలంచుచుండ, నతనికిఁ దిర్యక్సర్గం బభివర్తింప నందువల్లఁ దిర్యక్సర్గంబు పశ్వాదులు తమఃప్రాయంబులు, నవేదులు, నుత్పథగ్రాహులు నజ్ఞానులు, జ్ఞానమానులును, అహంమాన్యులును, అంతఃప్రకాశంబులు, పరస్పరావృతంబులు నష్టావింశద్విధాత్మకంబులునై పుట్టెను. ఆతిర్యక్సర్గం బన్యసాధకంబుగాఁ దలంచి సర్గాంతరంబు తలంచునజునకు నూర్ధ్వస్రోతంబు ప్రవర్తించిన నందువలన సాత్త్వికంబైన దేవసర్గంబుపుట్టె. వారు సుఖప్రీతిబహుళులును, బహిరంతరంబుల ప్రకాశులును, అనావృతులును, తుష్టాత్ములునునై వెలుంగుదురు. ఆదేవసర్గంబుచూచి పరమప్రీతిసంపన్నుండై, పుండరీకాసనుండు వెండియుసర్గాంతరంబు చింతించుచుండ, నర్వాక్స్రోతంబు ప్రవర్తింప నందువల్ల తమోరజోఽధికంబును, దుఃఖబహుళంబును పునఃపునఃకారియు, బహిరంతఃప్రకాశంబునునైన మనుష్యసర్గంబుపుట్టె. బ్రహ్మకుప్రథమంబు మహత్సర్గంబు. ద్వితీయంబు తన్మాత్రభూతసర్గంబు. తృతీయంబు వైకారికంబును, నైంద్రియకంబును. చతుర్థంబు ముఖ్యసర్గంబు. పంచమంబు తిర్యక్సర్గంబు. షష్ఠంబు దేవసర్గంబు. సప్తమంబు మానుషసర్గంబు. అష్టమం బనుగ్రహసర్గంబు. నవమంబు కౌమారసర్గంబు. ఈతొమ్మిదిసర్గంబులును జగన్మూలహేతువులగునని సంక్షేపప్రకారంబునఁజెప్పి సవిస్తరంబుగా వినందలంచిన మైత్రేయునకు శ్రీపరాశరుం డిట్లనియె. 122

క॥ ప్రాచీన కర్మభావితు, లై చచ్చుచుఁ బుట్టుచుఁ నిరంతరసంసా ।
రాచితులగుదురు, చెప్పఁగ, నీచందము చిత్తవృత్తి నెఱుఁగుదు రార్యుల్ ॥ 123

సీ॥ అమరతిర్యఙ్మనుష్యాచరములబొడమఁ, జేయునజునకు మానస సీమఁబుట్టి ।
రాత్మజులు,వారిచేజగంబంతయునునస,ముద్ధితంబయ్యెవినుమునన్మునివరేణ్య॥ 124

క॥ జలములలో మునిగిన, యజ్జలజాసను జఘనసీమ, జనియించిరి ని ।
శ్చలధైర్యు లసురవరు లతి, బలవంతులు తామసప్రబలమానసులై ॥ 125

క॥ వనజభవుండునపుడ, త్తనువిడువఁగ రాత్రియగుచుఁ దనరె నది వినూ ।
తనగతి, రాత్రుల బలియుట, దనుజవరులు దానచేసి ధర్మప్రవణా !! ॥ 126

చ॥ అనఘ పితామహుండు వపురంతరమొంది సృజించె, సత్త్వయు
క్తిని, సురకోటి నంత, నిజదేహము త్యక్తముసేయ నాక్షణం ।
బున దినమయ్యె, దేవగణముల్ దినభాగమునందు నొందు పెం
పును బలముఁ మునిప్రవర ! పూనె విధాతయు నన్యదేహముఁ ॥ 127

గీ॥ అందుఁ బితరులు జనియింప నబ్జభవుఁడు, విడిచె దత్తను వదియును వెలసె
యనఁగ, ద్విజకోటిచే సేవ్యయగుచు నెపుడు బ్రహ్మయును నంత దేహాంతరంబుఁ

క॥ వినుము రజోధికమగున, త్తనువున వలన మనుజకోటి తద్దయుఁ బొడమెన్
వనజజుఁడు విడువ దనువది, వినుతజ్యోత్స్నాభిధాన విశ్రుతిఁ గాంచెన్

వ॥ జ్యోత్స్నారాత్ర్యహస్సంధ్యలు నాలుగును బ్రహ్మశరీరంబులుగా గుము. మఱియు రజోమాత్రాత్మికయగు తనువు ధరించియున్న యన్నునకు క్షుతంబు వొడమె, నందువలన నంధకారంబునందు క్షుత్క్షాములు పులు శ్మశ్రుముఖులు నైన వారుపుట్టి ధాతం జుట్టుముట్టి, మాం రక్ష యనిపలుకుటం జేసి రాక్షసుల నంబరగిరి. కొందఱు భక్షింతమను జక్ష వలన యక్షులనఁ బుట్టిరి. వారి నప్రియంబులం జూచు ధాత కేశంబులు విశీ లై తలకెక్కి విసర్పించు కతంబున సర్పంబులు పుట్టి హీనంబు లగుట నహ బరఁగె. అంత క్రోధావిష్టుండై, జగత్స్రష్ట కపిలవర్ణంబులును నుగ్రంబ బిశితాశనంబులగు భూతగణంబుల నిర్మించె నంగంబువలన గంధర్వ వయస్సువలనఁ బక్షులను, వక్షంబువలన మేషంబుల, ముఖంబువలన నజ నుదరంబుల వలననుఁ బార్శ్వంబుల వలనను గోవులను, బాదంబుల నశ్వమాతంగ రాసభగవయ మృగంబులను, నుష్ట్రాశ్వతర న్యంకువులను, ( బులవలన ఫలమూలినులగు నోషధులం గల్పించె, నిట్లు కల్పాది త్రేత ముఖంబున నిర్మించి ॥

గీ॥ గోవు నజమును పురుషుండు గొఱియ గుఱ్ఱ, మశ్వతరగర్దభంబులు నన
గ్రామ్యపశువుల నధ్వర కార్యమునకు, ధాత నియమించె కుశలసంధాతయగుచు

ఉ॥ ఓ పరమర్షివర్య ! కమలోద్భవుఁ డధ్వర కార్యభారసు
శ్రీపరిమాణము మొప్ప విభజించె నరణ్యపశువ్రజంబు గాం ।
తాపరలీల నెన్నికకు సప్తవిధంబుల భూతధాత్రిపై
శ్వాపదవానరద్విఖురసామజపక్షిజలేచరాహులన్ ॥

సీ॥ ఋక్షివహంబు త్రివృద్రథంతరము ల, గ్నిష్టోమగాయత్రి నియమవిధులు ।
యజురాగమంబు స్తోమాధ్వర త్రైష్టుభం, బులు బృహత్సామోక్థ్యముల తెఱ
సామంబు జాగతచ్ఛందంబు సోమంబు, వైరూప మతిరాత్రవర్తనంబు
సమధికాథర్వ మార్యమణమానుష్టుభ, చ్ఛందంబు వైరాజసారసరణి ॥

గీ॥ ఘనుఁడు రాజీవభవుఁ డనుక్రమనిరూఢి, యొనర ప్రాక్దక్షిణప్రతీచోత్తరా
నీరజంబులవలనఁ బూనికె సృజించె, సాంద్రవిభవంబు మీరమునీంద్రచంద్ర

వ॥ ఇట్లు దేవాసురపితృమనుష్యుల నానావిధభూతంబుల సృజించి మఱియు సంక
ల్పంబున యక్షపిశాచగంధర్వాప్సరోగణనరకిన్నరరక్షోవయఃపశుమృగంబుల
నవ్యయవ్యయంబులైన స్థావరజంగమంబుల సృజియించె. ప్రాచీనకర్మం
బులు బీజంబులుగా వేదశబ్దంబులవలన నెఱింగి నామరూపంబులు కల్పించు.
ఇట్లు ప్రతిసర్గంబునందును సిసృక్షాశక్తియుక్తుండై సృజ్యశక్తిప్రేరితుండై
సృజించుచుండునని చెప్పిన మైత్రేయుండిట్లనియె. 134

క॥ మునివర ! యర్వాక్స్రోతో, జనితులుమానవులు వారిజన్మంబులవెం ।
పును వర్ణములునుగర్మము, లనూనగుణములును జెప్పవయ్య తెలియఁగాఁ ॥ 135

వ॥ అనినఁ బరాశరుండిట్లనియె ॥ 136

సీ॥ కల్పించె నాస్యపంకజముల సత్త్వైక, గుణగరిష్ఠులను బ్రాహ్మణులఘనుల ।
కలిగించె వక్షంబువలన రజోగుణా, ధిక్యభాసురుల, క్షత్రియకులజుల ।
నిర్మించె తొడల నున్నిద్రరజస్తమో, వశ్యమానసుల సద్వైశ్యవరుల ।
పుట్టించె పదముల భూయిష్ఠతామస, గ్రస్తవిగ్రహుల శూద్రప్రవరుల ॥

గీ॥ పద్మగర్భుండు యజ్ఞనిష్పాదనార్థ, మనఘవీరలు యజ్ఞసాధనముసువ్వె ।
యజ్ఞములఁదృప్తులై సురలడిగినపుడు, వృష్టియొనఁగూర్ప బ్రతుకుదు రెల్లప్రజలు ॥

మ॥ వినుతాచారులు, నైజకర్మనిరతుల్, విఖ్యాతధర్ముల్ యశో ।
ధనులంతఃకరణాతినిర్మలులునై ధాత్రీజనుల్ కోరిన ।
ట్లనసర్గంబపవర్గముం గనుచు వేడ్కంబెక్కుకాలంబు లి ।
ట్లనఘ ప్రక్రియనుండ నంతట సమగ్రాశ్చర్య సంపాదియై ॥ 138

క॥ హరిరూపమైనకాలము పరిపాటిం జనులయందుఁ బడవైచు సుని ।
ష్ఠురపాపబీజ మది యు, ద్ధురగతికడుఁబ్రబలె బహుళ దోషాస్పదమై ॥ 139

గీ॥ కర్మతతులుఫలింపక ధర్మసరణి సాగక, విశేషసిద్ధులు సంభవింప । [కొనియె॥
కపుడుజనసంఘములకు పాపాభిభవము, మించద్వంద్వాదిదుఃఖముల్ ముంచు

క॥ వనగిరిజలకృత్రిమ దుర్గనికరములుపట్టణములు ఖర్వటములువెం ।
వెనయ రచియించియందుల,ననువుపఱచుకొనిరి తగుగృహంబులుతమకున్ ॥141

వ॥ ఇట్లు శీతాతపాదిబాధాప్రశమనంబునకుఁ బ్రతీకారంబుగా గృహాదికంబు నిర్మిం
చుకొని జీవనోపాయంబునకై వ్రీహులు, గోధుమలు,యవలు,అణువులు,తిలలు,
ప్రియంగువులు, ఉదారంబులు, కోద్రవంబులు, సతీనకంబులు, మాషంబులు,
ముద్గంబులు, మసూరంబులు, నిష్పావంబులు, కుళుత్థంబులు ఆఢకంబులు, చణ
కంబులు, శణంబులు, ననఁబదియేడు విధంబుల గ్రామ్యౌషధులు సంపాదించిరి.

ఇందు యజ్ఞార్హంబులు వ్రీహియవ మాషగోధూమాణు తిలప్రియంగు
ద్ధంబులన గ్రామ్యౌషధు లెనిమిదియు, శ్యామాక, నీవార, జర్తిల, గవే
ధుకయవ, మర్కటకంబులను నారణ్యౌషధు లాఱునుంగాఁ బదునాలుగో
షధ్యుత్పత్తి దినిచేఁబరాపర విదులైన మునులు యజ్ఞంబు లొనరింతురు. క
చిత్తంబునఁ బాపంబు వృద్ధింబొందు వారు యజ్ఞంబులను, వేదవేద్యుఁ
శ్రీహరిని దేవతలను నిందింతురు. అట్లు వేదాదినిందకులై దురాత్ములు
చారులు కుటిలాశయులునై నిరయంబునంబడి దుఃఖభాగులై య
యాతంబులం బొందుదురని చెప్పి శ్రీపరాశరుం డిట్లనియె॥

గీ॥ ఇట్లుజీవననిర్వాహ మేర్పడంగ, కమల గర్భుండు వర్ణాశ్రమములకఖిల।
ధర్మవర్తులలోకముల్ ధర్మములను, నేర్పవిఖ్యాతి నొందగా నేర్పరించె

సీ॥ సత్కర్మనిరతులై జరగుబ్రాహ్మణులకు, నొదవుప్రాజాపత్యపదనివాస।
మాహవశూరతాఖ్యాతు లౌరాజుల, కైంద్రసంస్థాన సౌఖ్యంబుగలుగు।
పరిపాటినిజకర్మపరులైనవైశ్యుల, కనువొందువాయులోకాధివసతి।
ద్విజపరిచర్యల వెలయుశూద్రులకబ్బు, నవ్యవైభవము గాంధర్వపదము॥

గీ॥ ధర్మమర్యాద యింతైనఁ దప్పకుండ, జగము లెల్లను బాలించుసారసాక్ష।
నక్షయాంశంబు తానగునబ్జగర్భు, నాజ్ఞ చొప్పది సుమ్ము సంయమివరేణ్య

క॥ అష్టాశీతిసహస్రవి, శిష్టమునీంద్రవ్రజంబు చెందెడిలోకో।
త్కృష్టపదమధివసింతురు, స్పష్టత,గురుకులనివాసపరులుమునీంద్రా! ॥

క॥ మానివర! సప్తఋషులున, నూనత వసియించునట్టి యున్నతపదవిం।
బూనికతో వసియింతురు, వానప్రస్థులు సమగ్రవైభవమొప్పన్ ॥

చ॥ అనిశము నిత్యకర్మపరులై, విజితేంద్రియులై వినిష్ట వ।
ర్తన, ఋతుకాలదార నిరతత్వమునొంది, దయార్ద్రులై, మనం।
బున పరహింసమాని, జనపూజ్యతనొందు గృహస్థులొందువా।
రనుపమమైనబ్రహ్మనిలయంబు వినిర్మలధర్మవిత్తమా ॥

గీ॥ చంద్రసూర్యాదులైనను జనుచుఁజనుచు, మగిడివత్తురుగాని సన్మౌనిచంద్ర
ఎప్పుడును పునరావృత్తి మెఱుగరవని, ద్వాదశాక్షరచింతనాధన్యమతులు

సీ॥ తామిస్రమును, నంధతామిస్రమును, రౌరవంబు, మహారౌరవంబు, వీచి।
కాలసూత్రంబు, సంఘాతంబు నివియాది,గాఁ బెక్కునరకముల్ గలవు వా
యందుమునుంగుదు రధ్వరవ్యాసేధ, కారులువేదంబు గర్హచేయు।
వారును నిజకర్మవర్గ పరిత్యాగు, లైనమానవులు నిట్లుగుటచేసి ॥

గీ॥ మానవులు నిజవర్ణైకమార్గవృత్తి, నాశ్రమార్గ్వసదాచారమర్గకర్మ ।
పథము,వదలక,మెలఁగ,నిర్భరవివేక!, గ్రైహికాముష్మికంబులనందుటరుదె ॥ 149

వ॥ సర్వనియంతయగు వాక్కాంతోపయంత, భృగుపుల స్త్యపులహప్రత్యంగిరు లును, మరీచిదక్షాత్రివసిష్ఠులు నను మానసపుత్త్రుల, నవబ్రహ్మలసృజించి, ఖ్యాతి, భూతి, సంభూతి, క్షమ, ప్రీతి, సన్నతి, ఊర్జ, అనసూయ, ప్రసూతులనఁ దొమ్మండ్రు కాంతల సృజించి క్రమంబున భృగ్వాదులకుఁ బత్నులగానిచ్చె ॥

చ॥ మఱియు సనందనాదులగు, మానసపుత్త్రులు వీతరాగులై ।
కొతకరిమాని, సంసృతిసుఖంబులపై కడురోసిపోవ, న ।
త్తెఱఁగునకబ్జ గర్భుఁడతితీవ్రపుఁ గోపమునొంద, భ్రూకుటి ।
స్ఫురితతదీయఫాలమున పుట్టెనుతుండొకఁడుగ్రమూర్తియై ॥ 151

గీ॥ జననమొందుచు నతఁడురోదనముసేయు, కతనరుద్రుండు నా పేరుకలిగె నతని ।
కంత నారీనరాత్మకంబైన తచ్ఛరీరమీక్షించి యధికసంప్రీతితోడ ॥ 152

క॥ విభజించుము నిను ననియా, ప్రభుడంతర్ధానమొంద, పదపడి తన్నున్ ।
విభజింపనతఁడు పురుషుఁడు, నిభగమనయునైరి చిత్రమిదియని పొగడన్ ॥ 153

వ॥ అప్పురుషుండు పదనొకండు భేదంబులనొంది శాంతంబులును ఘోరంబులును నైనరూపంబుల వెలసె. అయ్యంగనయు సర్వమంగళాకారంబున శాంత రూపయై వెలసె ॥ 154

ఉ॥ సంభృత సృష్టిచింతన వశంవదుఁడై, కమలాసనుండు స్వా ।
యంభువు మానసంబున ప్రహర్ష మెలర్ప సృజించి, నవ్య వి ।
స్రంభసురూపలక్షణవరన్, శతరూపసతిన్, స్వయంమనః ।
సంభవ నిచ్చెనాతనికి సమ్మతిఁ బాణి గృహీతియై తగన్ ॥ 155

వ॥ వారిర్వురకి ప్రియవ్రతోత్తాన పాదులను పుత్త్రులిద్దఱును ప్రసూత్యాకూతులను రూపౌదార్యగుణాన్వితలగు కన్యక లిర్వురునుబుట్టిరి. అందు ప్రసూతిదక్షునికి, ఆకూతి రుచిప్రజాపతికి భార్యలైరి. అందు ఆకూతి రుచిప్రజాపతివలన దక్షిణ యను కన్యకను యజ్ఞనామ ధేయుండైన పుత్త్రునిం గనియె. వారిద్దఱును మిథు నంబైరి. అందు యజ్ఞుండు దక్షిణయందుఁ బన్నిద్దఱు పుత్త్రులంగనియె. వారు స్వాయంభువ మన్వంతరంబున, యామాఖ్యదేవతలైరి. దక్షుండు, ప్రసూతి యందు నిరువదినలుగురు కన్యకలంగనియె. అందు శ్రద్ధ, లక్ష్మి, ధృతి, పుష్టి, తుష్టి, మేధ, క్రియ, బుద్ధి, లజ్జ, వపు, శాంతి, సిద్ధి, కీర్తి, అను నీపదమువ్వురను ధర్ముండు భార్యలుగాఁ బరిగ్రహించె. వారి చెల్లెండ్రు ఖ్యాతి,సతి, సంభూతి,స్మృతి

ప్రీతి, క్షమ, సన్నతి, అనసూయ, ఊర్జ, స్వాహా స్వధలను పదు
క్రమంబున భృగుండును, మరీచియు, అంగిరుండును, పులస్త్యుండు
హుండును, క్రతువును, అత్రియు, వసిష్ఠుండును, వహ్నియు, పితరులున
లగాఁ బరిగ్రహించిరి. అందు ధర్మునివలన నశ్రద్ధ, కామంబును; లక్ష్మి
బున, ధృతినియమంబును; తుష్టి, సంతోషంబును; పుష్టి, లోభంబును
శ్రుతంబును; క్రియ, దండంబును; నయంబు, వినయంబును; బుద్ధి, బోధ
లజ్జ, వినయంబును; వపువు, వ్యవసాయంబును; శాంతి, క్షమను; సిద్ధి
ఖును ; కీర్తి, యశంబును పుత్రులగాఁ గనిరి. అందు శ్రద్ధాసూనుండగు క
వలన నందియనుకాంత హర్షుండను పుత్రునింగనియె. అతండు ధ
జాత్రుండయ్యె ॥

గీ॥ పరమపుణ్య! యధర్మునిభార్యయయ్యె, హింస, వారిద్దఱికిఁగలిగె నెన్ని
అనృతుఁడనునందనుఁడు, నికృత్యాఖ్య, కన్య, వారలిద్దఱుమిథునమైభూరిప

వ॥ భయంబును, నరకంబును, ననునిద్దఱు పుత్రులను, మాయయు వేదన
నిద్దఱు కన్యకలంగనిరి. అందు భయంబును మాయయు నరకంబును
మిథునంబులైరి. అందు భయంబు మాయయందు భూతాపహ
మృత్యువుంగనియె. నరకంబు వేదనయందు దుఃఖంబను పుత్రుని
మృత్యువువలన వ్యాధిజరాశోకతృష్ణాక్రోధంబులు పుట్టె. అవి
నూర్ధ్వరేతంబులయ్యె. ఇవియన్నియు జగత్ప్రళయ కార్యపరుండగు
దేవుని రౌద్రరూపంబులుగా నెఱుంగుము. దక్షమరీచ్యాదులగు ప్రజ
సృష్టికార్యనిర్వాహకుండగు శ్రీవిష్ణుదేవుని రాజసరూపంబులుగా నెఱు
మనువులు మనుపుత్రులు సన్మార్గవర్తులగు నరోత్తములు జగత్స్థితికార
హకుండైన శ్రీవిష్ణుదేవుని సాత్త్వికరూపంబులుగా నెఱుంగుమని
మైత్రేయుం డిట్లనియె.

క॥ స్థితిసర్గవిలయములు ని, శ్చితగతినిత్యంబులనుచుఁ జెప్పఁబడియె నూ।
ర్జితపుణ్య! తత్స్వరూపము, వితతంబుగనాకుఁ జెప్పవే, కృప ననినన్

చ॥ ప్రమదమెలర్పనిట్లను, బరాశరుఁ డుద్భవరక్ష ణాంతముల్।
క్రమమున రూపభేదములు గైకొనిచేయు జనార్దనుండు ని।
త్యము మహనీయదివ్యమహిమాతిశయంబున నడ్డపాటలే।
కమితవివేకపాకపరమాద్భుతభూరితరప్రభావుఁడై ॥

వ॥ నైమిత్తకంబును, ప్రాకృతికంబును, నత్యంతికంబును నిత్యంబును
భూతంబులకుఁ జతుర్విధప్రళయంబు గలదు. అందు బ్రహ్మశయనించి

యంబు నైమిత్తికంబు. బ్రహ్మాండంబు ప్రకృతియందు లయంబొందు నది ప్రాకృత ప్రళయంబు, యోగీంద్రులు జ్ఞానంబునం బరమాత్మయందు నత్యంత లయంబు నొందిన నది యాత్యంతిక ప్రళయంబు. అహర్నిశంబును జంతువులు పొందు వినాశంబది నిత్యప్రళయంబు. ప్రకృతివలని ప్రసూతియది ప్రాకృత సృష్టియనంబడును. అవాంతర ప్రళయపర్యంతంబును జెప్పంబడునది నైమిత్తిక సృష్టి. అనుదినంబును సమస్తభూతంబులుం బుట్టుట నిత్యసృష్టి. అనిపురాణార్థ విచక్షణులచేతం జెప్పంబడు. ఇట్లు సర్వశరీరంబుల యందుసంస్థితుండై భగవంతుండును భూతభావనుండును నగు శ్రీవిష్ణుదేవుం డుత్పత్తిస్థితి సంయమంబులు చేయుచుండు. సృష్టిస్థితి వినాశంబులకు సర్వప్రాణులయందు వైష్ణవ శక్తులు పరివర్తించు. జగంబు గుణత్రయ మయంబును బ్రహ్మశక్తిమయంబును నై యుండు. ఇట్లెఱింగిన మర్త్యుండు పునరావృత్తి నొందఁడు ॥ 161

ఉ॥ ఆది పితామహుండు తనయంతటి పుత్త్రకుఁగాంతు నంచు న।
త్యాదృతినుండ నవ్విభుని యంకమునందు జనించె పుత్త్రుఁ డు।
న్మాధుఁడు నీలలోహితుఁడనన్, వడి నేడ్చె నతండు భీతిసం।
పాదకుఁడై యుపద్రవము పాటిల సద్ద్విజ వంశవర్ధనా ! ॥ 162

క॥ ఏమిటి కేడ్చెదవని తనుఁ, దామరసప్రభవుఁడడుగఁ దడయక నాకున్।
నామమిడుమనిన రోదన, సామగ్రిన్ రుద్రుఁడనఁగఁజనుదని పలికెన్ ॥ 163

గీ॥ రోదనమ్ము మానుమనిన నా రుద్రుఁ డేడుఁ మార్లు మఱియును నేడ్వ నమ్మహితమతికి।
నామసప్తకమిడియె విన్నాణమమర, నబ్జగర్భుఁడు మానికులాగ్రగణ్య ॥ 164

క॥ స్థానములు నందనులు బత్నీనివహముఁ గలుగఁ జేసె నిపుణుఁడు వాక్యాం।
తానాథుం డెనమండ్రకు నానందరసార్ద్ర హృదయుఁడై మునినాథా ॥ 165

వ॥ అవియును భవుండు, శర్వుం డీశానుండు, పశుపతి, భీముం డుగ్రుండు, మహాదేవుండన నేడు నామంబులు రుద్రునకు వెలయు. సూర్యుండు, జలంబు, భూమి, వాయువు, వహ్ని, ఆకాశంబు, దీక్షితుండగు బ్రాహ్మణుండు సోముండుననఁ గ్రమంబున రుద్రాదులకుఁ దనువులయ్యె. సువర్చల, ఉమ, సువికేశి, అపర, శివ, స్వాహా, దీక్ష, రోహిణి యను నెనమండ్రు క్రమంబున భార్యలైరి. శనైశ్చరుండు శుక్రుండు, లోహితాంగుండు; మనోజవుండు, స్కందుండు, సర్గుండు, సుత్తానుండు, బుధుండునన పుత్త్రులైరి; దీనిపుత్త్రపౌత్త్రులచే జగంబు పూరితంబయ్యె. ఏతత్ప్రభావుండగు రుద్రుండు సతీదేవిఁ దనకు భార్యగాఁ గైకొనియుండునంత॥

ఉ॥ దక్షునిమీఁదికోపమునఁ దాళక యాసతి యోగచాతురీ।
దక్షత మేను వ్రావిడిచి, తా హిమవంతుని పుత్త్రియైన, ఫా।
లాక్షుఁడు పెండ్లియాడెఁ బ్రియమార, సుమానసతి, నాత్మవీథిఁ బ్ర।
త్యక్షముతన్నుఁ గోరు వికచాంబుజ పత్త్రవిశాలలోచనన్ ॥

గీ॥ ధాతయు విధాతయు నన ఖ్యాతులైన, సుతులనిద్దఱి పంకజాక్షునకు వ
య్యైన శ్రీదేవిగాంచెసంయమివరుండుభృగుఁడుఖ్యాత్యాఖ్యగలతనమగుఖ

వ॥ అనిన మైత్రేయుండి ట్లనియె ॥

క॥ శ్రీతరుణిదుగ్ధసాగర, జాతయనుచుఁ జెప్పుదురు, నిజంబుగమీఁరల్।
ఖ్యాతికి భృగునకుసుతయం, చీతఱిఁ జెప్పితిరి దీనినెఱిగింపఁ దగున్ ॥

వ॥ అనిన, బరాశరుం డిట్లనియె ॥

గీ॥ నిత్య సుమ్మా జగన్మాత నీరజాయ, తాక్షునకు, ననపాయని యనఘచరి
భర్తకై వడితానును బ్రచురలీల, వెలయునీలోకములయందునలఘుమహి

సీ॥ అర్థంబు, పంకజాతాక్షుండు, వాక్కు, పద్మాలయసుమ్ము, సంయమిన
బోధ, శ్రీవిష్ణుండు, బుద్ధిశ్రీకామినీ, మణి సుమ్ము కమలసంభవకులీన।
ధర్మంబు, చక్రగదాపాణి, సత్క్రియ, సాగరోద్భవ, సుమ్ము యోగివర
స్రష్ట కైటభదైత్యసంహారి, సృష్టి, లక్ష్మి మానవతిసుమ్ము శిష్టచరిత।

గీ॥ భూమిధరుఁడబ్జనాభుండు, భూమి కమల; యుభ పరిత్రాత సంతోష, మిం
ధూటితుష్టి, రమాధినాథుండు కామ, మబ్జకరయిచ్ఛ, సుమ్ము విప్రాగ్ర

వ॥ శ్రీవిష్ణుండు యజ్ఞంబు, శ్రీకాంత దక్షిణ, జనార్దనుఁడు పురోడ
రమాదేవి, యాజ్యాహుతి; మధుసూదనుండు, ప్రాగ్వంశంబు; లక్ష్మి
శాల; శ్రీహరి, యూపంబు, వారిధినందనచితి; భగవంతుండు, కుశంబు
వాస,యిధ్మ; సారసాక్షుండు, సామంబు; పద్మ,ఉద్గీతి, వాసుదేవుండు,
నుండు; హరిప్రియ, స్వాహ; జగన్నాథుండు, శంకరుండు, ఇందిర
దామోదరుండు, సూర్యుండు; లోకమాత, ప్రభ; వైకుంఠుండు, పితృ
సంపత్కాంత, స్వధ; హృషీకేశుం, డాకాశంబు; మంగళదేవత,
శ్రీధరుండు, శశాంకుండు; పద్మమందిర, కాంతి; వాసుదేవుండు, వ
మదనజనయిత్రి, జగచ్చేష్ట; గోవిందుండు,సాగరంబు; చంద్రసహోదరి,
గరుడధ్వజుం, డింద్రుండు; ఇందిరాదేవి, యింద్రాణి; మధుసూ
యముఁడు; కమలమందిర తత్కాంత; మాధవుండు, ధనేశ్వరుండు, మ
బుద్ధి; కేశవుండు, వరుణుఁడు; పుండరీకవిష్టరవరుణాని; దైత్యా

సేనాని, క్షీరాబ్ధితనయ దేవసేన; పీతాంబరుం డవష్టంభంబు, విష్ణుమహిషి,
శక్తి; పురుషోత్తముండు, నిమేషంబు; హరివక్షోనివాసిని, కాష్ఠ; త్రివిక్ర
ముండు, ముహూర్తంబు; మా నారీరత్నంబు, కళ; పుండరీకాక్షుండు, ప్రదీ
పంబు; అరవిందమందిర, జ్యోత్స్న; పాంచజన్యధరుండు, ద్రుమంబు; శోభన
దేవత, లత; విష్టరశ్రవుండు, దివసంబు; వైష్ణవి, విభావరి; కృష్ణుండు,
రుండు; వారిజాలయ, వధూమణి; ఉపేంద్రుండు, నదంబు; నలినపాణి,
ది; అచ్యుతుండు, ధ్వజంబు; అబ్జగేహిని, పతాక; నాగశయనుండు,
లుండు; నలినాసన తృష్ణ; ధరణీధరుండు, రాగంబు, రమాకాంత, రతి;
యివ్విధంబున ॥ 174

న్నని చెప్పెదన్ముని కులేశ్వర! పూరుషరూపధారు లె
న్నియుఁ బంకజోదరుని యాకృతులంచు దలంచు, స్త్రీత్వసం।
న్నము లెన్ని భావములుపాటిలు, నన్నియు పద్మమందిరా
న్నత మూర్తులంచు, మదిఁజక్కదలంచు, మచంచలస్థితిన్ ॥ 175

ప్రసతిపుణ్యగాథ మునిశేఖరుఁడైన మరీచిచెప్ప, ను
నసముతోడ వింటి, నదిశ్లాఘ్యము, నీకెఱిఁగింతుఁ దొల్లి దు।
ర్వాసుఁడు, శంకరాంశజుఁ డవారితదుర్భరసత్తపో విభా
సిత విగ్రహుండు, పరిపాటిఁ జరించె వసుంధరాస్థలిన్ ॥ 176

రునితంబాభోగ పరిణద్ధమేఖలా, మణి ఘంటికలు, వాద్యమహిమఁజూప
వనాబ్జసౌరభ్య వాంఛామిళద్భృంగ, రావముల్, గేయకార్యము ఘటింప।
చలన్నవపాణి వరమణి కంకణో, త్కర నిక్వణంబులు, తాళగింప
దము తెమ్మెరల సోకునవాలిముంగురు, లలికభాగమున, నృత్యంబు సలుప ॥

లసగతులకు, రాయంచ లాసపడఁగ, పృథుకుచభరంబునకు మధ్యరేఖ వణఁక।
క్షు విరిదండ తాల్చి మార్గమునవచ్చె, నొక్కవిద్యాధరాంగనయక్కజముగ॥177

కుసుమదామ సౌరభ, మాకారిత మధుపనివహ మవ్వనమెల్లన్।
కటగతి వాసింపఁగ, నా కమలభవోపమానుఁ డంగనకనియెన్ ॥ 178

అండజయాన! నీకు శుభమయ్యెడు, నాకు నొసంగరాదె, పూ
డ" యనన్, లతాంగి కరతామరసంబులుమోడ్చి, "మీరు నై।
డు, లతాంతదామ మిదిగో" యని యిచ్చి నమస్కరింప, ము
డును బోలెఁ గైకొని, సదోహలుఁడై తలఁదాల్చి పోవఁగన్ ॥ 179

సీ॥ కూడి ముప్పదిమూఁడుకోటులు దేవతా, సంఘములిరుగుల హెచ్చరికఁ
తాళమేళ ప్రాప్తిఁదప్పక హాహాది, గంధర్వనాథు లుత్కంఠఁబాడ।
చోద్యం వేద్యముగ రంభాద్యప్సరోంగనా, మణులు లాస్యైక సంభ్రమః
జయజయజీవేతి శబ్దాయమానమై, విద్యాధరశ్రేణి వినుతిసేయ॥

గీ॥ వేలసంఖ్యకుమిగులుముత్యాలగొడుగు,లమితచామరములుదాల్చి యమ
గొలువఁబాలోమితోనభ్రకుంజరాధి, రూఢుఁడై వచ్చెనటకు మరుత్ప్ర

వ॥ ఇట్లు స్వేచ్ఛాగతుండైన యాఖండలుంజూచి ప్రచండతపోమద శౌ
నమ్ముని మార్తాండుండు, నిజజటా మండలి మండనంబైన యప్పువ్వుద
దేవమండలేశ్వరుపై విసరివైచిన నతండును మెండుకొన్న యః
బున మనఃపంకజం బశంకంబై యుండ శరాంకుశంబున నందుకొని
బిందు నందదిందిందిరవంది బృందసుందర గీతికారామంబైన యద్దివ్య
దామంబు దిగిచి కైలాస శిఖరంబుజుట్టిన జాహ్నవియనం దగునట్లుగ
మదస్తోమాభిరామంబులగు సామజకుంభంబులం జుట్టిన బెట్టువదరు
దుమ్మెద పదువుల రొదకుచెదరి యమ్మదకలభంబుదిరిపడి, వడిం,
దిగిచి మధుఁకరమలీమసాకారకల్యంబగు నమ్మాల్యంబు శరగళితనిగళః
సాక్యలంబుగా ధరణింబడవైచి యేచిన, మదాంధకారంబు ఘో
జెచ్చుపెరిగి, రెచ్చి, పదంబులబెట్టుమట్టి, పుట్టిన కోపచాపలంబున,
బుగాఁ, బుచ్చికొని, విసరి, వియచ్చరకోటిపై, వైచి, యద్దెసకుం
కొవ్వునార్చి, దేవసంఘంబులు, వెకలి పికవికలై చెదరిపఱవ
సహస్రాక్షుండ క్షీణసంరంభంబునఁ గుంభమధ్యం బంకుశంబున
నూన శోణితధారలు కటంబుల నుత్కటంబుగా, నుదీర్ణ కర్ణోపాం
విద్రుమ గుళుచ్ఛ ఛాయాకారంబుగా జారినఁ జేరిన కోపాటోపం
రంబుగ క్రమ్మఱం బుచ్చుకొని యుచ్చైర్నాదంబున మేదినివైచి
రాచి ఘీంకారంబుచేసి నిలిచినంజూచి, వాచంయమీంద్రుఁడు ర
నిస్తంద్రుండై యింద్రున కిట్లనియె॥

క॥ స్వారాజ్యపద మదాంధుడవై, రాజసమున, మదీయహస్తార్పిత మా
లారత్న మిచ్చమెచ్చక, యీరీతిఁ బాఱవైతువే కుటిలాత్మా॥

ఉ॥ సాగిలిమ్రొక్కి, దేవర ప్రసాదము నుమ్మనివేడ్కతో శిరో
భాగముచేర్పకేనొసగు భవ్యరమాస్పద పుష్పదామ మీ।
లాగునఁ బాఱవైచితివలక్ష్యము చేసిటుగాన సంపదా
భోగమువాయు మూడుజగముల్ ప్రభుఁడౌ నినుగూడ వాసవా॥

క॥ నను నన్యులతో సరిగా, మనమునఁ దలఁచితివి, కుపితమానసునన్నుఁ ।
గనివణఁకు జగములిపుడే, యేనువున నీకింత చులకనైతిఁ జెపుమా! ॥ 184

క॥ అనవిని సురపతియును, గ్రక్కునఁ గరి దిగనుఱికి, మౌనికుంజరుపదముల్ ।
తనమౌళి సోఁక మ్రొక్కుచు, ననునయవచనములు పలుకనమ్ముని పలికెన్ ॥ 185

చ॥ వదరకుమౌని పొమ్ముడుపవచ్చునె యెవ్వరికైన నన్ను, నా
హృదయమునందు లేదుదయయెంచగ నించుకయైన, తాల్మి చెం ।
దదు మదినెంత తెచ్చికొనినన్, భువనత్రయ జంతుసాధ్వస
ప్రదుని నెఱుంగవే నను, పురందర,! యెందఱు లేరు తాపసుల్ ॥ 186

గీ॥ గౌతమాదులు మునులు నీకడకుఁ జేరి, కలవిలేనివి నొక కొన్ని పలుక, లేని ।
చేవ యెక్కించుకొని యెంత చేసితింద్ర,! యెఱుఁగవే నన్ను దుర్వాసు సిద్ధతేజు ॥

సీ॥ తరుణారుణచ్ఛాయదారొక్కను ఘనదీర్ఘ జటలుజ్జ్వలత్కీలజాలములుగ
భయదకేతు ప్రభం, బక్కననగు, నటద్భ్రుకుటిధూమ విస్ఫూర్తిగాఁగ ।
కోకనదద్యుతిఁ గుచ్చించు కనుచూపుగము లురు విస్ఫులింగములఁ బోల
స్తనిత నాదముఁ గేరు దంతసంఘట్ట నారావంబు చిటచిటార్భటులుగాఁగ ॥

గీ॥ పేర్చి కార్చిచ్చునఁగ మహాభీకరోగ్ర, మూర్తియైవచ్చు, ననుజూచిముజ్జగముల ।
వారు భయమందికందని వారుగలరె, చెనటివై యింద్ర! యిట్లేలచేసితీవు ॥ 188

క॥ అటునిటు నీవిప్పుడు, తటవెటమాటలు కొన్నియాడవిడుచునె, యస్మత్ ।
పటుకోప తీవ్రదహనో, ద్భటకీలాజాలతాప భరముసురేంద్రా ॥ 189

గీ॥ ఎన్ని చెప్పిననైననే నిప్పుడాడు, మాటదప్పనె, నీవనుమానముడిగి ।
నాగపతినెక్కి దేవతానగరమునకు, పొమ్ము దేవేంద్ర! యీవట్టిబూమె లేల ॥ 190

క॥ అనిపరుషోక్తులుపల్కుచు, చనియెన్ మునిపతి, యధేచ్ఛ, శతమన్యుఁడు గ్ర ।
క్కున నభ్రగజము నెక్కక, యనుపమఖేదమునఁ బోయె నమరావతికిన్ ॥ 191

వ॥ అంత॥ 192

సీ॥ నిశ్చలిపుణ్య తపశ్చర్యలుడిగిపోయె, సవనతంత్రంబులు సాగవయ్యె
ఫలియింపవయ్యె వృక్షలతాదు లామ్నాయ శాస్త్రపాఠంబులు జరుగవయ్యె ।
ప్రాణివర్గములు దుర్బలవృత్తులయ్యె, సనాతనధర్మముల్ నడువవయ్యె
కామలోభాదు లగ్గలమయ్యె నగ్రహవ్యాప్తి నర్ఘవిశేష మల్పమయ్యె ॥

గీ॥ పాకదమనుండు సురలు నిశ్శ్రీకులైరి, లోకములు, లేమిచేత, చికాకుపడియె ।
హరిహయసుకృతాపరాధకుప్యన్మునీంద్ర, చంద్రరుంద్రభయంకరశాపమహిమ॥ 193

వ॥ ఎచ్చట సత్యంబుగల దచ్చటలక్ష్మినిలుచు. ఆ సత్యంబును లక్ష్మినను లక్ష్మీసహితులకు సత్యంబెక్కుడిది. సత్యంబు లేకున్న గుణంబులు గలుగ గుణంబులు లేకున్న పురుషులకు బలశౌర్యాద్యభావంబు సిద్ధంబగు. బలశ్రీ వివర్జితుండు సకలజనంబులకు లంఘనీయుండగు. అట్లు సర్వజన లంఘిత ప్రసిద్ధుండయ్యును అపధ్వస్తమతియగు. ఇట్లు త్రైలోక్యంబు నిశ్శ్రీకంబు గుణవివర్జితంబును నగుచుండ, నిశ్శ్రీకులగు దేవగణంబులతోడ దాడి దైత్యదానవులు రణోద్యోగంబు చేసిన పరాజితులై పురుహూతప పురోగములైన త్రిదశులు పితామహు శరణంబు చొచ్చి యథావృత్తం వృత్తాంతంబు విన్నవించిన వారలనాదరించి విరించి యిట్లనియె॥

చ॥ పరము, బరాపరేశ్వరు శుభప్రజవర్ధను దైత్యమర్దనున్
వరదు జగద్భవస్థితి వినాశనకారణు దుఃఖదారణున్ ।
నిరఘు ప్రజాపతీశ్వరుని నీరజనేత్రుని దివ్యగాత్రునిన్
శరణము వేడు డీక్షణము, సత్యము మీకు శుభంబు గల్గెడిన్ ॥ 5

చ॥ అనియని యంత సంభ్రమ నిరంతర తాంత నితాంత చింత బా
యని మునిదేవతల్ గొలువ నంబుజగర్భుడు నిర్భరత్వరన్ ।
చనిచని తాను మోదము లెసంగ గనుంగొనె శుభ్రతావిమో
హన ఘనవీచితల్ప సుఖితార్జునసారథి, క్షీరవారిధిన్ ॥ 6

వ॥ ఇట్లు క్షీరాబ్ధిగాంచి, విరించి, తదుత్తర తీరంబాశ్రయించి సాష్టాం
గావించి, యంజలిపుటంబులు ఫాలంబులంగీలించి, పంచాస్త్రగురు
యిట్లని వినుతించె॥ 7

చ॥ సరసిజనాభ, సర్వగత, సర్వశరణ్య, యనంతనామ, య
క్షర, యజ, యవ్యయాత్మక, సుఖప్రద, భూధర, లోకధామ, భా
స్వర, శరణాగతార్తిహర, చక్రగదాధర, దేవదేవ, నీ
చరణసరోరుహంబులకు సాగిలిమ్రొక్కెద నిష్టసిద్ధికిన్ ॥ 8

గీ॥ ఆదరమున ముముక్షువులైనయోగు, లాత్మదలంతురు నిన్ను మోక్షా
అరయ ప్రకృతిగుణములు నీయందు లేవు, శుద్ధసత్వాత్మ, మముకృపం జూ

సీ॥ కాలమై, శక్తియై, కారణంబై, కారణమునకు కారణత్వము వహిం
కార్యమై, కార్యసంఘాతంబునకు కార్యమై సర్వభూతాత్మయై వె
భోక్తయై, భోజ్యమై, వ్యక్తయై, స్రష్టయై, సృజ్యమై యఖిలకర్తయై
బోద్ధయై, బోధమై, బోధ్యమై, యవికారమై, స్థూలసూక్ష్మతా ప్రా

గీ॥ శంకరుఁడు నేను నింద్రాదిసకలసురలు, తెలియఁగాలేనిమహిమచేఁ దెలివినొందు
పరగునెయ్యది యవ్విష్ణుపరమపదము మదితిరంబుగనిల్పి మ్రొక్కెదముభక్తి॥

క॥ వనజజ్ఞుఁడన, శంకరుఁడన, వనజోదరుఁడనఁగ, భువనవందిత! యయ్యా!
యనువుల వెలయుదు వఘనా, శివ! తావకమహిమఁ బొగడ శక్యమె కృష్ణా!!॥

వ॥ భవదీయదర్శన స్ఫూర్త్యోదయంబున సన్నన్నయన కమలంబులు తెలివినొందుం
గాక, అని పలుకు పితామహుని పలుకులువిని యనిమిషపతి పురోగములైన
సురలు సాగిలి మ్రొక్కి యుచ్చైర్నాదంబున నిట్లని స్తుతియించిరి॥ 202

గీ॥ మాకునధిపతియైన బ్రహ్మాయును దెలియ, జాలఁడట నీపరమపదం బేల తెలియు।
శక్యమగుమాకు నీవ ప్రసన్నదృష్టిఁ, జూచిదర్శన మొసఁగుమచ్యుతముకుంద॥203

వ॥ తదనంతరంబ బృహస్పతి పురోగములైన మునులిట్లని స్తుతియించిరి॥ 204

క॥ ఆద్యుఁడవు యజ్ఞపురుషుఁడ, వాద్యంత విహీనుఁడవు సమస్తాగమసం।
వేద్యుఁడవు సృష్టిపతివన, వద్యుఁడ వమితుఁడవు సకలవంద్యుఁడ వెందున్॥ 205

వ॥ ప్రసన్నుండవై దర్శన మొసంగుము॥ 206

సీ॥ ధాతయీతండు, పద్మామనోహర! త్రిలోచనుఁడీతఁ డుత్ఫుల్ల వనజనేత్ర!
పూషుఁడీతఁడు సుధాంభోరాశిశయన! వైశ్వానరుండతఁడు దివ్యప్రభావ।
పాకారియితఁడు నిర్భరకృపాసంవేశ, యాదోధిపతి యీతఁడసురదమన
ధనదుఁడీతఁడుతప్త కనకసుందరచేల, యక్షరాజితఁడు విహంగగమన॥

గీ॥ సాధ్యమరుదశ్వి వసువిశ్వసంజ్ఞ సురలు, వీరుసర్వేశ! నిజపరివారసహితు।
లగుచువచ్చిరి మిముఁగొల్వ నాదరించి, దృష్టిగోచరుఁడవు గమ్ము దేవదేవ ॥207

వ॥ దైత్యసేనా పరాజితులమై వచ్చి దేవరవారి శ్రీచరణంబులు శరణంబు జొచ్చి
తిమి రక్షించుమని ప్రార్థించిరాసమయమున॥ 208

సీ॥ ఎదబాదల్ సిరి మేననొదగు నుంజాయల, మక్కడించినపైఁడి మణుగువాని
తళుకుదంతముల, నిద్దపురుచిచ్ఛటలని, న్నడియైనకలికి లేనగవువాని।
మేలిడాల్చల్లు కెంగేలి చిందపుతేట, నీటైన చుట్టువాతెఱగువాని
తెలిగన్నుగొనలజూపులఁ జాలకళలెక్క, నక్రకుండల సమున్నతులవాని॥

గీ॥ చతురకలశాంబునిధి సుధాసౌధవీధి, జిలుగుదరగలముత్యాల చేర్లసిరుల। 209
నలరుఫణిరాజు తూగుటుయ్యాలఁ దూఁగు,వాని శ్రీజానిగనిరివాగ్వరుఁడు సురలు॥

వ॥ ఇట్లపూర్వరూప సంస్థానంబై తేజోరాశియగు పుండరీకాక్షునీక్షించి పితా
మహపురోగములు మ్రొక్కి "దేవా! బ్రహ్మేంద్రాది సురగణంబులు నీవ,
యజ్ఞవషట్కారోంకారంబులు నీవ, ఇజ్జగంబంతయును నీవ, వేత్తయు, వేద్యం

బును నీవ, దైత్యనిర్జితులమై యార్తినొంది నిన్ను శరణంబుజొచ్చితిమి.
తేజంబున మమ్ము నాప్యాయనంబు నొందించి రక్షింపుము ॥

క॥ నినుగొలిచి నపుడతొలఁగున్, ఘనతరదుఃఖములు శుభములుగల్గును పాపౌ।
ఘనివృత్తియగును, వికసిత, వనజాయతనేత్ర, భక్తవత్సలకృష్ణా ॥

క॥ అనియిట్లు సురలువలుకఁగ, వనజాయతలోచనుం డవారితకరుణా।
వినుత కటాక్షేక్షణములఁ, దనియఁగ సురకోటిఁజూచి తానిట్లనియెఁ ॥

ఉ॥ ఓసురలార నాదగుసమున్నత తేజముచేత మీకు ను
ల్లాసముచేయుదున్ గడునలంఘ్యము విప్రునిమాట తప్పదా।
యాసమనాక యోషధిచయం బఖిలంబును దెచ్చివైచి ని
స్త్రాసమునన్ బయోజలధిఁద్రచ్చుఁడు హెచ్చగుమీకు సంపదల్ ॥

క॥ మీరును దైత్యపతులు త,త్ప్రారంభముతోడ మందరము మంథము, స।
ర్వోరగపతివాసుకిత్రా, డారూఢిం జేసి చేయుఁడబ్ధిమథనమున్ ॥

సీ॥ అసురలసామోక్తి నలరించి యమృతంబు, మీకునగంబని మేరచేసి
మత్సహాయుతనబ్ధి మథియించి యమృత,లాభముగాంచి యసురులఁబరిహరి
వినుత సుధాపానమున బలాఢ్యత,మించి యమరత్వసిద్ధి నిత్యముగఁగాంచి
శత్రువర్గముల వాంఛారూఢినిర్జించి, నిఖలసంపదలు బూనికవరించి॥ [ధవ

గీ॥ యలరెదరు; పొండుసురలారయనిన మ్రొక్కి, చని; రమాపతియాన తెచ్చి
క్షీరవారాశిలోన నక్షీణమహిమ, నోషధులువైచి మథియించిరురుబలమున

వ॥ ఇట్లు మంథరంబు కవ్వంబుగా వాసుకి నంకత్రాడుగా క్షీరాబ్ధిమథి
నప్పుడు దేవతలుపుచ్ఛంబును దైత్యులు శిరంబునుబట్టిరప్పుడు విషదిగ్ధ నిశ
వహ్నిచే నపహృతకాంతులై యసురులు నిస్తేజులైరి. తన్ముఖనిశ్వాస వా
హతిందూలి వలాహకంబులు పుచ్ఛోపరిభాగంబునం బొగులుగట్టి వర్షిం
ద్వర్ష ధారాప్యాయితశరీరులై సురలుబలసంపన్నులై యుండిరంత ॥

ఉ॥ మందరభూధరంబుదధిమధ్య నిమగ్నముగాకయుండ, గో
విందుడు క్రిందుకూర్మమయి వీపునఁదాల్చి, సురవ్రజంబు లో।
నం, దనుజాతిలోన గగనంబున నొక్కకరూపుదాల్చి, త
న్నందఱుగానకుండ, కలశాబ్ధిమథించె నదృశ్యరూపుఁడై ॥

క॥ సురలకునసురలకును, న య్యురగశ్రేష్ఠునకు పంకజోదరుఁ డొసఁగెఁ।
వరనిజతేజోబలవి, స్ఫురణమున, ననూనబలము, భూరివివేకా ॥

వ॥ ఇట్లు మథించుచుండ క్షీరాబ్ధియందు ॥ 219

క॥ సురలు వినుతింపమానీ, శ్వరులుత్సాహంబునొంద, సకలమనుజులున్ ।
పరమానురాగ రససం, భరితులుగా, సురభి, యజ్ఞమాన్య, జనించెన్ ॥ 220

క॥ భూరితర నిజసముత్కట, సౌరభమెల్లెడలను వెదజల్లుచు పారా ।
వారాంతరమున్న నప్పుడు, వారుణియుదయించె దైత్యవర్గము చెలగన్ ॥ 221

సీ॥ కాంక్షితప్రదము సద్గంధంబు, దివ్య కాంతాసౌఖ్యదము కల్పతరువుపుట్టె
ధవళరూపము, చదుర్దంత నితాంత సత్కాంతికాంతము దివ్యదంతిపుట్టె ।
రాజభాస్వరము, ధారాజితానిలతర స్తంత్రముచ్చైశ్శ్రవోశ్వంబుపుట్టె
మదవతీ వదనోపమము సుధారసకరండము పూర్ణచంద్రమండలముపుట్టె ॥

గీ॥ అప్సరః కోటిపుట్టె దివ్యామృత ప్రపూర్ణకుండిక బూని యంభోజనేత్ర ।
మూర్తిధన్వంతరియనంగ స్ఫూర్తివెలయ, పుట్టెమంథక్షుభిత మహాంభోధిలోన॥

క॥ అక్కజమ్ముగ దేవాసురు, లుక్కున, వడి, బట్టితిగుచు నుద్ధతులకడున్ ।
త్రొక్కుడువడి, వాసుకి, వడి, గ్రక్కినగరళంబు భోగిగణములు గొనియెన్ ॥

వ॥ అంత ॥ 224

సీ॥ శృంగారలక్ష్మిమూర్తి వహించెనో యన మెఱుఁగుఁ దీఁగనదల్చు మేనువెరయ
తతసుధాచ్ఛాయ సుస్మితభూయమందెనో యనఁగ వెన్నెలఁ గేరు హాసమొప్ప ।
కలువచాయలు, చూపుగములయ్యెనోయన కామితూపులనేలు కన్నులమర
అబ్జుండువదనతాదాత్మ్యంబు నొందెనోయన తమ్మిఁ దెగడువక్త్రాబ్జమమర ॥

గీ॥ మానితాంభోరుహాసనాసీనయగుచు, శ్రీకరకరాంబుజముల నాళీకయుగము ।
పూనికల్యాణ విభవసంతానదాన, కాంత, శ్రీకాంతవచ్చె సాగరము వెడలి ॥225

ఉ॥ అప్పుడు దిక్కరుల్ నిజకరాగ్రములన్, సురనిమ్నగాది పు
ణ్యాప్పరిపూర్ణ హేమకలశావళులెత్తి జగత్పవిత్రిన ।
య్యప్పతికన్యకన్ పరమహర్షముతో నభిషిక్తఁజేసెన
య్యొప్పిదమెల్లలోకముల కుత్సవదాయకమయ్యె నయ్యెడన్ ॥ 226

ఉ॥ ఆడకువారిరాశి, పురుషాకృతితో జనుదెంచి యెన్నడున్
వాడనిదివ్య హేమమయవారిజమాలిక తెచ్చియిచ్చె, కా ।
పాడుమువమ్ము నేమరకుమంచు రమారమణీలలామ కా
మ్రేడితభక్తియుక్తిగల ప్రేమనికామగతిన్ జెలంగఁగన్ ॥ 227

గీ॥ తళుకులెల్లెడ జిందుకుందనపుపసుల, ప్రచురదివ్యమణీ కలాపములఁ దెచ్చి ।
అమ్మహాదేవికర్పించె నపుడుభక్తి, వినయసంభ్రమరసవర్మ, విశ్వకర్మ. 228

చ॥ స్మరజనయిత్రి, యప్పుడు ప్రసన్నమనోంబుజయై క్షితేపనాం
బరసుమదామభూషణ సమంచితయై, సురలెల్లఁజూడ శ్రీ।
హరియురమెక్కి చూచె జగమంతయు నంశుమదంశుజాల భా
స్వరసరసీజ పత్రవిలసన్నయనాంచల చంచలేక్షలన్ ॥

క॥ గంధర్వులుపాడగ, నమృతాంధస్తరుణీగణంబులాడగ, మహాపు।
ష్పంధయవేణీమణి, యతిబంధురగతిసురుల విన్నపములాలించెన్ ॥

వ॥ ఇట్లు పుండరీకాక్ష వక్షస్స్థలనివాస లక్ష్మీకటాక్షవీక్షా నిరీక్షితులై సహస్రాక్ష
రోగములగు దేవతాధ్యక్షు లక్షీణనిర్వృతింబొందిరి, వందిరి. ముకుందచర
విందవిముఖులై నముచిప్రముఖులు లక్ష్మీకటాక్షంబునకుంబాసి రేసి ధన్వం
కరస్థయగు నమృతకుండికయొడిసి పుచ్చుకొనిన నచ్యుతుండు కపటమానినీ ర
ధరుండై వారివంచించి నిషేధ విబుధులకొసంగిన తదీయపానంబున బల
పన్నులై యన్నిశాచరులందోలిన పాతాళంబువట్టిరంత, అనంతున్నకు మొ
గ్రక్కున నమరులమరావతికింజనిరి. సూర్యుండవార్య తేజోధుర్యుండవ
నక్షత్రంబు లక్షీణకాంతి పాత్రంబులయ్యె. అగ్నులనుద్విగ్న జ్వాలాలగ్నం
లయ్యె. ధర్మమార్గంబులునిర్మలత్వానర్గళంబులయ్యె. శక్రుండవక్ర పరాక్ర
బున లక్ష్మీకటాక్షజుష్టంబగు విష్టపత్రయంబేలుచు స్వారాజ్య సింహాసనస్థుం
కరగృహీత కనకారవిందయగు నిందిరాదేవి నిట్లనిస్తుతియించె ॥ 2

గీ॥ పద్మవదన, పద్మపత్ర సుందరనేత్ర, పద్మసద్మ పద్మభాస్వరకర।
పద్మనాభుదేవి పద్మపూజాప్రియ, నఖిలలోకజనని నాశ్రయింతు ॥ 2

శా॥ శ్రద్ధామేధలు, భూతినీతిగతులున్, స్వాహాస్వధాసత్క్రియా
సిద్ధుల్, యజ్ఞరహస్యవిద్యల, పరిజ్ఞేయత్రయీవార్తలున్।
బుద్ధిప్రస్ఫుటదండనీతులును, నీపుణ్యాకృతుల్, శ్రీసుసం
బద్ధాక్షేక్షులఁ జూడవమ్మ! ననుపద్మా! పద్మనాభప్రియా ॥ 2

గీ॥ నీవయిజ్జగమెల్లను నిండియుండు, దీవుతక్కంగ నన్యులకెక్కఁ దరమె।
యజ్ఞమయమునుయోగి చింత్యంబునైన, సారసాయతనేత్రు వక్షస్స్థలంబు ॥

క॥ నీచేవిడువంబడి, యతి, నీచత్వముబొంద జగము నీవిపుడు సుధా।
వీచుల నగు కనుచూపులఁ, జూచిననీక్షణమె సకలశుభములు గాంచున్ ॥ 2

క॥ దారసుతాగారమహో, దారసు హృద్ధాన్య ధనవితానములు శరీ।
రారోగ్యైశ్వర్యాదులు, చేరున్నీచూపు మహిమ చే మనుజునకున్ ॥ 2

ఉ॥ తల్లివినీవు జీవులకు, దండ్రిపయోరుహలోచనుండు, వి
శ్వెల్లజగంబునిండి, సుసమృద్ధతనుండుదు రస్మదీయహృ
ద్వల్లభనైన కాంక్షితమవశ్యమునిచ్చి దయావిమిశ్రసం
ఫుల్లకటాక్షవీక్షణసమూహములంగనను చూడుమిందిరా॥ 237

గీ॥ కమలసదన ! మామక ధనమందిరగోష్ఠ, పుత్రమిత్రతనుకళత్రచిత్ర।
తరపరిచ్ఛదముల నిరతంబువిడువక, నిండియెపుడు నిచటనుండుమమ్మ॥ 238

క॥ శీలదయాసత్యాదివి, శాలసుగుణ వితతి పంచజనుని భజించున్।
శ్రీలలన ! త్వత్కటాక్ష స,మాలోకితుడైన యాతఁ డగుణుండైనన్॥ 239

చ॥ అతఁడుకులీనుఁ డాతఁడు సమగ్రయశోధనశాలి యాతఁ డూ
ర్జిత బలుఁడాతఁ డాహవ పరిష్కుఁడతం డభిరూపుఁడాతఁ డా।
యతమతిమంతుఁడాతఁడు గుణాఢ్యుఁడతం డతి పుణ్యుఁడెవ్వఁ డ
చ్యుతసతి! నీదుసత్కృపకు యోగ్యుఁడు భాగ్యకళాధురీణతన్॥ 240

గీ॥ అఖిలగుణములు కలిగినవైననచట, నీకటాక్షంబొకింతైన నిలువదేని।
అవియ, విగుణంబులగు, నీగుణాలి పొగడఁ, గలఁడె వాగ్దానియైన పంకరుహవదన॥

లయగ్రాహి.

ఇందిర ! దరనలినమందిర ! ముఖాబ్జజితచందిర ! వినీలకచబృందజితమత్తేం
దిందిర, సమస్తసురవందితపదోద్యదరవింద చరణానతముకుంద భవనీయా।
మందకరుణావశగసుందరకటాక్షరుచికందళములన్నను గనందగు దయాని
ష్యందనవబిందుతతులం దడిసి యంగము లనిందితసుఖానుభవమొందుగతిఁబొంగన్॥

క॥ అనిఘనుతించిన పద్మా, సన యింద్రునిఁ బలికె నీదు సన్నుతిచే నా।
మనమలరె వరములిచ్చెద, గొనుమన నతఁ డమరరక్షకునిసతికనియెన్॥ 243

క॥ వరమిచ్చెదేని నేనీ, కరుణకుఁ బాత్రంబయేని కమలాలయ మ।
త్పరిపాలిత లోకత్రయి, నిరవుకొనుము పాసిచనక యెప్పుడువేడ్కన్॥ 244

వ॥ ఇది యొక్కవరం బింకనొక్క వరంబువేడెద॥ 245

క॥ ఏనొనరించిన నీస్తవ, మేనరుఁడు పఠించు నతని నిందిరభవదీ।
యానూన సత్కృపాస, న్మానితుఁగాఁ జేయుమమ్మ మానకయెపుడున్॥ 246

వ॥ అనిన నరవిందమందిర పురందరున కిట్లనియె. నీవొనరించిన స్తోత్రారాధనంబునం
బరితుష్టనైతి. నీవు కోరినయట్లు త్రైలోక్యంబును విడువ, నెవ్వండేనియు సాయం
ప్రాతస్సమయంబుల నీస్తవంబు పఠించునతని నెపుడువిడువనని వరద్వయంబు

నొసంగె. ఇవ్విధంబున శ్రీదేవి భృగుమునీంద్రునివలన ఖ్యాతియందు నుదయించి క్రమ్మఱ నమృతమథన కాలంబున నంబుధివలన బుట్టె జగత్స్వామి యగు జనార్దనుం డేకాలంబున నవతారంబుల నొందునాకాలంబులం దానును సహాయత్వంబు నొందు. మఱియును హరి యాదిత్యుండుగా, పద్మ పద్మంబు వలనంబుట్టె, పదంపడి భార్గవరామావతారంబున ధరణియన, రాఘవత్వంబున సీతయన, కృష్ణావతారంబున రుక్మిణియనంబరగు. ఇతరావతారంబుల యందును సహాయినియగు. హరి దేవత్వంబునొంద దేవతయగు. హరిమనుష్యత్వంబు నొంద మానుషియై భగవదనురూప చేష్టలమెలంగు ॥ 247

ఉ॥ ఇందిరదివ్యజన్మకథ యెవ్వఁడువేడ్క పఠించు, నెవ్వఁడా
నందమునన్ వినున్ శుచిమనస్స్థితి నాతనియింట సంతతా।
మందములై సిరుల్ నిలుచు మానకమూఁడుతరంబు లెప్పుడున్
జెంద దలక్ష్మి మౌనికులశేఖర! నీకు నెఱుంగఁ జెప్పితిన్ ॥ 248

వ॥ అనిన మైత్రేయుం డిట్లనియె ॥ 249

గీ॥ భృగునివలన నెట్లు నెగడెసర్గము ప్రజ, లెందఱతనికైరి యెఱుఁగఁజెప్ప।
వయ్య! నాకుననినమ్ముని ప్రవరుఁడి, ట్లనుచుఁ జెప్పె హర్ష మగ్గలముగ॥ 250

క॥ ఖ్యాతికి భృగునకు ధాత,వి ధాతయునన పుత్త్రయుగము, తనయ జగద్వి।
ఖ్యాత రమయును జనించుట, చేతోమోదముగనీకుఁ జెప్పితినిగదా ॥ 251

వ॥ ఆ ధాతృ విధాతలకుఁ గ్రమంబున మేరుకన్యకలైన ఆయతియు నియతియు నన నిద్దఱుభార్యలైరి. అందుధాతకు నాయతియందుఁ బ్రాణుండును, విధాతకు నియతియందు మృకండుండును బుట్టె ॥ 252

క॥ పాండిత్యధుర్య! వినుము మృకండునకున్ బుట్టె, సుతుఁడు కల్పాంతాయు।
ర్మండితుఁ డఖండమతి మా, ర్కండేయుండనఁ దపోఽధికత్వము వెలయన్ ॥ 253

వ॥ అమ్మార్కండేయునకు వేదశిరుండుపుట్టె ధాతృపుత్త్రుండైన ప్రాణునకు ద్యుతిమంతుండు, ద్యుతిమంతునకు రాజవత్తుండుపుట్టె. అతనివలన భార్గవవంశంబు విస్తారంబు నొందె ॥ 254

ఉ॥ ఆతతసత్తపోవిభవుఁడైన మరీచికిభార్యయైన సం
భూతి, విరాజనామకుని బుత్త్రునిగాంచెఁ, దదీయవంశము।
ద్యోతితమై ధరం బరగె యోగికులోత్తమ! యంగిరుండు వి
ఖ్యాతియెలర్పఁగాఁ దనకులాంగనయౌ స్మృతియందు కన్యలన్ ॥ 255

వ॥ సినివాలియు, మహువును, రాకయు, ననుమతియును నన నలువురిం గనియె. అత్రికి ననసూయ యందు సోముండును దుర్వాసుండును, దత్తాత్రేయ యోగీశ్వ

రుండును ననముగ్గురు పుత్రులుపుట్టిరి. పులస్త్యునకు ప్రీతియను కాంతవలన దత్తుండుపుట్టె;నతండు పూర్వజన్మంబున స్వాయంభువ మన్వంతరంబున నగస్త్యుండనంబరగు. పులహునకు క్షమయనుభార్య యందుఁ గర్దముండును, ఊర్వరీయుండును సహిష్ణుండునను,సుత త్రయంబుపుట్టె. క్రతువునకు సన్నతియను భార్యయందు నూర్ధ్వరేతస్కులును నంగుష్ఠ పర్వమాత్రులును జ్వలద్భాస్కర తేజులునగు వాలఖిల్యు లరువదివేలుపుట్టిరి. వసిష్ఠునకు నూర్జయందు రజుండును, గాత్రుండును నూర్ధ్వబాహుండును, సవనుండును, అనఘుండును, ఘుతపుత్రుండును, శుక్రుండును, ననసేడ్వురు ఋషులుపుట్టిరి ॥ 256

గీ॥అరయ నగ్న్యభిమాని,బ్రహ్మాగ్రసుతుఁడు,పావకుఁడుస్వాహాయను తనభార్యయందు।
వినుము!పవమానశుచిజలాశనులనంగ, సుతులముగ్వురగనియె నూర్జితమతులను॥

వ॥ వారలసంతతి పంచచత్వారింశద్భేదంబులం బరఁగె. పావకుండును, పుత్రత్రయంబునుం గూడ నేకోనపంచాశద్భేదంబుల వహ్నులఁగీర్తింపం బడుదురు బ్రహ్మకు నగ్నిష్వాత్తులును, బర్హిషదులును ననుపితరులు పుట్టిరి; వా రనగ్నులును, సాగ్నులునునై యుండుదురు. వారలు స్వధయను భార్యయందు మేనయు, వైధారిణియు నను గన్యలంగనిరి.వారిరువురు బ్రహ్మవాదినులును యోగినులును, ఉత్తమజ్ఞాన సంపన్నలును, సకల గుణాన్వితలునునై యుండుదురు. ఇదిదక్షకన్యకాసంతానవృత్తాంతంబు. ఇది శ్రద్ధావంతులై వినువారు పుత్రపౌత్రాభివృద్ధులగుదురని చెప్పి శ్రీపరాశరుం డిట్లనియె ॥ 258

## ధ్రువ చరిత్ర.

సీ॥ మునివర స్వాయంభువునకుఁ బ్రియవ్రతో, త్తానపాదాఖ్యు లిద్దఱుతనయులు
తనఘుదు రండు నుత్తానపాదునకును, రుచునునీతులు భవ్యరుచులు సతులు ।
సురుచిపైఁ బ్రేమ హెచ్చుగనుంచు భూనాథుఁ డిడదునునీతిపై నించుకైన
సురుచికినుతుఁడు భాసురుఁ డుత్తముఁడు పుట్టె వెలయసునీతికిఁ గలిగెధ్రువుఁడు ॥

గీ॥ నవ్యమణిహేమరాజాసనస్థుఁడైన, తండ్రితో డయెక్కియున్న యుత్తమునిజూచి।
ధ్రువకుమారకుఁడును దదారోహణాభి, కాంక్షియై డాయవచ్చినఁగాంచిసురుచి॥

ఉ॥ పాపఁడ ! యీవృథాశ్రమము పాల్పడనేల నృపాలకాంకమే
రూపుననబ్బునీ కిది యెఱుంగవేమున్న మదీయగర్భజ ।
న్మాపరిమేయభాగ్య దశనంద సునీతికి నేలపుట్టి తీ
వీపతి, తండ్రియైన నిదియేలలభించుఁ ద్యజించుఁగామముర్ ॥ 260

క॥ వాత్తపయుఁడు త్తముండీ, యుత్తమపదమునకు నర్హుఁడుడుగుము నీవీ ।
యుత్తలము, పుణ్యఫలసంపత్తిన్నత్సుతుఁడవైన మఱిసిద్ధించుర్ ॥ 261

వ॥ ఈ రాజాసనంబు సామ్రాజ్య చిహ్నంబిది నా పుత్రునకే యోగ్యం బేల క్లేశ
పడియెదవు ? సునీతికిం బుట్టిన నీవు చెచ్చెర మ్మనో రథంబులు సిద్ధించునే యనియధి
క్షేపించి పలికిన నప్పుడు. 262

క॥ ధ్రువుఁ డవిరళతరకోపో, ద్భవుఁడై యచ్చోటువాసి తనునొందుపరా ।
భవము తనతల్లి కెఱిగించ, నడిం, దద్గేహమునకుఁ, జయ్యనఁ, బోయెన్ ॥ 263

క॥ పరిభవ పీడితుసీష త్స్ఫురితాధరుఁ దనయునపుడు చూచిజనని యా ।
దరమున నంకస్థలినిడి, శిరమాఘ్రాణించియనియెఁ జిత్తము చెదరన్ ॥ 264

సీ॥ అన్న యేటికి విన్ననైనది నీమోము ? కోపకారణమేమి ? చాపలమున ।
నెవ్వరైనను బలికెగ్గు కావించిరో ? నీకెగ్గుచేసిరో ? శోకమేల ? ।
అనుటయు సురుచి తన్నవమానవాక్యముల్, గర్వించిపలికిన క్రమము చెప్ప ।
వెండినిట్టూర్పు బల్విడిపుచ్చి దుశ్చిత్త, మున దీనవదనయై తనయుఁజూచి ॥

గీ॥ అల్పఫణితిసునీతి యిట్లనియె సత్యమయ్య తద్వాక్య మట్ల భాగ్యంబులేని ।
నాకునుదయించి నికృతిసంతాప జలధి మునుగఁ బాలైతివింక నేమనఁగఁగలదు ॥

చ॥ సురుచి పురాభవంబున విశుద్ధతపంబులు చేసియుండ భూ
వరుఁడు తదీయ కార్యవశవర్తనుఁ డయ్యె, నపుణ్యకర్మదు
స్తరపరిభావవారినిధి సాంద్రతరంగనిమగ్నయైనసుం
దరి ననుబోటి భార్యయను నామమె తాల్చువిహీనభాగ్యతన్ ॥ 266

ఉ॥ అన్న ! పురాభవాంతరసమార్జిత కర్మచయంబు పాకమై
నన్నరునొందు నెందును ఘనంబుగ దుఃఖసుఖంబులిట్లుతా
నెన్నక స్రుక్కఁబొంగు నరుఁడెవ్వఁడతండు వివేకపాపసం
పన్నత లేనివాఁడనుచుఁ బల్కుదు రాగమతత్త్వకోవిదుల్ ॥ 267

వ॥ రాజాసన ఛత్ర చామరాశ్వవారణాదులు పుణ్యంబులేని వారికిం గలుగవు,
పుణ్యవతియైన సురుచికడుపునంబుట్టుటంజేసి యుత్తమునకుం గలిగె నల్ప
పుణ్యనైన నాకడుపునంబుట్టిన నీకేల కల్గు నెవ్వరికేమి గల్గు వారందుచేతఁ
దృప్తింబొందవలయునని యుపశమించుము. కాకున్ననట్టి మహోన్నత పదం
బులు లభించుటకై సర్వఫల ప్రదుండైన దామోదరు నాశ్రయించి పుణ్యో
పచయార్థంబు యత్నంబు చేయుము. సుశీలుండవై, ధర్మాత్ముండవై, సర్వ
భూతహితరతుండవై, సర్వ మిత్రుండవై వర్తిల్లుము. ఉదకంబులు పల్లంబున
కోడిగిలినట్లు సంపదలు పాత్రంబు వెదకిపొందునని చెప్పిన సునీతికి ధ్రువుం
డిట్లనియె॥ 268

॥ అమ్మ! శమియించుమనుచుమీరానతిచ్చి, సంతయునిజంబు పరులజిహ్వాభిధాన ।
చాపనిర్ముక్త దుర్వచస్సాయకములు, నాటఁగందిన మదినిది దీటుఁగానదు ॥

॥ అమితపర్యాభవానల శిఖా వృతిఁగందిన నింకను త్తమో
త్తమపదలాభ మొందెద వృథావచనంబులు వల్కనీ సప ।
త్నిమదికి విస్మయంబొదవఁ దెల్లము తండ్రియుఁ బొందనోపదు
త్తముఁడన నెంతయంచు విబుధప్రవరుల్వినుతించునట్లుగన్ ॥ 270

అనియిల్లు వెడలి పుర బా, హ్యానవీనోపవనసీమయందుఁ దనపురా ।
తనపుణ్యపాకఫలతతి, యనఁగొందఱు మునులఁ గాంచె నర్భకుఁడంతన్ ॥ 271

॥ ధృతకృష్ణాజిన చేలులన్, రవిసముద్దీప్తప్రభాజాలులన్
దతతామ్రాభజటాభరాభరణులన్, నందన్మనోవృత్తులన్ ।
హతకామాదిసమస్తశాత్రవుల, దివ్యజ్ఞానదీపప్రభా
ప్రతతిచ్ఛిన్న తమస్కులం, గనియె నబ్బాలుండు సప్తర్షులన్ ॥ 272

సాగిలి మ్రొక్కి హస్తజలజంబుల మోడ్చి నృపాలసూనుఁడ
య్యోగులఁజూచి యిట్లనియె నో మహనీయతర ప్రభావ భ
వ్యాగమవేదులార! ధ్రువుఁడందురు నన్ను, మదీయపూర్వ పు
ణ్యాగమనంబున న్నిము మహాత్ముల గంటిఫలించెఁ గోరికల్ ॥ 273

ఉత్తమజనకుండైన యుత్తానపాదుని కుమారుండనని విన్నవించిన సప్తర్షు లిట్లనిరి ॥ 274

నాలుగైదేండ్ల యీడుమాణవకుఁడవు వి, షాదమేటికి నీకు భూజానితండ్రి ।
యొకటఁగొదలే దభీష్టవియోగమేమి, కానుపించదు దేహరోగములు లేవు ॥ 275

నిర్వేదమేమిటికిగుణ, ధూర్వహ! యెఱిఁగించుమనిన ధ్రువుఁడువినతుఁడై ।
పూర్వకథయెల్లనయ్యం, తర్వాణులతోడఁ జెప్పినం, దమలోనన్ ॥ 276

ఔరా! క్షత్రియతేజం, బారూఢక్రోధరసమహాభారము, దు ।
ర్వారాభిమానితాహం, కారైకాగారమెన్నగాశక్యంబే ॥ 277

సవతితల్లి యుల్లసంబుల నుల్లంబుతల్లడిల్లుచున్నదని యమ్మహాత్ములాదరించి యిట్లనిరి. ఓయీ! క్షత్రియ కుమారా! నీకుఁ గర్తవ్యంబేమి? అప్పనికి సహాయంబాచరించెదము. చెప్పందలంచినమాట చెప్పుమనిన ధ్రువుం డిట్లనియె.

అనఘ చరిత్రులార! వినుఁడర్థము రాజ్యముభోగమేమియున్ ।
మనమునఁగోరఁ, గోరెద సమస్తపదంబులకెల్ల నెక్కుడై ।

యనుపమమై యనా(?)గతమై భువనత్రయసేవ్యతరాసనమై ।
ఘనతరకల్ప(?)ల్పనలఁ గ(?)సద్దై తగునట్ప్రభంబునున్ ॥ 279

సీ॥ వరదుగోవిందుఁ గొల్వకకాని సంస్థాన మబ్బునే ? యటుచేయుమనె మరీచి ।
శ్రీజనార్దనుఁడు హర్షించిన నక్షరస్థానంబు గల్గు సత్యమనె నత్రి ।
అచ్యుతు సర్వభూతాత్ముఁ బూజింప ది, వ్యపదం బెసఁగుననె నంగిరుండు ।
హరిసేవము క్తిద యన, నున్నతస్థాన లాభ మెంతనియెఁ బులస్త్య మౌని॥

గీ॥ అబ్జనేత్రుభజనసగు కోర్కె యనుక్రతుఁ, డింద్రరేశువినతినెసఁగుకామ ।
మనియెఁ బులహముని మహాత్మువిష్ణునివేఁడఁ, జెందుసిద్ధులనె వసిష్ఠుఁడపుడు॥ 280

వ॥ అని సప్తర్షులానతిచ్చిన ॥ 281

క॥ బాలకుఁడిట్లను సన్మును, పాలురతో నయ్య! మీరు పనిచినగతి ల ।
క్ష్మీలలనేశ్వరుఁ గొలిచెద, నీలీలకుఁదగిన జప్య మెయ్యది నాకున్ ॥ 282

వ॥ అరాధనక్రమం బెవ్విధంబానతీయ వలయుననినఁ జిత్తంబు బాహ్య పదార్థ
యత్తంబు గాకుండంజేసి జగద్ధామంబగు వాసుదేవునియందుఁ జేర్చి యేకాగ్ర
మనస్కుండవై జపియించుమని మనురాజంబగు వాసుదేవ ద్వాదశాక్షరం
బుపదేశించి భవత్పితామహుండగు స్వాయంభువుండు జపించినం బరితుష్టుండై
జనార్దనుండు త్రైలోక్యదుర్లభంబగు నైశ్వర్యంబు ప్రసాదించె, నీవును న
మ్మంత్రంబున గోవిందుం బరితుష్టుంజేసి యిష్టార్థంబు లందుమని యాన
తిచ్చిన విని కృతకృత్యునింగాఁ దలంచుకొని వారలకు మ్రొక్కి యవ్వనంబ
వెడలి ॥ 283

సీ॥ ఎందేనిపరమ మునీంద్రు లుత్తమతప, శ్చర్యనిర్వాణ సంసక్తిగనిరి ।
ఎందేనినిండుకాళిందీనదీపుణ్య, వారి పూరంబు లవ్వారిగాఁగ ।
ఎందేని మధుదైత్య నందనులవణు ని, ర్జించె శత్రుఘ్నుఁ డూర్జితబలమున ।
నెందేనివెలయు సమిద్ధసంపత్పురి, పూర్ణయై మధురాఖ్య పుణ్యనగరి ॥

గీ॥ నెపుడునెందేని విహరించు నిపుణగోప, రూపసుకలాపుఁడైన సరోజనేత్రుఁ ।
డట్టిమధువనమున కేగెనధికధైర్య, ధుర్యమతిశాలి రాజసుతుండు వేడ్క॥ 284

ఉ॥ మౌనిపు లానతిచ్చిన క్రమంబునఁ దన్మహనీయపావన
స్థానమునందుఁ జేసె నతిదారుణమైన తపంబుమిక్కిలిం
బూనికనిష్ఠతో హృదయపుష్కర సీమపరాపరేశు ల
క్ష్మీనలినాననావిభు నమేయుని నిల్పి యనల్పవై ఖరిన్ ॥ 285

॥ ఇట్లు మధువనతీర్థంబున నూర్ధ్వబాహుండును, వామపాదస్థితుండును నై
కొన్నిదినంబు లేకాంగుష్ఠస్థితుండై ఘోరతపంబు చేయుచున్నంత ॥ 286

ఉ॥ ధరణీచక్రము దిర్దిరందిరిగె భూధ్రవ్రాత మల్లాడె సా
గరముల్ ఘూర్ణిలె, భూతకోటిబెగడెన్ గంధర్వయక్షోరగా,
సురదేవోత్కరముల్ మదిం దలఁకె, నక్షోభ్యప్రభావానసీ
శ్వరపుత్ర ప్రవరప్రవర్తిత తపశ్చర్యా ప్రతాపంబునై ॥ 287

॥ అప్పుడు ॥ 288

॥ యామాఖ్యదేవతల ఘో, రామితకూష్మాండతతుల నాఖండలుఁడు।
ద్దామగతిఁబంపె నృపసుతుఁ, డామెయినోనరించు తపము నలజడిపెట్టన్ ॥ 289

॥ కామరూపులగు వామాఖ్యదేవతలును,కూష్మాండ గణంబులును, మధువనంబు
ప్రవేశించి నానావిధ మాయలు పన్నిరంత ॥ 290

॥ వసివాడువాడిన వదనపంకజముతో, నినుపాఱెవడియు కన్నీటితోడఁ।
గొదలుచునొదవుగ ద్గదవచోయుక్తితో, దట్టంపునిశ్వాసధారతోడ।
గమ్మనస్నాహ సంగత మహాత్మ్యాంతితో నాకంపమాన దేహంబుతోడ।
శ్రమజలాసార సంసక్త గాత్రంబుతో, సంభవద్దైన్య రసంబుతోడఁ ॥

। గొడుక! యిడుమలఁ గుడిచెదే యడవిలోన,న నెడునస్థోక్తి గళకుహారాంత రమున।
నాగునేరుపుతోనిల్చె నగ్రసరణి, నధికదుర్నీతి దైత్యమాయా సునీతి ॥ 291

। ఇట్లునిలిచి ॥ 292

। కొడుకా దేహవ్యయకర, మిడుమిది నీకేలమాను మెన్నేనోములున్ ।
బడి బడి నోచి నినుంగని, యడవులఁ గలిపితిని నోములాఱడి వ్రావన్ ॥ 293

। పాటించిమగనిచేఁబట్టులేకయనాథ, భావంబుఁదాల్చు నాబ్రదుకుఁ దలఁచి।
మనసుచిల్లులువ్రావ ఘనగర్వమున నాదు, సవతివల్కెడి వచస్సరణిఁ దలఁచి।
ముద్దుగాఱెడి రూపమున నాలుగై దేండ్ల, చక్కనినీమేని సౌరుదలఁచి।
నీబడివాయక నిరతంబుక్రీడనా, లంపటులైన బాలకులఁదలఁచి ॥

। కుడువఁగట్టంగలేనియీగొదవఁదలఁచి,యొడలుచివుకంగఁజేయునీయిడుమదలఁచి।
హాయిగలుగని వట్టికాపేయమేల, రాఃవృథా, దీనిమానుమురా! కుమార ॥ 294

॥ మన్ననలేక భర్తయవమానముసేయ, సపత్నినవ్వ, ని
న్గన్నులఁజూచి యన్నియుసుఖంబని యోర్చితి నిట్టు నీవురా

కున్నభవత్పరోధర నసూత్కరముం ద్యజియించుద్దాన స
రోన్నతసత్తపోవిభవమొంద సుఖించు చిరాయురున్నతిన్ ॥ 295

క॥ అనుచువిలపించు మాయా, జననింగని యక్కుమార చంద్రుఁడు ఖినియున్ ।
విననిగతినుండె హరిపద, వనజభ్రమరన్మనః ప్రవర్తనుఁ డగుచున్ ॥ 296

గీ॥ వత్స! వత్స! మహోగ్రరావములు బెఱయ, రయసముద్యత తీవ్రశస్త్రప్రచండ।
భండనోద్దండులగు దైత్యపతులువీర, వచ్చిరెచ్చట చొరవఁగా వచ్చునీకు॥297

వ॥ అని యదృశ్యం బయ్యెనప్పుడు ॥ 298

క॥ పొడుపొడుమని కూకలు బ, ల్విడిచంపుఁడు చంపుఁడనెడు వికృతోక్తులుమ్రిం।
గుఁడుమ్రింగుఁడనెడు నార్పులు, దడ బడఁగాఁజుట్టుముట్టె దైత్య బలంబుల్॥ 299

చ॥ అదరులుచల్లుకై దువు లుదగ్రతఁ ద్రిప్పుచు ఘోరవాక్యముల్
వదరుచుమండలభ్రమణవైఖరిఁ బొలుచు నొక్క రొక్కరిన్ ।
బదరుచు హుంక్రియాకలనఁ బల్మఱు నిక్కుచు వెక్కిరించుచున్
బొదుపయిఁబెట్టుకూసిరి నభోపలయంబద్రువన్నిశాచరుల్॥ 30(

గీ॥ దీర్ఘదంష్ట్రల వదనముల్దెఱచిమెడలు, సాచివెను మంటలురుల నుచ్చైస్స్వరముల
మిగులవాపోయె నక్కలు మేదినీశ,తనయుముందర చెవులుచిందరులుపొవ॥30

వ॥ మఱియునద్దానవులు సింహోష్ట్రమకరాననులై, నానావిధ ఘోరారావంబుల
చేయుచు నారాజపుత్రునివెఱపించ నతండు గోవిందాసక్తచిత్తుండగుటం జే
తన్మాయావిలసనంబు లేమియు నింద్రియ గోచరంబులు గావయ్యె; నంతకంతకే
నేకాగ్రచిత్తుండై చిత్తజజనకుం దలంచుచున్న యన్నరేంద్రునందనుం జూ
నంక్షోభంబునొంది బృందారకులు సర్వశరణ్యుండగు నిందిరారమణుపాలికి
జని యిట్లని విన్నవించిరి ॥ 30

గీ॥ దేవదేవ, జగన్నాథ, శ్రీవధూసనాథ, పురుషోత్తమ, పరేశ,నవ్యమహిమ।
వెలయునొత్తానపాది గావించుతపము క్రాచె, మమునెల్లఁగరుణచేఁగావవయ్య

క॥ నెలబాలుఁడు, దినదినమున, కళల పసల వృద్ధినొందు గతి నుగ్రతపో।
విలసనమున దినదినమున, కలఘుండతఁడధిక వృద్ధినందుచునుండున్ ॥ 3(

క॥ బలరిపువరుణధనేశ్వర, జలజహిత శశాంకు లేలు స్థానములేలం।
దలఁచియొ, యొనర్చెనృపసుతు, డలఘుతపము దీనిమాన్పవయ్యముకుందా

చ॥ అనవినిపద్మనాభుఁడను నమ్మహితాత్ముఁడు మీ నివాసముల్
వినఁగనొల్లఁడొక్కటి నవీనమనోరథమాత్మఁగోరు, నే।

నోనరుతుదాని మీరూ చనుఁ డుల్లములన్ భయమొందనేల నా
ననిమిషకోటి భక్తివినయంబుల మ్రొక్కుచు నేగునంతలోన్ ॥ 306

॥ పంకజపత్త్రలోచనుఁ డపారకృపారసధార లానవ
త్కింకరకోటి ముంచ సముదీర్ణ సువర్ణ సవర్ణ పర్ణుని ।
శ్శంకు సుపర్ణు నెక్కి వినుచక్కి వడిం జనుదెంచి యన్నిరా
తంకతపోభిరాము గుణధాముఁ గుమారునిఁ జూచి యిట్లనున్ ॥ 307

। ఉత్తానపాదతనయ ! భవ, త్తపమునఁ దుష్టిఁ బొంది వరమీయంగా ।
నిత్తఱి వచ్చితిఁ, గోరుము, చిత్తంబునఁ దలఁచినది విశృంఖలవృత్తిన్ ॥ 308

॥ అని పలికినపలుకమృతరసముపగిదిఁ జెవులంజినికిన నలరి కనుగవ విచ్చి యచ్చి ఱుతపాపండగ్రభాగంబునఁ గులిశాదిరేఖాభరణంబులగుట నిసర్గసుందరారవింద ప్రభవ ప్రభాసంభరణంబులగు శ్రీచరణంబులుఁ జరణాగ్ర సమాశ్రిత ముక్తాకారంబులగు నఖాంకురంబులును నఖాంకురచంద్రకళాధర సర్వమంగళావాసపదదివ్యనగఫలద్వయంబులగు గుల్ఫద్వయంబును, గుల్ఫద్వయసపుష్కర మహాశావారణకరకాండసముద్దండంబులగు జంఘాకాండంబులును, జంఘాక్కాండమండనాయితంబులగు జానుస్తబకంబులును, జానుస్తబకశుంభదూరు రంభాస్తంభంబులును, ఊరురంభాస్తంభజననకనక సైకతాయితనితంబబింబంబును, నితంబబింబసమావరకమణీమేఖలాంతరితహైమోప సంవ్యానకాంతి సరస్వతీప్రవాహావర్తాయితనాభిసరోజంబును నాభిసరోజగంధానుబంధపుష్పంధయమాలాలీలానుకారవిరాజిరోమరాజియు, రోమరాజీంద్రనీలైకస్తంభోపరినిర్మితకమలాభర్మసౌధోపమానమాననీయవక్షస్స్థలంబును, వక్షస్స్థలసుమేరుతటప్రాంతసమారూఢకల్పతరుశాఖాయమాన భుజాస్తంభసంభరణమాన్యంబులగు సుదర్శనపాంచజన్యంబులును, పాంచజన్యసౌభాగ్యయోగ్య తానర్గళంబగుగళంబును, గళవృంతనితాంతకాంతముకురప్రభాజిత్వరంబులగు కపోలఫలకంబులును, కపోలఫలకనృత్యత్కాంతిపుంజరంజితనక్రకుండలోదీర్ణంబులగు కర్ణంబులును, కర్ణాంతవిశ్రాంత నేత్రపుండరీకప్రభావంశకాండాగ్ర జాగ్రన్ముక్తాఫలనాసికాప్రసూనంబును, నాసికాప్రసూనఫలితమధురఫలాధర బింబంబును, అధరబింబ మాధుర్యయాచనార్థ సమాగతార్ధేందుతిరస్కారి లలాటరేఖయు, లలాటరేఖేందుజిష్ణుతావిలంబితమోహాంకారతిరస్కారి శృంగారి భ్రమరకవ్రాతంబును, భ్రమరకోదయాద్రిసముదితార్కబింబస్పర్ధి రత్నకిరీటంబులుం గలిగి కోటిమన్మథలావణ్యంబుననున్న పన్నగశాయికి సాగిమ్రొక్కి యిట్లని విన్నవించె ॥ 309

చ॥ సరసిజనాభ! నాయెడఁ బ్రసన్నుఁడవై పరమిచ్ఛ వేని దే
వరచరణాంబుజద్వయము వాంఛ నుతింపఁ దలంతు బాల్యని
ర్భరజడిమన్ బొసంగదది భవ్యకృపారసధార నాపయిన్
దొరఁగ ననుగ్రహింపు మతినూల్కొని నిన్ను నుతించునట్లుగన్॥ 310

సీ॥ అనివిన్నవించిన నరవిందలోచనుఁ, డధికకృపావృతస్వాంతుఁడగుచు
ముకుళితహస్తుఁడై ముందర నిలుచున్న, యాత్మనందను నెయ్యమునఁ జూచి।
దువ్వుచు పాంచజన్యప్రాంతమున మేను, నివిరిన నాతఁడున్నిద్ర బుద్ధి
సంపన్నుఁడై నేలజాఁగిలి మ్రొక్కి, గ్రక్కున లేచి యంజలిఁ గూర్చి నుదుట॥

గీ॥ మోపి, యానందరసము సంపూర్ణలీల, మనసునిండి వెల్లార్చిన మాడ్కిఁ గన్నుఁ
గొనల సంతోషబాష్పముల్ గురియ, నవ్విరించి జనకునిట్లు గీర్తించఁ దొడఁగె॥

క॥ భూమిజలానలవాయు, వ్యోమమనోబుద్ధులును సమున్నతసర్గ।
శ్రీమించిన భూతాదియు, నా మూలప్రకృతియును ద్వదాకారంబుల్॥ 312

గీ॥ అరయ శుద్ధుండు, సూక్ష్ముండు, వ్యాపకుండునై, ప్రధానంబునకు నవ్వలైన, పురుషుఁ
డీశ! నీరూప మిదినిక్కమిట్టి నీకు, మోడ్పు కెంగేలు నాఫాలమున ఘటించితు॥313

వ॥ భూతాదులకు, గంధాదులకు, బుద్ధ్యాదులకుఁ, బ్రధానంబునకుఁ, బురుషునకుం
బరుండవై, పరమాత్మయు బ్రహ్మంబును నని చెప్పంబడు నీకు నమస్కారంబు॥

సీ॥ వేయిశిరంబులు వేయికన్నులు వేయి, చరణములుగలయట్టి పురుషవరుఁడ
వంతట వ్యాపింతువధిప! కాలత్రయ, జాతమంతయు నీవ, సంభవించెఁ।
జర్చింపఁగ విరాట్టు సామ్రాట్టును స్వరాట్టు, నధిపూరుషుండు నీయందు, జగము
లన్నియు, నీరూప; యజ్ఞంబు పృషదాజ్య, మర్ధర్చసామంబులన్ని ఛంద॥

గీ॥ ములును యజురాగమమును నీవలనఁ బుట్టె, నశ్వగోజాతిమృగములు నఖిలమును జ।
నించె నీవలన నే, సమున్నిద్రమహిమ, పూరుషోత్తమ! పావనాద్భుతచరిత్ర!॥

క॥ సమ్మతి ముఖబాహూరుప, దమ్ముల బ్రాహ్మణులు రాజతతి వైశ్యనికా।
యమ్మును శూద్రులు పుట్టిరి, నెమ్మదిఁ జంద్రుండు పుట్టె నీకు మహాత్మా॥ 316

ఉ॥ కన్నులఁ బొద్దు, శ్రోత్రమున గాలి, ముఖంబున వహ్ని, నాభి న
మ్మిన్నును బుట్టె, స్వర్గ ముపమింపఁగ శేతమునం జనించెన।
రోన్నత! శ్రోత్రసీమ దిశలుద్భవమయ్యెను, భూతధాత్రియున్
బన్నలినంబులం బొడమె, భవ్యము నీమహిమంబు మాధవా॥ 317

వ॥ దేవా! న్యగ్రోధబీజంబునందంకురించి వృద్ధిఁబొందిన వృక్షంబు చందంబునఁ
బరమసూక్ష్ముండవైన నీయందు జనించి జగంబు వృద్ధిఁబొందు, కదలీవృక్షంబు

త్వక్పత్రంబులకంటె భిన్నంబులుగాని చందంబున జగంబునకన్న నీవు భిన్నుండవుగావు, హృదతాప కారిణిస్మైన బుద్ధి జగంబునకుంగాని గుణవర్జితుం డగు నీకు లేదు, పృథగ్భూత్మైక భూతుండవు, భూతభూతుండవు, ప్రధానవ్యక్త పురుషవిరాట్స మ్రాట్స్వరూపుండవు, సర్వరూపధరుండవు, సర్వతపో విశేషజన కుండవును, సర్వేశ్వరుండవునైన నీకునమస్కారంబు. సర్వభూత హృదయుండవు వైన నీవెఱుంగని మనోరథంబులు గలవే. భవదీయసందర్శనంబున మన్మనో రథంబు సఫలంబయ్యె, ధన్యుండఁ, గృతకృత్యుండ, భాగ్యసంపన్నుండ నైతి నని వినుతించిన నతనికి భగవంతుం డిట్లనియె. 218

ఉ॥ బాలక! నేఁడు నీతపముపండె ననుంగనుగొంటిగాన నీ
వేళనభీష్టమెయ్యది ప్రవీణతఁ గోరుము మద్విలోకనం।
బేలనిరర్థకంబగు నభీష్టకరంబగుగాక, మర్త్యలి
చ్ఛాలలితప్రసక్తి ననుసమ్మతిఁ గాంచి లభింతురిష్టముల్ ॥ 319

వ॥ అనిన ధ్రువుండిట్లనియె. 320

గీ॥ అఖిలభూతేశ! నీవు సర్వాత్మవగుట, కానుపింపదె మన్మనోగతమునీకు।
నయ్యును నాచేత విననిష్టమయ్యెనేని, యనధరింపుము దేవమదర్థితంబు ॥ 321

చ॥ ఘనమగు మీప్రసాదమునఁ గాదె మహేంద్రుఁడ శేషలోక రా
జ్యనిరతభోగముల్గనియె, స్వామి! ప్రసన్నుఁడ వైన దుర్లభం।
బననొక టెద్దియుం గలదె? యస్మదపేక్షితమాట యెంత, భ
క్తనివహరక్షణంబు నియతవ్రతమౌగద నీకు నచ్యుతా ॥ 322

క॥ "ఈరాజాసన మోయి కు, మారక! నీ కర్హమగునె? మదుదరజాతుం।
డై రాజిలు వానికిఁగా, కారయ" నని సవతితల్లి యాడెను నన్నున్ ॥ 323

ఉ॥ గాటపుగర్వరేఖఁ గనుగానక మాసవతమ్మయన్నయ
మ్మాటశరంబుపోలె మురమర్దన! మర్మమునొవ్వ నాటియు
త్పాటనచేయరాక పరితాప మొనర్చుచు నున్న దాపదు
ద్ఘాటనదక్ష! తావకసుధాసదృశేక్షలదాని మాన్పవే ॥ 324

వ॥ జగంబున కాధారభూతంబై, సర్వస్థానంబులకు నుత్తమోత్తమంబైన స్థానంబు దయచేసి రక్షింపవలయునని ప్రార్థించిన ధ్రువునకు భవబంధమోచనుండైన పుండరీకలోచనుం డిట్లనియె ॥ 325

సీ॥ అధిపకుమార! నీయర్థించినట్లు లో, కోత్తరసంస్థాన మొంద దేవు।
వినుమటితొల్లిటిమేన విప్రుండవర్చనా, దికములఁ దుష్టినొందించినావు।

సను; మిత్రుండగురాజ నందనుఁ గనుగొని, యభిలషించితివి నీకందువలన
నీజన్మమొదనె సర్వోహితభోగముల్, యానవోదయమున ననుభవించి ॥

గీ॥ సకలలోకోన్నతంబైన స్థానమొంది, అనిశము మదీయపాదపద్మాభిరతుండ ।
వై విముక్తిరమాధిరాజ్యము భజించె దస్మదీయదయాసముదగ్రమహిమ ॥326

వ॥ సూర్యాదిగ్రహంబులకు, సప్తఋషులకు, నశేషవైమానికులకు, నుపరితన
స్థానంబునొందెదు; కొందఱుసురలు చతుర్యుగ పర్యంతంబు, కొందఱు
మన్వంతర పర్యంతంబు, వసింతురు. వీరలందఱు నీక్రిందవసింతురు. నీతల్లియైన
సునీతియు నతి నిర్మలమైన నక్షత్రరూపముదాల్చి దివ్యవిమానంబున నీసమీ
పంబున నాకల్పపర్యంతంబును వసియించుగాక, ఎవ్వరేని సాయంప్రాతః
కాలంబుల నిన్నుగీర్తింతురు వారికి మహాపుణ్యంబు గలుగునని యానతిచ్చి
జనార్దనుండంతర్ధానంబు నొందిన ॥ 327

ఉ॥ మానితసారుఁడౌ ధ్రువకుమారుఁడు శ్రీవిభుఁ డానతిచ్చిన
ట్లా నిఖిలావనీతలసమంచితరాజ్యముచేసి యంతఁ ది ।
వ్యానుపమాన సత్పదమునందు వసించినవాఁడు నేటికిన్
శ్రీనలినాననావిభు భజించిన వారలురి త్తపోదురే ॥ 328

గీ॥ అతనియభిమానసమృద్ధ మానట్టిమహిమ, చూచి యసురగురుండగు శుక్రుఁడధిక ।
విస్మయమునొంది యప్పుడావిర్భవించి,హర్షముమనంబునిండ నిట్లనుచుఁబొగడె।

క॥ ఈనృపసూనుపరాక్రమ, మానంత్యతపః ప్రభావ మాసప్తర్షి ।
స్థానములకన్న నూర్ధ్వ, స్థానంబునఁ గూర్చెనద్భుతక్రియమీరన్ ॥ 330

చ॥ నిరుపమపుణ్యలక్షణ, సునీతితపంబు వచించనెంచ నె
వ్వరితర, మాత్మసంభవుని వద్దవిమానము మీఁదతారయై ।
నిరుపహతిస్థలంబున ననింద్యతనుండె, స్వకీయకీర్తిభా
స్వరమతి నెవ్వరేఁబొగడ వారికి శోభనముల్ ఘటించుచున్ ॥ 331

గీ॥ ఆయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి, కరము నిహపరసౌఖ్యసంఘటనకరము ।
నగును వీరలచరితంబు మిగులభక్తి, వినినవారికిధర్మప్రవీణహృదయ ॥ 332

వ॥ ఆధ్రువునకు, శంభువను భార్యయందు శిష్టయను పుత్రుండుకలిగె. శిష్టకు
నుచ్ఛాయయనుభార్యయందు రిపుండును, రిపుంజయుండును, విప్రుండును, వృక
లుండును వృకతేజుండును ననుపుత్రపంచకంబు గలిగె. అందు రిపునకు బృహతి
యను భార్యయందు చాక్షుషుండుపుట్టె. చాక్షుషునకు వాయుపుత్రియైన
పుష్కరిణియందు మనువుపుట్టె. మనువునకు, విరణప్రజాపతి పుత్రియైన నడ్వల

యందు, ఊరుండును పూరుండును శతద్యుమ్నుండును, తపస్వియు, సత్యవాక్కును శుచియును, అగ్నిష్టుత్తును, అతిరాత్రుండును, విద్యుమ్నుండును, అభిమన్యుండును అను పుత్రదశకంబును, తపతియను కన్యకయుంబుట్టె. తపతిని వైరాజప్రజాపతికిచ్చిరి. అందుపూరునకు ఆగ్నేయియందు అంగుండును, సుమనుండును, సాతియు, క్రతుండును, అంగిరుండును, శిబియును, అనుపుత్రషట్కంబుగలిగె. అందు అంగునకు సునీథయను భార్యయందు వెన్నుండుపుట్టె. ప్రజార్థంబు మహర్షులవ్వెన్నుని దక్షిణపాణి మథించిన వైన్యుండను మహీపాలుండుపుట్టె. అతండేకదా పృథుచక్రవర్తియనం బ్రసిద్ధుండై ప్రజలకు హితంబుగోరి, వసుంధర నశేషవస్తువ్రాతంబునుం బిదికె. అనిన మైత్రేయుండిట్లనియె ॥ 333

క॥ మునులేటికి వెన్నునికర, వనజము మథియించి రెట్లు వరకీర్తి మహా ।
ధనుఁడు పృథుం డుదయించెను, వినుపింపుము నాకు పృథు వివేకాభరణా॥ 334

వ॥ అనిన పరాశరుం డిట్లనియె ॥ 335

సీ॥ అంగుఁడు మృత్యుపుత్రియగు నంబుజనేత్ర సునీథ పేరి త
న్వంగిని బరిగ్రహించుటయు నమ్మిథునమ్మున కుగ్రహీతకో ।
త్తుంగుఁడు క్రూరవర్తనుఁడు దుర్గుణరాశి జనించె వేనుఁడు
ప్పొంగుచు మాను లత్తులువఁ బూన్చిరి భూభరణ ప్రసక్తికిన్ ॥ 336

వ॥ ఇట్లు మాతామహ దోషంబున దుష్టస్వభావుండగు నవ్వేనునిం బట్టాభిషిక్తుం జేసిన నతండు ॥ 337

॥ యజ్ఞములుసేయవలదు,హోమాదివిధుల,మాటగూడదు,దానధర్మక్రమములు।
తడవరాదని కఱవె నుదగ్రభేరి మ్రొత్తి చాటించె భూజనులెల్ల వినఁగ ॥ 338

॥ నాకన్న యజ్ఞభోక్తలు లోకంబునఁ గలరె? నేనలోకేశ్వరుఁడన్ ।
జేకొందు యజ్ఞపతియను సాకాంక్షస్తుతులు జగములన్నియు మెచ్చన్॥ 339

॥ అని ఘననాస్తికత్వనిధియై, కడుమూర్ఖత నున్న యంగనం
దనుకడ కొయ్యనే మునికదంబముపోయి, బహూకరించి యి ।
ట్లనియెఁ బరావరేశుఁడగు నచ్యుతుఁగూర్చి మఖక్రియల్ వినూ
తనగతిఁజేయు మోయధిప! తత్ఫలభాగము నీకునబ్బెడిన్ ॥ 340

। యజ్ఞపురుషుండు, శ్రీహరి, యజ్ఞవిధుల, ప్రీతుఁడై మనకొనఁగు నభీష్టతతుల ।
ఏ విభునిరాజ్యమున చెల్లునిచ్చు లతని,కొనఁగు నఖిలషితములు దామోదరుండు॥

సీ॥ అనవిని వేనుఁ డిట్లను నాకు మిక్కిలి పూజ్యుఁ డెవ్వఁడు జగంబులఁ దలంప
హరియన నెవ్వఁ డంబుజహ గర్భజనార్దన, శివేంద్రమారుతానలయమార్క ।
వరుణచంద్రాదిదేవతలెల్ల రాజదేహాశ్రితులగుట ధరాధినాథుఁ
డఖిలదేవమయుండు సామోదుడై నృపుఁబూజింప శ్రేయోవిభూతిగలదు ॥

గీ॥ భర్తృశుశ్రూషణంబెట్లు పరమధర్మ, మంగనలకట్లు మీకు రాజాజ్ఞ సేత ।
ధర్మమటు గాన మీరును దడవరాదు, యాగదానాది కృత్యము లస్మదాజ్ఞ ॥

చ॥ అనె మునులిట్లువల్కిరి, జనాధిప! యానతియిమ్ము, ధర్మవ
ర్ధన మొనరింప నేమొకటి తథ్యము చెప్పెద మాదరమ్మునన్ ।
వినుము, జగంబులెల్లను హవిఃపరిణామమె సుమ్ము యాగవ
ర్తనములు లేకపోయిన ధరావలయం బశుభంబుపాలగున్ ॥ 343

క॥ అనిపలుమాఱును జెప్పిన, విననొల్లక యతఁడు ధర్మవిముఖుండైనన్ ।
మునులెల్లఁ గోపమున నీ, ఘనపాపుని జంపుఁడనుచు గాఢప్రతిభన్ ॥ 344

చ॥ అనిశము యజ్ఞపూరుషు జనార్దను బుణ్యచరిత్రు నింద చే,
సిన కుటిలాత్ము చంపుఁడని శీఘ్రమె మంత్రపవిత్రదర్భవ ।
జ్రనిహతిచేసి రమ్మునులు, సారసనేత్రుని నింద మున్న చ,
చ్చిన యవివేకి పాపగుణశీలుని దుర్మలినాంతరంగునిన్ ॥ 34

వ॥ అంత ॥ 34

ఉ॥ చోరులు లేఁగి గేహములుచొచ్చి, యవధ్యుల సొమ్ములెల్ల ని,
ష్కారణవైరులై కొనిరి, సందడిగాఁగ నొకళ్లొకళ్లతి ।
క్రూరత, సర్థలోభమున ఘోరరణంబులొనర్చిరంత, ది
గ్వారములెల్ల ముంచె ననివారతభూరిరజోంధకారముల్ ॥ 34

క॥ మునులు నరాజకదోషం, బనుచు విచారించి యజ్ఞనాథిపు తొడ నే,
ర్పొనర మథించిరి, పుత్ర, జననమాత్మలఁగోరి సజ్జనస్తుత చరితా! ॥ 34

గీ॥ చూడఁజూడంగఁ గాలినమోడువంటి, మేను, మరుగుజ్జురూపు వెంబైననోరు ।
కలుగువాఁడు జనించెనొక్కరుఁడు, వేన,మహిపు మథితోరుతలమున మౌనివర

క॥ ఏనేమిచేయుదున్ మీ, రానతియిండనుచు నాతఁడాతురుఁడై, య
మ్మౌనులఁ బల్కిన వారు, తదాననమున్ గని "నిషీద" యని పల్కుటయున్

చ॥ అతఁడు నిషాదనామధరుఁడయ్యెఁ దదంగసముద్భవుల్, సము,
ద్ధతులు నిషాదు లుగ్రబలదర్పులు, పాపరతుల్ జనించి యూ,

ర్జితగతి వింధ్యపర్వతద్రోణివనసీమలనుండి రట్టు లా,
క్షితిపుని పాపమంతయును, జెల్లె నిషాద వినిర్గమంబునన్ ॥ 351

సీ॥ అమ్మునిపుంగవులాతని దక్షిణకరము మథింప భాస్కరసమాన,
తేజుండు వీరగుణాధికుఁడు పృథుండు, వైన్యుఁడు పుట్టె, నప్పుడు వ్యోమవీథి।
నుండి యాజగవనామోగ్ర చాపము దివ్యకాండవర్మములు నగ్రమ్మునఁబడినఁ,
గైకొనె నాతఁడక్కాలంబున నశేష భూతసంతోషంబు పొసఁగఁ బుత్రుఁ ॥

గీ॥ డుదయమందిన వేనుండు త్రిదశపదముచేరె, పున్నామనరకంబు చెందక, త్వద।
నంతరమ సర్వనదులును నంబునిధులు, నతని కభిషేక మొనరించ నరుగుదెంచె॥

వ॥ ఇట్లు పుణ్యజలంబులును మణులుం గొని నదీసముద్రంబులు వచ్చె, సకల ముని
సమేతుండై పితామహుండు వచ్చె, స్థావర జంగమాత్మకంబులగు సర్వభూతం
బులు వచ్చె, ఇట్లు వచ్చి యా వైన్య, రాజుం గానభిషిక్తుం జేసిరంత ॥ 353

గీ॥ అధిక తేజుని దక్షిణహస్తకలిత, దివ్యచక్రుని శ్రీవిష్ణుదేవు నంశ।
భూతునవైన్యుఁ గనుగొని జాతహర్ష, కంచుకిత మూర్తులయ్యె లోకంబులెల్ల॥

కం॥ హరికోనరినట్ల యాభూవరునకు దక్షిణకరమున వర్తిల్లును భా।
స్వరలీల దివ్యచక్ర స్ఫురుడుగ జగమంతయును, నిజాజ్ఞ మెలఁగఁగాఁ ॥ 355

ఆ॥ తంత్రి పగిదిఁ బ్రజకుఁ దగ రంజనము సేయు, కతన విశ్వధరణిపతికి నతని।
కొనరె రాజనామ మనుకూలమై భూమి పతులకెల్ల నొజ్జబంతి యగుచు ॥356

ఉ॥ అంబుధి భూధరప్రతతులందు తదీయమహారథప్రచా,
రంబు లవంధ్యయత్నరుచిరస్థితి సడ్డము లేకసాగెస।
స్యంబు లకృష్టపచ్యము లనంతములై తగ గోగణంబు కా,
మంబులు నిచ్చలుం బిదికె మాకుల జొబ్బిలెఁ దేనియల్మహిన్॥ 357

సీ॥ అతని ప్రాజాపత్యయజ్ఞ సుత్యాహంబు, నందు నిద్దరు సూతుఁడనఁగ, మాగ,
ధుడనఁ బుట్టిరి వారితో మునులిట్లని రీరాజుఁ బొగడుండు మీరలనిన।
నేమెట్లు పొగడుదు మీతని గుణకీర్తు, లెఱుఁగరావనిన వారితని భావి
సద్గుణకీర్తులుత్సాహంబుతోఁ గొని, యాడుఁడాతఁడు వానికనుగుణముగ ॥

ఆ॥ నడవఁగలవాఁడనిన మహానందమొదవ, పొగడఁదొడఁగిరి వారు విస్ఫూర్తితోడ।
నఖిలమునులును సంతోషమంద వైన్య, వసుమతీ భర్తయును మోదవార్ధిఁ దేలె॥

వ॥ సత్యవచనుండు, దానశీలుండు, సత్యదండుండు, లజ్జాశాలి, మైత్రుండు, క్షమా
శీలుండు, విక్రాంతుండు, దుష్టశాసనుండు, ధర్మజ్ఞుండు, కృతజ్ఞుండు, దయా
వంతుండు, ప్రియభాషణుండు, మాన్యుండు, మానయుత, యజ్ఞశీలుండు,

బ్రహ్మణ్యుఁడు, సాధువత్సలుండు, వ్యవహారంబులయెడ శత్రుమిత్రసముఁ
డని సూతమాగధులు నుతింపఁ దృక్కర్మకుండై, ధరణిఁ బాలింపుచు, భూరి
దక్షిణాకంబులగు యజ్ఞంబు లనేకంబులు చేయుచుండినంత ॥ 359

క॥ ప్రజలు క్షుధాపీడితులై, నిజవసతులు విడిచివచ్చి నృపుఁబల్కిరి భూ ।
భుజుఁడనని లేని దోషం, బజహద్గతిఁ బొదనఁ జెడియె నఖిలౌషధులున్ ॥ 360

గీ॥ ఓషధులు నష్టమై పోవనోడవడయ్యె, నన్న మేమియు మాకుసత్యముగఁ దండ్రి
పీవు, జీవన మొసఁగక యెట్లు బ్రతుకు, వారమని విన్నవింప నివ్వటిలు కరుణ ।

ఉ॥ ఆనరపాలచంద్రుఁడు మహాజగవంబు ధరించి బాణముల్
పూనిధరిత్రి వెంటఁబడఁ బొంకము దప్పఁగ గోత్వధాత్రియై ।
ఆనలినాసనాదిభువనావళిఁ ద్రిమ్మర వెంటనంటినన్
దానొక దిక్కులేక వసుధాసతి యిట్లను కంపమానయై ॥ 362

గీ॥ అఖిలభూతములకు నాధారమగునన్నుఁ, జంపి లేని యెచటజంతుసమితి ।
నిలిచిబ్రతుకఁగలదు నృపకులోత్తమయన, వసుధకిట్టులనియె వైన్యవిభుఁడు॥363

క॥ జడియకమచ్ఛాసనమును, గడచిన నింజంపి భూతగణముల నెల్లన్ ।
బడకుండ యోగబలమునఁ గడువేడుకఁదాల్తునన్నిఁ గంపితయగుచున్ ॥ 364

చ॥ క్షితితలనాథ! యోషధులు జీర్ణములయ్యె, మదాత్మ యందునూ
ర్జితగతి, వత్సకల్పనముచేసి, మదీయపయోవిశేషమం ।
చితభుజశక్తినై పిదికి శీఘ్రము చల్లుము దాననోషధి
ప్రతతులుపుట్టు నన్నముశుభస్థితిగల్గుఁ బ్రజల్సుఖింపఁగన్ ॥ 365

వ॥ అనుటయు ॥ 366

క॥ ఆనృపతి వింటికొప్పునఁ, బూనికతోఁ గొండలెల్లఁ బోద్రోసిసమ।
స్థానముచేసె ధరాస్థల, మూనెలవు నివాసమయ్యె నఖిలజనులకున్ ॥ 367

సీ॥ పూర్వసర్గంబున భూతలంబతి విష, మముగానఁబురులు గ్రామములు నేర్పఁ,
డవుగాన సస్యసంభవము గోరక్షయు, కృషియువాణిజ్యాదివృత్తులెచట ।
లేవు, వైన్యునినుండి లెస్సగానన్నియుఁ, గలిగె నీగతి బాగుగా నొనర్చి,
నగరముల్ గ్రామముల్ నానావిధములైన, వృత్తులుగల్పించి పృథుఁడు ప్రజల

గీ॥ కెల్లఁదగుకందమూలాదు లిష్టలీలఁ, దనరనాహారములుచేసి మనువరుండు। [బు
ఘనుఁడుస్వాయంభువుఁడు వత్సకార్యమునకుఁ, జాలనిజపాణి బిదికెనోషధిచయఁ

వ॥ ఆయోషధులచేతఁ బ్రజలు వృద్ధిం బొందిరి. ఇట్లు ప్రాణప్రదాతయగుటం జేసి జగంబులకుఁ దండ్రియయ్యె, ఆతనిపేరనే ధరణి పృథివియనంబరఁగె. అంత దేవ, ముని, దైత్య, రక్షః, పర్వత, గంధర్వోరగ, యక్ష, పితృ, వృక్షంబులు తత్తత్పాత్రంబులుగాని వత్సదోగ్ధృ విశేషంబులయ్యె, నీపృథుని జన్మాదికంబులు కీర్తించినవారికిఁ బాపక్షయంబును, దుస్స్వప్ననాశనంబును, అగునని చెప్పి శ్రీ పరాశరుండిట్లనియె. 369

క॥ మునినాథ! తనయులతనికి, ననుపము లంతర్ధిపాతులనువా రుదయిం
చిన నం దంతర్ధితుసుతుఁ, డొనర హవిర్ధానుఁ డనఁగ నుదయం బయ్యెన్॥ 370

వ॥ ఇట్లంతర్ధికి శిఖండియందు హవిర్ధానుండుపుట్టె, హవిర్ధానునికి నాగ్నేయియయిన విషాణయందుఁ బ్రాచీనబర్హి, శుక్ర, గయ, కృష్ణులన నలువురు పుత్రులు పుట్టిరందు. 371

క॥ ప్రాచీనబర్హిధర్మ, ప్రాచుర్య మహాయశుండు పాథోధిసుతన్ ।
శ్రీచతురసవర్ణయను స, మీచీనగుణాభిరామ మృగశాబాక్షిన్ ॥ 372

ఉ॥ ప్రేమ దలిర్ప శాస్త్రవిధిఁ బెండిలియాడి మనోజ్ఞలీల న,
క్కామినియందుఁ బుత్రకులఁగాంచెఁ బదుండ్రఁ బరస్పరానురా ।
గాముల ధర్మవర్తనుల నచ్ఛధనుర్నిగమాఢ్యులన్ బ్రచే,
తోమహనీయనామకుల దుర్దమశాత్రవమాన భేదులన్ ॥ 373

సీ॥ వారుసాగరజలమధ్యవర్తులగుచు, దశసహస్రాబ్దములు ఘోరతపముచేసి ।
రనిన శక్తికుమారు ముఖాంబుజాత, మెలమిఁగనుఁగొని మైత్రేయుఁడిట్టులనియె॥

ఉ॥ ఏమితలంచి యుగ్రతపమిట్లొనరించిరి వార్ధిమగ్నులై,
భూమిపనందనుల్ పరమపుణ్యులు, పుణ్యచరిత్ర! నీదు వా ।
క్యామృతసేచనంబున మదాత్మ చెలంగఁగ నానతీయవే,
యీమహి నీవు తక్కమఱి యెవ్వరెఱుంగుదురీరహస్యముల్ ॥ 375

చ॥ అనుటయు శ్రీపరాశరుఁడు హర్షమిగుర్పఁగఁ బల్కెఁ, బుత్రులన్,
ఘనుల బదుండ్రఁ జూచి యతిగౌరవమొప్ప కుమారులార! య ।
వ్వనజజుఁ డాజ్ఞయిచ్చె, చెలువంబుతగన్ బ్రజలన్ సృజించుమం,
చనయముతన్మహాజ్ఞ సుగుణాకరులార! యొనర్పఁగాఁదగున్ ॥ 376

చ॥ అనుటయుఁ దండ్రిఁ జూచి వినయంబున నందను లిట్లుపల్కిరో,
జనక! ప్రజాభివృద్ధియగు సారపుకర్మము మాకుఁ దెల్పుమీ ।

వన, వనజాక్షుసద్వరదు నచ్యుతుఁగొల్చినకాక కోర్కులే,
యనువునఁగల్గు, సంశయములన్నియుమానిభజించుఁడాయనన్ ॥ 37

శ్లో॥ ధర్మమర్థంచ కామంచ, మోక్షంచాన్విచ్ఛతా సతా।
ఆరాధనీయోభగవా, ననాదిపురుషోత్తమః॥ 37

సీ॥ ధర్మంబువలసిన తాపసార్చితతపః ఫలుశార్ఙ్గధరునిని గొలువవలయు
అర్థంబువలసిన ననుపమపరమార్థ శ్రీవధూరమణు నర్చింపవలయు।
కామంబువలసిన కామితఫలదుఁ, బుత్రితకాముఁ బ్రేమ నర్థింపవలయు
మోక్షంబువలసిన ముహ్యద్గజేంద్రమోక్షణ విచక్షణుభక్తి నలుపవలయు ॥
గీ॥ పూని భగవంతుని ననాదిపూరుషోత్త, మునిభజింపక పురుషార్థములు ఘటింప
నమరముని కోటికైన నీయర్థమెఱిగి, దానవాంతకుఁ గొలువుండు తనయులార

ఉ॥ ఆదిఁబితామహుండు కమలాక్షునిఁబూజయొనర్చి చేసెదే,
వాదికసర్వసృష్టియు సురాధిపముఖ్యులు నమ్మహాత్ముని।
త్యాదృతిఁ గొల్చి కాంచిరి, మనోర్థితసిద్ధులు, నట్లమీరు దా,
మోదరుఁగోరికొల్వుఁడు సమున్నతితోడఁ బ్రజాభివృద్ధికిన్ ॥ 380

క॥ అనియాదేశించినతమ, జనకునిశాసనమువాళి నరణినిడుచు నా।
ఘనులుప్రచేతసులంబుధి, మునిగితపముచేసిరపుడు ముదితహృతయులై ॥ 381

క॥ పదివేలు వత్సరంబులు, పదిలముగా హరిని మదినిబాదుకొలిపి స।
మ్మదమునఁ దపమొనరించుచు, సదమలమతిఁజేసి రొక్క స్తవము ముదితులై ॥

చ॥ నిరతము శాశ్వతస్థితుల నిల్చునశేషవచః ప్రతిష్ఠ యే,
పురుషునియందు, నిజ్జగముపుట్టువు నాశమునొందుచుండు నే।
పరమునిచేత, భక్తజనపాలకుఁడే విభుఁడట్టి యిందిరా,
వరుచరణాంబుజంబులకు వందన మే మొనరింతు మెప్పుడున్ ॥ 383

క॥ చోద్యమనౌపమ్యము జగ, దాద్యమగోచర మపార మాగమపదవీ।
వేద్యమగు తేజమెద్ది, సముద్యతమతి నట్టిహరికి మ్రొక్కెద మెపుడున్ ॥ 384

గీ॥ పగలునిశయును సంధ్యయు ప్రచురలీలఁ బ్రబలునే దేవదేవు రూపంబులగుచు।
నట్టికాలాత్మునకును, శ్రీహరికి రూప,రహితునకె మ్రొక్కెదము భక్తిరంజిలంగ॥

చ॥ అనుదినమున్ సురల్ పితరులాత్తలఁబొంగి భజింతురే మహా,
త్ముని, మునిపూజ్యు, జీవమయు, సర్వమశార్వరగర్వహారి న।
య్యనఘు సుధాకరాత్మునకు నంబుజనేత్రున కాత్మవీధి మే,
మునితరభక్తియుక్తి చెలువారఁగ మ్రొక్కెద మెల్లకాలమున్ । 386

గీ॥ తమము వాఱదోలి, తన తేజమున నభః, స్థలము వెలుఁగఁ జేసి తావశీత |
జలములోనఁగునట్టి జలజాప్తరూపికి, హరికి మ్రొక్కెదము నిరంతరంబు॥ 387

సీ॥ జగములన్నియు మోచి శబ్దాదిసంశ్రయుండైన భూమ్యాత్మకు హరి భజింతు,
మఖిలబీజాకృతినై జగద్యోనియౌ జలరూపి నచ్యుతు సంస్మరింతు |
మనిమిష పితృకోటి నరయు దేవముఖాఖ్యు ననలాత్ము దనుజారి నభినుతింతు,
మఖిల దేహములందు వ్యాపించి చేష్టించు పవనాత్ము విష్ణుని బ్రస్తుతింతు ॥

గీ॥ మంతటికి నవకాశ ముదగ్రలీల, నిచ్చు నాకాశరూపకుఁ గృష్ణుఁ గొలుతు |
మింద్రియములకు స్థానమై యెసఁగు విషయ,రూపునకుఁ గేశవునకివే మ్రొక్కుగ

చ॥ చతురత నెప్పుడున్ విషయజాలము నొందుచు నింద్రియాత్ముఁడై, [ములు॥
యతిగతి జ్ఞానమూలమయి యక్షరుఁడై క్షరుఁడై వెలుంగు నే |
యతిశయిత ప్రభావనిధి యట్టి రమాసఖు నాశ్రయింతు మే
మితరము మాని మానితసమీహిత నిశ్చలభక్తియుక్తితోన్ ॥ 389

గీ॥ ఇంద్రియగృహీతవిషయంబు లెపుడు నాత్మ, కించి, యంతఃకరణలీల నెసఁగి విశ్వ
మయ్యతఁ జెన్నొందునట్టి రమాసహాయు,చరణములు గొల్చెదము వినిశ్చలమనీష॥

క॥ తనయందు జగములన్నియు, జననవిలయ సంస్థితులు నిజంబుగఁ గనఁగా |
వెనుపొందు ప్రకృతిధర్ముని, వనజాక్షుని గొల్తుమేము వారితభక్తిన్ ॥ 391

చ॥ అనయము శుద్ధుఁడై యగుణుఁడై, గుణవంతుఁడపోలె భ్రాంతిచే,
నొనరెడు నాత్మరూపుఁ బురుషోత్తముఁ జిత్తము చేర్చువారము |
త్యనఘు, విశుద్ధు, నిర్గుణు, నిరంజను, విష్ణుపదంబు పేరిటన్,
దనరెడు నాత్మతత్త్వము, సనాతనుఁ గొల్చెద మబ్జనేత్రునిన్ ॥ 392

సీ॥ హ్రస్వదీర్ఘస్థూలతాణుత్వవిరహిత మగ్ర్యమలోహిత మతను సక్త,
మశిశిర మవ్యోమ మస్పర్శగంధరసంబచక్షు శ్రోత్రకంబపాణి |
వాఙ్మనసమునామవర్జ మగోత్రమతుల మతేజంబహేతుకము విభయ,
మభ్రాంతిక మనిద్రమజర మరుజ మమృతంబ పూర్వాపరత్వంబ ఘనము ॥

గీ॥ దృష్టిజిహ్వాదిగంబునై దివ్యమహిమ, దనరు శ్రీవిష్ణుపరమపదంబునకును |
మ్రొక్కెదము మేము మానసాంభోరుహముల, భక్తితాత్పర్యగరిమసంభ్రమము

వ॥ అని యిట్లు ॥

మ॥ లీలఁ గుమారులంబుధి జలేశయులై పదివేలవర్షముల్,
హాలిఁ దపంబొనర్చి శరణాగతవత్సలు భక్తకామదున్ |

శ్రీలల నాథినాథునిగుఱించి స్తవంబొనరించుసంత్త భ
వ్యాలఘుతత్తపఃఫల మయత్నమునన్ ఫలియించు కైవడిన్॥ 395

సీ॥ మోముచందురునందు ముగ్ధామృతముచిందు, లలితహాసాంకూరములు చెలంగ
కేలిదమ్ములయందుఁ దాళితళ్యముగ్రందు, కమనీయశంఖచక్రములు మెఱయ।
ఘనకటీరమునందు మిను మినుకులుచెందు, పొన్నిటి నునుజాటి వన్నెఁజూప,
మౌళిభాగమునందు మార్తాండరుచిపొందు, హాటకహీరకిరీటమమర॥

గీ॥ కల్లుష రేకుల నునుచాయబలచఁజేయఁ, జాలుమేడాలు దిక్కులఁ గీలుకొనఁగ।
తేజువెంపెక్కి తెక్కలతేజినెక్కి, వారిలో వారియెదుర శ్రీవరుఁడునిలిచె॥ 396

క॥ నారాయణుఁ డఘవిదళన, పారాయణుఁడట్లునిలువఁ బార్థివతనయుల్।
కోరికఁదచ్ఛ్రీపాదాం, భోరుహముల వ్రాలి వినయమున నున్నెడలన్॥ 397

గీ॥ వారిజోదరుం డవారితకృపతమ్ము, వరమువేఁడుమనిన వారుతండ్రి।
ప్రజలకొఱకుఁదమ్ము పనిచినపని విన్న, పంబొనర్పనిచ్చి పరముఁడరుగ॥ 398

ఉ॥ వారునువార్ధి వారి గరువంబున వెల్వడివచ్చి భూరిభూ,
మీరుహసంఘముల్ పెరిగి మేదినినిండి నభంబుగప్పి వెం।
పారఁగమారుతంబునకునైనను దూరఁగరాక ఘోర దు
ర్వారతనున్నఁజూచి ప్రచురప్రతిఘావృతి దుర్నిరీక్షులై॥ 399

చ॥ తరునివహంబు లుప్పతిలిధారుణిఁగప్పఁ బ్రజాక్షయంబు దు
ష్కరగతినయ్యె నిత్తరులుగావె యనిష్టకరంబులంచు ధీ।
కరపవనాగ్నులన్ నిజముఖంబుల వెల్వరుపం బటిష్ఠని
ష్ఠురతఁ బెకల్చి మారుతముశోషిలఁ జేసె దహించె నగ్నియున్॥ 400

గీ॥ ఆడకాడకునొక్కొక్క యవనిజంబు, చిక్కనన్నింటి నీఱుగాఁజేసెవహ్ని।
దానిఁగనియోషధీ శుఁడమ్మానసీయు, లున్నయెడకేగుదెంచి ప్రియోక్తిఁబలికె॥

క॥ ఆరయనోయిప్రజాపతు, లారా! యీపనులు లెన్సలా? శాంతి మదిన్।
జేరిచినావచనమ్ములు, మీరక సంధింపవలయు మీరుతరులతోన్॥ 402

శా॥ కన్యారత్నము వృక్షసంజనిత చక్కంజూడుఁ డీయంగనన్
ధన్యన్ మారిషయండ్రు దీనినిటమీఁదంబుట్టు కార్యంబు నే।
మాన్యాత్మస్థితిఁగాంచి మత్కిరణసంస్పర్శంబునం బోషించినా
డ న్యాయంబునఁ బెండ్లియాడుఁడు నిరూఢప్రేమ సంధిల్లగన్॥ 403

క॥ నా తేజములో సగమును, మీ తేజములో సగంబు మేలతుక యందు।
ద్యోతితగతిసుతుఁడై యు, జ్జాతుండగు దక్షుఁడనఁ బ్రజలనతఁడుగనున్॥ 404

మండితనిజతేజోఘన, మండలమహిమాభిభూత మధ్యందినమా।
ర్తాండుఁడు దుర్వారతప, శ్చండుఁడు కండుడన మానిచంద్రుఁడు వెలయున్ ॥405

అమ్మునిపుంగవుండు పరమాద్భుతచర్యల గోమతీతటీ
సమ్మితపుణ్యకాననముచక్కఁ సుదుశ్చరమాతపంబు తీ
వ్రమ్ముగఁజేయఁడత్తపము వాడిమివేడిమి చూపి నాకలో
కమ్మునమధ్యలోకమునఁ గంచుకి లోకమునన్మహోగ్రతన్ ॥ 406

ఘోరుననమ్మహాముని తపోమయవహ్ని సధూమకీలదు
ర్వారము చుట్టుముట్టుకొన ద్వారముగానక మానసంబులన్।
గూరినభీతివందురుచు గొందులుదూరి మునింగియుండె సం
చారముదూరమైచన భుజంగమలోక భుజంగవారముల్ ॥ 407

జగతీస్థలికార్చిచ్ఛ, ర్చగతిన్ దుర్దాన్తలీల క్రూరజ్వాలా।
ప్రగుణములైనలుదిక్కులఁ, బొగలెగయుచు నుండె మునితపోమయవహ్నుల్॥

ఆవనము వెకల్చి యందుకధ్వనులతోఁ, బారిస్వర్ణదిఁజొచ్చె సౌరదంతి
అరుణకరాళకీలార్తిఁ జిగిర్చినపూనికఁదోచె సంతానవాటి।
త్రాసంబుచెందుచందమునఁ బీటలువాఱె నామరమణి సుధర్మాంతరమున
పలుగాకపొల్దమ్మి తలిరుతెల్లఁగఁబంగ, గంగనుప్పొంగె బంగారునీరు ॥

దప్పివడడస్సి సురలమృతంబు వెతకి, రింద్రుఁడాగుబ్బుపోగ రెప్పలెత్తఁడయ్యె।
నగ్నిసూక్తంబుజపియించెనాంగిరసుఁడుమునితపోగ్నిచ్ఛటలుమిన్నుముంచుకొనిన॥

అప్పుడు॥ 410

వాచస్పతియనుమతినతి, వాచాలప్రౌఢమతి దివస్పతితత్కా।
లోచితగతి నచ్చరఁబ్రమ్లోచన్ బనివంచెనపుడు మునివంచించన్ ॥ 411

నారీలలామధరణిన్, జేరినగ్రొక్కాఱుమెఱుఁగు చెలువున ఘనగం।
భీరతపోమహిమ మహా, నీరధియగుమాని యెదురనిలిచిచతురయై ॥ 412

॥ పాటలనాటలన్ గలికిపల్కులఁ గుల్కుల వీణెమీటులన్
నీటులహావభావకమనీయవిలాసవిలోకనక్రియా।
చాటువచోపహాసముల సంయమిచిత్తము గుత్తగాఁగొనెన్
పాటలగంధి పంచశర పంచశిలీముఖపాలుచేయుచున్ ॥ 413

తమకమునమానిపతి, యక్కమలేక్షణఁ గౌగిలించి గాఢమనోజ।
క్లమముడుగ సురతసుఖమయ, సముదీర్ణానందరూప జలధిం దేలెన్ ॥ 414

ఉ॥ ఆపరమర్షి పుంగవుఁ డహర్నిశముఁ గా వినఁగోరు పంచరా
త్రోపనిషద్రహస్యము సముత్కలికన్ మననంబొనర్చు కాం ।
క్షాపరుఁడై తదర్థము ప్రసన్నత ధ్యానముసేయు నంతతే
జోపరిమేయమైన సతియాకృతిఁగాంచి తదాత్మతంగనున్ ॥

సీ॥ కలికిచిల్కలకొల్కి కుల్కునుంబలుకుల భావించు శుకవచఃప్రౌఢిమరిబు
భామగాంగేయ కుంభభవాభకుచముల వహియించుభారత మహితబుద్ధి ।
పడతిపీఠామోఘ బాణపాతంబులఁ దలపోయు రామావతారమహిమ
సుదతివిశుద్ధతాస్ఫురితహాసంబుల రూపించు వేదాంతరుచులకలిమి ॥

గీ॥ సకియబొమదోయి ధర్మజిజ్ఞాసచేయు, కామసీమణి యసదులేఁగానుతీఁగ ।
తథ్యమిథ్యాత్వసంశయ తర్కమరయు, పండితత్వాభిమాని యక్కండుమహా

గీ॥ బహుతపోభ్యసనార్జిత ప్రచురపుణ్య, పాటవంబున, నిర్ముక్తబంధుఁడయ్యు ।
బహురతంబుల యువతిసంబంధబంధ, బంధుఁడై యుండె నప్పుడప్పరమహాని

సీ॥ జడలుగూడఁగఁబట్టి సవరించి కొరగా సికవేసినిండఁ బూచేర్లుచుట్టి
బూదిప్రోనలిచి కర్పూరసాంకవమిళద్గంధసారంబంగకములనలఁది ।
కుశముద్రలూడ్చియంగుళికల రత్నదీధితిధగద్ధగితముద్రికలు దొడిగి
వల్కలాంశుకములు వదలించిపొన్నీటి వ్రాతదుప్పటి వలెవాటువేసి ॥

గీ॥ మించుగడ్డంబు బవిరిదిద్దించియెదుట, దర్పణమునిల్పవిటవేష మేర్పడంగ ।
కాంచిహర్షించిమౌని యాచంచలాక్షి, కౌగిలించెమనోజ వికారమునను ॥4

క॥ ఈవిధి నభిమతసుఖపరుఁడై వాచంయముఁడు కొన్నియహములు చపలా।
క్షీ! వసియించుము నీవని, భావభవుని యంపగములపాలై మఱియున్ ॥ 4

సీ॥ కామినిఘర్మోదకముల మజ్జనమాడు నాదరంబున సహరాగమముల
యువతికుచాభోగ భవయావనాత్యుష్మజాతవేదుని గొల్చుసంగమముల ।
అంగనామధురాధరామృతావాప్తి నభ్యవహృతిఁ దీర్చు మధ్యందినముల
లలనాగళోద్భవత్కలరవంబుల పురాణార్థంబు విను నపరాహ్ణములను।

గీ॥ రుచిరనిర్జరభామిని రూపధేయ, చింతఁగనుమూసియుండు సాయంతనముల ।
పంచకాలపరాయణత్వాంచితుండు, కండుమౌని పురాభ్యాసగౌరవమున॥ 42

గీ॥ ఇట్లు నూఱేండ్లమీఁద కొన్నేండ్లుచనిన, తోయజాతదళాక్షి కేల్దోయి మొగిచి ।
పలికెసురరాజు గొలువఁబోవలయుననుచు, ననుచు ప్రేమనివారించెమునివరుండ

క॥ మందరకందరమందిర, సుందరమణివేదులందు సుదతీసురతా ।
నందానందముకను ముని, బృందారకవిభుఁడు మిగులప్రేమ దలిర్పన్ ॥ 42

॥ తుదగోళ్లనున్నగా దువ్వికీల్గంటున దిండుగాఁ జుట్టు పూదండగములు
సొగసుగాఁ బచ్చికస్తురిపయోధరకుంభసాళిపై లిఖియించు పత్రకములు।
లావణ్యనవవయోలలితావయవముల భూషించు నవరత్నభూషణములు
తరుణాంబుజాత జిచ్చరణ పల్లవముల చతురసస్తతిబూయు జతురసంబు॥

॥ తమిగదంబంబుచేసి గంధంబుపూయు, శ్రమముడీఅంగతాలవృంతమునవిసరు
ఆకుచుట్టిచ్చు బాగంబులందియిచ్చు, కాంతకమ్మౌనిపతిసురతాంతములను॥

॥ క్రీడాకంధర మందిరాంతరములన్ గేళీగతిన్ మౌనిరాట్,
చూడారత్నము తాళమేళగతిమించుల్ సూపఁగా కోపుగా।
నాడన్ వేడుక రాగరక్తుల బెడంగౌజంతగాత్రంబులన్,
పాడన్ జోడుగఁగూడి నిర్జరపురీభామాలలామంబుతోన్॥ 424

। వారిజాక్షి మఱియు నూఱేండ్లపైఁగొంత, కాలమరుగ మునికిఁ గేలుమొగిచి।
దేవవిభుని గొలువ పోవలె సెలవిమ్ము, మౌనివరయటన్న మౌన్నెనతఁడు॥ 425

। ఆపడఁతియును మ్మునిపతి, శాపభయముకతన విడిచి చననోడి, సము।
ద్దీపిత మదనానలఘన, తాపపరీతాత్మునతనిఁ దనిపె రతులచేన్॥ 426

। క్రొత్తక్రొత్తయి ప్రేమ నూల్కొనఁగనతఁడు,నిర్జరాంగ నతోడ నిర్నిద్రసుఖము।
లంద మఱియును నిన్నూఱుహాయనములు,నడిచెఁగడువడికించిదూనంబుగాఁగ॥

। అంత॥ 428

అంగనపోయెదననిముని, పుంగవువేఁడుటయు నతఁడు పోనీయకయు।
త్తుంగస్తనములు వక్షము, నంగదియఁగ గౌగిలించి నాతిన్ బలికెన్॥ 429

। అంగనే మాటిమాటికిదయారహితాత్మకవై సురాధరా
జుంగొలువంగ పోదుననుచున్ గఠినోక్తులు వల్కనేలయె।
ట్టుంగడుసాహసంబతికఠోరతఁ జేయుట నిక్కమేనిఘో
రాంగజ బాణవేదనలఁ బ్రాణములేమగునో యెఱుంగుమీ॥ 430

అని యవ్వనంబున నవ్వధూమణి పెక్కుమారులువేడిన గ్రొన్ననవింటిజోదు
క్రొవ్వాడిములుకుల వేడిమికినోడి యాప్రాజ్ఞుండాజ్ఞ యియ్యక కొంతకాలంబు
సురత సౌఖ్యంబులన్ దేలుచుండె॥ 431

అంతట నొక్కనాఁడు చతురానన సన్నిభుఁ డమ్మునీంద్రుఁడ
త్యంతరయమ్మునన్ నిజగృహాంతము వెల్వడిపోవ నప్సరః।
కాంత యెటెందుపోయెదన సజ్జహితుండదె వ్రాలె షట్పదీ
కుంతల! సంధ్యవార్చవలె కొంచెముతే క్రియలట్లతప్పినన్॥ 432

చ॥ అనవిని నవ్వి యవ్వికసి తాంబుజలోచన, లోచనప్రభల్
మునిపతినామతింప "ధరలో విననెన్నఁడు నిట్టి ఘస్రముల్ ।
మునుబహువత్సరంబులు సమున్నతి మీకొకవాసరంబొకో"
యన ననఘాత్ముఁడచ్చెరువు నచ్చెరుపాటొదవంగనిట్లనున్ ॥

గీ॥ వెలయుఁ బ్రొద్దున సంధ్యాది విధులుతీర్చి, యిన్నదీతీరవనములోనున్న నీవు
వచ్చి నను గూడితివి ప్రొద్దువ్రాలెనిపుడు, హాస్యమేటికి చెపుమతథ్యంబుతరు

వ॥ అనినఁ బ్రమ్లోచ లోచనచ్ఛాయలెల్లెడం బ్రేళ్ళుదాట . నజ్జటాధరున
నియె.

ఉత్సాహ॥ ఏఱుపరువ తొమ్మనూట యేడువత్సరములపై
నాఱునెలలు మూఁడుదినములయ్యె నన్నుగూడి దు ।
ర్వారమారకేళిఁ దేలి రాత్రులుంబగళ్లు నీ
కోరికలుపొసంగఁదీర్చుకొనఁగఁబట్టి గట్టిగన్ ॥

చ॥ అనుటయు నవ్వుటాల కిటులాడెదొ సత్యముపల్కుమన్ననో
ఘనతరధర్మశీల! పలుకందగునయ్య మృషానులాపముల్ ।
మునికుల సార్వభౌముఁడవు ముఖ్యుఁడవీ వడుగంగ కల్ల లే
యనువుననాడనోపుదు సుధాబ్ధిజనించుట రిత్తగాననన్ ॥ 4

క॥ ఝల్లని గుండియయదరఁగ, వెల్లనైన మోమువాంచి విప్రుఁడుమిగులన్ ।
తల్లడమందుచు చెల్లర, చెల్లరయనిఁయిట్టులనియె చిత్తములోనన్ ॥ 4

ఉ॥ పూర్ణ మనూర్మి చంచల మబోధ్య మపారమునైనయట్టి బ్ర
హ్మార్ణవమాకలించి సుఖమందఁగఁ బోరముఁజేర్చుమామకో ।
దీర్ణవివేకనౌక సుదతీ! నిబిరీసకటాక్షవీక్షగో
త్కీర్ణ మహాశుగౌఘనిహతిం గతిఁ దప్పె నిఁకేమిసేయుదున్ ॥ 4

చ॥ అనిశము దుశ్చరక్రమములైన వ్రతంబులు పెక్కుచేసి కూ
ర్చినసుమహత్తపోధనము రిత్తకురిత్తయి బూదిలోన వే ।
ల్చినమహితాహుతి ప్రతతిలీల నిరర్థకమయ్యె నన్నుఁబో
లినయవివేకపామరులు లేరు ధరావలయంబులోపలన్ ॥ 4

సీ॥ అలరుఁ గన్నులు కన్నులని చలించుటగాక, రౌరవాకార ఘోరములుగావె
నునుపుగుబ్బలుగుబ్బలనుచు నుబ్బుటగాక, యతులకుంభీపాకగతులుకావె ।
కోరినూగారు నూగారనెన్నుటగాక, తలపోయ కాలసూత్రంబుగాదె ।
నునుదరుల్ నునుధరులనుచుఁ బొంగుటగాక, కనమహావీచిమార్గములుకావె

గీ॥ సత్కవీంద్రులు తమచక్షతురిమములు, చూపనూరకె బ్రమసిరి...
వందురుటగాక తెలిసినవాస్తవమున, వారిజాక్షులు జంగమనాకలతలు 441

ఉ॥ ఏతఱిసత్కులప్రభవుఁ డేవము లేక విహీనుఁడై త్రపా
పేతమనస్కుఁడై యకట యేగతి ముద్దిడువాఁడు కష్టము।
ర్జాతవిదూషకాల్పనట జారభుజంగక చోరకోటి ని
ష్ఠ్యూత శరావమైన వెలయుగ్గలిమోవి వసుంధరాస్థలిన్ ॥ 442

సీ॥ విధ్యుక్తిసాంగమా వేదప్రపంచంబు, చదివి యత్యంతప్రశస్తిఁగాంచి।
మానకయుభయమీమాంసాపరిశ్రమ, ప్రమనస్త్వమునఁ గీర్తిపరిఢవించి।
సిద్ధాంతసంసిద్ధి చిదచిదీశ్వరవిని, ర్ణయవివేకనిరూఢి జయముగాంచి।
అలయకబహుళేతిహాసపురాణార్థ, వైదుష్యమునఁ జాలవన్నెకెక్కి ॥

గీ॥ పిదప నీరీతి చదివినచదువులెల్ల, చిలకచదువులుచేసి దుశ్శీలలీల।
లోలనయనావిలోకనాభీలజాల, వినిహతేమృగంబునైతి నేమనఁగఁగలదు ॥

చ॥ అని తనురోసి రేచి జలజాయతలోచనమోముఁజూచి య
మ్ముని యను పాపజాతి ననుముంచితివీకలుషాబ్ధిలోన న।
య్యనిమిషనాథుకార్యమునకై చను మెక్కడికైన నీవువ
చ్చినపనిదీర్చె గోపశిఖిచే నిను నేర్చెదనిల్చియుండినన్ ॥ 444

వ॥ మఱియు నొక విశేషంబుచెప్పెద. సఖ్యంబు సాప్తపదీనంబని చెప్పుదురు,
బహుకాలంబు నీతోడంగూడియుండి నిన్ను దండింపరాదు గావున॥ 445

కం॥ నినుగినియనేమి యింద్రుని, ననఁగారణమేమి ఘనవిషాభవిషయవా।
రనుపమవననిధివీచుల, మునిగిననను దిట్టఁ దగవు మూర్ఖుఁడనగుటన్ ॥ 446

వ॥ అని యమ్ముని యధిక్షేపించి కించిదరుణాయమాన నేత్రాంచలుండై వెచ్చ
వెఱిగి రెచ్చిపలికిన ఱిచ్చవడి యయ్యచ్చర యచ్చెరుపాటునఁ దోటతోటం
దొరగు చెమటచిత్తడిందడిసి వడ వడ వడఁకు నవయవంబులుముంచిన రోమాం
చసంచయంబునన్ కంచుకితయై సంచరించి జవంబున దివంబునకుఁ బోవు
నప్పుడు ॥ 447

గీ॥ అమ్మునిపతి తేజము, గర్భమ్ముయిస్వేదమునఁగలిసి స్రవియించిన న।
క్కొమ్మయుఁ దరుపల్లవముల, సమ్మదమునఁ దుడిచివేసె శాఖలమీఁదన్ ॥ 448

గీ॥ మారుతమేకముచేసిన, నారీమణియయ్యెవినుము నాకనుప్రమ్లో।
చారమణికి మునిపతికిని, మారుతవృక్షములకిది కుమారిక యయ్యెన్ ॥ 449

గీ॥ కండుమునియును నప్సరః కాంతకతనఁ, గూర్చిన తపోధనంబెల్ల గొల్లఁబోఁ
తల్లపమునందె యధికసంతాపతప్త, చిత్తుఁడై దాని నిష్కృతిచేయఁబూని॥

సీ॥ ఆమ్నాయనివహంబు లందందవందురై పొగడు నేక్షేత్రంబుభూరి మహిమఁ
గీర్వాణవితతు లేక్షేత్రంబు జనులనారూఢిఁ గన్గొను చతుర్భుజులుగాఁగఁ।
గీర్తించునంత నేక్షేత్రంబు కోటికోట్యయుత జన్మాఘుంబులడఁగఁజేయు।
శ్రీసతీపతికి నేక్షేత్రంబుదేహమై తనరు కల్పాంతరస్థాయియగుచు॥

గీ॥ సతతపావనతాఖ్యాతిఁ బ్రబలుచుండు, భూమినేక్షేత్రమట్టి శ్రీపురుషోత్త।
మాహ్వయక్షేత్రమున కేగె నతితపస్స, మిద్ధరుచి హేళి, కండు మునీంద్రమహి

ఉ॥ ఉత్కలికన్ మునిప్రవరుఁడుబ్బుచు, గొబ్బునఁజేరె భారతీ
యోత్కలసీమ దక్షిణమహోదధితీరమునందు సర్వసం।
పత్కరమై విముక్తులకుఁ బట్టగు శ్రీపురుషోత్తమంబు, సం
విత్కలనానిరూఢి నవివిస్మితుఁడై యతఁ డాక్షణంబునన్॥

సీ॥ కమలాక్షుచక్రనిఖాత మార్కండేయ కుండోదకంబునఁగ్రుంకులిడియొ।
తురగమేధీయబంధురగవిఖుర దీర్ణ సమధికేంద్ర ద్యుమ్న సరసిఁదోఁగె।
కాకమోక్షప్రదకారణాంభః పూర్ణ రోహిణ పావనోర్మ్మలమునింగె।
దర్శనమాత్రపాతకవిదారణ చణాంచిత తీర్థరాజవీచికలఁదేలె।

గీ॥ శ్వేతరాజతపస్తుంగ, శ్వేతగంగ, నంగములదోఁచె కోటిజన్మార్జితాఘ।
పుంజముల నొక్క వ్రేల్మిడిపాల్లుచేసె, మహితసద్గుణశాలి యమహ్మానిమాళి॥

వ॥ ఇట్లు శ్రీ పురుషోత్తమ దివ్యక్షేత్రంబునకు భూషణీభూతంబైన తీర్థజాతంబ
గృతస్నానుండై పుండరీకాక్ష కృపాకటాక్ష వీక్షేక్షుసార ఝరీపరంప
దారొంకని పేరొంకని కరడుగట్టి గట్టిగాకనుపట్టి పంచదార గట్టనం బట్ట
దట్టంపు ప్రాసాదవజ్రదీధితిఘట్టంబులు చుట్టుకొన్న మిన్నందియున్న శ్రీ
మహీధరం బధిరోహించి నేత్రపర్వంబులగు ద్వావింశత్పర్వంబులు గ
చని దివ్యప్రాసాదమధ్యగత విచిత్రరత్నసింహాసనోపరిభాగంబున॥

సీ॥ అంజనాచలకాంతిభంజనాచలతనుచ్ఛాయ లెల్లెడలకు జౌకళింప।
పద్మసౌందర్యైకసద్మసౌభాగ్యాకరాయితేక్షణరుచుల్ హర్ష మొసఁగ।
మేరుకూటోదార భూరిరత్న స్ఫారమకుటదీధితులు నభోమార్గమలమ।
బాలాతపోద్దామలీలారుచిర హైమచేలాభలంతటా జికిలిచేయ॥

గీ॥ సుకరసంవాసితదరారి సుకరవికచ, చకచకలు పేరెములఁదొక్కచక్కఁదనపు
రాశియైయున్న శ్రీసుభద్రాసనాథు, శ్రీజగన్నాథుఁ గనియెనాసిద్ధమహాని॥

చ॥ కనుఁగొని యంత సంభ్రమితగాఢ ముదర్ణవమగ్నుఁడై మహా,
ముని తనివోక రెప్పకవమించిన యశ్రులుగండపాళిపైఁ।
జినుకఁగఁ గంటకప్రతతి చెందిన యంగముపొంగ భక్తిఁ గ్ర,
క్కున ధరఁజాఁగి మ్రొక్కిడియె గోష్ఠవిహారికి కంసవైరికిన్॥ 456

గీ॥ మ్రొక్కిలేచి హస్తములు ముకుళించి, ఫాళ్యగ్రసీమ నిల్పిహర్షగద్గ।
దస్వరంబు, గళపథమ్మున మెల్లనె, యేగుదేరభక్తి నిట్లుపొగడె॥ 457

వ॥ జయజయ సకలజగదుద్భవస్థితి విలయకారణభూత ప్రభావ, భావభవకోటి సౌందర్య ధుర్య దివ్యవిగ్రహ, గ్రహపతి రోచి స్సహస్రప్రభాదుర్దర్శ సుదర్శన దర్శనభయలోకాలోక గుహాంతర విలీనదైతేయతమోవార, వారణరాజ రక్షావిచక్షణా, క్షణదాచర ప్రమోషిత నిగమసందోహ పునర్దాన సంతోషిత కమలభవకృతస్తోత్ర సంతతానంద, నందత్సురాసుర మహాభారపారావార మగ్నమంథానశైల నిర్వహణమహిమ సంజాత నూతన సుధాపానోన్మనస్సు మనస్సముదాయ కృతాదర, దరవిదళత్కేతకి ముకుళాభ దంష్ట్రాగ్ర సముద్ధృత ధరణీతరుణీ సమాగమ రోమాంచిత మహాదేహవరాహ, వరాహవధరణ్యగ్రగణ్య హిరణ్యకశిపు వక్షోవిక్షోభ సంభూత ప్రభూత రుధిరాభిషేకాశోక ముకుళ తిరస్కారి ఖరనఖరాగ్ర విద్యోతమాన, మాననీయ శ్రీపాదారవింద నిష్యంది మకరంద బిందుధారాయిత మందాకినీ ప్రవాహ పావితాశేష భువన వనధివేష్టిత క్షితీశాసనవిరాజి రాజన్యరాజికానన ప్రజ్వలత్తనూన పాత్కీలా భీలకుఠారధారా జాగ్రద్భుజాగ్రముని శేఖర, ఖరదూషణ త్రిశిరోముఖ విరోధి శిరోధి గళద్రక్తధారాస్వాదామోద జవవత్పత్రి విక్షేపణక్రీడాసదోహల, హాలముఖ నిర్భిన్న యామునాంభః ప్రవాహ, వాహదేహధారి కుపాచారి విదారి భయంకరాలోక, లోకజిద్దర్పత్యాజిత పౌతనారి వ్రతమండల, మండలభ్రమణ చతురతురగఖురపుట నిరశితయవనకోటి పరంపర పరవాసుదేవ, దేవ సార్వభౌమస్వర్గ శ్రీపురుషోత్తమనాథ, శ్రీజగన్నాథా! విజయీభవ, దిగ్విజయీభవ॥ 458

అనులోమకందము-విలోమార్య

స్మారపితా నిజఘనదయ, సారసనాభా సమహిమ, సరసనుతవరదా।
తేరినతగలనుతిమసవి, చేరు సురదదాసమతవశిధనాధారా॥ 459

తెనుంగున కందము - అదేశ్లోకము॥

నను నేలేసనివాసికి, మను నీలాగేది గురుతుమానసకు భాగే।
ననవయయిందులపసరయ, మనవలదా, పటమిదంత యాంతేజమయా॥ 460

వ॥ అనిపొగడి, బ్రహ్మపార స్తవంబున నిట్లని భొగడందొడంగె ॥ 46

శ్లో॥పారంపరం విష్ణురపారపారః । పరః పరేభ్యః పరమార్థరూపీ ।
సబ్రహ్మపారః పరపారభూతః । పరః పరాణామపిపారపారః ॥ 46

శ్లో॥సకారణం, కారణత స్తతోపి । తస్యాపి హేతుః పరహేతుహేతుః ।
కార్యేషుచైవం సహకర్మకర్తృ । రూపైరశేషై రవతీహవిశ్వం. 46

శ్లో॥ బ్రహ్మప్రభుర్బ్రహ్మ ససర్వభూతో । బ్రహ్మప్రజానాంపతి, రచ్యుతో, సౌ ।
బ్రహ్మావ్యయం, నిత్యమజం, సవిష్ణు । రపక్షయాద్యై రఖిలై రసంగీ ॥ 46

శ్లో॥ బ్రహ్మాక్షరమజంనిత్యం । యథాసౌ పురుషో త్తమః ।
తథారాగాదయోదోషాః । ప్రయాన్తు, ప్రశమంమమ ॥ 46

శ్లో॥ఏతద్బ్రహ్మపరాఖ్యం వై । సం స్తవంపరమం జపన్ ।
అవాపపరమాంసిద్ధిం । ససమారాధ్య కేశవం ॥ 6

వ॥ మఱియును. 6

ఉ॥ తారగిరీంద్రవైఖరి యదభ్రశరీరము, పండువెన్నెలన్,
గేరెడినవ్వు, చిత్రమణికీలితదివ్య విభూషణప్రభో ।
దారతయున్ దగంగ, హరిదక్షిణపార్శ్వమునందుగాంచె, మం ।
దారసమాను, నీలపరిధాను భుజంగమ సార్వభౌమునిన్ ॥ 46

గీ॥ వారియిద్దఱినడుమ నవార్యమాణ, బాలభానుప్రభాసముద్భాసమాన ।
కాంతిసంతాన సంతతా గమ్యమాన, భానురాంగవితాన, సుభద్రగనియె॥ 46

సీ. వదనవారిజముపై వ్రాలనూహించువైఖరిఁ జలద్భ్రమరకోత్కరము వెలయ ।
అవయవకాంతి యాచ్ఛాదమై చేరిన పగిదిభూషాపరంపరలుమెఱయ ।
ఎల్లెడనమృతంబు వెల్లిగావిరిసినకిరణి కటాక్షవీక్షలు వ్రసంగ।
సౌందర్యఘనతర స్పర్ధబందీకృతంబైన రీతినికేలియబ్జమమర ॥

గీ॥ తరుణకరపల్ల వాంగుళి తాడ్యమాన, మాననీయవిపంచికామంజునాద ।
సాదరామోదమైయున్న జలదసద్మ, పద్మలోచనఁగనియె సుభద్రనపుడు ॥. 47

క॥ హరివామపార్శ్వమున, సుస్థిర రవికోటిప్రభావి శేషదురవలో ।
క్యరభస మహాసుదర్శన, మురుభ క్తిఁగనియె మునికులో త్తముఁడచేటన్॥ 47

వ॥ ఇట్లుగాంచి, బహుప్రకారంబులవినుతించి, 47

క॥ వెండియును కండుమునిమార్కండేయేశాది శంభుగణమును విమలా ।
చండాకృతి ముఖ్యాఖిల చండీతతిఁగాంచెనపుడు సమ్యగ్భక్తిన్ ॥ 47

మ॥ పరమర్షిప్రవరుండు, భక్తివినయభ్రాజిష్ణుఁడై కొల్చె దు,
ర్భరకారుణ్యధురీణు దానవతమోబాలార్కు, శ్రీవైష్ణవప్రా ।
త్కర్షచూడామణి, రత్నవేత్రసముదగ్రప్రస్ఫురద్బాహు శ్రీ,
హారిసేనాపతి నుగ్రసేను పరమాహ్లాదంబు సంధిల్లఁగన్ ॥ 474

సీ॥ కమనీయముఖ్య రుక్కాండంబు తుండంబు, చటులపక్షవిభూతి సామగీతి ।
ఆవృతయాజుషామోదంబు నాదంబు, బలమథర్వపుల ప్రభాషఫలము ।
బహువిధచ్ఛందోను బద్ధంబు స్కంధంబు, విపులనానాయజ్ఞ విధులప్రాపు ।
భూరివర్ణక్రమంబులు విక్రమంబులు పుచ్ఛంబు కల్పసంపూర్ణతాచ్ఛ ॥

గీ॥ మఱచుఁజెలువొంద ఛందోమయత్వమంది, యిందిరాప్రాణవల్లభు మందురాంత।
రమున నసురలపై కాలుద్రవ్వుచున్న, పన్నగారాతిఁగొలిచె నప్పరమహాని ॥ 475

చ॥ అనఘచరిత్రుఁడమ్మునికులాగ్రణి యగ్రపథంబునందుఁగ
న్గొనె ఘనమార్గమెల్లనతి కోమలపత్రవిచిత్రశాఖలన్ ।
పనుపడఁ గప్పి శ్రీవిభుని మారటమూర్తియనన్ మహాఘపా
టనపటువైన యక్షయవట క్షితిజాతశిఖావతంసమున్ ॥ 476

సీ॥ తర్గలిపోవకయున్నతననీడదుస్త్యజ, బ్రహ్మహత్యాకోటిఁ బాఱఁదఁగులఁ ।
తరుణత్వరమ్యహాతనదళంబు కిశోర, పద్మనాభుననుంగు పాన్పుకాఁగ ।
దృఢగతిన్ జనమహాదీర్ఘ శాఖాగ్రజా, గ్రద్విటపాలిదిక్పాలిఁ గడవ ।
స్థూలనిరంతరాభీలమౌ తనశిఫా, మూలజాలంబు పాతాళమంట ॥

గీ॥ సిరుల శ్రీపూరుషోత్తమ క్షేత్రసీమ, తాఁద్రివిక్రము నపరావతారమనఁగ।
భువనవిఖ్యాతిఁగాంచి సంపూర్ణమహిమ, నలరునక్షయవటభూరుహంబుఁగొలిచి॥ 477

వ॥ క్షేత్రరాజంబు నివాసంబుచేసి నారాయణమంత్రజపపరుండై కొంత
కాలంబునకు మోక్షసామ్రాజ్య సింహాసనాధ్యక్షుండయ్యె ॥ 478

చ॥ కలుషవినాశకారియగు కండుమునీంద్రు చరిత్రమున్ విని
ర్మలమహిమాభిరామ యగుమారిషజన్మము విన్నఁగోరికల్।
దలకొని చెందు సత్ఫలవితానములూనము గాకయంచును
త్కలికదలిర్పఁజెప్పి గుణధాముఁడు సోముఁడువారి కిట్లనున్ ॥ 479

క॥ ఇల్లలసతొల్లి యొకభూ, వల్లభుసతిభర్త బాలవయసునఁ దెగిపోఁ ।
దల్లడిలి బాలవైధ, వ్యోల్లోలనిమగ్న యగుచు నురుదుఃఖమునన్ ॥ 480

ఉ॥ పంకజనాభ భక్త పరిపాలన లాభ విభాసిశంఖచ
క్రాంకితబాహు నీరదనిభాంచితదేహు సభక్తియుక్తి హృ

త్పంకజపీఠినిల్పి వనితామణిపూజ యొనర్చికొల్చె జ్ఞా
నాంకురితాత్మయై తదజహార్ఘనభక్తికి మెచ్చి గ్రక్కునన్ ॥ 48

సీ॥ మెఱుఁగు రేయెండ సోఁపరము మేలిమిపైఁడి, జలపోసనపుఁ శాలతళుకుఁజూపఁ।
కారొన్నగుల్ని గనిగల్గా దనను, నును మేని, చాయ లెల్లెడలకుఁ జౌకళింప।
నిడుదకేల్దోయిఁబూనిన సంకుచుట్టువాల్, జాలిరువంక బేరేలుదొక్క।
తెలిదామరలమించుఁ దలవంచుకొనఁజేయు, మెఱుఁగుకన్ బెళకులు సిరులనీన।

గీ॥ గొనబుసొమ్ములగములతోఁ గూడియెదకు, తగినసొమ్మైనకలుములముగుద బెళకు
కలికిచూపులు చదలమేల్కట్లుగట్ట, కాంతముందరనిలిచి శ్రీకాంతుఁడపుడు॥48

చ॥ నిరుపమపుణ్యశీలగుణ నీవొనరించిన భక్తికిప్పు నే
వరదుఁడనై వరంబొసఁగవచ్చితి వేడుమటన్న మ్రొక్కియ
త్తరుణియుఁ గేలు మోడ్చి యను దైత్యహరా! విధవాత్వదుఃఖదు
స్తరజలరాశిమగ్నయయి తావకపాదము లాశ్రయించితిన్ ॥ 48

గీ॥ బాలవైధవ్యదుఃఖసంప్రాప్తపుత్ర, హీననిర్భాగ్య యిట్టినాకిందిరేశ।
జన్మజన్మంబులం దతిశ్లాఘ్యులైన, పతులనిమ్ము లసత్కృపాపాటవమున ॥48

ఉ॥ ఓకరిరాజరక్షక! అయోనిజనై శుభలక్షణాంగినై
శ్రీకరరూప సంపదలచెన్నువహింపుచు ప్రాజ్ఞనై గుణా।
స్తోకసుపుత్రలాభమువసుంధర పెంపు వహించఁగాంచనీ
వే కృప నీవరంబనుచు వేడిన శ్రీవరుఁడాదరంబునన్ ॥ 48

సీ॥ ఇందీవరేక్షణ యింకొక్క జన్మంబు, నందప్రఖ్యాతు లుదారకర్మ।
లధికతపోబలులగుదురు పతులుప, దుండ్రు పుత్రకుఁడు బంధురయశుండు।
ధీరాత్ముఁడుప్రజాపతిగుణాభిరాముండు, గలుగునీకిపుడాత్మఁ దలఁచినటుల।
అన్నియుఁగల్గు నీ యాత్మజుండున శేష, వంశకర్తృత్వ సద్వైభవంబు॥

గీ॥ నందుఁ దత్సంతతియెనిండునఖిలజగతి, నందటికిఁ బ్రీతికారిణివగుచు నెపుడు।
నీవు పుణ్యస్వరూపివై నెగడెదనుచు, దనుజమర్దనుఁడప్పుడంతర్థినొందె ॥ 48

క॥ అమ్మానినీలలామం, బిమ్మారిష దీనిమీఁరలిందఱునుప యా।
మమ్మయి ప్రజలసృజింపుఁడు, సమ్మతమిది ద్రుహిణునకు నిజంబుగననినన్॥48

ఉ॥ సోమునిమాటగైకొని విశుద్ధగుణాన్వితమారిషన్ ప్రచే
తోమహిమాభిధాములుప దుండ్రునుబెండిలియాడి ప్రేమున।
క్కామినియందు దక్షుసుతుఁగాంచిరతండు ప్రజాపతిత్వసు।
శ్రీమహనీయుఁడై మది సృజించెవిచిత్రితసృష్టిజాలమున్ ॥ 48

॥ ఇట్లు అచరంబులును, చరంబులును, ద్విపదంబులును, [illegible] ననేక ప్రాణిజాతంబుల మానసంబున సృజించిచూచి, [illegible] మఱియు మానసంబున పంచాశత్కన్యకల సృజియించి [illegible] పదుం డ్రను కశ్యపునకుఁ బదమువ్వుర, చంద్రునకు నిరువది యేడ్వుర [illegible] యుండ దేవదైత్య నానాగణంబులును, గో, ఖగ, గంధర్వాప్సర[illegible] లును, దానవాదులునుం బుట్టిరి. అదిమొదలు స్త్రీ పురుష సమా[illegible] ప్రజలు పుట్టిరి. తపోనిష్ఠా గరిష్ఠులగు పూర్వులకు సంకల్పంబున [illegible] బ్రజలు పుట్టుదురనిన శ్రీ పరాశరునకు మైత్రేయుండిట్లనియె.

॥ ధాతయంగుష్ఠమునఁబుట్టెదక్షుఁడనుచుఁ, జెప్పుదురు మీరతండు ప్ర[illegible] బుత్త్రుఁడని చెప్పితిరి జగత్పూజ్య నాకు, సంశయంబయ్యెఁ దెలుపుఁడీ[illegible] మెల్ల ॥

॥ సోమునికిఁ బుత్రికాసుతుఁ, డామహాత్మకుఁడు దక్షుఁడాతఁడెమరలన్ ।
సోమునికిమామయయ్యె, మహామహిమా తెలుపుదీని నాద్యంతంబున్ ॥ 491

॥ అనివిన్నవించిన యమ్మునితో శ్రీపరాశరుండిట్లను బ్రస్ఫుటముగ ।
భూతకోటులయందు పుట్టువులును, నిరోధములును నిత్యముల్ విమలచరిత ।
ప్రవిమలజ్ఞాన సంపన్నులౌ ఋషివరు లీయర్థమున సంశయింప రెపుడు ।
ప్రతియుగంబునయందుఁ బ్రభవించుచునిరోధ మొందుచుదక్షాదులుందు రెందు ॥

॥ జ్యేష్ఠకానిష్ఠ్యములులేవు చర్చసేయ, వారలకు భూరితపమున వార్యమాన ।
సారదివ్యప్రభావముల్ కారణమ్ము, లనినమైత్రేయుఁడిట్లనునాదరమున ॥ 492

॥ సురపన్నగ గంధర్వా, సురతతియుత్పత్తిమాకు సురుచిరపరమా ।
దరమునఁ నెఱిగింపుముముని, వరయనుటయు నమ్మునిప్రవరుఁడిట్లనియెన్ ॥ 493

ఉ॥ కమలజునాజ్ఞ దక్షుఁడతి కౌశలమొప్పగ దేవదానవా
ద్యమిత సమస్తభూతముల నాత్మసృజింప నవన్నియున్ యథా ।
క్రమమున వృద్ధిబొందక నిరర్థములై చనఁజింతనొంది ది
వ్యమహిమ మైథునక్రియ ప్రజాళిసృజింపఁగ నిశ్చితాత్ముఁడై ॥ 494

॥ వీరణుఁడనెడు ప్రజాపతి, గారాబు తనూజ పుణ్యకలిత నశిక్నిం ।
గోరికపెండిలిసైై కడుకూరిమి నతఁడైదువేల కొడుకులఁగాంచెన్ ॥ 495

॥ వారలకడకల్లనఁ జని, నారదుఁడిట్లనియె ప్రియము నయమునఁగదురన్ ।
మీరలు ప్రజలసృజించెడి, వారా, కడగనరు వెఱ్ఱివారలు తలపన్ ॥ 496

ఉ॥ భువికడ యేమిగంటిరి, నభోవివరంబదియెంత దిక్కులె
ట్టివి యెడుగెంత యన్నియు కడింటియెఱుంగఁగ మీరలందఱున్ ।

జవమునఁ బోయి వీనికడ చక్కఁగఁ గాంచి, యనంతరంబ ప్రా
భవము దలిర్పఁగాఁ బ్రజలఁ బన్పడఁ గాంచుడు పొందునాపుడుర్ ॥ 497

క॥ హర్యశ్వనాములాగుణ, ధుర్యులు నలుదిక్కులకును దోడ్తోహర్యా ।
పర్యమెఱుంగక పోయి, యవార్యతనందడగిరబ్ధివాహినులగతిన్ ॥ 498

క॥ అందఱు జనినఁ బ్రచేతో, నందనుఁ డప్పటియుసుతుల నయగుణతేజ ।
స్సందీప్తులగనె పరమా, నందుల వెయ్యంటివీరణాతనుజయందున్ ॥ 499

ఉ॥ అప్పటివచ్చి దేవముని యా శబలాశ్వులఁ జూచి యిట్లనున్
తప్పక యన్నలేగిన పథంబున మీరును బోయి వారి లా ।
గప్పుడు గాంచి భూమికడ యారసివచ్చి ప్రజన్ సృజించుఁడీ
చొప్పున నన్న నన్నల, వసుంధరఁ జూడఁగఁ బోయి రందఱున్ ॥ 500

ఆ॥ వె॥ పోయి జలధిసొచ్చి పోయిననదులట్ల, తిరుగరైరి యెపుడు ధరణియందు ।
భ్రాతలరుగ వెదుక పనివడిపోయిన, వారు మరల రారు వారియట్ల ॥ 501

ఉ॥ నందనులిట్లు క్రన్నురవినాశమునందుటచూచి మారిషా
నందనుఁ డెంతయున్ గనలి నారదు శాపమహాబ్ధి ముంచి పెం ।
పొంద నశిక్నియందుగనె నుగ్మలులన్ దగ నర్వదింటి న ।
య్యందు నిధాననామణులనిచ్చె బ్రసిద్ధులకున్ గ్రమంబునన్ ॥ 502

వ॥ ధర్మునకుం బదుండ్రను, కశ్యపునకున్ పదమువ్వురను, చంద్రునకు నిర్వదేడ్వురను, అరిష్టనేమికి నలువురను, బహుపుత్రునకు నిద్దఱను అంగిరునకు నిద్దఱను, కృశాశ్వునకు నిద్దఱను, నిచ్చెనందు ధర్మునిపత్నులు, అరుంధతి వసువు, జామి, లంబ, భాను, మరుత్వతి, సంకల్ప, ముహూర్త, సాధ్య, విశ్వ, అనుపదుండ్రు. అందు విశ్వకు విశ్వదేవతలు, సాధ్యకు సాధ్యులు, అరుంధతికి మరుత్వంతులు, వసువుకు వసువులు, ముహూర్తకు ముహూర్తజులు, లంబకు ఘోషుండును, జామికి నాగవిధియు, మరుత్వతికి పృథివి విషయంబైన సర్వంబును, సంకల్పకు సర్వాత్మకుండైన సంకల్పుండును, జ్యోతికి పురోగములైన యనేక సహస్ర దేవతలునుం బుట్టిరి. వసుపుత్రులైన యిష్టవసువుల నామంబులం జెప్పెద. అప, ధ్రువ, సోమ, ధర్మ, అనిల, అనల ప్రత్యూష, ప్రభాసులనం బరగుదురు అందు అపునకు వైతధ్య, శమ, శాంతనయులునుం బుట్టిరి ధ్రువునకు కాలకలనకారియు భగవంతుండునగు కాలుండుపుట్టె. సోమునకు భగవంతుండైన వర్చుండు, వర్చునకు వర్చస్వియుంబుట్టిరి. ధర్మునకు మనోహరయందు ద్రవిణుండును, హుతహవ్యుండును శిశిరుండును, ప్రాణుండును, వరుణుండునుం బుట్టిరి

శివయందు మనోజవుండును, అవిజ్ఞాతగతియునుం బుట్టిరి. అనలునకుఁ గుమారుండు శరస్తంబంబునఁ బుట్టె. అతనికి శాఖ, విశాఖ నైగమ పృష్ఠజులుఁ బుట్టిరి. అతఁడు కృత్తికలకు నపత్యుండై కార్తికేయుండనంబరఁగు. ప్రత్యూషునకు ఋషియైన దేవలుండు పుట్టె. దేవలునకు క్షమావంతులును, మనీషులు నగు పుత్త్రు లిరువురు పుట్టిరి.

॥ సల్లలితగుణ బృహస్పతి, చెల్లెలు యోగప్రసిద్ధ చిరకాలము తా।
నిల్లోకమెల్లఁదిరిగెను, ముల్లసిత బ్రహ్మచర్య యోగము వెలయన్ ॥ 504

॥ ఆ కాంత అష్టమవసువగు ప్రభావసువునకు భార్యయయ్యె. వారిద్దఱికిఁ బ్రజాపతియు, దేవవర్ధకియు నైన విశ్వకర్మ పుట్టె. అతని శిల్పనైపుణంబునఁ జేసి దేవసంఘంబునకు దివ్యవిమాన దివ్యభూషణాదులు కలిగె. మనుష్యులును అతని శిల్పంబున నుపజీవింతురు. అజ, ఏకపాద అహిర్బుధ్న, త్వష్ట, రుద్రులన నతనికి పుత్త్రులుగలిగిరి. త్వష్టకు విశ్వరూపుఁడను కుమారుండును గలిగె. మరియు హరుండును, బహురూపకుండు, త్ర్యంబకుండు, అపరాజితుండు, వృషాకపి, శంభుండు, కపర్ది, రైవతుండు, మృగవ్యాధుండు, శర్వుండు, కపాలి, యన నేకాదశ రుద్రులుగల్గిరి. వారలకు శకుండు శ్వేతుండు సమాకూతుండును గల్గిరి. 505

॥ ఘనతపోనిధి కశ్యపమునికి భార్య, లనఘ మూర్తులు పదమువ్వురైరి యదితి।
యాదిగాఁ గల వికచపద్మాయతాక్షు,లతులితపతివ్రతాగుణాభ్యధికమతులు ॥ 506

॥ వారలదితియు, దితియు, దనువు, అరిష్ట, సురస, ఖస, సురభి, వినత, తామ్ర, క్రోధ, వశ, ఇల, కద్రు, మునియునన వెలయుదురు ॥ 507

॥ మనువుచాక్షుషుఁడై యుండ మహితమతులు, భూనుతఖ్యాతిపన్నిద్దరైన తుషితు।
లదితికడుపున నాదిత్యులనఁగ బుట్టి, రనఘ వైవస్వతాఖ్య మన్వంతరమున ॥ 508

॥ వారలు విష్ణుండును, శక్రుండును, అర్యముండును, ధాతయు, త్వష్టయు, పూషయు, వివస్వంతుండును, సవితృండును, మిత్రావరుణుండును, అంశుండును, భగుండును, అదితేజుండును, అను ద్వాదశాదిత్యులు. అరిష్టనేమి పత్నులకుఁ బదియాఱుగురు తనూజులుదయించిరి. బహుపుత్త్రునకు విద్యుత్సంజ్ఞగల పుత్త్రికలు నలుగురు కలిగిరి. ప్రత్యంగిరునకు ఋక్సంజ్ఞగల బ్రహ్మఋషిసత్తములు జనించిరి. కృశాశ్వునకుఁ బ్రహరణసంజ్ఞగల పుత్త్రులుపుట్టిరి. వీరలకుఁ బ్రతియుగ సహస్రాంతంబునందును సూర్యునకుఁ బ్రతిదివసంబునందు నుదయాస్తమయములు కలుగునట్లుత్పత్తినిరోధంబులు గలుగుచుండు ॥ 509

॥ దితికినికశ్యపమౌనికి, సుతులిద్దఱుగలిగి రధికశూరులుసమిద్దా।
ర్జితుఁడు హిరణ్యాక్షుండును, క్రతుభుగ్జైత్రుఁడు హిరణ్యకశిపుండనఁగన్ ॥ 510

గీ॥ సింహికాభిధాన చెలియలువారికి వెలఁదియొకతె గలిగె విప్రచిత్తి ।
యనెడిదైత్యపతికి వనితగానిచ్చిన ప్రీతినతఁడుదగఁ బరిగ్రహించె ॥

వ॥ ఆహిరణ్యకశిపునకు, అనుహ్లాద, హ్లాద, ప్రహ్లాద, సంహ్లాదులన నలుగురు పుత్త్రు
పుట్టిరి. వారిలోన ॥

క॥ సమదర్శనుఁడు మహాత్ముం, డమలయశోనిధి గుణాఢ్యుఁడగు ప్రహ్లాదుం ।
డమితైకభక్తి నిలిపెన్, కమలాక్షునియందు నన్యకామరహితుఁడై ॥

సీ॥ చల్లనై యుండె వైశ్వానరుఁడంభోధి, మీఁగాలిబంటియై మీఱదయ్యె ।
శస్త్రాస్త్రజాలముల్ శకలీకృతములయ్యె, విషధరదంష్ట్రిక ల్విఱిగిపోయె ।
పూబంతులై తాకె భూధరఘాతముల్, హంసతూలపుఁ బాను పయ్యె ధరణి ।
మలయమారుతమయ్యె ప్రళయఝంఝానిలం బిభదంతములుపువ్వుటెత్తులయె

గీ॥ విషము,సుధ,కృత్య,దాసియువివిధమాయ,లెల్ల ముంచుగనులునయ్యెనిందిరా
హాయుఁదలఁచుచున్న ప్రహ్లాదునకును, తండ్రిఘనరోషభీషణోద్ధతిఘటింప॥ 5

మ॥ అనమైత్త్రేయుఁడు కేలుదోయి నిజఫాలాంతంబు నంగూర్చియి
ట్లను నోశక్తికుమార ! పంకజదళాక్షాంఘ్రిద్వ యీచింతనా
భినుతానందను, నందనుం,జనకుఁ డ ప్రేమాత్ముఁడై యేల యి
ట్లనిమిత్తంబుగనొంచఁబంచె నిదియాద్యంతంబునుం జెప్పవే ॥ 5

క॥ అనినఁబరాశరమునియూ, ఘనుఁగనియను మునుహిరణ్యకశిపుఁ డుతపము ।
త్యనుపమగతిమందరనగ, మునఁజేసె దృఢప్రయత్నమున నిశ్చలుఁడై ॥ 5

ఉ॥ అక్కజమైనతత్తప ముదగ్రతఁజూప విరించియంచపై
వాక్కలికతోఁగూడియటువచ్చి వియచ్చరులెల్లఁ జూడఁగా
రక్కసుఁడిచ్చఁగోరిన వరంబులొసంగిచనన్ దపోమదం
బెక్కి జగత్త్రయంబునతఁడేలె సురాసురమర్త్యజైత్రుఁడై ॥ 5

సీ॥ ఇంద్రుఁడై సురకోటినేలు పావకమూర్తి, యయి కయికొనుకవ్యహవ్యతతుల
దండియై ప్రాణులదండించు కోణేశుఁడై, యాతుధానుల నాక్రమించు ।
యాదోధినాథుఁడై యాదోగణమునొంచు,పవనుఁడై వడకించు భువనచయము
ధనపతియై సర్వధనములుహరియించు, రుద్రుఁడై రుద్రగనలార్చులు నిగుడ్చు

గీ॥తపనుఁడై దుస్సహోగ్రసంతాపమొసఁగు,సోముఁడై భూమినించు నుద్దామమహి.
మేఘమై వర్షధారాసమృద్ధిఁజూపు, ద్రుహిణపరమత్ముఁడాజగద్ద్రోహియసుర

క॥ సురలెల్లబంట్లుగాన, చ్చరలెల్లం జేటికలుగ సకలధరిత్రీ ।
నరులెల్ల భక్ష్యములుగా, హిరణ్యకశిపుఁ డెల్లజగములేలె బలియుఁడై ॥ 5.

మ॥ కనదభ్రంకషరత్నసౌధములలోఁ గాంతాసహస్రంబుతో,
ననిశంబున్ శశికాంతకాంత కలశీహాలారసంబాని, యు।
త్యనుపక్రోన్మదఘూర్ణితాక్షియుగ కోణాత్యుగ్రరోచుల్ జని,
జ్జనసంత్రాసమొనర్ప నేలెనతఁడుచ్చైః కీర్తి లోకంబులన్ ॥ 520

క॥ వరమతియా ప్రహ్లాదుఁడు, పరిపాటించదివె బాలపాఠ్యంబులు ని।
ర్భర హరిభక్తిపరుండై, గురుకులమున దైత్యబాలకులతోఁ గూడన్ ॥ 521

క॥ ఒకనాఁడు గురులతో, న య్యకలంకుఁడు తండ్రి కడకు నరిగి తదీయాం
ఘ్రికమలముల కెఱఁగిన యతి, వికచముఖుండగుచు సుతుని వినతుఁ బలికెన్ ॥ 522

ఉ॥ పాపఁడ నీవు సద్గురుకృపన్ బరిపాటి గ్రహించినట్టి వి,
ద్యాపటిమంబెఱుంగ మదిహర్షముప్పుట్ట పఠించుమయ్య భూ।
మీపతినీతిశాస్త్రముల మేయము లోఁగద వానిలోన నీ,
వేపున నే ప్రసంగములు హెచ్చని మెచ్చెద వందుసారముల్ ॥ 523

వ॥ అనిన ప్రహ్లాదుండిట్లనియె ॥ 524

గీ॥ అచ్యుతుననాది మధ్యాంతు నజు మహాత్ము, నప్రమేయు, నవృద్ధిక్షయాత్ము సర్వ।
కారణములకు సారమౌ కారణంబు నాత్మనిడి మ్రొక్కి కొలుతు నిరంతరంబు ॥ 525

చ॥ అనవిని కోపవహ్నినయనాంతముల న్వెడలంగ దైత్యుఁడి
ట్లనుగురు మోము చూచి యధమాధమ విప్ర విపక్షసంస్తుతుల్
తనయునకిట్లు చెప్పితి వుదగ్రమదీయ మహాభుజార్గళా।
త్యనుపమశౌర్యసారము నిరర్థము చేసి విమూఢవర్తనన్ ॥ 526

వ॥ అనిన గురుండిట్లనియె ॥ 527

క॥ కోపింపకు దైత్యేశ్వర, మాపాఠముగాఁడు నీకుమారుఁడు ఘనవి।
ద్యాపాటవకలితుని క్రియ, మాపాఠము చదువఁడేమి మాయయొ తలఁపన్ ॥ 528

క॥ అవిమర్శనమున శత్రుస్తవకథ నీతనయునకుఁ బ్రధానత్వమునన్।
వివరింపలాతివారమె, భవదీయాశ్రితులమింత పని సేయుదుమే ॥ 529

క॥ మాచెప్పినట్టి చదువుల, రోచకములు నీసుతునకు రుచియింపవు తా।
వాచోయుక్తిత్వంబున, వాచించున్ బెక్కులైన వాచప్రౌఢుల్ ॥ 530

వ॥ అనిపలుకు గురునివచనంబులు విని హిరణ్యకశిపుండు ప్రహ్లాదున కిట్లనియె ॥ 531

క॥ గురువులెఱుంగక యుండన్, పరిపంథిస్తవము నీకుఁ బాఠ్యముగానె।
వ్వరు చెప్పిరి చెప్పుము నా, కరుదుగ శాసింతు వారి నందఱు చూడన్ ॥ 532

వ॥ అనిన ప్రహ్లాదుండు తండ్రి కిట్లనియె॥ 533

గీ॥ సకలజంతువులకు శాస్త్రమైపరమాత్మ, విష్ణుఁడెపుడుహృదయ వీథినుండు।
నతఁడుదప్పజనునికన్యుఁ డెవ్వండుశా, సకుఁడుకలఁడు దైత్యచంద్ర చెపుమ ॥534

క॥ అనుటయుదైత్యేశ్వరుఁడి, ట్లనువిష్ణుఁడనంగ నెవ్వఁడఖిలంబునకే।
నొనరంగ నీశ్వరుండన్, ననుమిగిలినవాఁడు గలిగినన్ జెప్పుమిలన్ ॥ 535

వ॥ అనిన ప్రహ్లాదుం డిట్లనియె ॥ 536

క॥ యోగిధ్యేయమదృశ్యం, బేగుణనిధిపరమపదము హెచ్చైజగదా।
భోగం బెవిభుకృతిచే, వేగున్ పరమేశుఁడతఁడు విష్ణుఁడు తండ్రీ ! ॥ 537

వ॥ అనిన విని దైత్యేంద్రుం డిట్లనియె ॥ 538

ఉ॥ ఈవెడమాటలేల పరమేశ్వరుఁడెవ్వఁడు నాకుమిక్కిలి
భూవలయంబునన్ ముగిసిపోఁదలపెత్తిన నీకునీశ్వరుం।
డైవెలుగొందువాఁడు చపలాత్మక యెక్కడనుండువాఁడు వా
చావితథత్వ మేర్పడ నిజంబుగ నాకు నెఱుంగఁ జెప్పరా ॥ 539

వ॥ అనుటయు ప్రహ్లాదుండు ॥ 540

ఉ॥ నామదినేల నీతలపునన్ భువనంబుల నిండియుండి ల
క్ష్మీమహిళామనోహరుఁ డమేయుఁడు సర్వగతుండు నిత్యక్ర।
త్వామిత సర్వచేష్టితములందు నియుక్తులఁ జేయు నిట్టిచో
తామొనరించినామనుట తథ్యమె రాక్షసలోకనాయకా ॥ 541

వ॥ అనుటయు ॥ 542

గీ॥ వెడలఁద్రోయుఁడువీని నివ్వేళగురుని, శిక్ష నీకన్నైన సద్బుద్ధిచేరునేమొ।
శత్రుపక్షస్తవంబులు చదువుమనుచు, వీనినెవ్వరో వెఱ్ఱిఁజేసిరి చూడు ॥ 543

క॥ అను నెడదానవ భటుల, య్యనఘునిఁదోడ్కొనుచు గురునియాలయమునకున్।
చను దెంచిరచటఁ జదివెన్, వినుతమహామహిమ నిఖిలవిద్యలువరుసన్ ॥ 544

మ॥ మనుజాశీశ్వరుఁడొక్కనాఁడు నవరత్నస్తంభ శుంభద్విభా
ఘనసౌధాగ్రమునన్ మణీఖచిత యోగ్య ప్రస్ఫురత్పీఠిపై
ననువొందన్వసియించి కొల్వొనఁగిదివ్యభ్రాజసం బొప్పఁగాఁ।
దనురప్పించి పఠించుశాస్త్ర మడుగన్ దైత్యార్భకుండిట్లనున్ ॥ 545

క॥ పురుషుండు ప్రకృతియునునీ, చరాచరాత్మక మునైన జగములు నగునే।
పరమాత్మునివలన నాశ్రీ, హరిమాకుఁబ్రసన్న హృదయుఁడయ్యెడుమనీసన్ ॥546

॥ దుష్టునీనిఁబట్టి ద్రుంపుఁడు జీవించె, నేనిపీనివలన నేమికలదు ।
అరయఁగా స్వపక్షహానికర్తృత్వంబు, కతనవీఁడుకులము కాల్పఁగల ... 547

॥ అనియాజ్ఞ యిచ్చిన నసురులునాయుధ, హస్తులై విసిన నక్క...
డస్త్రంబులెందు మీయందును నాయందు, విహరించిమాడ శ్రీకృష్ణ...
నీసత్యమున మీరలెత్తిన కైదువుల్, ననుసోకకుండెడు మనిసవారు ।
నానాస్త్రములనొంప మేనింతయును నొవ్వ, కంతకంతకుఁ దేజ మధికమైన ॥

। రాక్షసాధీశ్వరుండు పుత్రకునిఁజూచి, యోరి దుర్బుద్ధికాన ! నీ యోజమాను ।
మభయమిచ్చెదనీకు నిరర్థకంబు, చావనేటికి రిపుకథల్ పోవనిమ్ము ॥ 548

। అనినప్రహ్లాదుఁ డిట్లనియె ॥ 549

॥ సకలభయాపహారియగు చక్రి మనంబుననున్నవాఁడు నా,
కొకభయమైనలేదు భయమొందినచో నభయంబుగాక యూ ।
రక యభయంబొసంగుట నిరర్థక మింతియెకాదు సర్వబా,
ధకభవమండలీ భయముతప్పను దండ్రి ! హరింపలంచినన్ ॥ 550

। అనుటయు ॥ 551

॥ రక్షోనాథుఁడు తక్షకప్రభృతి దుర్దాంతాహులంజూచి యీ,
తాక్షీతూతవి నిప్పులొల్కనను, నీ యజ్ఞున్ దురాచారు శ ।
త్రుక్షేమంకరు నందనుండనక మీదుర్వారదంష్ట్రావిష,
ప్రక్షేపంబున నీఁగుచేయుఁడన నుగ్ర క్రూరరూపంబులన్ ॥ 552

॥ భుగభుగన్మనివిషాగ్నులు నభోవివరంబుననిండ ఫూత్కృతి
ప్రగుణమరుత్పరంపరత రాయిడివారిదముల్చలింప తీ ।
వ్రగతి భుజంగముల్గఅవ గ్రక్కున దంష్ట్రలునుగ్గలయ్యె న,
య్యగణితసద్గుణాకరుని యంగముసోకినయంత వింతగన్ ॥ 553

హరిపదాంభోజ చింత దేవారి సూనుఁ, డింతయైనను విషపీడ యెఱుఁగఁడయ్యె ।
అదిగనుంగొని యపుడు సర్పాధినాథు, లనిరి తలవంచుకొని సిగ్గులినుమడింప ॥

తుమురయ్యె దంష్ట్రికలు, రత్నములెల్లంబగిలె రక్తధారలు ఫణాసం ।
ఘములందొఱఁగెన్ హృత్కం, పముపుట్టెన్ మాకునతని పట్టకుఁబోవన్ ॥ 555

తీవ్రదంష్ట్రలునాటి తదీయచర్మ, మించుకేనియు భేదిలదేమిచెప్ప ।
మాకుచేఁతప, నశక్యమీమానవకుని, పనుపుమేదైన నింకొక్క పనికిమమ్ము ॥ 556

ఝర ॥ అనినన్ రోషాగ్ని కీలవ్యతికర భయదోగ్రాక్షివీక్షాప్రభావం
బున దిక్కుల్మండ చండాద్భుతరవమెసఁగన్ బూని దిగ్నాగకోటిన్ ।

బనిచెనన్ దైత్యేశ్వరుండర్భకునిం బొడువ శుంభద్గతిన్ దిగ్గజంబుల్,
ఘనఘీంకారారవంబగ్గలముగఁ జని జాగ్రత్వరంబిట్టుముట్టెన్ ॥ 557

సీ॥ కులిశఘోర విషాణకోటి ఘట్టనలఁ గూలఁగాఁబడఁ ద్రోసి కుమ్మికుమ్మి।
దండధరోద్దండ దండప్రచండ గుం, డాకాండనిహతుల నలిచినలిచి।
గిరిపాదసదృశ నిష్ఠురపాదతల మహా, ప్రక్షేపములఁ ద్రొక్కి రాచిరాచి।
సకరకాసార వర్షనిభముక్తాయుక్త, సాంద్రోరువమథువుల్ చల్లిచల్లి ॥

గీ॥ వినుత గోవింద చరణారవింద మాక, రంద రసపానహర్ష నిర్భరునినతని।
చెఱుపఁజాలక దంతముల్విఱిగి రక్త, పూరమూరంగ దిగ్గజంబులు దొలంగె॥ 558

వ॥ అప్పుడు తండ్రికిం గొడు కిట్లనియె ॥ 559

ఉ॥ కొమ్ములువీలి దిక్కరటికోటి మదంబఱి పోక నాదు స,
త్వమ్మునఁగాదు హైమపరిధాన పదాంబుజ చింతనప్రభా।
వమ్మునఁజుమ్ము భక్తజనవత్సలుఁ డంబుజనేత్రుఁడాశ్రితా,
ఘమ్ములవమ్ముచేయుట జగమ్ములవింతయె తండ్రి చెప్పుమా ॥ 560

వ॥ అని ప్రహ్లాదుండు పలికిన నాక్షేపించి రక్షోవల్లభుండు నిజబలాధ్యక్షులంజూచి యిట్లనియె ॥ 561

ఉ॥ తీర్చగరాని వైరమిదె తెచ్చె దురాత్ముఁడువీనిఁ గాష్ఠముల్,
పేర్చిదహింపుఁ డీక్షణమ భీషణరోషమునం దనూనపా।
దర్చులు గీలుకొల్పి యన నప్పుడరక్కసులక్కుమారుపై,
పేర్చినయల్కనట్ల యతిభీకరవృత్తినొనర్చి రార్చుచున్ ॥ 562

శా॥ ఆదుర్వారమహాగ్ని కీలములలో సామోదుఁడై యుండి ప్ర,
హ్లాదుండిట్లను దండ్రిఁజూచి పరికీర్ణాం భోజకాసారమై।
నాదేహంబున కీమహాగ్నిశిఖ లానందంబు నొందించెనా,
శ్రీదేవీపతి మానసాబ్జమున సుశ్రీయుక్తుఁడై యుండుటన్ ॥ 563

క॥ అనునెడ దైత్య పురోహితు, లనునయవచనముల విభునిసనిరిబ్బాలుం
డనుదితవివేకపాకుం, డనుకంప్యుఁడుగాక దండనార్హుఁడెతలఁపన్ ॥ 564

క॥ బాల్యమ్ము దుష్టగుణచాం, చల్యైకాస్పదముబుద్ధి జడిమాహిత దా।
ర్బల్యఘనలౌల్యమిది సా, కల్యముగాఁబోక బుద్ధికల్గునె చెపుమా ॥ 565

క॥ హెచ్చుగుసీకోపంబు, వియచ్చరపతిమీఁదఁ జూపనగు నర్హంబే।
యిచ్చిఱుతవానిపై నిది, పిచ్చుకపై బ్రహ్మశరము పృథులవిచారా ॥ 566

। చదివించెద మీబాల్యము, వదులున్ బరిపాటి నగ్నివలనఁగూమారుం ।
వదులుము, మా ప్రార్థనమున, నిదియేపదివేలు చనవులిచ్చుట మాకున్ ॥ 567

। వినుము దైతేంద్ర మామాట వినకయితఁడు, శత్రుపక్షంబుఁబట్టిన చదువైన ।
నగ్నిముఖమునను గ్ర కృత్యనుసృజింతు, మంతటనడంగునీతని గంతులెల్ల 568

॥ అని దైత్యేంద్రునిసమ్మతించి ఘనకీలాభీలవన్యంతరం,
బునఁ బద్మారమణీ మనోహర పదాంభోజద్వయధ్యానసం ।
జనితానంద సుధాబ్ధిమగ్నుఁడయి రాజత్కాంతితోనున్న యీ,
ఘనునిందోడ్కొని తెచ్చిరింటికి సమగ్రప్రేములై భార్గవుల్ ॥ 569

। గురులుపాఠముచెప్పి నిర్భరత స్వప్ర,యోజనములకుఁ బోవనారాజపుత్రుఁ ।
డాదరమున సహశ్రోతలైన దైత్య, బాలకులఁజేరఁబిలిచి యేర్పడఁగఁబలికె ॥ 570

। వినుఁడు దైతేయనందనులార పరమార్థ, మెఱిఁగింతు నే మీరలితరమైన ।
దైవంబు నాత్మలోఁదలఁపక శ్రీహరిఁ, గలుషవినాశనుం గొలిచిమనుఁడు ।
జననకౌమారయౌవన జరామరణముల్, క్రమమునఁ బ్రాపించు ప్రాణులెల్ల ।
నిది మీరు మేమును నెఱిఁగినదేకదా, మృతుఁడై సజన్మంబు మీఁదనిజము ॥

గర్భవాసపునర్జన్మగతులు తొంటి, కైవడినెగల్గునివియ దుఃఖములుకావె ।
చోద్యమిది దుఃఖశాంతులుసుఖములనుచు, తలఁచుకొందురు మూఢులుతామనస

వాతాది నిశ్చలాంగకు, లైతగు వ్యాయామసుఖమునర్థించెడి, రో । [మున ॥
గాతురులు ప్రహారములున్, జూతురుసుఖమనుచునదియు సుఖమేతలఁపన్ ॥ 572

అక్కటఘూంసశ్లేష్మ, సృక్కలితంబైన దేహమిదియెక్కడ,స ।
మ్యక్కాంతిసౌరభాదిక, మెక్కడనివియెల్లవట్టి యెమ్మెలుతలఁపన్ ॥ 573

॥ హేయపుతోలు మాంసమును నెమ్ములునెత్తురు చీముమజ్జయున్
స్నాయుపురీషమూత్రములు సంఘముఁగూడిన దేహమిందుపై ।
రోయక ప్రేమచేసిన నరుండుమనంబున రోయనేర్చునే
ఈయెడఁగానిపించని యనిష్టమహానరక ప్రపంచమున్ ॥ 574

ఎన్నియిష్టపదార్థము లిచ్ఛగించు, నన్నియునువాని హృదయమధ్యముననధిక ।
శోకశంకువులైనాటుఁ జోద్యలీల, నెన్నిచూచినసుఖము లేదెందునైన ॥ 575

ఏయేపదార్థంబులింటి లోపలనుండు, నవియన్నియును దనయాత్మనుండు ।
ఎచ్చటికైనను నేగిన నాయాశ,దాహోపకరణంబు తనకుఁజువ్వె ।
జన్మదుఃఖంబుదుస్సహమంత కన్నను, మరణదుఃఖంబతి మాత్రమరయ ।
యమునియగ్రమునందు యాతనాదుఃఖంబు, గర్భసంక్రమణ దుఃఖంబు,గర్భ।

గీ॥ వాసదుఃఖంబు చెప్పఁ గావచ్చునెట్లు, జగము దుఃఖమయం బయిచందమెఱిగి
బహుళ దుఃఖాస్పదీభూత భవసముద్ర, తారకుని శ్రీవధూనాథుఁ దలపవలయు ॥ 576

ఉ॥ దేహములందు శాశ్వతుఁడు దేహి, వినుండు కుమారులార ! సం
దేహము లేదు, దీనియెడఁ దెల్లము బాల్య జరాదిధర్మముల్ ।
దేహముఁ బుట్టిముట్టికొను దేహికి లేవవి మీరు నాత్మన
మ్మోహము మాని దీనివిధముం దెలియం దగునప్రమత్తులై ॥ 577

సీ॥ అసువు గాదిపుడు బాల్యావస్థ, మీఁదట, నాచరింతుము యౌవనాగమమున ।
యౌవనోదయమైన నంగీకరింతము, ప్రౌఢనిర్భర వయః పాకముసను ।
ప్రౌఢత్వమైన వార్ధకమునఁ గావింతు, మవ్వేళ యొక పనియైన లేదు ।
వార్ధకంబైన దుర్వారరుజాదిక సంగతి పొంగుడువంగుడగుచు ॥

గీ॥ చిత్తముచలించి పరలోకచింత లేక, తనువుదిగనాడి తీవ్రయాతనల వేఁగి ।
మగుడ జన్మించి యీరీతిమఱుఁగుగాని, జనుఁడు శ్రేయఃప్రయత్నంబు గనఁగలేఁడు

క॥ ఆటల బాల్యము, మగునల, కూటమ్ముల యౌవనమ్ము, గురుతర రోగ ।
స్ఫోటన వార్ధకముం జను, చోటేదీ పరము తేరి చూడఁగనైనన్ ॥ 579

క॥ కావున బాల్యముననె, లక్ష్మీవనితావిభుని భక్తమిత్రుని ముక్తి ।
శ్రీవిభవదాయిఁ గొలువన్, గావలయు నన్మనము, మనముగట్టియుండన్ ॥ 580

గీ॥ అఖిలశోభనములె గల్గు నాక్షణంబె, వివిధపాతకమోరాశి విరిసిపోవు ।
లేశమైనను నలయిక లేదు నరుఁడు, హరిదలంపంగ వలయు నహర్నిశంబు ॥ 581

చ॥ అనయము సర్వభూతగతుఁడై కడు నెచ్చెలియైన పద్మనా
భునుపయిబుద్ధిఁ జేర్చి విలసన్మతితో వసియింతురేని మీ ।
రనుపమలీల క్లేశములనన్నిటఁ బాసి సుఖోత్తరాకృతిన్
బనుపడు మోక్షలక్ష్మి సులభస్థితిగాంచెద రక్రమంబునన్ ॥ 582

క॥ పేర్చిన తాపత్రయదహ, నార్చులచే వేఁగి శోచ్యులగు ప్రాణులపై ।
నేర్చునె ద్వేషింపఁగ జగ, దర్చితుఁడగు ప్రాజ్ఞుఁ డెట్టి యనువుననైనన్ ॥ 583

వ॥ కావున సర్వహానికరంబగు ద్వేషంబు విడిచి జగంబు సర్వభూతమయుండగు
శ్రీవిష్ణునిరూపంబని చూడవలయు. మనమందఱము నాసురభావంబు వదలి
శ్రీకేశవునియందు మనంబుచేర్చి యనలార్కేందుపవనులచేతను, బర్జన్య
వరుణ రాక్షస, యక్ష, దైత్య, దానవోరగ, కిన్నరులచేతను, మనుష్యపశుసం
ఘంబులచేతను, నాత్మసంభవ దోషంబులచేతను, జ్వరాదిరోగంబులచేతను

ద్వేషేర్ష్యాసూయా మత్సరంబులచేతను, రాగలోభాదులచేతను, క్షయం బు
నొందింప శక్యంబుగాని పరమనిర్వాణ సుఖంబు నొందఁగలయును. అతి
సార వివర్తనంబుల శోషింపక నావచనంబులు చేపట్టి యచ్యుతారాధనపరులై
సమత్వంబు నొందుఁడు. సమత్వంబున నారాధితుండై లక్ష్మీవల్లభుండు ప్రసన్నుం
డైనఁ నల్పంబులైన ధర్మార్థకామంబు లెంత. దుర్లభంబైన మోక్షంబును
కలుగు. కావున నప్రమత్తులై శ్రీపురుషోత్తము నాశ్రయించుఁడని దైత్య
కుమారుల బోధించు ప్రహ్లాదుని చేష్ట లెఱింగి భయంబున దానవు లావృత్తాం
తంబు హిరణ్యకశిపునకుం జెప్పిన ॥ 584

ఉ॥ బాలుని మీఁద రెచ్చి యడబాలల బిల్వఁ గనంపి దైత్యరా
ట్పాలుఁడు వల్కె వీనిఁ గులపాంసను శాత్రవ పక్షపాతిదు ।
శ్శీలునిఁ జంపఁగావలయు శీఘ్రము, భోజ్యములందు దుర్దమ
క్ష్వేళము వెట్టి భోజనము సేయఁగఁ బెట్టుఁడు వీనికిమ్ములన్ ॥ 585

వ॥ అని యాజ్ఞాపించిన ॥ 586

క॥ సూదగణంబపుఁడా ప్ర, హ్లాదునకు న్విషము వెట్ట నతఁడన్నముతో ।
మోదమునఁ గుడిచి దైత్యని, షూదను నిందలఁపన దియు సులభత నరిగెన్ ॥ 587

క॥ దితిజేశ్వరుఁడాత్మపురోహితుల న్వేగమునఁ బిలిచి హింసింపుఁడు మీ ।
రితని నతిభయదకృత్యా, హతి నుద్ధతిననినవారు నతిరోషమునన్ ॥ 588

... ... ... ... ...

... ... ... ... ...

చ॥ సురపరిపంథి భార్గవులఁ జూచి విపక్షసపక్షు వీని ను,
ద్ధురతర కృత్య జేసి త్వరతో వధియింపుఁడటన్న వారు న ।
ప్పురుషవరేణ్యుఁడున్నెడకుఁ బోయి. నృపాలకుమార మేము మీ,
గురువుల మేమి చెప్పినను గోరిక నీవును జేయఁగాఁదగున్ ॥ 589

ఉ॥ పావఁడ లోకపూజ్యమగు బ్రహ్మకులమ్మునఁ బుట్టినావు శౌ,
ర్యాపరమేయ సాహసబలాఢ్యుఁడు తండ్రి, జగంబు లేలు నీ ।
వాపగిదిన్ గుణాకరుఁడవై మముఁ బ్రోచెదవంచునున్న సం,
తాపముఁ దెచ్చె శాత్రవకథావితథాభినివేశ మింతటన్ ॥ 590

చ॥ పరమగురుండు తండ్రియని పల్కఁగఁ దద్వచనంబు మీరినన్
పరము నిహంబునుం గలదె బాలక యేల కలంక తెచ్చెదీ ।
పరకథమానిమానిత శుభస్థితి నొందు మనంతుఁ డేలయొ
వ్వరునికనేల తండ్రియ, ధ్రువంబగు దైవమెఱుంగ నేర్చినన్ ॥ 591

చ॥ అనవిని నమ్రుఁడై పలుకు నయ్యసురేంద్రకుమారుఁడిట్లు మీ
రనయమునానతిచ్చిన వచోర్థముగాదనవచ్చునయ్య, మ।
జ్జనకుఁడు ప్రాజ్ఞుఁడౌటనిది సంశయమయ్య, గురూత్తమోత్తమా,
దనుట యెఱుంగనయ్య, వినవయ్య భవద్వచనేరితార్థముల్ ॥ 59

క॥ గురులనలరింతుఁ, దండ్రికిఁ బరిచర్యయొనర్తుఁగాని, భ్రాంతుఁడనై బల।
ధురధర్మమార్గగమనాంతరమేమఱి యుండనెవ్విధంబుననైనన్ ॥ 59

చ॥ భళిభళిమంచివాక్యములె పల్కితి రిప్పుడనంతుఁడేలయం,
చలుగకుఁడయ్య మీకుఁగమునల్పతరంబు వివేకమేమిగాఁ।
దలఁచిపఠించినారు వితతశ్రుతిశాస్త్రచయంబనంతయున్,
బలుమఱునయ్యనంతుని ప్రభావములెంచి వచింపదేమొకో ॥ 59

సీ॥ మనసుఖేదముమాని వినరయ్య పురుషార్థ సమితియెవ్వరినుండి సంభవించె
ధర్మార్థులు మరీచి దక్షాదులెవ్వరి యనుకంపధర్మంబు లధిగమించి।
రిష్టార్థకామేప్సు లింద్రాదులెవ్వరి కరుణతత్ప్రాప్తులుగాంచిమించి
రనుపమధ్యానయోగాఢ్యులై సనకాదు లెవ్వరి దయమోక్షమెఱిఁగిరౌనిరి.
అట్టిజగదంతరాత్ముఁడ నంతుఁ డేమిపనికివచ్చునటంచు దుర్భాషలాడ।
చనునె భార్గవవంశ సంజాతులైన మీకు రాక్షసభావంబుమీఱుచుండ ॥ 59.

వ॥ అనవినిమండిపడి, పురోహితులిట్లనిరి. 59

గీ॥ మండిపోవకుండ మంటలోవెడలించి తెచ్చువెల్ల మఱచి పెచ్చువెఱిగి।
ప్రేలెదీవు నిన్నుభీకరకృత్యచే నుక్కడంప నిచట నిక్కగలదె ॥ 59'

వ॥ అనిరాసమయంబున, 59.

సీ॥ అమరవిద్వేషి తీవ్రాటోపమునఁ దమ్ముఁబనుపభార్గవులు తపస్సమృద్ధిఁ,
కృత్యఁబుట్టించి లాగించినదదినిప్పు లురులవెన్మిడిగ్రుడ్లు, మెఱుగుకోఱ।
లాలోలజిహ్వా ఘోరానలజ్వాల కరాళ విజృంభితాభీలవక్త్రి,
మతిదుస్సహాట్టహాసార్భటులతిమాత్ర తనువును దగపదోద్ధతులనేల।

గీ॥ పగులదాటించి యార్చుచుఁబారుడెంచి చటులశూలాయుధంబెత్తి జలధిజాస
హాయుఁదలఁచుచునున్న నయ్యసురరాజ తనయువక్షస్థలంబు క్రోధమునఁబొడిచె

క॥ అప్పుడువజ్రకఠినమగు నప్పుణ్యునితనువు సోకినంతనతుమురై।
యప్పుడమిరాలెశూలం బప్పనికడుచోద్యమయ్యె నసురులకెల్లన్ ॥ 60

ఉ॥ పాపములేని యప్పరమభాగవతోత్తము పుణ్యచర్యచూ,
ఘోషక యంపశూలమటులుర్వర వ్రాలకరాళమూర్తి హె।

చ్చొ వెనుమాయకృత్యో భృయదార్భటి నుగ్రదవాగ్నికీల జా
లాపరిమేయస్థైు గుగుల నందఱంగాల్చి నశించె గృత్యనన్ ॥ 601

క॥ ఇట్లు స్వయంకృతదోషంబున నద్దోషాచర పురోహితులు నిహ్యమానులగుట
చూచి పరమకృపా విధేయుండై ... 602

॥ కృష్ణ ! పద్మనాభ కేశవ సర్వభూతాంత రాత్మ హరి యనంతవరద ।
పుండరీకనయన పురుషోత్తమ రమేశ కావుమయ్య వీరిఁ గరుణతోడ ॥ 603

చ॥ అరయఁగసర్వభూతము లయందుసమత్వము నొందియుందిరా,
వరుఁడువసించునంచు గరువంబునఁ జూచెదనేని శాత్రవో ।
త్కరములమీఁదనైన యనుకంపయెప్పూనుదు నేని యిప్పుడీ,
సురుచిరమంత్రపావకము సోఁకక లేతురుగాక మద్గురుల్ ॥ 604

॥ అనునెడనందఱు సుఖులై, దనుజపురోహితులు లేచి తండ్రీమనుజు ము ।
న్ననచేసి బ్రతుకఁజేసితి, వనుపమకళ్యాణ సిద్ధులగు నీకెపుడున్ ॥ 605

క॥ అనిదీవించుచు నేగి దైత్యపతికాద్యంతంబునుం జెప్పనం,
దన్నుఁ జావించియనూనరోష ఘటితార్థస్వాంతుఁడై పల్కె హే ।
చ్చనఁగావచ్చు భళీరయీమహిమ, మంత్రౌషధీచేనో స్వభా,
వని రూఢంబో యెఱుంగఁగావలయు సువ్యక్తంబుగాఁ జెప్పరా ॥ 606

చ॥ అనవినితండ్రి కిట్లనియె నగ్గుణభూషణుఁ డేనయేల యె,
వ్వనిహృదయంబునందు నవవారిజలోచనుఁడుండు వాఁడె పా ।
వనుఁడఖిల ప్రభావములు వాని కెకల్గు నిదెంతవింత య
వ్వనరుహపత్రనేత్రుని యవారితభూరితరప్రపత్తికిన్ ॥ 607

సీ॥ తంగేటిజున్ను రాధావల్లభుండు, ముకుందుఁడెన్నంగ ముంగొంగుపసిడి,
గాడిగట్టినదేవగమి పూరుషోత్తముఁ, డురగతల్పుఁడు గాదెనున్నకొలుచు ।
ముంగిటిపెన్నిధి మురదానవవిభేది, దైత్యారియరచేతి దైవతమణి,
పెరటిలో సురశాఖి కరిరాజవరదుండు, రతిరాజగురుఁడు నీరాటియమృత ॥

॥ మాపదలఁబాప సంపదలందఁజేయ, నఘములడఁగింపఁ బుణ్యంబులందఁజేయ ।
మాకు మొనఁగూర్పభక్తసమూహమునకు, నేడుగడయును హరియె దైత్యేంద్ర వినవే॥

వ॥ అనినన హంకరించి యభ్రంకష సౌధశిఖరాగ్రంబుననుండి పడద్రొబ్బించిన
నబ్బాలుండు శ్రీలలనావల్లభునుల్లంబుననిడిపడిన భూతధాత్రి, తూలతల్ప
సమాన్నమై యుండుటంజేసి యవిశీర్ణాస్థిబంధనుండై సుఖంబుననున్న హిరణ్యా
కశిపుండు సహస్రమాయాడంబరుండగు శంబరుని తద్వధార్థంబు నియోగించిన

వాఁడును ననేకమాయాజాల వలాహకంబుల ధైర్యసార తిరస్కృతహేమా
ద్య్రుండగునప్పురుషవర్యుంగప్పిన నప్పతికన్యకోపయంత నంతరంగంబునం జ
తించుచున్న సమయంబున ॥ 60

చ॥ ప్రళయవిభాకరాయిత విభావదవక్రము, దివ్యచక్రమా,
యలజడిమాన్పఁ బంకజదళాక్షుఁడు పంచిన వచ్చి దైత్యమా ।
యలు హరియించిపోవుటయు, నంతకుమారుఁడు శోషిలంగన,
త్యలఘువిశోషణానిలము నంప నిలింపవిరోధి క్రోధియై ॥ 61

చ॥ విలయవిశోషణ శ్వసనవేగమునం బను వెల్ల శోషణా,
కులదశనొందకుండ హరిగ్రోలె మహాపవనంబు తన్ననో ।
జలజనివాసిసైయై గుణవిశాలుఁడు బాలుఁడు మోదమానుఁడై,
నిలిచినఁజూచి యిట్లనిరి నిర్జరవైరికిఁ దత్పురోహితుల్ ॥ 61

చ॥ నలుకువనొందె బుద్ధి పరిణామముఁ జెందెడి నింక దైత్యరా,
ట్తిలక భవత్కుమారకుఁడు దీర్ణతతోడ త్రివర్గమార్గని ।
శ్చలమతియుక్తి నీచరణసారసముల్భజియించి శత్రుదు,
ర్బలనుతిమాను నెప్పుడు శుభంబగు నీతనిఁ బంపుమిటికిన్ ॥ 61

క॥ ఔశనసద్గ్రంథార్థ, సమాసమునఁ ద్రివర్గసారమంతయు, గుర్వ ।
భ్యాసమునఁగాంచునితఁడని, యాసురబాలకుఁడు తాము నతివేగమునన్ ॥ 61

క॥ ఇంటికి వేడుకతోఁజని, యంటిసకలకళలుచెప్పి రాచార్యులు వె ।
న్వెంటనె నేర్చె, నవిద్యాలుంటాకుండ ర్భకుం డలోలతఁ బెరయన్ ॥ 614

గీ॥ మనకుఁ దలయెత్తికొనఁగలైననుచుఁ బోయి, గురులుచెప్పిరిదాన వేశ్వరునితోడ।
జాడ్యమెల్లనువిడిచి యాశ్చర్యలీల, నీసుతుఁడు సర్వవిద్యలు నేర్చెననుచు ॥ 615

క॥ మోదమున దైత్యపతి ప్రహ్లాదునిఁబిలిపించి పాపఁడా, మేధాసం ।
పాదనఁజదివితివే నం, వాదకుమమయ్యెనే త్రివర్గము నీకున్ ॥ 616

సీ॥ ధరణీవిభుండు శాత్రవమిత్ర, మధ్యస్థులెడయకుండగనెట్లునడవవలయు ।
స్వామ్యమాత్యాదులౌ సప్తాంగములనెట్లు, పెంపుదీపింపరక్షింపవలయు ।
సంధ్యాదికంబై నషాడ్గుణ్యమేరీతి తేట, తెల్లంబుగాఁ దెలియవలయు
ప్రబలసహాయాదిపంచాంగలక్షణంబే, ప్రకారంబున నెఱుఁగవలయు ॥

గీ॥ చటులశక్తిత్రయంబెట్లు జరుపవలయు, సామభేదాదులేరీతి నలుపవలయు ।
మూఁడుసిద్ధులునేగతి చూడవలయు, నుదయములు మూఁడునేరీతి నొందవలయు॥

వ॥ మఱియుపౌరజానపదులయందు నెవ్విధంబునం జరియింపవలయు ... రాజనీతి తంత్రంబెట్లు నడపవలయునని యడిగిన ... శ్రీపాదంబులకు ప్రణామిల్లి ప్రహ్లాదుం డిట్లనియె ॥ 618

క॥ చెప్పినచదివితి నేనిం, దప్పక ధర్మార్థకామ ... లగు చదువుల్ ।
చెప్పెడిదేమియవన్నియు, నొప్పవసత్యాప్రియములు సమున్నతి ... ॥ 619

క॥ శత్రువులయందు దండంబుమిత్రులందు, సామమును జేయుమని చెప్పి ...
జగములన్నియు పద్మలోచనుఁడ యచట, శత్రుమిత్రకథా ప్ర...

క॥ అనఘనీయందు నాయందునన్యులందు, తెలిసిచూచిన శ్రీవిష్ణుదేవుఁడు ...
అట్టిచో శత్రుఁడన మిత్రుఁడనఁగనొక్కఁ, డరయఁగలఁడట్టి, వట్టి ... మరతినాడె ॥

క॥ ఈవట్టిమాటలెల్లం, బోవిడిచిశుభ ప్రయత్నమున కుద్యుతులై ।
శ్రీవనితావల్లభపద, సేవనమొనరింపవలయు చేతనులెల్లన్ ॥ 622

। ఆద్యబుద్ధితుబుద్ధి సుమ్మసురనాథ, అదియునజ్ఞాన సంజాతయగునిజంబు ।
పుడమిఁబోలుఁడుమెరుగుడు పురుగుఁజూచి, యాత్మలోనదలంచఁ జేయగ్నియనుచు॥

॥ కలగ్నానబంధ మూడ్చఁగలకర్మము కర్మము, మోక్షులక్ష్మియా
గలయదివిద్యవిద్య, యటుగాకవృథాశ్రమ కారికర్మమ
ట్లలవడకున్నవిద్య హృదయంబునఁ జూడగశిల్పనైపుణీ
కలనయటంచు చెప్పుదురుగాథ వివేకవిపాక భూషణుల్ ॥ 624

వినవయ్య ప్రణామిల్లి వినుపింతునీకు సారాంశమొక్కటి, భూమియందు ...
రాజ్యభోగంబుకోరని వాఁడుకలఁడె, కోరినఁగల్గునే భాగ్య రేఖలేక ।
ఉద్యమ్మంబులుసిరులోన గూర్చునే భాగ్యకళలేక యదియునుగాక జడులు
అవివేకులునశూరులగువారు భాగ్యంబుకలిమి, రాజ్యైకసుఖములుగాంచు ॥

రట్లగుటపుణ్యములు సేయ నలరుసిరులు, సమతనిల్పిన నిర్వాణసౌఖ్యమొందు ।
సకలభూతమ్ములును పంకజాతనయనుఁ, డనుచుచూడుము మదిలోనదనుజనాథ॥

ఎప్పుడునీగతిఁజూచిన, నప్పరమేశుఁడుప్రసన్నుఁడగు నీశ్వరుఁడా ।
చొప్పైనయెల్లకడలన్, చిప్పిలుక్లేశంబులెల్ల క్షీణతనొందన్ ॥ 626

అనినవాజ్యసమర్పణాత్యంతదీప్త, వహ్నియునుబోలి దానవేశ్వరుఁడుమిగుల ।
మండిదిగ్గునలేచి యమ్మాణవకుని, గొమ్ముతన్నెమహోదగ్రరోషమునను ॥627

శ్రమమున విప్రజిత్తిబలిరాహు ముఖాఖిల దైత్యకోటితో
నమరవిరోధి యిట్లను దురాత్ముని వీని మహాభుజంగహా ।

శముల నిబద్ధుచేసి రభసంబున నంబుధిపైవుఁడన్న దు
ర్దమభుజసార సాహసధురంధరు లైవడినట్లు చేసినన్ ॥ 728

ఉ॥ అంబుధి మధ్యభాగమున సమ్మహితాత్ముఁడు వజ్రభూమిచ
క్రంబఖిలంబునున్ దిరిగ కంధిజలంబతివేలమై సమ।
స్తంబునుముంచె దానిగని దైత్యులతో దనుజేశ్వరుండు రో
షంబునఁబల్కె నిచ్చపలుఁజంపఁగ దుర్భర మెన్ని భంగులన్ ॥ 629

ఉ॥ కొండలు పెక్కుతెచ్చి యతిఘోర విచారుని వీని కప్పుడు
ద్దండత వేయివర్షము లుదన్వదబంతర సీమ నూర్పులే।
కుండెడు నంత పీఁడన శిలోచ్చయ కోటిసహస్రయోజనా
ఖండముగాఁగ గప్పిరవిగాఢని రంకుశవృత్తి రక్కసుల్ ॥ 630

వ॥ ఇట్లు మహార్ణవాంతర్జలంబున సహస్రయోజన విస్తారంబుగా తనపై కొండల
తండంబులు పేర్చిననోర్చి, యర్చిత ప్రభావుండగు నాడింభకుండు మనఃపుండ
రీకంబున పుండరీకాక్షుందలంచి యిట్లని నుతించె ॥ 631

గీ॥ పుండరీకాక్ష తేనమో భుజగశయన, పురుషోత్తమ తే నమోఽద్భుతచరిత్ర
సర్వభూతగ, తేనమోజలజనేత్ర చక్రధరహస్త తేనమో జగదధీశ ॥ 632

క॥ బ్రహ్మణ్య దేవునకు గో బ్రాహ్మణహితునకు ప్రపంచపాలునకుఁ బర।
బ్రహ్మమునకు, దర్వీకృత జిహ్వగునకు నీకు వినతిచేసెద కృష్ణా! 633

చ॥ ఘనత రజోగుణంబున, జగంబు సృజింపుచు సత్త్వయుక్తిపా
లన మొనరించుచున్ విలయ లాలన తామసలీల నొందుచున్।
తనరు త్రిమూర్తి వైభవము దాల్చిన నీకు నమస్కరింతునో
వనరుహనాభ భక్తజనవాంఛిత దాన కళాధురంధరా ॥ 634

క॥ దేవాసురాదులును ధర, ణీవారి ప్రముఖ భూతని చయము తన్మా।
త్రావళియు మహద హంకృతి, భావంబులు నీవ పద్మపత్రదళాక్షా! 635

ఉ॥ నీవయె కాలమాత్మయును నీవగుణంబులు నీవ విద్యయున్
నీవ యవిద్య సత్యమును నీతి యసత్య విషామృతంబులున్।
నీవ సమస్త కర్మములు నీవ తదీయఫలప్రభోక్తవున్
నీవ ఫలంబు నీవ ధరణీధర! సర్వము నీవ చూడఁగన్ ॥ 636

క॥ యోగులు నిను చింతింతురు యాగపరులు నిను యజింతురనిశము పితృదే।
వాగణ్య రూపివై యుప యోగింతువు కవ్యహవ్య యోగ్యరసంబుల్ ॥ 637

క॥ జగమంతయు నీరూపము జగదీశ్వర భూతభేద సముదయములు నీ।
యగణిత రూపంబులు, నీ దగు రూపంబంతరాత్మ యారసిచూడన్ ॥ 638

గీ॥ అట్టి సూక్ష్మాంతరాత్మకు నధికసూక్ష్మ మగుచుచెలువొందు నేపరమాత్మరూప।
మట్టి పురుషోత్తమునకు దివ్యస్వభావ సహితునకు మ్రొక్కుచుందు నిత్యంబుగాను॥

క॥ సర్వాత్మ సర్వశక్తి సర్వజగద్వంద్య సర్వసాక్షి కరుణా।
ధూర్వహ దురంత పాతక పర్వత నిర్వాపణోగ్రపవి నిను గొలుతున్ ॥ 640

సీ॥ వాసుదేవునకు సర్వజ్ఞున కఖిలాతిరిక్తునకఖిల వరిష్ఠునకును
నామరూపవిహీనునకును నస్తిత్వోపలభ్యున కవతారలలితమహిమ।
పాలితనిఖిలాత్మభావున కంతరాత్మాకృతినిల్చి శుభాశుభంబు।
వీక్షించు సర్వైక సాక్షికి ప్రభవిష్ణునకు విష్ణునకును సనాతనునకు

గీ॥ జగదభిన్నునకును జగదాద్యునకు జగత్ ధ్యేయ రూపునకు నమేయునకును।
యోగి నుతునకధ్యయునకు సర్వాధారునకు నొనర్తు వందనంబులేను ॥ 641

క॥ హరిసర్వజగన్మయుఁడిది పరమార్థము దీన భేద ఘటితులు లేవా।
హరియే నేనాహరినని యరుదుగ తన్మయత నొంది యతఁడున్నంతన్ ॥ 642

శా॥ ఆగోవిందుఁడ యేనటంచు మదిలో నంకించతద్భావ నా
యోగారూఢి నకల్మషుండుగఁ, దదీయో దీర్ణహృత్ప్రీతిపై
యోగిధ్యేయుఁడు చక్రియుండుటయు తద్వ్యక్తిన్ సమస్తావనీ
భాగంబెల్ల తలంకె భూమిభృ దకూపారాటవీయుక్తమై ॥ 643

ఉ॥ ఔరగ పాశముల్ దునిసె, నద్రిపరంపరలెల్ల దూదినై
జారె, కుమారుఁడంబునిధిచయ్యన నెల్వడివచ్చె తన్నుపెం।
పారనెఱింగె, భూమి యిదెయంచు నెఱింగె ననంతగంబ య
న్నీరజనేత్రునిం బొగడె నిండు మదిన్ ఘనభక్తి యుక్తుఁడై ॥ 644

సీ॥ అక్షర,క్షర, పరమాత్మార్థ, స్థూలసూక్ష్మాకార, వ్యక్త, యవ్యక్తరూప।
నిరఘనిరంజననిర్గుణాత్మక, గుణాధారగుణస్థితధర్మరూప
అధికకరాళసౌమ్యాత్మక, సదసదాకార, నిత్యానిత్యగణ్యానిష్ప్రపంచకనిఖిలప్రపంచాశ్రయ, యనేకయేకరూపసమస్తలోకనాథ ॥

గీ॥ వాసుదేవ, సమస్తదేవాసురాది, మూలకారణ, సర్వసంపూర్ణ, యప్ర।
మేయ శ్రీపురుషోత్తమమిముకు నెపుడు, వందనంబులొనర్తు భావము చెలంగ॥ 645

వ॥ ఇవ్విధంబున స్తుతియించిన ॥ 646

సీ॥ అడుగునంటిన యేరు నడుమ మేలగు పేరు, జడధిలోని బిడారు జరుగువాఁడు
తళుకు బంగరు చేల, కలుములీనెడి బాల, తలచఁ జేరెడి లీల గలుగువాఁడు ।
విను పొద్దు కనుడాలు, తనయంతటి పడాలు, పెనురెక్కలరవాలు దనరువాఁడు
ఎదకు సొమ్మగు కందు, మొదటి మాటల పొందు, విదురు గేహము విందు తెలియువాఁడ

గీ॥ మెరుపు గలవాఁడు, చామన మేనివాఁడు, కరుణ గలవాఁడు, జగములు గాచువాఁడ
ఘనుఁడు శ్రీపుండరీకాక్షుఁ డనఘచరితుఁ, డా సురకుమారు నెదుటఁ బ్రత్యక్షమయ్యె

ఉ॥ కోరక మీఁద రక్కసుల గొంగ మనంబు చెలంగ, ముంగిటన్,
చేరిన పెన్నిధానమనఁ జేరువ నిల్చిన మ్రొక్కి ధన్యుఁడై ।
దారకుఁ డింక నీదు భవతారక ధీర కటాక్షవీక్షణో,
దార కనత్సుధాప్లవ విధానమునన్ ననుఁ బ్రోవవే యనన్ ॥ 64

క॥ మారుని తండ్రియు, దైత్యకుమారునిపైఁ జూడ్కి నిలిపి, మామక పాదాం ।
భోరుహ భక్తికి మెచ్చితి కోరుము వరమనిన బాలకుం డిట్లనియెన్ ॥ 64

గీ॥ ఈశ! కర్మవశంబున నెట్టి యోను లందు నెందులఁ బుట్టిన నైన నాకు ।
మీ పదాంభోరుహమ్ముల మీఁది భక్తి నిండి తరుగక యెప్పుడు నుండవలయు ॥ 65

క॥ ఇలనవివేకులు విషయంబుల పై నొనరించు ప్రేమ పురుషోత్తమ ని ।
న్నెలమి భజియించు నాకున్ గలుగంగాఁ జేయుమయ్య కారుణ్యమునన్ ॥ 65

వ. అనుటయు. 65

ఉ॥ నా పదభక్తి యెప్పుడు మనంబున నిండియె యుండు, మీఁదటన్,
చేపడు నిట్లు నీకు నిది సిద్ధము వేడు మభీష్ట మేసిరుల్ ।
చూప నమోఘదర్శనుఁడఁ జుమ్మి, ననుం గని రిత్త పోవు చే,
తోఽపరిమేయ సౌఖ్యగతులందక యెందును జంతుసంతతుల్ ॥ 65

మ॥ అనినం దైత్యకుమారకుండు జగదీశా! తీవ్రరోషోద్ధతిన్,
మనముప్పొంగఁగఁ దామసప్రకృతినై మా తండ్రి నా మీఁదఁ జే ।
సిన పాపంబులఁ బాపియయ్య నితనిన్ శ్రీమద్భవత్సత్కృపా,
ఘనతీర్థంబున నోలలార్చి ప్రయతుం గావించి రక్షించవే ॥ 65

వ॥ అనిన వనజాక్షుం డవ్వరం బిచ్చి యింకొక వరంబు వేడుమనిన ప్రహ్లాదుం డిట్ల
నియె. 65

క॥ కృతకృత్యుఁడనైతిన్ భవదతులిత సద్భక్తియుక్తి నచ్యుత యనినన్ ।
చతురత, మద్భక్తిన తుది నతులిత నిశ్శ్రేయసంబు లందెదవంచున్ ॥ 65

చ॥ జలరుహలోచనుండరుగఁ జయ్యననాయనఘుండు ప్రోయిపెం,
పలవడఁ దండ్రిపాదములకఱ్ఱిలిమ్రొక్కినఁ గౌఁగిలించి యు।
త్కలిమి ఘటిల్లఁగాఁ బ్రతికితేయని మూర్ధము మూరుకొంచు క,
న్నులఁ బ్రమదాశ్రుబిందువులునూల్కొన లాలితుఁజేసె నందనున్ ॥ 657

వ॥ ఇట్లు పశ్చాత్తాప తప్తుండగు తండ్రికి గురువులకు శుశ్రూష సేయుచుండె నంత ॥ 658

సీ॥ జనకుండు దివికిఁబోయిన దైత్యపతియయ్యెఁ బ్రహ్లాదుఁడంత పుత్రకులుపౌత్రు
లెందఱేఁగల్గిరి యెల్లసంపదలును రాజ్యంబు విడిచి నిర్మలినచిత్తుఁ।
డై సమదృష్టి పుణ్యాపుణ్యములు లేక నారాయణధ్యాన నైపుణమునఁ,
బరమనిర్వాణంబు ప్రాపించె నీపుణ్యచరితంబు పాతకక్షయకరంబు ॥ 659

గీ॥ దర్శపూర్ణిమలందును ద్వాదశులను, వెలయనష్టములందును విన్నవారి।
నంబుజాక్షుండు ప్రహ్లాదునరసికాచి, నట్లుకాచు నిజంబుసంయమివరేణ్య ॥ 660

వ॥ ఆప్రహ్లాదునకు నాయుష్మచ్ఛిబి, బాష్కల, విరోచనులనఁ బుత్రులుగలిగిరి. అందువిరోచనునకుబలి, బలికి బాణుండు, మొదలగుపుత్రశతంబుపుట్టె. హిరణ్యాక్షునకు జర్ఝరుండు, శకుని, భూతసంతాపనుండు, మహానాభుండు, మహాబాహుండు, కాలనాభుండును ననమహారథులు పుత్రులుగలిగిరి. దనువునకు ద్విమూర్ధుండు, శంకరుండు, అయోముఖుండు, శంకుశిరుండు, శంబరుండు, ఏకచక్రుండును, మహాబాహుండు, తారకుండు, మహాబలుండు, స్వర్భానుండు వృషపర్వుఁడు, పులోముండు, మహాబలుండు విప్రచిత్తియుననఁ బుత్రులుగలిగిరి. అందుస్వర్భానునకు సుప్రభయు వృషపర్వునకు శర్మిష్ఠయుం బుట్టిరి. ఆశర్మిష్ఠను యయాతిగ్రహించుట చెప్పంబడియె. వైశ్వానరునకుఁ బులోమయుఁ, గాలికయుననిద్దఱు కన్యలుపుట్టిరి. వారిని మరీచి పరిగ్రహించె. వారలకుఁబౌలోమకాలికేయులన నఱువదివేలు పరమదారుణులైన దానవులుపుట్టిరి. విప్రచిత్తివలన సింహికయందు వ్యంసుండును, శల్యుండును, నభుండును, వాతాపియు, నముచియు, ఇల్వలుండును, ప్రసృముండు, అంధకుండును, నరకుండును, కాలనాభుండును, స్వర్భానుండును, వక్త్రయోధియు నన దనువంశవివర్ధనులైన దానవులుపుట్టిరి. వీరలపుత్రపౌత్రు లనేకసహస్రంబులుపుట్టిరి. ప్రహ్లాదునికులంబున నివాతకవచులుపుట్టిరి. 661

। శుకియు, శ్యేనియుభాసియు, శుచియు, గృధ్రికయును, సుగ్రీవియుననుకన్యలారువు।
రుదయమొందిరి తామ్రయందుదితతేజుఁ, డైనకశ్యపమునికిసంయమివరేణ్య॥ 662

వ॥ అందు శుకివలనశుకంబులును, ఉలూకివలన నుల్కూకంబులును, శ్యేనివలన శ్యేనంబులును, భాసివలన భాసిపక్షులు, గృధ్రివలన గృధ్రంబులును, శుచి వలన నుదకపక్షిగణంబులును, సుగ్రీవివలన నశ్వో, ష్ట్ర, గర్దభంబులునుం బుట్టె॥ 663

క॥ వినతకునిద్దఱుపుత్రులు, ఘనతేజుండరుణుఁడనఁగ గరుడుఁడనంగా।
జనియించిరందుగరుడుం, డనివారణపన్నగాశ నాఖ్యంబరఁగెన్॥ 664

వ॥ సురసకు అమితౌజస్కంబును, ననేకశిరస్కంబును, ఖేచరంబును, మహాత్మకంబునునగు, సర్పసహస్రంబుపుట్టె. కద్రువకుఁ దేజోబలసంపన్నంబులు, ననేకమస్తకంబులునగు సర్పంబులు సహస్రంబు పుట్టె. సుపర్ణునకు వశవర్తులయ్యె. అందుఁ బ్రధాన సర్పంబులు శేష, వాసుకి, తక్షక, శ్వేత, మహాపద్మ, శంబర, అన్వతక, కర్కోటక, ధనంజయులు నాదిగాఁగల విషోల్బణ దందశూకంబులు పెక్కుగలవు, మఱియు సురభివలన స్థలజంబులు, జలజంబులు, దారుణంబులు పిశితాశనంబులునైన పక్షిగణంబులుపుట్టె. ఇలవలన వృక్ష, లతా, తృణజాతులుపుట్టె. ఖషవలన యక్షరక్షోగణంబులుపుట్టె, మునివలననప్సరోగణంబులు పుట్టె, అరిష్టవలన మహాసత్వులైన గంధర్వులుపుట్టిరి. స్థావరజంగమంబులైన వీరందఱు కశ్యపదాయాదులనంబరఁగుదురు. ఏతత్పుత్రపౌత్ర పరంపరయ సంఖ్యంబై ప్రవర్తిల్లు. ఇదిస్వారోచిషమన్వంతర సర్గంబు. వైవస్వతమన్వంతరంబున వరుణయాగంబునందువేల్చు ప్రజాపతికిఁ బ్రజాసర్గంబుకలిగెనని చెప్పంబడు పూర్వసర్గంబున సువర్ణాఖ్యులగు సప్తర్షుల నిసర్గంబుమానసపుత్రులంగాఁగల్పించి పితామహుండుగంధర్వ, భోగి, దేవ, దానవులనట్లు కల్పించె॥

క॥ కొడుకులపనియీవిధమునఁ, గడతేరుటచూచి దితియుఁగశ్యపమౌనిం।
గడువేడమెచ్చియతఁడో, పడతుకనీయిష్టమేమి పలుకుమనుటయున్॥ 666

గీ॥ పాకశాసనువధియించుపాటిపుత్రు, నొసఁగుమనుటయు సతఁడునయ్యుత్పలాక్షి।
కోరువరమిచ్చిపల్కెనో కీరవాణి ఘనశుచిక్రియ నూఱేండ్లుగర్భమిూవు॥ 667

క॥ ధరియించితేని యింద్రుని, బరిమార్పఁగఁ జాలునట్టిపట్టిభవద్భా।
సురకుక్షిఁబుట్టుననిముని, యరిగెన్ గర్భంబుదాల్చె సతివయుశుచియై॥ 668

చ॥ అమరవరేణ్యుఁడింతయు నిజాత్మగతంబునఁగాంచి పోయియా
యమకతిభక్తి సేవ వినయంబునఁజేయుచుఁ గాచియుండఁగాఁ
గ్రమమునఁగించిదూనమయి కాలమువచ్చిననొక్కనాఁడుపా
దములనశౌచస్థయై శయనధామమునం దితి నిద్రవోయినన్॥ 669

క॥ అంతరము వేచి పాకని, శ్రాంతయుఁ దత్కుక్షిఁ సూక్ష్ముఁడై చొచ్చి సుదు ।
ర్ధాంతపవి నేడు గ్రనెలుగ, కాంతాగర్భంబు నఱికెఁ గడు మొఱయిడఁగన్ ॥ 670

క॥ మొఱయిడకు మంచు నింద్రుఁడు, దాఁ ఱకొని యొకటొకటి యేడు దునుకలుగ నడిన్ ।
నఱికె నతికోపమునని, క్షురవజ్రప్రహతి మిగులఁ జోద్యముగాఁగన్ ॥ 671

వ॥ ఇట్లు ఏకోనపంచాశత్ఖండంబులై యింద్రుఁడు "మారోదిషీ" అని మాటి మాటికిం బలుకుట మారుతులను నామంబుగల తీవ్రవేగులైన దేవతాస్థానంబులై యింద్రునకు సహాయులైరని చెప్పి శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె॥

చ॥ మునుపు మహామునుల్ పృథుని ముఖ్యునిఁ జేసి సమస్తమేదినీ,
వినుత మహాధిరాజ్యపదవి స్థితికై యభిషిక్తుఁ జేసిర ।
ట్లనపర మేష్ఠి రాజ్యములు శ్లాఘ్యగతిన్ విభజించి యిచ్చె శో,
భనకరుఁడై క్రమంబునఁ గృపన్ సురదైత్య భుజంగకోటికిన్ ॥ 673

క॥ తారాగ్రహ విప్రులకును, సారతపంబులకు యజ్ఞసముదయమునకున్ ।
భూరిమహౌషధులకుఁగా, సారసభవుఁ డధిపుఁ జేసెఁ జంద్రుని నెలమిన్ ॥ 674

సీ॥ రాజుల కెల్ల వైశ్రవణుని వరుణుని, జలముల కాదిత్య జాలమునకు ।
విష్ణుని, వసునామ విబుధుల కెల్లను పావకు, సురలకుఁ బాకదమను ।
దక్షుఁ బ్రజాపతితతికి, ప్రహ్లాదుని దైత్యదానవసముత్కరమునకును ।
యమరాజు పితృకోటి, కైరావణము నశేషగజంబులకుఁ, బక్షిసంఘమునకు ॥

గీ॥ వైనతేయుని, నుచ్చైశ్శ్రవంబు నశ్వములకు, వృషభంబు గోగణంబులకు, భూధ
రములకు హిమాలయంబు, సింహము మృగౌఘములకు, నధిపులఁ జేసె నంభోజ

క॥ కపిలుని మునులకు, సర్పాధిపులకు శేషుని, వనస్పతితతికి ప్లక్షాం । [భవుఁడు ॥
ఘ్రిపమును, నధిపులఁ జేసె, న్నిపుణుఁడు పద్మజుఁడునై పుణ్యక్రియ వెలయన్ ॥676

సీ॥ ప్రాగ్దిశయందు వైరాజప్రజాపతి తనయు సుధన్వునిం ధవునిఁ జేసె ।
దక్షిణదిశకుఁ గర్దమపుత్రకుని శంఖ పదనామధేయుని ప్రభువుఁ జేసె ।
ప్రత్యగ్దిశాభూమి రజసూను కేతుమం, తుని పాలనక్రియాధుర్యుఁ జేసె ।
ఉత్తరదిశ కేతు మత్తనూజు హిరణ్య రోమాభిధానుని స్వామిఁ జేసె ॥

గీ॥ అంబురుహసూతి వీరిచే నఖిలధరణి, యెపుడు పాలితయగు ధర్మనిపుణశీల ।
వీరు భూతభవద్భవ్యవివిధపతులు, శ్రీవిభువిభూతి భూతులూర్జితవివేక ॥ 677

ఉ॥ సారసపత్రలోచనుఁడు సర్వమయుండు తదంశసంభవుల్,
గారెసమస్తపాలన కళామహనీయులు దేవదైత్యమ ।

ర్యోరగముఖ్యులెల్లను దదున్నతిఁ జెందనివారికెల్లఁ జే,
కూరెడుశిష్టపాలనము కుత్సిత దుష్టవినాశరూఢియున్ ॥ 678

గీ॥ సృష్టియందుజగము సృజియించు స్థితియందుఁ, బ్రోచివిలయకాలమునహరించు ।
చతురులీలలరజస్సత్త్వంబుతమమును, నాశ్రయించిపంకజాక్షుఁడెపుడు ॥ 679

క॥ నాలుగురూపుల సృష్టియు, నాలుగురూపులను స్థితియునాలుగురూపుల్ ।
పోలఁగలయముంజేయుచు, నాలుగురూపులను పద్మనయనుండుండున్ ॥ 680

ఉ॥ సారసగర్భుఁడై ధరఁబ్రజాపతులైన మరీచిముఖ్యులై,
యారయఁగాలమై ఘనచరాచరభూతములై జనార్దనుం ।
డీరహినాల్గురూపముల నప్పురజోగుణలిప్తతన్ సువి,
స్తారముగాసృజించు వివిధక్రియమైన జగంబిదంతయున్ ॥ 681

గీ॥ విష్ణుఁడై, మనురూపియై, వితతమైన కాలమై, సర్వభూతసంఘాతచిత్త ।
సంస్థితుండయి, రక్షించుసత్త్వనియతి, యొనరజగమెల్ల శ్రీపురుషోత్తముండు ॥

ఉ॥ రూపర, నంతకాలమునరుద్రుఁడు తానయి యంతకాగ్నియు,
ఖ్యాపరిమేయరూపధరుఁడై దురతిక్రమకాలరూపుఁడై ।
వ్యాపితసర్వభూతగణుఁడై జగమంతయుఁద్రుంచుచుండు ల,
క్ష్మీపతితామసప్రకృతిమించఁగ నెంచగని త్తెఱంగునన్ ॥ 683

వ॥ ఇట్లు జగత్సృష్టిహేతువులైన బ్రహ్మయు, మరీచ్యాదులు, కాలంబు, సకల జంతువులును, జగత్స్థితిహేతువులైన విష్ణువు,మన్వాదులు, కాలంబు,సర్వజంతువులును, జగత్ప్రళయ హేతువులైన రుద్రుండును, అగ్న్యంతకాదులును, కాలంబును, సర్వజంతువులును, జనార్దనుని విభూతులుగా నెఱుంగుము. హరికింగాక సృష్ట్యాది సామర్థ్యం బొరులకుంగలుగునే? సృష్టి స్థితిలయంబు లొనర్చునవి రజస్సత్త్వ, తమోయుక్తంబులగు హరిశరీరంబులు గా నెఱుంగుము. జగత్స్రష్టయు, జగద్రక్షకుండును,జగద్భక్షకుండును,జనార్దనుండు గా నెఱుంగుము. సర్గస్థిత్యంత కాలంబులందు గుణప్రవర్తనతండు మూఁడుప్రకారంబుల వర్తించు. అగుణంబై, అనౌపమ్యంబై, జ్ఞానమయంబై,స్వయంవేద్యంబై, అధికంబై,జనార్దనుని పరమపదంబు వెలుంగుచుండు. అప్పరమాత్మ స్వరూపంబును, నాల్గు తెఱంగుల వర్తించుననిన శ్రీపరాశరునకు మైత్రేయుం డిట్లనియె॥ 684

క॥ పరమపదాఖ్యము బ్రహ్మ, స్వరూపమూర్జిత మధికము జ్ఞానమయము మీ ।
రరయ చతుర్విధమంటిరి, యెఱింగింపుడు తత్క్రమము మునీంద్రాయనుడున్ ॥

గీ॥ సర్వవస్తువులందును జగ్ధ్రసేయ, కరణ మదిసాధనంబండ్రు కాంక్షితంబు ।
వస్తువది సాధ్యమండ్రు భావలయమునను, దెలిసిచూచి విభాగకర్తలుమునీంద్రా॥

క॥ వేమఱు యోగికిఁ బ్రాణా, యామాద్యముసాధనము సమంచితసాధ్యం ।
బై ఖ్యించు బ్రహ్మమదిగని, తా, మఱలఁడు, భవమునకు నుదారస్ఫూర్తిన్ ॥

ఉ॥ వెంబడి యోగిముఖ్యులకు వేగము ముక్తియొసంగుసాధనా
లంబనమైన జ్ఞానమది లక్షణమొప్పఁగ జ్ఞానమైన బ్ర ।
హ్మంబున కొక్కయంశము సమంచిత బోధనిధానసావధా
నంబయి యొప్పుమానసమునం దలపోయుము నిశ్చితస్థితిన్ ॥ 688

గీ॥ యోగిజనము లతిక్లేశమొదవసాధ్య, మైన బ్రహ్మంబు చిత్తంబునందుఁగూర్చు ।
నట్టి సాధ్యావలంబనంబైన జ్ఞాన, మది ద్వితీయాంశమయ్యె బ్రహ్మంబునకును॥

క॥ సాధనసాధ్యాభేదము, సాధారణభంగియగుచుఁజన, నద్వైత ।
త్వాధికమగు జ్ఞానమ్మన, మాధేయంబై తృతీయమగు నంశమగున్ ॥ 690

వ॥ ఏతత్జ్ఞానత్రయ విశేష నిరాకరణద్వారంబున దర్శితాత్మ స్వరూపంబై నిర్వ్యాపారంబును, అనాఖ్యేయంబును, వ్యాప్తిమాత్రంబును, అనౌపమ్యంబును, ఆత్మసంబోధవిషయంబును, సత్తామాత్రంబును, అలక్షణంబును ప్రశాంతంబును, అభయంబును, శుద్ధంబును, దుర్విభావ్యంబును, అనాశ్రయంబునునై, జ్ఞానమయుండగు విష్ణుదేవుని జ్ఞానంబు పరమపదంబనంబరఁగు. ఆ జ్ఞాననిరోధంబుచేసి యోగిజనులు అందు లయంబునొంది సంసారంబు నొందరు. ఈ ప్రకారంబున నమలంబును, నిత్యంబును, వ్యాపకంబును, అక్షయంబును, సమస్తాపాయరహితంబును, నైన విష్ణ్వాఖ్య పరమపదంబు పరబ్రహ్మంబనంబరఁగు. పుణ్యాపుణ్యోపరమంబున క్షీణక్లేశుండై యతినిర్మలుండై, యోగీశ్వరుండా బ్రహ్మంబుంజేరి పునరావృత్తి నొందండు బ్రహ్మంబునకు మూర్తామూర్తంబులు రెండురూపంబులు. అవి, క్షరాక్షరసంజ్ఞల సర్వభూతావస్థితంబులునై యుండు. అక్షరంబు బ్రహ్మంబు, క్షరంబు జగంబు. ఏకదేశస్థితుండైన వహ్నితాశనుని జ్యోతి విస్తరిల్లినపగిది పరబ్రహ్మంబుశక్తి విస్తరిల్లి జగంబయ్యె. 691

సీ॥ వివరింప బ్రహ్మయు విష్ణుండుశివుఁడు ప్రధానశక్తులు బ్రహ్మతత్వమునకు ।
అంతకుఁ దక్కువ యమరులు దక్షాదు లంతకుఁ దక్కువయంతకన్నఁ ।
దక్కువమనుజులంతకును దక్కువక్రమంబునఁ బశుమృగ పక్షిభోగికులము ।
మేదినీవృక్ష గుల్మాదులంతకుఁ దక్కువై యుండు నిదిజగంబంతటికిని ॥

సీ॥ శక్తిశ్రీవిష్ణుదేవుండు సకలయోగి, చింతనీయ ప్రభావుండు శ్రీవిభుండు ।
సర్వశక్తీశ్వరుండంబు జాతనేత్రుఁ డన్నిబ్రహ్మాంబుల్లను హరియనియెఱుంగు।

క॥ వరభూషణాస్త్రరూప, స్ఫురణంబునహించియున్న పురుషాదులన ।
య్యురగేంద్రశాయి నిత్యము, ధరియించుం బ్రాణిచయహితముచేకూర్పన్

వ॥ అనినమైత్రేయుండు శ్రీపరాశరున కిట్లనియె ॥ 694

ఉ॥ నీరజలోచనుండు రమణీయవిభూషణ శస్త్రరూప ధృ
త్పూరుషముఖ్యులన్ మహిమతో ధరియించునటంచు నిప్డుమీ ।
రారయనానతిచ్చితిరదంతయు సత్కృపనానతీయవే,
శ్రీరమణీవరాంఘ్రి సరసీరుహషట్చరణాయి తాత్త్వకా ॥ 695

వ॥ అనినమైత్రేయునకుఁ బరాశరుం డిట్లనియె॥ 696

క॥ సకలజగజ్జీవాకృతి, ప్రకటితరుచిమెఱయుఁ గౌస్తుభము ధరియించున్ ।
సకలజగద్రక్షకుఁడగు, వికచాంబుజలోచనుఁడు ప్రవీణతమెఱయన్ ॥ 697

క॥ అమరు ప్రధానము శ్రీ, వత్సమునఁగగదయయ్యె బుద్ధితత్వముపీనిన్ ।
కమలామనోహరుఁడు, నిత్యముదాల్చు నపారభూరి హర్షముమెఱయన్॥ [డ

సీ॥ అమరుభూతాదియునునింద్రియాదియుననఁ, గలుగుద్వివిధమహంకార మెలమితో
నతులశంఖాకృతియును శార్ఙ్గాకృతియును, దాల్చిభజియించు శ్రీజనార్దను

చ॥ అమితజవాధరీకృత మహానిలవేగము చంచలస్వరూ, [నెపుడు
పముదురతిక్రమంబునయి భాసిలుచున్నమనంబు చక్రరూ ।
పముధరియించి శ్రీశుకరపద్మమునందు వెలుంగునెప్పుడున్,
స్వమహఉదీర్ణతా శమితశాత్రవభూరితర ప్రతాపమై ॥ 70

సీ॥ పంచవర్ణకుసుమ భాసమానతసుగం, ధాఢ్యయగుచు వైజయంతియనఁగఁ ।
బుష్కరాక్షువక్షముననుండు నెప్పుడు, భూతపంచకంబు భూసురేంద్ర ॥ 70

క॥ ఇరువెఱఁగులనింద్రియములు, శరరూపముఁదాల్చి వినయ సంభృతలీలా ।
స్ఫురణమునఁ గొల్చియుండున్, సరసీరుహపత్రనయను చాతుర్యమునన్ ॥ 70

క॥ ఎందునవిద్యామయతా, మందంబగు ఫలకమును సమంచితమహిమా ।
నందద్విద్యామయమగు, నందకమునుదాల్చు పద్మనాభుఁడు వేడ్కన్ ॥ 70

వ॥ ఇవ్విధంబునఁ బురుషప్రధాన, బుద్ధ్యహంకార, భూత, మనస్సర్వేంద్రియ
విద్యా, విద్యలు భూషణాస్త్ర స్వరూపంబులుదాల్చి భగవంతుని భ

యించు. సవికారంబైన ప్రధానంబును బురుషుండును, జగత్తును, విద్యావిద్యలును, సర్వభూతేశ్వరుండై, కాలమయుండైన, హరియందు నిలిచియుండు. భూర్లోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనుర్లోక, తపోలోక, సత్యలోకంబులను, సప్తలోకంబులును, దానయయి, కాలాత్మమూర్తియయి, పూర్వులకుం బూర్వుండై, సర్వవిద్యలకు నాధారంబై, దేవ, మానుష, పశ్వాది బహురూపంబులు దాల్చి, బహురూపధారియై శ్రీమన్నారాయణుండు వెలయుచుండు॥

క॥ వేదము లితిహాసంబులు, వేదాంతోక్తులు పురాణవితతులు స్మృతులున్ ।
వాదములు కావ్యగీతము, లాదట శబ్దాత్ముఁడైన హరితనువులగున్ ॥ 705

క॥ హరినేను జగములన్నియు, హరి తద్వ్యతిరిక్తమొకటి యరయఁగ లేదం ।
చురుమతి నెవ్వఁడు గను, నప్పురుషుఁడు ముక్తుఁడగునధికపూతాత్ముఁడై ॥ 706

వ॥ ఇప్పురాణంబునందు నిది మొదలియంశంబు నీ కెఱింగించితి. శ్రద్ధాపరుండై వినునతండు పుష్కరతీర్థంబుల ద్వాదశాబ్దంబులు, కార్తికపౌర్ణిమాశివ్రతంబు లాచరించిన ఫలంబునొందు. దేవర్షి, పితృ, గంధర్వ, యక్షాదుల సంభవంబువిన్న నిష్టవరంబులు వొసంగునని శ్రీపరాశరుండు మైత్రేయునకు నానతిచ్చుటయును॥

శా॥ శంఖక్షేత్రవిహార, హారకనకస్వచ్ఛీభవత్ఫాల్గునీ
ప్రేంఖారోహణధీర, ధీరచితసత్ప్రేమానమత్పత్రిరాట్।
కంఖాణప్రభుచార, చారణనుతోగ్రవ్యగ్ర చక్రప్రభా
సంఖిన్నాసురవార, వారణభయోచ్చైచ్ఛ్రేఘు జంఝానిలా ॥ 708

క॥ దారూభ్నవదాత్మ తనూ, చారూభవదతులమలయ జద్రవమృదుచ ।
ర్చోర్యూభవదామోద వి,భీర్యూభవదఖిలలోక పృథుసంశరణా ॥ 709

తోదకము :—

ఖేటక ఘోటక ఖేలనధీరా, హాటక శాటక హారికటీరా ।
కూట నిశాటనిగూహనసారా, కాటనపాటన కార్యరిధారా ॥ 710

గద్య॥ ఇది శ్రీసుభద్రా కరుణాకటాక్ష వీక్షణలబ్ధకవిత్వతత్వ పవిత్ర వేంకటామాత్యపుత్ర కందాళ శ్రీరంగాచార్య కృపాపాత్ర సజ్జనమిత్ర శ్రీహరి చరణారవిందవందన పరాయణ కలిదిండి భావనారాయణ ప్రణీతంబైన శ్రీవిష్ణుపురాణంబునందు మైత్రేయ మహాముని శ్రీపరాశరునకు మ్రొక్కి ప్రశ్నంబు లడుగుటయు, రాక్షస సత్రయాగంబును, వసిష్ఠపరాశర సంవాదంబును, వాసుదేవ నామనిర్వచంబును, ప్రకృతిపురుషేశ్వర కాలస్వరూపకథనంబును, భూత తన్మాత్ర సృష్టిప్రకారంబును, ఇంద్రియసృష్టి ప్రకారంబును, బ్రహ్మాండోత్ప

త్తియు, సప్తావరణ ప్రకారంబును, కాలనిర్ణయంబును, యుగపరిణామంబులును, మన్వంతర ప్రమాణంబులును, నైమిత్తిక ప్రళయ ప్రకారంబులును, నారాయణనామ నిర్వచనంబును, యజ్ఞవరాహావతారంబును, భూస్తుతియు, భూసముద్ధరణంబును, సృష్టిప్రకారంబును, ముఖ్యసర్గాది నవసర్గ ప్రకారంబులును, సకలభూత సంభవంబును, చాతుర్వర్ణ్యోత్పత్తియు, వర్ణాశ్రమంబుల వారుపొందుగతులును, భృగ్వాది నవబ్రహ్మలయుత్పత్తియు, వారలవలనం బ్రజోత్పత్తియు, లక్ష్మీచరిత్రంబును, దుర్వాసునిశాప ప్రకారంబును, సముద్రమథనంబును, ఐరావతాది సంభవంబును, లక్ష్మీసముత్పత్తియు, ఇంద్రస్తుతియును, ఉత్తానపాదుని చరిత్రంబును, ధ్రువసంతతి క్రమంబును, పృథుచరిత్రంబును, ప్రచేతసులచరిత్రంబును, కండుముని చరితంబును, శ్రీపురుషోత్తమమాహాత్మ్యంబును, మారిషాచరితంబును, దక్షోత్పత్తియు, దక్షకన్యకా సంతాన ప్రకారంబును, రుద్రోత్పత్తియు,ప్రహ్లాదచరితంబును, ప్రహ్లాదసంతతి ప్రకారంబును, మరుత్తులజన్మ ప్రకారంబును ఆధిపత్యకథనంబును, శ్రీహరి గుణత్రయంబుదాల్చి సృష్టి, స్థితి, లయంబులు చేయుప్రకారంబు, పరమపదజ్ఞాన చాతుర్విధ్యంబును, ప్రకృతిపురుషాదులు శ్రీహరికి నాయుధభూషణాదులైన ప్రకారంబులును, శ్రీహరి విశ్వరూపంబును ననుకథలంగల ప్రథమాంశమనంబడు ప్రథమాశ్వాసము.

శ్రీ కృష్ణార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ ర స్తు.

# వి ష్ణు పు రా ణ ము.

భావనారాయణకృతము.

---

## ద్వి తీ యా ం శ ము.


లావణ్యాసుభద్రో,
త్తాలపయోధరసువర్ణ ధరవిహరణకే।
లీలోల, ప్రావృషణ్ణవ,
నీలాంబుధర ప్రకాశనీలాద్రీశా ॥ 1

వ॥ అవధరింపుము మైత్రేయమహాముని శ్రీపరాశరున కిట్లనియె. 2

గీ॥ ఘనులుస్వాయంభువుని పుత్త్రులనుపమాన, ధర్మపరులు, ప్రియవ్రతోత్తానపాదు।
లందు, నుత్తానపాదునియన్వయంబు, వింటిని, ప్రియవ్రతునిజెప్పవేమునీంద్ర ॥

వ॥ అనియడిగిన మైత్రేయునకు పరాశరుం డిట్లనియె॥ 4

చ॥ ఘనభుజుఁడా ప్రియవ్రతుఁడు కర్దమపుత్త్రికఁబెండ్లియాడి, య
వ్వనరుహనేత్రియందు, బలవంతుల పుత్త్రకులం, బదుండ్రన।
త్యనుపమతేజులంగనియె, నమ్మహనీయుల నామధేయముల్,
వినుము, మునీంద్రచంద్ర! కడువేడుకతో నవధానమేర్పడన్ ॥ 5

వ॥ అగ్నీధ్రుండును, అగ్నిబాహుండును, వపుష్మంతుండును ద్యుతిమంతుండును, మేధియు, మేధాతిథియు, హవ్యుండును, సవనుండును, పుత్త్రుండును, జ్యోతిష్మంతుండును, అందు, మేధాగ్నిబాహుపుత్త్రులు మువ్వురును, జాతిస్మరులై రాజ్యంబొల్లక, నిర్మములును, అఫలాకాంక్షులునై, తపోనిష్ఠులైరి. తక్కిన యేడ్వురుపుత్త్రులఁ బ్రియంవదుండు సప్తద్వీపంబులకు నధిపతులఁజేసె. తత్ప్రకారంబువినుము. అగ్నీధ్రునకు జంబూద్వీపంబును, మేధాతిథికి ప్లక్షద్వీపంబును, వపుష్మంతునకు శాల్మలద్వీపంబును, జ్యోతిష్మంతునకు కుశద్వీపంబును, ద్యుతిమంతునకు క్రౌంచద్వీపంబును, హవ్యునకు శాకద్వీపంబును, సవను

నకు పుష్కరద్వీపంబును ఇచ్చి యభిషిక్తులం జేసె. అందు జంబూ
పేశ్వరుండైన యగ్నీధ్రునకు నాభి, కింపురుష, హరివర్ష, ఇలావృత, రమ
హిరణ్వత్తు, కురు, భద్రాశ్వకేతుమాలులను తొమ్మిద్దరు పుత్రకులు ప్ర
పతిసములుపుట్టిరి. అగ్నీధ్రుండు జంబూద్వీపంబు తొమ్మిదిభాగంబులుగా వి
జించి. నాభియను నగ్రపుత్రునకు దక్షిణంబైన హిమవర్షంబును, కింపురు
నకు హేమకూటంబును, హరివర్షునకు నైషధవర్షంబును, ఇలావృతునకు మేరు
చుట్టున మేరువర్షంబును, రమ్యునకు నిలాచలవర్షంబును, హిరణ్వంతునకు ఉ
రంబైన శ్వేతవర్షంబును, కురువునకు శృంగపర్వతోత్తరవర్షంబును, భద్రాశ
నకు మేరుపూర్వవర్షంబును, కేతుమాలునకు గంధమాదనంబును నొసంగె॥

క॥ ఈమాడ్కినమ్మహీపతి, భూమీభాగముల కాత్మపుత్త్రులరాజ।
శ్రీమించఁజేసిసాల గ్రామాశ్రమమునకుఁ దపమునైకొనఁ జనియెన్॥

సీ॥ మునికులచంద్ర కింపురుషాభిధేయాష్ట వర్షంబులందు సర్వసుఖసిద్ధు।
లప్రయత్నంబున నావిర్భవించు, విపర్యయంబును, జరాభయము మృత్యు।
భయము నధర్మసంభవమును ధర్మసంభవమునులేదు వీడ్వడగనుత్త।
మాధమమధ్యమ వ్యవహారములు యుగవ్యాపారములు గల్గవందు నెప్డు॥

గీ॥ దేవలోకసమములై వెలుగొందుచు, భోగభూములగుచు పొగడుగనుచు।
నధికమహిమ వెలయు నయ్యష్టవర్షంబు, లధివసింతురచట ననఘమతులు॥

క॥ హిమవర్షపతికి నాభికి, నమితద్యుతి మేరుదేవి యనుకామినికిన్।
కమలాక్షు నిభుఁడు ఋషభుఁడు, కుమారుఁడుదయించె జగముకొనియాడంగన్

వ॥ ఋషభుండు తండ్రిపరోక్షంబున హిమవర్షంబునకు రాజై రాజధర్మంబవ
బించి, వివిధాధ్వరంబులొనరించె. అతనికి భరతజ్యేష్ఠంబైన పుత్రశతం
బుగలిగె. అందు జ్యేష్ఠపుత్రుని భరతు హిమవర్షంబునకు నభిషిక్తునింజేసి
ఋషభుండు పులహాశ్రమంబునకుఁబోయి, యచ్చట వాన ప్రస్థధర్మంబున
దపంబొనర్చుచు యథార్హయజనశీలుండై యోగమార్గంబున నుత్తమ
లోకగతుఁడయ్యె॥

క॥ ధీరుడు భరతుండేలగ, భారతమన ధరణిఁ బేరుపడి హిమవర్షం।
బారూఢికెక్కెనతనికి, సూరివరా! ధార్మికుండు సుమతిజనించెన్॥ 11

వ॥ సుమతిం బట్టాభిషిక్తుంజేసి భరతుండు సాలగ్రామాశ్రమంబున యోగాభ్యా
సరతుండై ప్రాణంబులువిడిచి శ్రేష్ఠంబైన యోగికులంబున విప్రుండై జని
యించె. మైత్రేయా! పదంపడి తచ్చరితంబుచెప్పెద; భరతపుత్రుండైన

సుమతికి తైజసుండు, అతని కింద్రద్యుమ్నుండు, అతనికి పరమేష్ఠి, అతనికి ప్రతిహారుండు, అతనికి ప్రతిహర్త, అతనికిత్వష్ట, అతనికి విరజుండు, అతనికి రజుండు, అతనికిశతజిత్తు, ఆశతజిత్తునకు విష్వగ్జ్యోతి ప్రధానులగు పుత్త్రులు నూర్వురు జనియించిరి. వారిచే గదాయీ భారతవర్షంబు తొమ్మిదిభేదంబుల నలంకరింపంబడియె. తదన్వయ ప్రసూతులైన మహీపాలకులచేత ఇత్త్యాతత మహీమండలం బనుభవింపంబడియె. వరాహకల్పంబు న నేకసప్తతి, చతుర్యుగ పరిమితంబైన, స్వాయంభువ మన్వంతరంబున నీ స్వాయంభువసర్గంబు ప్రవర్తిల్లె. ఇందుచేత జగంబుపూరితంబయ్యెనని చెప్పిన మైత్త్రేయుం డిట్లనియె॥

క॥ స్వామీ! స్వాయంభువస ర్గామితమహిమంబు వింటినంతయుమీాఁదన్ ।
భూమండలవిస్తారం బేమాడ్కిన్ బరగుదాని నెఱిఁగింపఁగదే॥ 13

క॥ సాగరంబులు ద్వీపవర్షములుగిరులు, నదులుకాననములు పట్టణములు ధరణిఁ ।
బరగు వీని ప్రమాణమెప్పగిది, వీని, కేమి యాధారమింతయు నెఱుఁగఁజెపుమ॥

వ॥ అనిన శ్రీపరాశరుండి ట్లనియె॥ 15

క॥ ఓమునినాయక! వినుమీ! భూమండలి తెఱఁగు సర్వమును చెప్పఁగవా గ్భామాపతికైనను రాదీమెయిసంక్షేప భంగినెఱిఁగింతుఁదగన్ ॥ 16

వ॥ జంబూప్లక్షశాల్మల కుశ క్రౌంచ శాకపుష్కరనామంబులం గల సప్త ద్వీపంబులు క్రమంబున, లవణేక్షుసురాసర్పిదధిదుగ్ధ శుద్ధజల సముద్రంబుల చేతం బరివేష్టితంబులై యుండు. ఈసప్తద్వీపంబులకు జంబూద్వీపంబు మధ్యస్థంస్థితంబై యుండు. తన్మధ్యంబున నెనుబదినాలుగువేలు యోజనంబులు పొడవును, పదాఱువేలయోజనంబులు పాతును ముప్పదిరెండువేల యోజనంబుల శిరోవిస్తారంబును, పదాఱువేల యోజనంబుల మూలవిస్తారంబును గలిగి భూపద్మంబునకు కర్ణికాకారంబై కనకమయంబైన మేరుపర్వతంబు వెలుంగు॥

సీ॥ హిమగిరి హేమకూటము నిషధమునన మేరుదక్షిణవర్షమేదినీధ ।
రములు నీలాద్రి శ్వేత మహీధరము శృంగవంతంబునఁగ సువర్ణశిఖరి ।
ఉత్తరవర్షభూభృత్తిలకములందు హేమకూటము శ్వేతభూమిధరము ।
లక్షయోజన దైర్ఘ్యలక్షితంబులు తక్కనాలుగు తొంబదివేలుయోజ ।

గీ॥ నముల నిడుపున వెలయు నున్నతియు వెడలుపును సహస్రద్వయమితమై పొల్చు గిరివరంబుల కాఱింటికిని గణింప, ధీరవర వీనివిధమెల్లఁ దెలిసికొనుము ॥ [వర్ష ।

వ॥ దక్షిణలవణాబ్ధిహిమవత్పర్వత మధ్యంబు భారతవర్షంబు, హిమవద్ధేమకూట పర్వత మధ్యంబు కింపురుషవర్షంబు, హేమకూటనిషధ పర్వతమధ్యంబు హరి

వర్షంబు ఈ మూఁడువర్షంబులు మేరుదక్షిణభాగంబున వర్తిల్లు. ఉత్తరలవ ణాబ్ధి శృంగపర్వత మధ్యంబు కురువర్షంబు శృంగవచ్ఛ్వేతపర్వత మధ్యంబు హిరణ్మయవర్షంబు శ్వేతనీల పర్వతమధ్యంబు రమ్యవర్షంబు ఈమూఁడు వర్షంబులు మేరువు నుత్తరభాగంబున వర్తిల్లు. ఈవర్షంబు లాఱింటికి తొమ్మిఁ దేసివేల యోజనంబులు ప్రమాణంబు. మేరువునలుచుట్టును తొమ్మిఁదేసివేల యోజనంబుల ప్రమాణంబున ఇలావృతవర్షంబు వెలయు. అయ్యిలావృత వర్షంబునందు మేరువునకు పూర్వదక్షిణ పశ్చిమోత్తరపార్శ్వంబుల క్రమం బున మందర గంధమాదన విపులసుపార్శ్వనామంబుల నాలుగు విష్కంభ పర్వతంబులు యోజనాయుతోచ్ఛ్రితంబులై వెలయు. ఆ గిరులయందు కేతనరూపంబులై, కదంబజంబూ పిప్పలవట పాదపంబులు ఏకాదశ శతా యామంబులై వెలుంగు. ఆజంబూవృక్షంబు కారణంబునంగాదె యీద్వీపంబు జంబూద్వీపం బనంబరఁగె॥ 19

క॥ మునివర ! యాజంబూతరు, ఘనఫలములురాలిపడు, నగంబుపయిఁ, ఘో । రనినాదమెసఁగ నెప్పుడు, ననుపను గజరాజతను సమాకృతులగుచుఁ ॥ 20

వ॥ తత్ఫలరసంబు ప్రవహించి జంబూనది యనం బ్రసిద్ధమైన నదియై యిలావృత వర్షంబునం బ్రవహించె. తద్రసపానంబుచేసిన యిలావృతవాసులకు స్వేద దౌర్గంధ్య జరాభారేంద్రియక్షయంబులు లేవు. తద్రసార్ద్రిస్థమైన తీరమృ త్తిక సుఖవాయువిశోషితమై జాంబూనదాఖ్యంబున సిద్ధభూషణంబైన సువ ర్ణంబయ్యె. మేరువుతూర్పున భద్రాశ్వవర్షంబును, పశ్చిమంబున కేతుమాల వర్షంబును వెలయు. ఈయెనిమిదివర్షంబుల నడుమ నిలావృతవర్షంబు వెలయు. చైత్రరథగంధమాదన, వైభ్రాజ, నందననామంబులం గల వనంబులు మేరు పూర్వదక్షిణ పశ్చిమోత్తర పార్శ్వంబులం గ్రమంబుననొప్పు. అట్లక్రమం బున, అరుణోద మహాభద్ర, శితోదన మానసంబులను సరోవరంబులు పొలు చు. మేరువు పూర్వభాగంబున శితాంతచారుకుడ్య, కురరీ మాల్యవ, నైష్కం కప్రముఖంబులు, కేసరాచలంబులు త్రికూటశేఖర పతంగరుచక నిషధా దులు మేరుదక్షిణపార్శ్వంబున కేసరాచలంబులు శిఖివాహవైదూర్య కపిల గంధమాదన చారుధిప్రముఖంబులు పశ్చిమకేసరాచలంబులు శంఖకూప ఋషభహంసనాగ కోలాంజక ప్రముఖంబులు, ఉత్తర కేసరాంచలంబులు వెలయును ॥ 21

గీ॥ శృంగవ పదునాల్గువేలయోజ, నములు, నిడుపున, కాంచన, నగమ్ముమీఁద । బ్రహ్మపురివర్తిలుఁబ్రొస్త భంగుల, చిరత్నరత్న సుస్థవిభ్రాజియగుచు ॥ 22

క॥ ఆపురియెనిమిది దిక్కుల, దీపితగతి వెలయుచుండు, దిక్పతిపురముల్ ।
శ్రీపరిపూర్ణ సువర్ణగృహాపరిమిత సకలవైభ వాఢ్యములగుచుఁ ॥ 23

చ॥ సరసిజనాభపజ్జలజ సంభవమై, నభమాక్రమించి భా,
స్వరశశిమండల ప్లవనచాతురిచూపి, సురాద్రిమస్తకో ।
పరిపరిపాతజాత ఘనభంగ, యభంగుర, గంగ, భారతీ
శ్వరుపురిచుట్టి దేవమునిసన్నుతమై ప్రవహించునిచ్చలుఁ ॥ 24

వ॥ ఆగంగ యందునుండి పూర్వాదిచతుర్దిక్కుల యందును గ్రమంబున, సిత, అలకనంద, చక్షువు, భద్రయనను నామంబులుదాల్చి, నాలుగు ప్రకారంబుల జగతికి డిగ్గిసముద్రంబు చొచ్చె, తత్ప్రకారంబువినుము. అందు సిత యనుగంగ తూర్పుడిగ్గినగంబులతిక్రమించి భద్రాశ్వవర్షంబుఁజొచ్చి ప్రవహించి పూర్వసాగరంబుచొచ్చె. అలకనంద దక్షిణంబుడిగ్గి శైలమ్ములతిక్రమించి భారతవర్షంబుచొచ్చి సప్తవిధంబుల దక్షిణసాగరంబు చొచ్చె. చక్షువు, పశ్చిమంబునకు డిగ్గి గిరులతిక్రమించి కేతుమాలవర్షంబు చొచ్చి పశ్చిమార్ణవంబు ప్రవేశించె. భద్రయనుత్తరంబు డిగ్గి గిరులుత్తరించి కురువర్షంబుచొచ్చి యుత్తరసముద్రంబు ప్రవేశించె. మేరు పూర్వపశ్చాద్భాగంబుల ననిల నిషధాయామంబులై మాల్యవద్గంధమాదన శైలములు వెలయు. తన్మధ్యంబునం గదా మేరునగంబు భూపద్మంబునకుఁ గర్ణికాకృతింబరఁగె. అప్పద్మంబునకు మర్యాదాశైల బాహ్యాభాగంబు భారత, కేతుమాల, భద్రాశ్వ, కురువర్షంబులు పత్రంబులైయొప్పు. జఠర, దేవకూటంబులను రెండు పర్వతంబులు దక్షిణోత్తరాయామంబులై నీల, నిషధపర్వత ప్రమాణంబునఁ, బూర్వమర్యాదా పర్వతంబులువెలయు. గంధమాదన సంజ్ఞంగల రెండుపర్వతంబులు పూర్వపశ్చిమాయామంబులై అశీతిసహస్ర యోజన ప్రమాణంబున సముద్రాంతర్వ్యవస్థితంబులై దక్షిణ మర్యాదాపర్వతంబులు వెలయు. నిషధ, పారియాత్రంబులను రెండుపర్వతంబులు మేరుపశ్చిమ మర్యాదాపర్వతంబులు, జఠరదేవకూట ప్రమాణంబులై వెలయు. త్రిశృంగ జారుధి సంజ్ఞలంగల రెండు పర్వతంబులు గంధమాదనా యామంబులై సముద్రాంతర్వ్యవస్థితంబులై యుత్తరమర్యాదా పర్వతంబులువెలయు. మేరువునలుదిక్కులం బ్రవహించిన గంగాప్రవాహంబులతోఁ బెరయుకేసర పర్వతంబులతిరమ్యంబులై యొప్పు. ఏతచ్ఛైలాంతరద్రోణులు సిద్ధ, చారణ, గంధర్వసేవితంబులై వెలయు. అందులక్ష్మి, విష్ణ్వగ్ని, సూర్యాదిదేవతలకు నాయతనంబులు పెక్కులుగలవు ఆద్రోణులయందు మఱియుఁ గాననంబులు, పురంబులు పెక్కుగలవు. అందుకిన్నర, గంధర్వ, యక్ష, రక్షో, దానవుల

హర్షిశలం గ్రీడింతురు, ఇవిభూస్వర్గంబులు, ధర్మిష్ఠులకు నివాసంబులగు. పాపకర్తలకగమ్యంబులై యుండు. 25

క॥ వనజాతపత్రనేత్రుఁడు, మునివరభద్రాశ్వవర్షమున హయశిరుఁడై ।
అనిశంబునుండు నచ్చటి, జనములుఘనభక్తి యుక్తిసతతముఁ గొలువన్ ॥ 26

చ॥ కమలదళాయతాక్షుఁ డనుకంపదలిర్పఁగఁ గేతుమాలవ
ర్షమ్మున వరాహమూర్తియయి రాజిలుఁగూర్మ శరీరధారివి ।
భ్రమగతినుండు నెప్పుడును భారతవర్షమునందు మత్స్యభా
వమున వసించియుండుఁ గురువర్షమునందు మునీంద్రచంద్రమా ॥ 27

ఉ॥ అంతటనిండియుండు కమలాయతనేత్రుఁడు విశ్వరూపుఁడై
యెంతని చెప్పదున్మనికులేశ్వర యీనిఖిల ప్రపంచమున్ ।
వింతగఁదాల్చి యాత్మయయి విష్ణుఁడధీశ్వరుఁడుండుఁగాన ని
శ్చింతతనింతయుం దెలిసి చిత్తమునన్నల కొల్వు మెప్పుడున్ ॥ 28

వ॥ ఈనవవర్షంబులందును, ప్రత్యేకంబ కులపర్వతంబు లేడేసికలవు, అందులం బుట్టిన నదులు శతసంఖ్యంబులు, హిమవద్దక్షిణ మధ్యంబు నవసహస్రయోజన విస్తారంబైన భారతవర్షంబు స్వర్గాపవర్గకాములకు తిర్యక్త్వనరకగాములకుఁ గర్మభూమియైయుండు॥ 29

చ॥ అనఘమహేంద్ర సహ్యమలయంబులు శక్తిమదృక్షవంతముల్ ।
ఘనమగువింధ్యమున్ బలుపుగల్గి వెలింగెడి పారియాత్రమున్ ।
పనుపడియుండు నెప్పుడును భారతవర్షమునందు దేవతా ।
జనవినుతోన్నత క్రమవిశాలతసప్తకులాచలేంద్రముల్ ॥ 30

వ॥ ఈభారతవర్షంబునను, నింద్రద్వీపంబును కసేరుద్వీపంబును, గభస్తిమద్ద్వీపంబును, నాగద్వీపంబును, సౌమ్యద్వీపంబును, గాంధర్వద్వీపంబును, వారుణద్వీపంబును, సాగరసంవృతద్వీపంబును ననఁ దొమ్మిదిద్వీపంబులు సహస్రయోజన విస్తారంబులై యుండు. అందుఁ దొమ్మిదవదగు నీద్వీపంబు సాగరవేష్టితంబై, దక్షిణోత్తరంబులు సహస్రయోజన విస్తారంబై యుండు. అందుఁ బూర్వభాగంబునఁ గిరాతులును, బశ్చిమభాగంబుగ యవనులును, మధ్యభాగంబున బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులును, స్వవృత్తినిరతులై యుండుదురు. శతద్రు, చంద్రభాగా ప్రముఖనదులు హిమవత్పాదసంభవంబులు, వేదస్మృతి ప్రముఖనదులు పారియాత్రోద్భవంబులు నర్మదా సురసాదులు వింధ్యనిర్గతంబులు. తాపిత, యోష్ణి, నిర్వింధ్యాదులు ఋషభ

పర్వతసంభవంబులు గోదావరీ,' భీమనదీ, కృష్ణవేణ్యాదులు సహ్యపాదోద్భవములు. త్రిసామా, ఋషికుల్యాదులు మహేంద్రపర్వత సంభవంబులు, కృతమాలా, తామ్రపర్ణి ప్రముఖనదులు మలయోద్భవములు. ఋషికూలా. కుమార్యాదులు శుక్తిమత్పాదసంభవములు. వీనివలన నుపనదులు పెక్కుగలవు. అందుఁగురు, పాంచాలాదిమాధ్యదేశజనులును, పూర్వదేశాదినివాసులును, మద్రభామారంబ, పారసీకాదులును, నీనదులజలంబులు త్రావుచుఁ దత్సమీపంబున హృష్టపుష్టజనాకులులై వసింతురు ॥ 31

చ॥ వరుసకృతంబు త్రేతయును ద్వాపరముం గలి సంజ్ఞితంబులై
పరగుయుగంబు లెప్పుడును భారతవర్షమునందగాని, కిం ।
పురుషముఖాష్టవర్షములఁ బొందవుదాన, తపో, ముఖక్రియల్,
పరముగుఱించి చేయుదురు భారతవర్షమునందు సత్తముల్. 32

వ॥ ద్వీపంబులందు జంబూద్వీపంబు త్తమంబు. దానియందు యజ్ఞపురుషుండైన శ్రీమన్నారాయణుండు పురుషులచేత యజింపఁబడు. సత్పురుషులు పరలోకార్థంబు సత్క్రియలుచేయుదురు. తక్కినద్వీపంబుల నన్యప్రకారంబున భజియింతురు. జంబూద్వీపంబునందు భారతవర్షంబు శ్రేష్ఠంబు. ఇదికర్మభూమి. తక్కినవి భోగమూలములు. అనేకజన్మసహస్రంబులకుఁ బుణ్యసంచయంబువలన జంతువు భారతవర్షంబునఁ బురుషుండై జనియించు ఈ యర్థంబునకు దేవగీతలుకలవు. వాని యర్థంబువినుమని శ్రీపరాశరుండు మైత్రేయునకి ట్లనియె. 33

చ॥ అమలత్వస్వర్గమోక్షముల కాదరులై తగుభారతాఖ్యవ,
ర్షమున జనించినట్టి పురుషప్రకరంబతి ధన్యమెట్లనన్ ।
తమతమ నిత్యకర్మసముదాయము తత్ఫలకాంక్షమాని శ్రీ,
రమణునిఁ జేర్చి పొందుదురు ప్రస్ఫుటతన్మహనీయధామమున్ ॥ 34

చ॥ తెలియక మోసపోతిమి కదీయత దెచ్చినకర్మమింకినన్,
పలుపలు కేల శీఘ్రమున భారతవర్షమునందుఁ బుట్టినే ।
ర్పలవడభక్తియుక్తి జలజాయతలోచను పాదపద్మముల్
గొలుతుము ముక్తికై తలఁపఁ గొంచెమెతన్మహిత ప్రభావముల్ ॥ 35

వ॥ అనిచెప్పి మఱియు ని ట్లనియె ॥ 36

గీ॥ బ్రహ్మవిద్వర నవవర్షపరిమితంబు, లక్షయోజన విస్తారలక్షితంబు ।
లైనయీదీవిచుట్టు చోద్యముగనుండు, క్షారనీరధి లక్షయోజనమితంబు ॥ 37

క॥ లక్షద్వయయోజనమిత, లక్షితమైజలధిఁ జుట్టిప్లక్షద్వీపం।
బక్షీణవైభవాఢ్యజ, నక్షేమదమగుచు వెలయునవ్యప్రతిభన్॥ 39

వ॥ ప్లక్షద్వీపేశ్వరుండైన మేధాతిథికి శాంతభయుండును, శిశిరుండును, సుఖోదయుండును ఆనందుండును, శివుండును, క్షేమకుండును, ధ్రువుండును, నన నేడ్వురుపుత్రులుపుట్టి ప్లక్షద్వీపంబునకు రాజులైరి. వారిపేరన పూర్వవర్షంబు మొదలుకొని ప్రదక్షిణంబుగాఁ గ్రమంబున శాంతభయవర్షంబును, శిశిరవర్షంబును, సుఖోదయవర్షంబును, ఆనందవర్షంబును, శివవర్షంబును, క్షేమకరవర్షంబును, ధ్రువవర్షంబును నన నేడువర్షంబులయ్యె. ఈవర్షంబులకు మర్యాదాశైలంబులుగోమేధ, చంద్ర, నారద, దుందుభి సోమిక, సుమనో, వైభ్రాజనామంబులంగలిగి యేడుపర్వతంబులు గలవు. ఈ వర్షాచలంబులయందును వర్షంబులయందును బ్రజలుదేవ, గంధర్వసహితులై వసియింతురు. 40

గీ॥ అందునధిక సమృద్ధంబులైన పుణ్య, జనపదంబులు పెక్కందు జనునకెల్ల।
వ్యాధులునునాధులును లేవు వలసినట్లు, సర్వకాలసుఖంబులు సంభవించు॥ 41

వ॥ ఆవర్షంబులకు అను, తప్త, శిఖి, విపాశ, త్రిదివ, అమృత, సుకృత, అను నామంబులంగల సముద్రగామినులైన సప్తనదులుగలవు. మఱియును క్షుద్ర నదీపర్వతంబులును సహస్రసంఖ్యలుకలవు. తన్నదీజలపానంబుచేసిన జనులు దేవసమానులగుదురు. ప్లక్ష, శాల్మల, క్రౌంచ, కుశ, శాకద్వీపంబులను పంచద్వీపంబులందును త్రేతాయుగ సమానకాలంబు వర్తించు. మానవులు పంచసహస్రవర్షంబులు పరమాయువుగాఁ బ్రదుకుదురు. ఆర్యకులులును, కురువులును, విదులును, స్వాభావులును, ననుసంజ్ఞలంగలిగి క్రమంబున బ్రహ్మక్షత్రియవైశ్య, శూద్రులువర్తిల్లుదురు. ఆద్వితీయద్వీపమధ్యంబున జంబూద్వీప ప్రమాణంబైన ప్లక్షవృక్షంబులు వెలుగొందు, తన్నామంబునంగదా యాద్వీపంబు ప్లక్షద్వీపంబనంబరఁగు॥ 42

క॥ విప్రక్షత్రియవైశ్యుల, తిప్రీతితలిర్పనందు దేవోత్తము, ల।
క్ష్మిప్రియువిహితక్రతుక, ర్మప్రవణమనస్కులగుచు మదిఁగొల్తురిలన్॥ 43

సీ॥ పాండిత్యలక్షణ! రెండులక్షలయోజ, నముల వెడల్పున నమరియిక్షు।
రసపరిపూరితార్ణవము ప్లక్షద్వీప, ధరణిమండలిఁ జుట్టితనరుచుండు।
డంబైనయిక్షురసాంబుధిఁజుట్టి చ, తుర్లక్షయోజనస్తుత్యమైన।
వెడలుపుశాల్మలద్వీపంబుగలదు త, ద్విభుఁడు వపుష్మంతుఁడభయులైన॥

గీ॥ నందనులనేడ్వురనుగాంచి యందఱికిని, శాల్మలముపంచియిచ్చె తత్సంజ్ఞ [illegible]
వర్షములు దానఁబరఁగెఁదద్వర్తనంబు, తెలియఁజెప్పెదవినుమునుసందియా[illegible]

వ॥ శాల్మలద్వీపేశ్వరుండైన వపుష్మంతునకు శ్వేతుండు, హరి, జీమూతుండు, లోహితుండు, వైద్యుతుండు, మానసుండు, సుప్రభుండు, నననేడ్వురుపుత్రులు గలిగిరి. వారిపేర నేడువర్షంబులుగలిగె. కుముదంబు, ఉన్నతంబు, వలాహకంబు, సంజీవన్యాది మహౌషధులుగల ద్రోణంబు, కంకంబు, మహిషంబు కకుద్మంతంబు, ననేడు మర్యాదాపర్వతంబులు ; యోని, తోయ, వితృష్ణ, పంచ, వృక్ణ, విమోచని, నివృత్తి అను నామంబులుంగల యేఁడుయేఱులు సకలకల్మషనాశనులుగలవు. అందు కపిలారుణ, పీత, కృష్ణ, [illegible]ర్ణంబుల చాతుర్వర్ణ్యంబు బరఁగు. 45

గీ॥ వాయుభూతుఁడైన వనజాతలోచను, నఖిలవర్ణజనులు ననుదినంబు।
యజనశీలురగుచు నర్చింతురతిభక్తిఁ, దెలివి, శాల్మలమునుదీవియందు॥ 46

క॥ దేవతలెప్పుడు మూఁడవ, దీవిన్మానవులఁగూడి దిరుగుదురతి శో।
భావహము శాల్మలద్రుమ, మావసుమతినుండునున్నతాకృతియగుచున్॥ 47

వ॥ అదియును లక్షద్వయయోజన విస్తారంబుకలదు. తన్నామంబునఁ గదా శాల్మలద్వీపంబనంబరఁగు. చతుర్లక్షయోజన విస్తారంబైన సురార్ణవంబా శాల్మలద్వీపధరణిం జుట్టియుండు. 48

ఉ॥ ఓపరమర్షి పుంగవ సురోదధి చుట్టునఁబెంపుతోఁ, గుశ,
ద్వీపమ్ముపొల్చునందుఁగల ధీరజనుల్ దివిజోపమానులై।
యేపుననుందురందమగు నెన్మిదిలక్షలయోజనంబులన్,
శ్రీపటిమున్ దివస్పతిపురిన్ హరియించుచునుండు నెప్పుడున్॥ 49

వ॥ కుశద్వీపేశ్వరుండైన జ్యోతిష్మంతునకు ఉద్భిదుండును, వేణుమంతుండును, స్వరథుండును, లంబనుండును, ధృతియును, ప్రభాకరుండును, కపిలుండును, ననేడ్వురు కొడుకులుదయించిరాజులైరి. వారిపేరన సప్తవర్షంబులయ్యె. విద్రుమంబును, సోమశైలంబును, ద్యుతిమంతంబును, పుష్పవంతంబును, కుశేశయంబును, హరియును, మందరంబును, ననేడు పర్వతంబులు, ధూతపాపయు శివయు, పవిత్రయు, సమతియు, విద్యుద్దంభయు, మహియు, అన్యయు, అనఁగ్రమంబున నేడువర్షంబులందు నేడునదులుకలవు. దమన, శుష్మనస్, స్నేహ, మందేహసంజ్ఞలంగల బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులు, స్వకర్మనిరతులై, అనపేక్షితకర్మఫలులై, బ్రహ్మరూపకుండైన జనార్దనుయజింతురు. 50

క॥ అలఘుఁ శ్రేద్వీపము తా, వెలయుఁ గుశ స్తంబసంజ్ఞ వినుతత్కుశమున్ ।
చెలువొందును నాలుగుల, క్షలయోజనముల మితమున గణుతింపంగన్ ॥ 5:

సీ॥ అష్టలక్షయోజనాతి విస్తారమై, తగుఘృతాబ్ధి వెలయు దానిఁజుట్టి ।
యాఘృతాబ్ధిఁ బుట్టియవల క్రౌంచద్వీప, మనఁగద్వీపమమరు, మునివరేణ్య॥5:

వ॥ ఆక్రౌంచద్వీపంబు షోడశలక్షయోజన విస్తారంబై వెలయు, క్రౌంచద్వీపేశ్వరుఁ
డైన ద్యుతిమంతునకుఁ గుశలుండును, మనుగుండును, ఉష్ణుండును, పివరుఁ
డును, అంధకారుండును, మునియు, దుందుభియును, ననునేడ్వురుపుత్త్రుల
పుట్టి క్రౌంచద్వీపంబునకు రాజులైరి. వారిపేరిట సప్తవర్షంబులై, దేవ
గంధర్వసేవితంబులయ్యె. క్రౌంచంబును, వామనంబును, అంధకారంబును
రత్నశైలంబును, దేవ్రోత్పత్తియు, పుండరీకవంతంబును, దుందుభియును నః
నేడువర్షాచలంబులు పరస్పరద్విగుణంబులై యుండు. ఈవర్షంబులయంద
వర్షాచలంబులయందు, దేవసమానులై జనులు నిరాతంకులై యుండుదురు
గౌరియు, కుముద్వతియు, సంధ్యయు, రాతియు, మనోజవయు, జ్యోతియు
పుండరీకయు ననునేడువర్షనదులుగలవు. మఱియు క్షుద్రనదులు సహస్ర
సంఖ్యలుకలవు, పుష్కరపుష్కల ధన్యాఖ్యాతసంజ్ఞలంగలిగి చాతుర్వర్ణ
జనంబులు వెలయుదురు. 5

శా॥ ఎంచన్ శక్యముగాని వైభవముతో నిజ్యావిశేషంబునన్
చంచద్భక్తితలిర్పఁగాఁ గొలుతురిచ్ఛాపూర్తివర్ధిల్లగా ।
ప్రాంచల్లీలల రుద్రరూపుఁడగు పద్మాధీశ్వరున్నిత్యమున్ ।
క్రౌంచద్వీపనివాసులౌ జనులునిర్ద్వంద్వత్వయుక్తాత్ములై ॥ 5

వ॥ షోడశలక్షయోజన విస్తారంబైన దధిసముద్రంబా క్రౌంచద్వీప ధరణింజు
యుండు. ఆవల ద్వాత్రింశల్లక్ష యోజనవిస్తారంబై శాకద్వీపంబాదధిసమ
ద్రంబుఁజుట్టియుండు శాకద్వీపేశ్వరుండైన భవ్యునకు జలజుండును, కుమ
రుండును, సుకుమారుండును, మరీచకుండును, కుసుమోత్కరుండును, మోద
రియు, మహాద్రుమ్రుండును ననేడువురుపుత్త్రులుపుట్టి శాకద్వీపంబునకు రా
లైరి. వారిపేరనాద్వీపంబున సప్తవర్షంబులయ్యె. ఉదయగిరి, జలాధారంబ
రైవతరశ్యామంబు, అంభోగిరి, అంచికేయంబు, రమ్యంబు, కేసరి, అనియె
మర్యాదాపర్వతంబులుగలవు. తద్ద్వీపమధ్యంబున సిద్ధగంధర్వసేవితంబై
సర్వాహ్లాదకరంబైన, శాకవృక్షంబు వెలయు, తన్నామంబునంగదా య
ద్వీపంబు శాకద్వీపంబనంబరఁగె. అందుఁబుణ్యాజనపదంబులు వెక్కుకలవు. సు
మారి, కుమారి, కధిని, వేణుక, ఇక్షు, ధేనుక, గభస్తి, అనునామంబ

లంగల సప్తనదులుగలవు. మఱియుం దక్కిన క్షుద్రనదులును, గిరులును,
అయుతసంఖ్యలుకలవు. ఈవర్షంబులు స్వర్గతుల్యంబులై, ధర్మసమేతంబులై
యుండు. మద్ర, మగధ, మానస, మందగసంజ్ఞలంగలిగి క్రమంబున
బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు ధర్మోపేతులై వర్తిల్లుదురు. 55

క॥ శ్రీకాంతాధీశుఁడు, సూ, ర్యాకృతిధరుఁడగుచు నధ్వరార్చితుఁడగుచు।
శ్లోకులగుమానవులచే, శాకద్వీపంబునందు సౌజన్యనిధీ॥ 56

సీ॥ ఋషివర ముప్పదిరెండు లక్షలయోజ, నముల వెడల్పున నమితమహిమ।
గలదుగ్ధవార్ధి శాక ద్వీపధరఁజుట్టి, పొలుపొందు నవ్వలపుష్కరాఖ్య।
మైనద్వీపముగల దఱువదినాలుగు, లక్షలమితమున శ్లాఘ్యమగుచు।
తద్ద్వీపపతియగు ధార్మికాగ్రణిసవ, నుండు పుత్రకులుసన్నుతచరితుల॥ 57

గీ॥ నిరువురినిగాంచి వారికినిచ్చెద్వీప, మమ్మహాత్ములపేర దివ్యంబులైన। [ణ్యా॥
వర్షములురెండు వెలయుపావనములౌచు, వినుము తన్నామధేయముల్వివరికే

వ॥ మహావీరుండును, ధాతకియు ననవారిపేర పుష్కరద్వీపంబున మహావీరవర్షం
బును, ధాతకివర్షంబును ననంబరఁగె. ఆరెండువర్షంబులనడుమ లక్షయునేబది
వేలయోజనంబులపొడవును, నంతియ వెడల్పును, నై, మానసోత్తరంబును,
వర్షపర్వతంబు పుష్కరద్వీప మధ్యంబున నుభయవర్షంబులకు, మర్యాదా
చలంబై మండలాకారంబున నుండు. దానియుభయపార్శ్వంబులంగదా
దుగ్ధాబ్ధిచుట్టున మహావీర ధాతకి వర్షంబులు వలయాకారంబులైయుండు.
అందు మానసోత్తర బాహ్యంబున మహావీరవర్షంబును, మానసోత్తరంబు
నకు నివ్వలిభాగంబున ధాతకివర్షంబునునుండును. అందలి జనులు నిరామయు
లును, నిర్వికారులును, రాగద్వేషవర్జితులును, నుత్తములును, ఈర్ష్యాసూయా
భయ, క్రోధ, దోష, లోభాదివర్జితులునునై పదివేలేండ్లు బ్రతుకుదురు.
ఆవర్షద్వయంబునందును, నదులును, శైలంబులును లేవు. వర్ణాశ్రమంబు
లును, వర్ణధర్మంబులును, త్రయీ, వార్తా, దండనీతి, శుశ్రూషలును లేవు.
భౌమస్వర్గంబనంబరఁగునందు దేవతుల్యులై జనులువర్తిల్లుదురు. 58

ఉ॥ ఓధరణీసురప్రవర! యొప్పగు నాపెనుదీవినొక్కన్య
గ్రోధము వ్యోమయానగతి రోధసిరోధక విస్ఫురన్మహో
చ్ఛేదముదానియందు సరసీరుహగర్భ నివాసమొప్పు శో
భాధరితాఖిలామరవిహార నిశాంతనితాంత కాంతియై॥ 59

వ॥ చతుష్షష్టిలక్షయోజన విస్తారంబున స్వాదూదక సముద్రంబా పుష్కరద్వీపం
బుంజుట్టియుండు. ఇవ్విధంబున సప్తద్వీపంబులును, సప్తసముద్రంబులచేత

నావృతంబులై యుండు, ద్వీపసముద్రంబులుత్తరోత్తరద్విగుణంబులై
యుండు. 60

చ॥ శమగుణభూషణా! వినుము సర్వపయోధులనీరు తారకా
రమణుఁడు పూర్వశైల శిఖరంబునఁ దోఁచిన సప్తశైల శృం
గముకొనకేగినన్ గడఁగిగాఢతరస్థితి పొంగుఁ గ్రుంగుని
త్యము శితకృష్ణపక్షములయందు నమందతరాద్భుత క్రియన్॥ 61

వ॥ చంద్రోదయాస్తమయంబుల సముద్రోదకంబులు వెయ్యిన్నైనూరు అంగుళంబుల పొడవు పొంగుచుం గ్రుంగుచునుండు. పుష్కరద్వీప నివాసులకు షడ్రసోపేతంబులైన భోజనంబులు తలంచినంతన తనకుఁదాన సంభవించు. స్వాదూదకసముద్రంబునవ్వల ఈ భూమండలికి నినుమడియై యేజంతువులును లేనికాంచనభూమికలదు. దానియవ్వల పదివేలయోజనంబుల వెడల్పునంతియ పొడవునుండగ వలయాకారబున లోకాలోక పర్వతంబుకలదు. అదితమోవృతంబై యుండు. ఇవ్విధంబున॥ 62

క॥ పంచాశత్కోటిసను, భ్యంచితయై భూతధాత్రి బరఁగుచు నుండున్।
చంచద్ద్వీపాంబుధిగిరు, లెంచందనమీఁదనుండు నిద్ధప్రతిభన్॥ 63

గీ॥ వినుముమునినాథ డెబ్బదివేలయోజ, నములదశమిమ్మహీస్థలి యమితభూత।
కోటికాధారమై యుండుహాటకాంబరునివిలాసంబిగంతయునని యెఱుఁగుము॥

శా॥ భూవిస్తారసముచ్ఛ్రియంబు లతివిస్ఫూర్జద్గతిం జెప్పితిన్
ప్రావీణ్యంబలరారఁగావినఁదగున్ పాతాళవిస్తారమున్।
శ్రీవైచిత్ర్యములందు దైత్యదనుజశ్రేణీభుజంగేంద్రులి
చ్ఛావృత్తి న్విహరింపు చుండుదురు శశ్వద్భోగ భాగ్యాఢ్యులై॥ 65

వ. అతలంబు, వితలంబు, నితలంబు, గభస్తిమంతంబు, మహాంబు, సుతలంబు, పాతాళంబునన నేడుభేదంబుల నొక్కటొక్కటి దశసహస్రయోజన పరివృతంబై యుండు॥ 66

ఉ॥ భూరివివేకపాక! కనఁ బొల్పగునందుల శుక్ల కృష్ణపీ
తారుణవర్ణయుక్తిగల యద్రులు, భూములు, స్వర్ణరత్నశృం।
గారసమేత సౌధములు కాంచనపుణ్యవనీనదీసర
స్సారససారసౌరభ వశంవదసన్మద షట్పదంబులన్॥ 67

క॥ లీలమెయినారదుఁడు పాతాళంబుననుండి దేవతాపురికిసము।
ద్వేలగతి వచ్చియింద్రుం, డాలింపఁగఁ జెప్పెనచటియతివై భవముల్॥ 68

సీ॥ ఆహ్లాదకారి శుభ్రాంచితమణులదా, నవదైత్యనాగకన్యా శతముల ।
గీతవాదననృత్యకేళుల గంధమా, ల్యానులేపన భూషణాంబరముల ।
ప్రాజ్యశ్రీసద్భక్ష్య భోజ్యపానంబుల, హంసశోభిత కమలాకరముల ।
కీరపుంస్కోకిలాధార వనంబుల సనుపమక్రీడా మహాచలముల ॥

గీ॥ బహుళతరభాగ్య భోగ్యసంపదలనధిక, వైభవస్ఫూర్తుల, సువర్ణవాసములను ।
ప్రబలిపాతాళలోక ముల్పరిహసించు, సారెసారెకుఁ గేరుచు స్వర్గపురిని ॥ 69

వ॥ ఆలోకంబుల సూర్యచంద్రతమఃప్రసారంబును, కాలకరణయు లేదు, దాని క్రిందట ॥ 70

సీ॥ తనఫణాతతులనిద్ధపుమణిద్యుతిపరం, పరలు బాలారుణ ప్రభలసీన ।
తనమహోన్నత దీర్ఘతనుకాంతసంపూర్ణ, స్ఫూర్తియ శశివిభాస్ఫూర్తిఁజూప ।
తనవిశాలాంతరీయ నవీనచాకచ, క్యముక్రమ్మ కటిక చీకటులుచూప ।
తనమహానిశ్వాసధారా ప్రవాహముల్, విలయజంఝామరుత్కలనఁ దెలుప ॥

గీ॥ తరళహారము లురమునఁ దారశైల, లుఠదమరవాహినీ ప్రణాళులనదల్ప ।
తామ్రరసనేత్రు తామసతనువనంతుఁ, దుర్వారాస్థలిఁ దలఁదాల్చియుండు నెపుడు॥

చ॥ ముసలహలాభిశోభిత సమున్నత దోర్యుగుఁ డేకకుండలో
ల్లసనలసత్కపోలుఁడచల, స్వఫణాగ్ర మణీగణప్రభా
ప్రసరణరంజితాఖిలధరావలయుండు లయుండనంతుఁ
డుప్పసముగఁదాల్చు నీభువనపంక్తులతోడి యజాండ భాండమున్ ॥ 72

చ॥ మునివరుఁడైన గర్గుఁడుసమున్నతిఁ దత్పదపంక జాతముల్
మనమునఁగొల్చి జ్యోతిషిక మార్గమనర్గళ బుద్ధిచే నెఱిం
గి నెఱినిమిత్తవేదియనఁ గీర్తితుఁడై దగెఁదన్మహత్త్వమిం
పెనయననంత మాకతన నెంతురనంతుఁడటంచు సన్మునుల్ ॥ 73

చ॥ అలఘుతరత్వలీల విలయావసరంబునఁ దన్ముఖాగ్నికీ
లలఁజనియించి రుద్రుఁడు చెలంగి జగత్త్రయ జంతుజాలమున్ ।
బలువిడిమ్రింగుఁదన్మహిమపద్ధతి వేదములైన నెన్నఁగాఁ
గలవె తదీయకీర్తనము కల్మషనాశముగాదె సువ్రతా ॥ 74

వ॥ ప్రళయకాలవ్యాజృంభమాణానంత ముఖపరంపరా సముద్భూత జాతవేదశిఖా నిష్క్రాంతి సమున్నిద్రుండగు రుద్రుండుసంకర్షణాత్మకుండై జగత్త్రయంబును మ్రింగునని చెప్పిశ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె ॥ 75

గీ॥ అవలజముని క్రిందనను వ్రేందనరక వాసములు పెక్కుగలవు సంయమీంద్ర ।
అందుపాప నిరతులౌ జనంబులు వసింతురు దురంత ఘోరదుఃఖులగుచు ॥ 76

వ॥ అవియు రౌరవంబును, సూకరంబును, రోధంబును, తాలంబును, విశసనం
బును, మహాజ్వాలంబును, తప్తకుంభంబును, లవణంబును, విలోహితంబును,
రుధిరాంభంబును, వైతరణియు, క్రిమిశంబును, క్రిమిభోజనంబును, అసిపత్ర
వనంబును, లాలాభక్షంబును, పూయపానంబును, వహ్నిజ్వాలయు, అధశ్శి
రంబును సందంశంబును, తమంబును, అవీచియు, శ్వభోజనంబును, అప్ర
తిష్టంబును, సంవీచియు, మొదలైన నరకంబులు, భృశదారుణంబులు, శస్త్రా
గ్నిభయదాయకంబులునై, పెక్కుకలవు, అవియు, యమశాసనాధీనంబులై
యుండు॥ 77

సీ॥ పక్షపాతితఁ గూటసాక్షి పల్కిన దురాచారుండు ప్రాపించు రౌరవంబు ।
భ్రూణహత్యాకారి పురహంత గోహంత, నిలుతురు రోధమన్నిరయమునను ।
మధుపవిప్రఘ్న హేమస్తేనులను విరిజోకయు బడుదురు సూకరమున ।
క్రొవ్వునఁ గోడలిఁ గూతును గదిసినవాఁడు మహాజ్వాలవాసియగును ॥

గీ॥ క్షత్రకులజుని వైశ్యునిఁ జంపినతఁడు, భగినిగలిసినవాఁడును భటునిఁ జంపి ।
నతఁడు గురుతల్పగుండును నధివసింతు రురుభయదతప్తకుంభాఖ్య నరకవసతి ।

క॥ గురులకు నవమతిచేసిన గురుపాపుఁడు వేదనిందకుఁడు తత్క్రియకా ।
ర్యరతుఁ డగమ్యన్ బొందిన నరుఁడును బోవుదురు లవణనరకంబులకున్ ॥ 79

వ॥ మర్యాదాదూషకులు, దేవద్విజపితృద్వేషులు, రత్నదూషకులును, క్రిమిభక్ష
ణంబునంబడుదురు. దురిష్టకర్తలు క్రిమిశంబునంబడుదురు. దేవ, పితృ, సుర
లకిడక భుజియించువారును, లాలాభక్షణంబునంబడుదురు. శరఖడ్గాదికర్తలు
విశసనంబునంబడుదురు. అసత్ప్రతిపాదకుండును, అయాజ్య యాజకుండును
నక్షత్రసూచకుండును, పంక్తివారికిడక తాను మృష్టాన్నంబు భుజియించు
వాడును, లాక్షా, మాంస, రస, తిల, లవణ, విక్రీతయయిన బ్రాహ్మణుండును
నధోముఖ నరకంబునంబడుదురు. మార్జాల, కుక్కుట, చ్ఛాగ, శునక,
వరాహ, విహంగంబులం బెంచినవారు దానియందబడుదురు. రంగోపజీవియు
కైవర్తుండు, కుండాశియు, గరదుండును, సూచకుండు, మాహిషకుండును
పర్వగామియు, గృహదాహకుండును, మిత్రఘ్నుండును, శాకునియు, గ్రామ
యాజకుండును, సోమవిక్రీతయు, తుదకాఖ్య నరకంబునంబడుదురు. మఖ
హంతయు, గ్రామహంతయు, వైతరణింబడుదురు. ధనయౌవనమత్తులై
మర్యాదతప్పినవారును, అశౌచులును, కుహనాజీవులును, కృష్ణాఖ్య నరకంబు

సంబడుదురు. వనంబులు నరుకువాఁడు అసిపత్త్రవనంబునంబడు. గోఘాతియ
లనేలు వాఁడును, మృగవధాజీవియు, వహ్నిజ్వాలాఖ్యంబునం బడుదురు.
మఱియు ననేకవిధ పాపకర్ములనేకవిధ నరకంబులంబడి యధోముఖులై
దుఃఖించుచు దేవతలంజూచుచుందురు. దేవతలును, నధోభాగంబున నర
కమగ్నులగు నానరులంజూచుచుందురు॥ 80

గీ॥ స్థావరంబులు క్రిములు నబ్జములు పక్షు లఖిలపశువులు నరులు ధర్మాభిరతులు।
త్రిదశులును ముముక్షులును నన తెలియవరుస నొక్కటొక్కటికి సహస్రభాగోన్నతములు॥

క॥ వినుజంతుతతులు ముక్తికి జనునంతకు నిలువవలయు స్వర్గనివాసం।
బునరకవాసమున నిట్లని చెప్పిరి బ్రహ్మవేత్తలైన మునీంద్రుల్॥ 82

సీ॥ అఘములు చేసి ప్రాయశ్చిత్తవిముఖుఁడై, నరుఁడు ప్రవేశించు నరకవసతి।
పాపంబుకొలఁది నేర్పఱచిరి ధరణిఁ బ్రాయశ్చిత్తవిధులు మన్వాదిమునులు।
జనుఁడు పశ్చాత్తాపసంసక్తుఁడై హరిం, దలపోయఁ జెడని పాతకము కలదె।
సకలతపఃకృచ్ఛ్రసముదయాత్మకములై, వెలయు ప్రాయశ్చిత్తములకునెల్ల॥

గీ॥ పరమముదుస్తరదురిత భీకరము, పుణ్యాకరము, సౌభాగ్యసంపదాకరము, సౌఖ్య।
కరము, శ్రీకృష్ణవిభునామవరము, దలఁపమునివర తదీయమహిమ యేమనఁగవచ్చు॥

క॥ రేపును మాపును పగలును శ్రీపతి నారాయణుని నశేషజగద్ర।
క్షాపారీణుని నరుఁడు దీపితగతిఁ దలఁచి పాయు తీవ్రాఘములన్॥ 84

శా॥ శ్రీవిష్ణుస్మరణానుభావమున, సంక్షీణాఘుఁడై ముక్తికిన్
బోవంబూనిన మానవప్రోత్తమున కింపుల్ జూపునాకాదిలో।
కావాసంబు దలంచిచూచిన ఘనంబౌ నంతరాయమ్మును
విప్రా వాచంయమివర్య! యార్యులమతం బీచందమూహించినన్॥ 85

మ॥ జపహోమార్చనముఖ్యకర్మముల కంసధ్వంసిపై చిత్తము
చ్చ్రపడన్నిల్పి యనల్పహర్షమున మించుల్చూపు పుణ్యుండు స్వ।
ర్గపతిత్వాదిఫలంబునైనఁ గడువిఘ్నంబంచు భావించు మో।
క్షపదప్రాప్తిమహాఫలంబునకు యోగప్రస్ఫురన్మానసా॥ 86

గీ॥ అపునరావృత్తి మోక్షదాయకము వాసు, దేవమంత్రజపంబు, భూదేవవర్య।
దానితో సరిపోల్పఁగాఁ దరమె, సుకృత, మరుగఁ జెడిపోవు నాకపృష్ఠాతిశయము॥

సీ॥ కావున రేయుఁబగలును శ్రీవిష్ణుసం, స్మరణంబొనర్చుచు నరుఁడు సకల।
కలుషనిర్ముక్తుఁడై కనఁడెన్నఁడును నర, కములు పుణ్యము పాతకమ్మునఁగ।

స్వర్గనరకములసంజ్ఞలు సుమ్ముస్వ, ర్గము మనస్సంతోషకరము, దుఃఖ ।
కరమునరకము స్వర్గమునకు నరకము, నకుఁ గారణములు మనంబునువ్వె ॥

గీ॥ జ్ఞానపుణ్యామనస్కుఁడై కమలనేత్రు, ననుదినంబును మదినెన్నుకొనుచునుండు ।
జనుఁడునరకంబునకుఁ బోక శాశ్వత ప్రభానహరిలోకవాస వైభవముఁగాంచు ।

వ॥ విద్యావిద్యల, జ్ఞానాజ్ఞానపర్యాయంబులందు నరకప్రాప్తికారిణియైన యవి
ద్యంబరిహరించి నిఖిలశ్రేయస్సంపాదినియైన విద్యనాశ్రయించవలయు. ఇవ్వి
ధంబునసశైల, సాగర, సరి, ద్వీప, కాననంబైన భూమండలమందును, సర్వ
పాతాళంబును, నరకంబులును, సంక్షేపరూపంబునంజెప్పితి. అనిచెప్పి భువ
ర్లోకాదిలోకంబులు వినఁగోరు మైత్రేయునకు శ్రీపరాశరుం డిట్లనియె. 89

మ॥ రవిచంద్రప్రచుర ప్రభాపటలిచే రంజిల్లి సద్వీపశై
లవనాంభోనిధియైన భూమికివిశాలత్వంబు తానెంత యెం ।
తవిశాలత్వము యాకసంబునకుఁ జోద్యంబై ప్రవర్తిల్లు ని ।
ట్లవధానంబున నాత్మలోఁ దెలియు దివ్యజ్ఞానభవ్యాశయా ॥ 90

సీ॥ ఉర్వీస్థలమునకు నొక్కయోజనలక్ష, మున సూర్యుఁడుండు సోముండు రెంట
మూఁటనక్షత్రసమూహంబు లేనింట, సౌమ్యుఁ డేడింటరాక్షస గురుండు ।
తొమ్మిదింట ధరాసుతుఁడు పదునొక్కట,సురమంత్రి పదుమూఁటసూర్యసుతుఁడు
పదునాలుగింట సప్తర్షి మండలమువ, దేనింట నలఘుఁడౌత్తానపాది ॥

గీ॥ ఉగ్రకరునకుఁ బదివేలయోజనముల, క్రిందవిపరీతగతి రాహుకేతువసతి ।
యివ్విధంబున గ్రహములు ఋక్షములును, దివిప్రవర్తిల్లుకమల సంభవకులీన

క॥ సకలజ్యోతిశ్చక్రము నకుమేఢీభూతుఁడగుచునభమున ధ్రువుఁడు ।
త్సకతన్వర్తిలుచుండుం బ్రకటితతేజోవిరాజమానుండగుచున్ ॥ 9

క॥ తెలియఁగయజ్ఞఫలంబున నలవడునీభూమి దీనియందునె యజ్ఞం ।
బులును ప్రతిష్ఠితములగు జలజాక్షుండె యిన్నిజగములువిప్రా ॥ 9

క॥ ధ్రువునికి నూర్ధ్వంబున, భవ్యవిభవమునఁబొగడుగను మహర్లోకము, వి ।
ప్రవర ! యొకకోటిపొడవున నవిరళగతికల్పవాసులందుందురోగిన్ ॥ 9

చ॥ అటకు, ద్వికోటియోజనసమంచితమాజనలోకమందు ను
త్కటమతులౌపితామహసుత ప్రవరుల్ సనకాదులుందురు ।
చ్చటుల వివేకపాకవిలసద్విమలాశయు లాత్మమానస
స్ఫుటసరసీజసౌధతల సుస్థితపంకజమందిరాసఖుల్ ॥ 9

క॥ జనలోకమునకునవ్వల నొనరుఁ జతుష్కోటియోజనోత్సేధమునన్ ।
వినుతతపోలోకము సజ్జనసేవితమై రాజదేవసంఘ వసతియై ॥ 96

వ॥ సూర్యకిరణ దాహవర్జితులై వైరాజనామధేయ దేవత లా తపోలోకంబున
నుండుదురు॥ 97

గీ॥ అనుపమంబై తపోలోకమునకుమీఁద నాఱుకోట్లయోజనమున సతులగతులఁ ।
బొగడుగనుసత్యలోకమద్భుతవిభూతియదియె బ్రహ్మలోకంబునదయహృదయ॥

వ॥ ఆసత్యలోకంబున నపునర్జాతకులు వసియింతురు॥ 99

క॥ పాదాభిగమ్యమైభువి నేదివెలయుచుండు దానినెఱుఁగుమునీన ।
త్యాదృతిభూ[illegible] భూ[illegible] [illegible] ॥ [illegible]

వ॥ ఆ భూ [illegible]
[illegible]॥ [illegible]

కం॥ మునిసిద్ధసేవితంబై యనఘంబై భూదివాకరాంతర్గతమై
వెనుపొందు భువర్లోకం బనవద్య ద్వితీయలోకమదియేసుమ్మీ ॥ 102

క॥ రవిమండలంబుమొదలుగ ధ్రువమండలిదాఁక, పెంపుతో వెలయుముని ।
ప్రవర! చతుర్దశలక్షము సువరాహ్వయలోక మఖిలసురసేవ్యంబై ॥ 103

సీ॥ భూర్భువస్స్వర్లోకములు మూఁడుకృతకముల్, జనతపస్సత్య సంజ్ఞములుమూఁడు।
నకృతకంబులు, కృతకాకృతకముమహ ర్లోకంబు, విను మునిలోకవినుత ।
యిట్లుమీఁదేడు క్రిందేడులోకంబులు, నమరుబ్రహ్మాండ మధ్యముననట్టి ।
యండంబుమీఁబైట సప్తావరణంబులు, దశగుణోత్తరములై తనరునవియు ॥

గీ॥ జలదహనమారుతాకాశములునహంక్రి, యామహత్ప్రకృతులుఁజుమ్మునీమదినిది।
దలఁచుము, కపిత్థబీజసంతతులఁ గప్పు చిప్పచందంబుగాఁగ, నూర్జితవివేక ॥104

క॥ అల కృతకాకృతకాఖ్యం, గలలోకము శూన్యమునను గల్పాంతమునన్ ।
పొలుపరి, చెడునత్యంతః, ప్రళయంబుననది వివేకపాకనిధానా ॥ 105

గీ॥అకృతకంబులుమూఁడునత్యంతవిలయ, సమయముననాశమొందుసంయమివరేణ్య
కృతికములుమూఁడుకల్పాంతహతములగును, తెలియుమవ్విధమెల్లనందియముదీర॥

వ॥ ఆబ్రహ్మాండంబునకు దశగుణోత్తరంబులై సప్తావరణంబులుండు. అనంతంబగు
ప్రధానంబున కంతంబులేదు. ఆప్రధానంబుకదా సమస్తంబునకు హేతుభూ
తమైన ప్రకృతియనంబరఁగు. ఆప్రకృతియందుఁగోట్ల్యయుత సంఖ్యాతంబులైన
యండంబులావృతంబులై యుండు. దారువునందునగ్నియు తిలలయందు తైలం

బునుబోలి, ప్రకృతియందుఁ బురుషుండు వ్యాపించి చేతనాత్ముండై యుండ
ఈప్రధాన పురుషులిద్దరును నన్యోన్యంబులుం గూడి సర్వభూతాత్మభూతయై
విష్ణుశక్తినాశ్రయించి పృథక్సంశ్రయంబులై యుందురు. సర్గకాలంబునఁ బ్రధా
పురుషక్షోభకారిణియై విష్ణుశక్తి వెలయు. ఆవిష్ణుశక్తియ ప్రకృతిపురుషాత్మక
బైన జగంబువహించియుండు. విష్ణుశక్తిసంక్షోభితంబులగు ప్రకృతిపురుషు
వలన మహదాదులు పుట్టు. వానివలన సురాసురాదులు పుట్టి వారిపుత్రపౌ
పరంపరలవలన జగంబు పూరితంబయ్యె. బీజంబువలన వృక్షంబుపుట్టి తత్పర
పరలవలన వృక్షషండంబు నిండునట్లు సర్వబీజభూతుండైన శ్రీవిష్ణునివలన జగ
బులు పుట్టెంగావున నిజ్జగంబు శ్రీవిష్ణుమయంబు ॥ 10

గీ॥ క్రతువుకర్తయుఁ గ్రియయునుకర్మఫలము, సకలమంత్రంబులుసృగాదిసాధనముల
అరసిచూచినపుండరీకాక్షుఁడనుచు, నాత్మఁదలఁచుమునిజముసంయమివరేణ్య

వ॥ అనిచెప్పి శ్రీపరాశరుం డిట్లనియె॥ 10

క॥ విను భానుని యరదము మిం, టనుదొమ్మిదివేల యోజనంబులు పరమై ॥
వెనుపగు నీషాదండము, కనఁదగుఁద ద్విగుణమగుచు గాఢవివేకా ॥ 11

వ॥ ఆసూర్యుని రథంబు క్రిందట నీషాదండంబునందగిలి నూటయేఁబది • యేఁ
లక్షల యోజనంబుల వెడల్పై చక్రంబు వెలయు త్రినాభికంబును, బంచా
రంబును, షణ్ణేమికమును, అక్షయాత్మకంబును, సంవత్సరమయంబును నై, కా
చక్రంబు దానియందు బ్రతిష్ఠితంబగు. యుగంబునకుఁ బ్రథమాక్షంబు
హ్రస్వంబును ద్వితీయాక్షంబు దీర్ఘంబునునై యుండు. అందుయుగార్ధంబు
నందగిలి హ్రస్వాక్షంబు, ధ్రువునకు నాధారంబై యుండు. ద్వితీయాక్షంబు
యుగార్ధంబునందగిలి చక్రసంయుగంబై మానసోత్తరంబునం బ్రవర్తిల్ల
నలుబదేనువేలున్నేనూరు యోజనంబులు ద్వితీయాక్షప్రమాణంబు. ఉభయ
యుగార్ధంబుల ప్రమాణంబును నక్షప్రమాణంబును నక్షప్రమాణం
గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, పంక్తియనియెడు ఛందంబు
లేడును సూర్యుని యరదంబులకు నశ్వంబులయ్యె॥ 11

సీ॥ పాకారినగరి పశ్వోకసార, యనంగ, వివిధసంపదలచే వెలయుచుండు।
యమరాజునగరి సంయమని, సమాఖ్య వి, స్ఫురితవైభవములఁ బొగడుఁగాంచ
అబ్ధీశునగరి సుధాభిధాన, యనేక, భోగభాగ్యముల విస్ఫూర్తిఁగాంచు
కౌబేరినగరి యోగ్యత విభావరి, యన, నిరుపమసౌఖ్య భాసురతఁగాంచు ॥

గీ॥ మానసోత్తరగిరికిఁ గ్రమమునఁ దూర్పు, నందు దక్షిణదిశయందు నబ్ధినాథు
దిక్తటాంతంబునందు నుదీచియందు, నతుల సద్గుణ గణ్య సంయమివరేణ్య ॥

శా॥ భాతిం దూర్పునుండి దక్షిణదిశా ప్రత్యగ్దిశో దగ్దిశా
స్ఫీతద్యోత వితానుఁడై పటుధనుఃక్షిప్తాశుగా శుక్రియల్ ।
చేతో హ్లాదముగాఁ బ్రదక్షిణముగాఁ జిత్రస్థితిం ద్రిమ్మరున్
జ్యోతిశ్చక్ర సమేతుఁడై యెపుడు ఖద్యోతుండు విప్రోత్తమా ॥ 113

వ॥ అహోరాత్ర వ్యవస్థాన కారణంబు భగవంతుండైన హరియకానెఱుంగుఁడు. ఉత్తరాయణంబు యోగులకు సకలక్లేశ సంక్షయకరంబైన దేవయానపథంబగు మార్గంబు. సర్వకాల ప్రభావుండగు సూర్యునకు నుదయాస్తమయంబులు లేవు. ఏదీవివారి కెచటంగానంబడియె నాదీవివారి కచట నుదయంబు ఎచ్చటం గానం బడక యుండునది యస్తమయంబు. దర్శనాదర్శనంబుల, యుదయాస్తమయంబులు. అర్కుండు శక్రాదుల పురంబుననుండి పురత్రయంబు స్పృశింపుచుంజను. పురోభాగంబెంత దవ్వుతపించు పృష్ఠపార్శ్వభాగంబుల యందు ననంత మేర తపించు. ఊర్ధ్వభాగంబున మేరూపరిభాగమ్ముననున్న బ్రహ్మసభందపింపలేఁడు. బ్రహ్మసభా తేజః ప్రతిహతంబులై సూర్యకిరణంబులు మగుడంబడు వినుము॥ 114

చ॥ రవికిరణంబు లెప్పుడును రాత్రులయందు హుతాశుకీలలన్
దలిరి వెసించు నట్లన పదంపడి వహ్నియుభానుఁ జెందుతా ।
దివములయందు నట్లగుటదీధితి రేలుఁబగళ్లు వహ్నికిన్
రవికిని మిక్కుటంబగు సనాతనధర్మధురీణవర్తనా ॥ 115

వ॥ అగ్ని సూర్యులు పరస్పరాను ప్రవేశంబున నాప్యాయనంబు నొందుదురు. ఉత్తరాయణ దక్షిణాయనాత్మకంబగు సంవత్సరంబు దేవతలకు నొక్కయహోరాత్రంబగు. అందు. 116

ఉ॥ తుంబురు నారదాదులతి దోహలులై తన కీర్తిపాడ ది
వ్యాంబుజలోచనాశతములాడ జగంబులు వేడ్కఁగూడన ।
య్యంబరమధ్యవీథిఁ గమలాప్తుఁడు ద్రిమ్మరునంశుమండలీ
చుంబిత సర్వదిక్కుఁడగుచున్ వడిఁగుమ్మరిసారెకై వడిన్ ॥ 117

వ॥ ఉష్ణకరుఁడుత్తరాయణం బొందునపుడు,మకరమునకేగునంత కుంభంబునొందు। మీనమేష వృషంబుల కానుపూర్వి నరుగు,నామిాఁదమిథునంబునాశ్రయించు॥

ఉ॥ కర్కటకంబుద్రొక్కి కుతుకంబుదలిర్పఁగ సింహకన్యలం
దార్కొని, త్రాసుపై నిలిచి తాలిమి వృశ్చికచాపయుక్తుఁడై ।
అర్కుఁడు దక్షిణాయన పథాధ్వరణమ్మునఁ ద్రిమ్మరున్ శుభో
దర్కగతిం, గ్రమాన్వయము దప్పక చెప్పఁగరాని వేడుకన్ ॥ 119

పంచచామరము॥ కొలందిగా ధ్రువుండు మేరుకూటలగ్నకాలచ
క్రలాలితాక్షరూఢుఁడై వికాసమొప్పఁ ద్రిమ్మరున్ ।
కులాలచక్రనాభియందుఁ గూర్చినట్టి మంటిము
ద్దలాగునన్ నిరంతరంబు తత్స్థలంబునందగున్ ॥ 120

వ॥ అయనద్వయంబునందును మార్తాండుండు శీఘ్రమందగతుల నడచుకతంబున
నహోరాత్రులల్పంబులును, నధికంబులును నై నడచు ॥ 121

సీ॥ పంకజగర్భు శాపంబునఁ బ్రత్యహం, బును మృతిఁబొందుచుఁ బుట్టుచున్న ।
నిరుపమోద్ధతులు మందేహాభిధానరా, క్షసులుసంధ్యలవచ్చి సవితుఁబట్టి ।
మ్రింగ నూహింతురు మేదినీసురులునం, ధ్యోపాస్తిసేయుచు నర్ఘ్యవిడుచు ।
మేదురప్రణవసమేత గాయత్ర్యభి, మంత్రితార్ఘ్యాంబువుల్ మహితవజ్ర ॥

గీ॥ ధారలై తాకి దైత్యుల తలలుద్రుంచు, మగుడిసంధ్యలఁబుట్టి యిమ్మాడ్కిఁజత్తు ।
రాతతాయులువారు నిత్యంబునిట్లు, అహిమభానునినడక బ్రాహ్మణవరేణ్య ॥122

ఉ॥ ఆదినివహ్నినిండె ప్రథమాహుతిచేఁ బరితుష్టినొందు ఛా
యాదయితుండు, దాన, దివిజారులడంగుదు రట్లుకానఁబ ।
ద్మోదరమూర్తిభానుఁ గరుణోదధి సంధ్యలఁ గొల్వఁగా దగున్
కా నికొల్వఁడేవ్వఁడు వికర్తన హంతయతండ ధారుణిన్ ॥ 123

వ॥ ఇట్లు మందేహులు జయించి ॥ 124

సీ॥ [illegible] తరతపోధను లత్యంతధర్మపరులు ।
[illegible] ఖాలఖిల్య [illegible] పరతఁ జెం[illegible] బొందిపోవుచున్నుఁడు॥ 125

వ॥ [illegible] పరిమాణంబులు నీకుంజెప్పితిం గదా. అట్టి
ముహూర్తంబులు ముప్పది యహోరాత్రంబు. సూర్యరేఖోదయంబు
మొదలుకొని [illegible]మూడేసిముహూర్తంబులు ప్రాత స్సంగవ, మధ్యాహ్న,
పరాహ్ణ, సాయాహ్నసంజ్ఞలం బరఁగు. ఇప్పదేనుముహూర్తంబులు దినం
బగు అంతియె రాత్రియగు. ఉత్తరాయణ, దక్షిణాయంబుల నహోరాత్రం
బులు వృద్ధిక్షయంబులం బొందు॥ 126

గీ॥ మేషతులలయందు మిహిరుండు వసియింప, సమము రేయిఁబగలు విమలచరిత ।
అగునుదక్షిణోత్తరాయణంబులు కర్కి, మకరములనినుండు మహిమనుండ ॥

వ॥ పదేనహోరాత్రంబులు పక్షంబు, పక్షద్వయంబు మాసంబు. మాసద్వ
యంబు ఋతువు, ఋతుత్రయంబయనంబు. అయనద్వయంబు సంవత్సరం
బగు, వినుము. 128

గీ॥ వరుససంవత్సరము బరివత్సరంబు, బ్రాహ్మణోత్తమ యిద్వత్సర మనువత్స।
రమనువత్సరమునునన ప్రభవముఖ్య, వత్సరములైదుయుగమనవసుధఁబరఁగు॥

వ॥ అందుఁ బ్రథమంబుసంవత్సరంబు, ద్వితీయంబు పరివత్సరంబు. తృతీయంబు ఇద్వత్సరంబు చతుర్థం బనువత్సరంబు. పంచమంబు వత్సరంబుగా నిట్లు ప్రభవాది పంచవర్షంబులు సౌర, చాంద్ర, నక్షత్ర, సావనమాన వికల్పితంబులై యుగమనంబరఁగు. ఈభూమండలంబునకుఁ గడపలదైన లోకాలోక శైలంబునకు దక్షిణంబును, నుత్తరంబును, వైషువంబును, ననఘూఁడు శృంగంబులుగల వందుమేషతులలయందు మార్తాండుండు వైషువతీ శిఖరంబుననుండ దివారాత్రంబులు సమంబుగానడచు. ఆసమకాలంబు విషువకాలంబనం బరఁగిపుణ్యకాలంబయ్యె. అందు దేవ, పితృదానంబులుచేసి కృతకృత్యులగుదురు. శుక్లపక్షాంతంబు పౌర్ణమాసియనంబరఁగు. కృష్ణపక్షాంతంబు అమావాస్యయనంబరఁగు ఆపౌర్ణమాసికి రాకయు ననుమతియును, అమావాస్యకు, శినీవాలియు, కుహూవునను నామాంతరంబులు కలవు. మాఘ, ఫాల్గునంబులును, చైత్ర, వైశాఖంబులును జ్యేష్ఠాషాఢంబులును, శిశిరవసంత గ్రీష్మఋతువులు మూఁడు నుత్తరాయణంబు. శ్రావణ భాద్రపదంబులును ఆశ్వీజ, కార్తికంబులును మార్గశీర్ష పౌష్యంబులును ననువర్షాశరద్, హేమంత ఋతువులు మూఁడును దక్షిణాయనంబనంబరఁగు. 127

చ॥ నరనుతచక్రవాళగిరి నాలుగు దిక్కుల లోకపాలురున్
పరమతపోధనుల్ సుగుణభాసురు లుత్తములున్నత వ్రతుల్।
దురిత విదూరులుండుదురు దోహలమొప్పఁగఁ గర్దమాత్మజుల్
నిరతము లోకరక్షణమనీష సరేష జగద్ధితార్థులై॥ 128

వ॥ వారలు సుధన్వుండును, శంఖపుండును, హిరణ్యరోముండును, కేతుమంతుండును ననంబరఁగుదురు. ఉత్తరంబు దేవయానమార్గంబనిచెప్పితిఁగదా; దక్షిణంబు పితృయానమార్గంబు. అందు నగ్నిహోత్రులైన ఋషులు భూతారంభకారిద్వైన బ్రహ్మంబు నొప్పుచు సంతతతపో మర్యాదాశ్రుతంబులచేతఁ బ్రతియుగంబులయందు బ్రహ్మస్థాపనంబు సేయుచుండుదురు. వారల మార్గంబుగదాదక్షిణంబు. దక్షిణమార్గ ప్రవర్తనులు చచ్చుచుంబుట్టుచు యాతాయాతంబునొంది భూతసంప్లవ పర్యంతంబు నుండుదురు. దేవయానమార్గంబైన యుత్తరాయణంబునందు, ఇంద్రియజయశీలురును, బ్రహ్మచారులును, విమలులును, సంసారదూరులును, ఊర్ధ్వరేతస్కులును, నైష్ఠికయతీశ్వరులు భూతసంప్లవ పర్యంతంబును వసియించి యుండుదురు. వారలులోభంబులేమిని వ్యవాయ వర్జనంబున కామాదిదోష రాహిత్యంబున నమృతంబునం బొందుదురు॥ 129

గీ॥ కమలభవునిపగటి కడపలసకలభూ, తములువిలయ మొందు దానిపేరు ।
భూత సంప్లవంబు భూర్భువస్స్వర్లోక. నాశకరమ బ్రాహ్మణవరముఖ్య ॥ 130

చ॥ క్రమగతి బ్రహ్మహత్యయు తురంగమ మేధము చేసినట్టి దు
ర్దమ తమసాపకర్ముఁడును బ్రస్ఫుట పుణ్యచరిత్రుఁడు న్యథా ।
ర్హ్మమునిరయంబు నాకమున నంటవసింతురు భూతసంప్లవం ।
బమరిన దాఁక నిత్తెఱఁగులై చను వేదవిధాన పద్ధతుల్ ॥ 131

గీ॥ ధరణినుండి ధ్రువపదముదాఁక భూతసం, ప్లవము చెల్లును ఋషిపదముకన్న ।
ధ్రువపదమునకన్న నవలనై వెలయుశ్రీ, విష్ణుపదము ఘనవివేకధుర్య ॥ 132

సీ॥ బ్రాహ్మణవర! విష్ణుపదమతి దివ్యంబు, తతముతృతీయ పదంబు, వ్యోమ ।
మున వెలుంగుచునుండు మననశీలురు యతుల్, పుణ్యపాపంబులు పోవఁద్రోచి।
అందుఁజెందుదురు శోకామయాదులుపున, రాగతుల్లేవుత దాశ్రితులకు ।
సచరాచరంబైన జగమంతయును దాని, యందసంపోతమై యమరుచుండు ॥

గీ॥ లోకసాక్షులై వెలుంగుధర్మధ్రువాదు, లునుదాని యందనె నిలిచియుంద్రు ।
రనఘమైనజ్ఞానమును వివేకంబును, నందకలవు బాగడనలవి యగునె ॥ 133

మ॥ తెలివిం, దత్పదమంది, యాధ్రువుఁడు, మేధీభూతుఁడై సంతతో
జ్వలతారాగ్రహ చక్రమెల్లపుడు, తేవంద్రిప్పచుం గాంచెనా
చలమూర్ధోపరి పుష్కరాంతమున నుచ్చైర్దీప్తితో నుండుశ్రీ
లలనాధీశ పదాబ్జపూజన మహోల్లాసస్ఫురన్మూర్తియై ॥ 134

వ॥ విష్ణుపదంబున ధ్రువుండు, అతనియందు సర్వజ్యోతిస్సులు వానియందు మేఘంబులు, వానియందు సంతతవృష్టియునుండు. ఆవృష్టివలన దేవతిర్యఙ్మనుష్య ప్రముఖులకు పుష్టియు నాప్యాయనంబునునగు. యజనంబులయందు నాజ్యాహుతిముఖంబునం బోషితులై దేవగణంబులు వృష్టికారణంబై సర్వభూతస్థితికిహేతు భూతులగుదురు. ఇవ్విధంబున లోకత్రయంబునకు నాధారంబై, యమలాత్మకంబై, తృతీయంబైన విష్ణుపదంబు వృష్టికిఁ గారణంబయ్యె వినుము ॥ 135

మ॥ సిరులొప్పం, బ్రభవించెనందు, నమరశ్రీపీనవక్షోరుహాం
తరవిన్యస్తపటీరకుంకుమ వినోదప్రక్రమస్నాన పిం
జరతాప్రాపిత భూరివారికలి తోచ్చైర్భంగ శ్రీశాంఘ్రివి
స్ఫురితాంగుష్ఠ సుసంగ, గంగ భువనంబుల్ పావవిపోత్తమా ॥ 136

సీ॥ సకలలోకోన్నత స్థానస్థితౌత్తాన, పాదిశిరంబుపైఁ బాదుకొనియె ।
బహుతపోవిభవ విభ్రామితమహనీయ శీలసప్తర్షుల నోలలార్చె ।

గళితసుధారసగ్రాసతుష్ట బుధశ, శాంకమండలిఁ గొనియాడఁజేసె।
కాంచనశైల శృంగనిరూఢ సంతాన, వాటిపరంపర వాడువేర్చె॥

తే॥ అచటినుండి, యసితేయలక నంబాభిధ, చతుభద్రయనెడు సంజ్ఞలఁగ
నాల్గుదిక్కులకు ఘనప్రభవహియించె, గంగవిమల వాస్తవంబయగుచు 137

క॥ మేరుగిరిదక్షిణమునఁగ, శారుచి, ప్రవహించు నయ్యలకనందంగా।
రీరమణీరమణుఁడు హాం, ఛారతిఁ దలఁదాల్చె పెక్కు సంవత్సరముల్॥ 138

చ॥ హరవరమస్తకాంచిత జటావలివెల్వడి, చంద్రమశ్శర
చ్ఛరదశరద్ద్యుతిం దెగడుచక్కని తుంగతరంగ మాలికల్।
ధరణికిఁదారహార రుచిదార్కొనదక్షివార్ధిఁ జొచ్చియు
ద్ధురసగరాత్మజాస్థి తతిదోఁచిన స్వర్గతులైరి వారలున్॥ 139

వ॥ ఈ గంగాజలంబుల యందు స్నాతులగు వారలకు సకలపాపప్రణాశనంబును, అపూర్వపుణ్య ప్రాప్తియునగు. తత్తోయంబుల తర్పణంబు చేసిన పితౄదులకుఁ బరమతృప్తియగు. ఆగంగయందు యజ్ఞేశ్వరుండైన పురుషోత్తము యజ్ఞంబులనారాధించి భూపాలకు లిహపరసుఖంబు లనుభవించిరి. తజ్జలస్నానాతి పూతపాపులగు యతీంద్రులు కేశవాసక్త మనస్కులై నిర్వాణంబు నొందిరి. వీనినభిలషించిన జూచిన, నంటిన, నవగాహించినఁ, గీర్తించిన నిగ్గంగసకల భూతంబులం బవిత్రులంజేయు. యోజనశతంబుల నుండియైన గంగాగానామంబు నుడివిన జన్మత్రయార్జిత పాపంబులడంగు. ఇట్లు సకలలోకపావనియైన గంగకు నుద్భవస్థానంబైన శ్రీవిష్ణుపదంబు తృతీయపదంబుగా నెఱుంగుమని చెప్పి శ్రీపరాశరుం డిట్లనియె॥ 140

ఉ॥ ఆకమలాక్షురూపము, నభోంతము నన్వెలుగొందు శింశుమా
రాకృతితారకామయము నై, మునివల్లభ, దానితోఁకపై
నేకద, యాధ్రువుండు వసియించుట, తారకలన్గ్రహంబులన్।
గైకొని ద్రిప్పుచుండు నతిగాఢసమీరణ పాశబద్ధుఁడై॥ 141

ఉ॥ ఆరయశింశు మారతనుఁడైన జనార్దనుహానసంబునన్
గోరిభజంచు నాధ్రువునకున్సకలగ్రహతారకాళికిన్
సారసపత్రలోచనుఁడు సర్వచరాచర భూతధారి, యా
ధారముగానెఱుంగుము యథాకథనంబిది నీకుఁజెప్పితిన్॥ 142

క॥ ఇనుఁడెనిమిది మాసంబుల, తనకరముల, నవనిరసముతగఁ గైకొనినా।
ల్గునెలల నొసంగునన్నం, బనువుగజీవించు ప్రాణులన్నియు దానన్॥ 143

చ॥ దినమణివాయునాడి మయతీక్ష్ణమయూఖచయంబుచే జలం
బొనరగ సోమునందు నిడు, సూర్యకరస్థజలంబు లీలఁగై
కొని ఘనపంక్తిపై విడుచుకొండుక, కాలమరుత్ప్రయుక్తతత్
ఘనములు భూమిపై విడుచు, గర్జిలుచు స్వనవారి పూరముల్ 144

సీ॥ కమలాప్తుఁడాకాశ గంగాంబుపూరముల్, తనమయూఖములఁ గైకొనిపయోద।
తతులు సోకకయుండ ధరణిపై విడుచుత, జ్జలకణములు పయింజిలుక నరుఁడు।
దురితనిర్ముక్తుఁడై నరకముల్ జూడక, దివమున కేగు భూదేవవర్య।
మేఘసంవృతి లేక మిహిరుండు గానరా, దివినుండి పడు వారి దివ్యమనెడు॥

గీ॥ స్నానమని యెఱుంగు సంయమివర యిది, పాపనాశనమ్ము ధన్యతరము।
[illegible] [illegible] లోకదా[illegible]ము, ప్రకృ[illegible]లభ్యమ[illegible] రమాకరంబు ॥145

క॥ సరి[illegible] [illegible] [illegible] [illegible] [illegible]లు లేక [illegible]గధరపై
దొ[illegible] జల [illegible], [illegible], ము[illegible]లు[illegible] ॥146

వ॥ మేఘసముత్సృష్టంబగు జలంబు సకలప్రాణులకు నోషధులకు జీవనకరంబగు. అయ్యోషధులచేత శాస్త్రచక్షువులైన మానవులు యజ్ఞంబు సేయుదురు. అయ్యజ్ఞంబులవలన దేవతలకు నాప్యాయనంబగు. ఇట్లు యజ్ఞంబులు, వేదంబులు, వర్ణంబులు, సర్వదేవనికాయంబులు, పశ్వాదులు వృష్టిచేత నన్నసంపన్నులగుదురు అట్టివృష్టి సూర్యునివలన నిష్పన్నయగు. అట్టి సూర్యునకు ధ్రువుండాధారభూతుండు. ధ్రువునకు శింశుమారంబాధారంబు. శింశుమారంబునకు హృదయస్థుండై, శ్రీనారాయణుండాధారంబై, సర్వభూతంబుల ధరించునని శ్రీపరాశరుం డిట్లనియె॥ 147

క॥ విను నాల్గువేలమీఁదట, నను బదియోజనముల పొడవెక్కనుదిగు సూ।
ర్యునిరథము రెండుదిక్కుల, ననయము నిదివత్సరగతి హరిదశ్వునకున్ ॥ 148

వ॥ దేవర్షి, గంధర్వాప్సరో గ్రామణి సర్పరాక్షసులచేత నాదిత్యుండు సతతాధిష్ఠితుండై యుండు. అదియెట్లనిన ధాతయను దేవతయు కృతస్థలయను నప్సరయుఁ బులస్త్యుండను ఋషియు, వాసుకియను సర్పంబును, రథకృత్తను గ్రామణియు, హేతియను రక్కసుండును తుంబురుండను గంధర్వుండును, నీయేడ్వురును చైత్రమాసంబున సూర్యునిరథంబున వసియింతురు. అర్యముండను దేవతయు, పులహుండను ఋషియు, రథౌజుండను సర్పంబును, పుంజికస్థలయనునచ్చరయు, ప్రహేతియను రక్కసుండును రథనిరుండను గ్రామణియు, నారదుండను గంధర్వుండును నీయేడ్వురు వైశాఖమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. అరుణుండను దేవతయు, వసిష్ఠుండను ఋషియు, నాగాఖ్యం

బను సర్పంబును, సహజన్యయను నచ్చరయు, హాహాహూయను గంధర్వుఁడును, వరుణుండను రక్కసుండును, చిత్రుండను గ్రామణియు నీయేడ్వురు జ్యేష్ఠమాసంబున సూర్యరథంబుపై వసియింతురు. మిత్రుండను దేవతయు, అత్రియను ఋషియు, తక్షకుండను సర్పంబును, పౌరుషేయుండను రక్కసుండును, మేనకయను నచ్చరయు, హాహాయను గంధర్వుఁడును, శతస్వరుండను గ్రామణియు నీయేడ్వురు నాషాఢమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. ఇంద్రుఁడను దేవతయు, విశ్వావసుండను గంధర్వుండును, శ్రోతుండను గ్రామణియు, ఇలాపుత్రుండను రక్కసుండును, అంగిరుండను ఋషియు ప్లమోచనయను నచ్చరయు, సర్పాఖ్యుండను నాగరాజును, నీయేడ్వురును శ్రావణమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. వివస్వంతుండను దేవతయు భృగుండను ఋషియు, అగ్రసేనుండను గ్రామణియు, అపూరణుండను గంధర్వుండును, అనుప్లమోచయను నచ్చరయు, శంఖహరుండను సర్పంబును, వ్యాఘ్రుండను రక్కసుండును, ఈయేడ్వురును భాద్రపదమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. పూషయను దేవతయు, గౌతముండను ఋషియు, ఘృతాచియను నచ్చరయు, సుషేణవ్యుండను రక్కసుండును, రుచియనుగంధర్వుండును, ధనంజయుండను సర్పంబును, పారుండను గ్రామణియు నీయేడ్వురును నాశ్వయుజమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. పర్జన్యుండను దేవతయు, భరద్వాజుండను ఋషియును, విశ్వావసుండను గంధర్వుండును, ఐరావతుండను సర్పంబును, విశ్వాచి యను నచ్చరయు, సేనజిత్తను రక్కసుండును, చాపాఖ్యుండను గ్రామణియు నీయేడ్వురును గార్తికమాసంబందు సూర్యునిరథంబుపై వసియింతురు. అంశుండను దేవతయు, కాశ్యపుండను ఋషియు, తార్క్ష్యుండను గ్రామణియు, మహాధర్మండను గంధర్వుండును, ఊర్వశియను నచ్చరయు, చిత్రసేనుండను రక్కసుండును, విద్యుత్తను సర్పంబును, మార్గశీర్షమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. త్వష్టయను దేవతయు, క్రతుండను ఋషియు పూర్ణాయువను గ్రామణియు, స్ఫూర్జకుండను రక్కసుండును, కర్కోటకుండను సర్పంబును, అరిష్టనేమి యను గంధర్వుండును, పూర్వచిత్తియను నచ్చరయు పుష్యమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. త్వష్ట యను దేవతయు, జమదగ్నియను ఋషియు, కంబళుండను సర్పంబును, తిలోత్తమయను నచ్చరయు, ప్రపితుండను రక్కసుండును, రుతజిత్తను గ్రామణియు, ధృతియను నచ్చరయు మాఘమాసంబున సూర్యునిరథంబుపై వసియింతురు. విష్ణుండను దేవతయు, విశ్వామిత్రుండను ఋషియు, అశ్వతరంబను సర్పంబును రంభయను నచ్చరయు, యజ్ఞవేతుండను రక్కసుండును, సూర్యవర్చుండను గంధర్వుండును, సత్యజిత్తను గ్రామణియు, నీయేడ్వురు ఫాల్గుణమాసంబున

సూర్యునిరథంబుపై వసియింతురు. వీరలు లోకప్రకాశనార్థంబు క్రమంబు ద్వాదశమాసాధికారులై విష్ణుశక్త్యుపబృంహితులై వసింతురు. అందుమును లు నుతించుచు, గంధర్వులుపాడుచు, అచ్చరలాడుచు, రక్కసు లనువర్తించు పన్నగంబులువహించుచు, గ్రామణులు పగ్గంబులు పట్టుచు వసియింతురు వాలఖిల్యులు పరివేష్టించి యుపాసింతురు. ఈ యేడు తెఱంగులవారును ర మండలంబునందు నిలిచి, హిమోష్ణవారివృద్ధులకుం, దమతమ సమయంబు హేతువులగుదురని చెప్పిన శ్రీపరాశరునకు మైత్రేయుం డిట్లనియె ॥ 14

సీ॥ ధీశేంద్ర యీ యేడు తెఱంగులవారును, సరసిజోదరదివ్యశక్తిబృంహి ।
తాత్ములై యాదిత్యు సదనంబుపై నుండి, [1] శీతలోష్ణాంబు వృష్టిముఖకార్య ।
కారులౌదురని వక్కాణించితిరి భానుం, డేకొనా తాంబు వృష్టులకును ।
హేతుభూతుం డని యెఱిఁగించితిరి,మును పిదపం దియ్యదోఁచె నెఱుఁగఁ జెప్పఁడ

గీ॥ అదియుఁగాక భానుండస్తమితుండయ్యె, నుదితుం డయ్యెననుచు నుర్విజనము
లెదురు చూడనేల యీపనుల్వీరలు, తీర్చరే నిదీనిఁ దెలుపవయ్య ॥ 15

వ॥ అనియడిగిన మైత్రేయునకు శ్రీపరాశరుం డిట్లనియె ॥ 15

క॥ వినుమెంద అన్నఁగానీ, దినకరుఁడేముఖ్యుఁ డతని తేజంబుననే ।
యొనరూడు నన్నిపనులును, జనవినుతములగుచు నెపుడుజగములయందున్ ॥ 15

ఉ॥ భూమినురేంద్ర యిజ్జగముఁబోఁచుటకై విలసించుఋగ్యజు
స్సామసమాఖ్య శ్రీవిభుని శక్తి యఘౌఘముద్రుంపఁ జాలు ను
ద్దామమహావిభూతి నదితామరసాప్తుని యందునిల్చి ది
వ్యావృత వృష్టి,వాత, మిహికాదిక కృత్యము తీర్చు నెప్పుడున్ ॥ 15

క॥ రేపుల ఋక్సివహంబును, మాపుల సామవ్రజంబు, మధ్యాహ్నములన్ ।
దీపితయజుస్సంతతులును మహాపటిమన్ బొగడుచుండు నంబుజబంధున్ ॥ 154

వ॥ సర్గాదియందు శ్రీమన్నారాయణుండు, సృష్ట్యర్థంబు రజోగుణం బవలంబించి ఋగ్వేదమయుండైన చతుర్ముఖుండయ్యె. రక్షణార్థంబు సత్వగుణంబవలం బించి,యజుర్మూర్తియైన విష్ణుండయ్యె.సంహారార్థంబు తమోగుణం బవలంబించి సామస్వరూపియైన రుద్రుండయ్యె. కావున సామస్వరం బశుచియయ్యె. ఏవం విధ మహిమగల విష్ణుశక్తి సత్వగుణస్థుండైన యాదిత్యునధిష్ఠించి యుండి వెలుంగం జేయు ॥ 155

చ॥ సమధికవిష్ణుశక్తి పరిసర్పితుఁడై సవిత్రుండు ఘోరసం
తమసము బాఱఁద్రోలి, భువనంబులు బ్రోచుచునుండుఁగాని ని

1. శీలాంభోష్ణవృష్టి.

త్యము నుదయంబు, న స్తమయమందుట లేదు త్రయీమయాత్ముఁడ
ర్యముఁడు త్రిమూర్తిరూపుఁడు సురస్తుతిపాత్రము సుమ్మనువ్రతా ॥ 156

వ॥ సుముఖ శుక్లపక్షమున సోముఁడు భాస్కరుభాస్వను ప్రవే
శమహిమ వృద్ధిచేఁ బొలిచి శ్యామలపక్షమునన్ గళల్ యథా
క్రమమున దేవతా పితృపరంపరకిచ్చుఁ గళాసుధాశన
ప్రముదితులై సుఖింతురు శుభస్థితి వారును ధీరపుంగవా ॥ 157

వ॥ దేవతలకుఁ బక్షతృప్తియు, పితరులకు మాసతృప్తియు, మర్త్యులకు నిత్యతృప్తి
యుం జేయుచు నర్కుండు ప్రవర్తించు ॥ 158

సీ॥ మూడు చక్రములు సోముని రథంబునకును, కుందాభములు పది ఘోటకములు ।
కుడికడ నెడమ దిక్కునఁ గట్ట నత్తురంగము లారథంబు వేగమునఁ దిగుచుఁ ।
దనకు నాధార ముత్తానపాదసుతుండుగా దినమొక్కఋక్షమున నుండి ।
చరియించు నవసుధాకిరణుండు సురకోటికళలు ద్రావిన రెండు కళలు చిక్కి ॥ [ణ।

గీ॥ సలిలములు చొచ్చి వీరుదుచ్ఛయము చొచ్చి, యర్కమండలిఁ జొచ్చు నయ్యర్కకిర
మొక్కటి యెతన్నుఁ గ్రమవృద్ధినొందఁ జేయ, గగనవీధి యథాపూర్వగతిఁ జరించు॥

వ॥ చంద్రుఁడు జలవీరుత్సూర్యమండలంబులు చొచ్చినకాలం బమావాస్యయనం
బరఁగు. అందును వీరుత్తులు ఛేదించిన నొక్క యాకైనం గోసిన బ్రహ్మహత్యా
ఫలంబు నొందుదురు. సౌమ్యులును బర్హిషదులును, అగ్నిష్వాత్తులును, అనఁ
బితరులు మూఁడు తెఱంగులవారలు. వీరల మావాస్యనాఁడ పరాహ్ణకాలం
బున సూర్యగతుండగు సోముని కళాద్వయంబును బానంబు సేయుదురు. అది
స్వధామృతం బనం బరఁగు. అందువలనఁ బరమనిర్వృతిం బొంది, మాసతృప్తు
లగుదురు. ఇట్లు దేవపితృగణంబులం దృప్తులం జేసి యమృతమయంబులైన
శీతలపరమాణువులచే [1] వీరుదోషధులు నిష్పాదించి వానివలనను బ్రకాశాహ్లా
దంబులవలనను మనుష్యపశుకీటంబుల నాప్యాయనంబు నొందించుచు
హిమాంశుండు కీర్తితుండగుచు నుండు ॥ 160

గీ॥ అవనిదేవ పిశంగవర్ణాష్టతురగ, వాహ్యమై, సర్వసన్నాహవంతమై ప్ర ।
శస్తిగాంచిన రథముపైఁ జంద్రసుతుఁడు, బుధుఁడు వెలుగొందు లోకసంపూజ్యుఁడగుచు॥

క॥ సివరూథం బనుకర్ష, స్తవనీయంబష్టభూమి జ తురగవాహ్యం
బవలోకనీయమును నగు, ప్రవిమల రథమెక్కు రవి తిరంబగు కణఁకఁ ॥ 162

గీ॥ అరుణసంభవపద్మరాగారుణాష్ట, తురగ సంవాహ్య కనకబంధుర రథంబు ।
తెలివిదళుకొత్త నెక్కు దేదీప్యమాన, మణివరోద్భాసితగళుండు మంగళుండు॥

---

1. వివిరుదోషాదులు.

చ॥ ధవళహయంబు లెన్మిది యుదగ్రతఁ గట్టినవైఁడి తేరిపై
దివిజపురోహితుండు సముదీర్ణతతోడ వసించి యేటియే।
టివరుసనొక్కటొక్కటిగ శీవినిరాసులు ద్రొక్కుచుండుఁ బ్రా
భవమున భూజనంబులకుఁ బ్రస్ఫుటశోభనముల్ ఘటించుచున్ ॥ 16

గీ॥ శబలసన్నంబు లాకాశసంభవములు, నైనయేనిమిదిగుఱ్ఱంబులానియున్న।
స్యందనంబందముగనెక్కి మందమంద, గమనమునసూర్యసుతుఁడేగు గగనవీధి

క॥ ఛ్గనిభదినల్లనిగుఱ్ఱము, లనువుగవహియించు ధూసరాభరథముపెం।
పెనయంగనెక్కి రాహువు, దినదినమునునభ్రవీథిఁ దిరుగుచునుండున్ ॥ 16(

క॥ ధూమలరుచి లాక్షానవ,ర్ణామితవేగంబునైన నశ్వాష్టకము।
ద్దామగతిఁబూన్చునరదము, పైమెలఁగున్ గేతువభ్రపదమున నెపుడున్ ॥ 167

వ॥ ఇది నవగ్రహంబులరథంబుల తెఱంగు ॥ 168

క॥ రవిఁబట్టివిడుచుఁబదపడి, ధవళకరునిఁబట్టి విడుచుఁద త్తత్పర్వ।
ప్రసరసమయముల రాహువు, దివినవిరతవక్రగమన దీపితుఁడగుచున్ ॥ 169

వ॥ ఈ నక్షత్రగ్రహతారలు, రాసులు నన్నియు ధ్రువునియందు వాతరశ్మి బద్ధంబులై ధ్రువునిం బ్రిప్పుచు తామునుం దిరుగుచుండు. ఈ ధ్రువాదులకు నాధారంబు శింశుమారంబని యెఱుంగుము. ఈ శింశుమారదర్శనంబుచేసి పాపంబులంబాసి యాయుష్మంతులగుదురు ॥ 170

క॥ వనజాతపత్రనేత్రుఁడు, మునిపుంగవ శింశుమారమూర్తిధరుండై।
వినువీథిఁ దిరుగునెప్పుడు, వినుము తదీయప్రభావవిశ్రుతమహిమల్ ॥ 171

వ॥ ఆశింశుమారంబునకు నుత్తరహనువున నుత్తానపాదుండును, అధరంబున యజ్ఞంబును, మూర్ధంబున ధర్మంబును, హృదయంబున నారాయణుండును, పూర్వపాదంబుల నశ్వినులును, పశ్చిమ పాదంబుల వరుణార్యములును, శిశ్నంబున సంవత్సరంబును, అపానంబున మిత్రుండును, పుచ్ఛంబున నగ్ని మహేంద్ర కశ్యపధ్రువులును, నుండుదురు. పుచ్ఛాశ్రయంబైన యీనక్షత్ర చతుష్టయంబును నస్తమయంబునొందదు. ఇది సమస్తజ్యోతిస్సన్నివేశంబు ॥

గీ॥ భువనములు జ్యోతిరుచ్చయంబులువనంబు,లద్రులు దిశల్ నదీసముద్రాదికములు।
అస్తినాస్తిపదార్థవేద్యములు, నంబుజాతనేత్రుండునుమ్మువిఖ్యాతచరిత ॥ 173

వ॥ అశేష జగన్మూర్తియైన భగవంతుండు జ్ఞానస్వరూపుండుగాని వస్తుభూతుండుకాఁడు. కావున జగంబంతయు జ్ఞానస్వరూపంబు ॥ 174

ంయనఁగమ్మృత్తిక, యనఁగఘటంబనఁగపా లమన చూర్ణమన ।
మాణువనఁగా, నొనరినయది భూమిగా దెయూహింపంగన్ ॥ 175

రాచరంబైన జగంబంతయు, జ్ఞానస్వరూపుండైన భగవంతుండు.
, విమలంబునూ, విశోకంబును, నిరస్తసంగమంబును, ఏకంబును
ంబు, పరముండును పరేశుండునునగు వాసుదేవుండు. అతనికన్న
లేదు. ఇది సకల భువనాశ్రితంబగు వాసుదేవాఖ్య జ్ఞానంబు నీకు
ంతి. 176

పావకర్త్వి, జ్వీవహూము స్వర్గఫలసామగీతి స్వర భో ।
గతులు భూదే, వవరా ! విష్ణుండనుమ్ము వర్ణింపంగన్ ॥ 177

మైత్రేయుం, డనుమోదరసార్ద్ర హృదయుఁడై యిట్లను నో ।
ర్వము దెలిపితి, రనుకంపముతోడ నాకు నధిక ప్రతిభన్ ॥ 178

జడభరతోపాఖ్యానము.

సాలగ్రామా, శ్రమమున భరతుండు తపము సమ్యగ్భంగిన్ ।
ఁగూర్చి చేయుచు, విమలత్వము లేక యెట్లు విస్మృతినొందెన్ ॥ 179

చ్చు సంగములఁ బాసి వివిక్తతపోవనంబులన్
చింతన మనంబునఁ జేర్చి భజించుచున్నయ ।
నకాయవస్థయఁట యన్యులు దుర్విపరోగ్ర సత్వని
హాన సంసరణ దుస్తరవార్ధిఁదరింప నేర్తురే ॥ 180

హీపతి పావన, చరితంబెఱిఁగింపుమయ్య చయ్యననాకున్ ।
ాసక్తుల సచ్చరితంబఘహారముగాదె సంయమితిలకా ॥ 181

ఁగిన మైత్రేయునకు శ్రీపరాశరుండిట్లనియె ॥ 182

స హరిపదపూజా, నిరతుండంతస్సపత్న నిర్వారణకళా ।
, ధర్మారంభా, భరతుఁడు రాజ్యంబుచేసె పృథుదోశ్శక్తిన్ ॥ 183

స్తమహీభరుండగుచు నా క్షోణీతలాధీశుఁడా
ణపదంబు చేరుటకునై శ్రీకాంతకాంతాంఘ్రిలో ।
ంతనిరంతరత్వమున సాలగ్రామ తీర్థంబునన్
ాద్యరివర్గుఁడై తపముచేసెఁ శాంతచిత్తంబునన్ ॥ 184

సర్వభూతాత్మ భూతాత్మక, యచ్యుతపుండరీకాయతాక్ష
సమదరక్షోమానశాసన, మాధవ సకలసంభావనీయ

ద్రమువితినెనో నిజంబుగ వినాశమునొందినచందమైనఁ బ్రా
ణములిఁక నామెయిన్నిలిచునా క్షణమాత్రము చిత్రవైఖరిన్ ॥ 195

॥ అని తలపోయుచుండు ॥ 196

॥ స్నానతర్పణసంధ్యా ప్రధానవిధులు, మాననీయహరి ధ్యానమంత్రవిధులు ।
పావనాగమసత్కథా పారవిధులు, హరిణలాలనమునఁ బోలవయ్యెమునికి॥ 197

క॥ పురుషశ్రేష్ఠుఁడతండు సర్వనియమంబుల్మాని యెల్లప్పుడున్
హరిణాసక్త మనస్కుఁడై తిరిగె, వన్యాహారమర్యాదలన్ ।
"హరిణాసక్తమభూదహో నృపమనోవ్యాపారమేతత్పుదు
ష్కరమర్థా" యని ధీరకోటిపటువాచాప్రౌఢిఁ గీర్తింపగన్ ॥ 198

॥ అనవరతహరిణలాలన, ననుపమితసమాధి భంగమయ్యెనతనిక ।
ల్లననంతఁ గొంతకాలము, చనఁజనఁబ్రాణప్రయాణ సమయంబైనన్ ॥ 199

ఉ॥ కన్నుల నశ్రుపూరములుగారఁ గుమారకులీలనేణమ
య్యున్నత కీర్తిపై వదనమొయ్యనఁ జేర్చి భృశార్తినుండె నం ।
పన్నమమత్వయుక్తిఁ బలుమారును దన్మృగరూపభావనా
సన్నమనస్కుఁడై విడిచెఁ గాయమున్యాయముగా మహీశుఁడున్ ॥ 200

॥ నిరతహరిణైక భావన, నరపాలకతాప సుఁడుపునర్జన్మంబా।
హరిణకులమునన కనియెన్, వరజంబూషండ భవ్యవసుమతియందున్ ॥ 201

వ॥ ఇవ్విధంబున నప్పురుషప్రకాండుండు జంబూషండ భూమండలంబున హరిణంబై
జనియించి జాతిస్మరత్వంబుకలిగి యనూనజ్ఞానోదయంబున శుష్కపర్ణతృణ
మాత్రంబున శరీరయాత్ర నడుపుచుఁ దొల్లిటి సాలగ్రామాశ్రమమునకు వచ్చి
యచ్చోటను గొంతకాలంబునకు హరిణశరీరంబువిడిచి ॥ 202

ఉ॥ అంబుజగర్భవంశ్య ! వినుమప్పటికిన్ శుచియైనయోగివం
శంబునవిప్రుఁడై యతఁడుజన్మమునొంది లసద్వివేకపా ।
కంబునవేదశాస్త్రములు గాఢమతిత్వర నభ్యసించి పీ
తాంబరదివ్యపాద జలజాశ్రిత మానసచంచరీకుఁడై ॥ 203

గీ॥ గుప్తమహాత్ముఁ డాయోగికుల విభుండు,జడునికైవడి నున్మత్తు చందమునను।
బాలురీతిఁబిశాచంబు భంగినుండు, నొరులకేరికిఁ దనచర్యయెఱుఁగనీక ॥ 204

సీ॥ నిరుపమసంస్కార వరమలీమసదేహు, ననుకలారచితబోధ నవగాహు ।
శతరంధ్రమలిన వస్త్రప్రావృతకటీరు, వికటజటీభూత చికురవారు ।

[illegible] మూన్నకిజలకేళుల్యోత్సాహు, పరిభూత ఘోరాంత రరిసమూహు
[illegible] భవత్తిరస్కారు పురస్కారు, దూరతోపాస్త సంసారభారు ॥

సీ॥ ధీరు, [illegible] నాజడీ భూయహారు, నిత్య,విష్ణుచింతన కార్యైనావిప్రవర్త్యుఁ ।
గాంచిజడునితియంచులోకంబుమిగులఁ, బరిహసించుమహత్త్వ మెర్వ్యజుప
[illegible] లోకముచెం, దినభ్రాతృపితృవ్యులడరి దినదినమునునో ।
[illegible] నతఁడును, జనదనకయొనర్చు మూఢజడుని తెఱఁగునన్ ॥
[illegible] బలుకఁడు, పలికినఁ, బలుబూతులుపలుకుఁ దనదుపజ్జకునరుఁడే ।
[illegible] యుండన్, మెలఁగునతఁడుగూఢ గతిసమృద్ధిదలిర్పన్ ॥
[illegible] వెట్టి చెప్పినపను, లేమినైనఁ జేయునేమిచెప్ప ।
[illegible] మన్మహానుభావుఁ డందఱిపనులకు, నిరతమును మహోపకరణమయ్యె ॥

వ॥ ఇట్లు [illegible] యోగసిద్ధికి సమర్థంబు గాకుండలోకవ్యవహారంబులుమాని నిరఁ
యోగాను భవపరుండగుచు నుండంగొంత కాలంబుచనిన ॥

సీ॥ కృత్తయర్ణ బేరిటి సౌవీరపతిదుఃఖ, కారణంబైన సంసారసుఖము ।
పై [illegible] సికపిలునిచే రహస్యజ్ఞాన, సారమెఱుంగఁగాఁ గోరియప్పు ।
[illegible] కేగు చోఁబల్లకి, పట్టఁగవెట్టికిఁ బట్టినట్టి ।
[illegible] తోఁగూడఁ బూర్ణజ్ఞాననిధియైన, యవ్విప్రవరుఁదెచ్చి యానదండ ॥
గీ॥ మంసమునకెత్తఁ గర్మశేషానుభవము, గావలెనటంచు వాహకగణమునదు
నిర్వికారత్వమున మోచె నిరభిమాన,మాననీయాత్ముఁడతఁడు బ్రాహ్మణవరేఁ

మ॥ ధరణీదేవుఁడుమూఁపు మీఁదశిబికాదండంబు విజ్ఞానని
ర్భరుఁడై తాల్చి యుగప్రమాణమహిమాత్ర ప్రేక్షణుండౌటయు।
ధురతన్మెల్లనపోవ వాహకజనుల్ తోడ్తోమహావేగులై
[illegible] బరువెత్తన త్తఱిని నిర్బంధస్థితింబొందుచున్ ॥ 2
క॥ వాహకులఁజూచినరపతి, యోహోయీవిషమగమన ముడుగుఁ డనిననీ ।
సాహసముమాదిగాదు దు,రీహుఁడితని చేష్టయనిన నించుక నగుచున్ ॥ 2
మ॥ ధరణీదేవునిఁజూచి వేసరితివో? దవ్వేగితో? మోచునే
ర్పరయంజాలదో నీకు? బీవరుఁడవేలా చేసెదాలస్యమో ।
కరణిన్నీవన నానృపాలకుని జక్కంజూచి భూదేవతా
వరుఁడల్లన్నగి యిట్లువల్కు విశద వ్యాపారమేపారఁగన్ ॥ 2
చ॥ బలిసినవాఁడఁగాను, వినుపల్లకిమోచినవాఁడఁగాను, నా
కలవునులేదు నీవరయకాడినమాట సహించినాఁడనే

నలుగనటన్న రాజనియెన్నల్లదె పల్లకిదండెమూఁపుపై
బలుపిదెక్కినసీకిపుడు భారముమోచిన శ్రాంతిపుట్టునే ॥ 214

వ॥ అనిన బ్రాహ్మణుం డిట్లనియె ॥ 215

గీ॥ భూపవరయిప్పుడీ వేమిపోలఁగంటి, వదియెఱింగింపు పిదపఁజెప్పెదవుగాని ।
బలవదబలవిచారనిష్పాదితార్థ, మంతయును సూక్ష్మబుద్ధిని నాకలించి ॥ 216

ఉ॥ పల్లకిమోచినాఁడవిదె పాయదుమూఁపున దండెయంచు నీ
వెల్లరుపీనులన్వినఁగ నిప్పుడుపల్కి తదంతయున్మహీ।
వల్లభ కల్లసుమ్ము వినువాంఛ జనించినయేని, చెప్పెదన్
దెల్లముగాఁగ నీదగుమనీషతిరంబుగఁ జేయుమేర్పడన్ ॥ 217

సీ॥ వసుధపై పాదముల్వానిపై జంఘలువానిపై నూరులువానిపైని ।
కడుపందుమీఁదవక్షము దానిపై బాహులామీఁద స్కంధంబుల మరియుండు।
స్కంధాశ్రితముశిబికాదండ మిట్లాట ప్రకటింపనాకు భారంబుకలదె।
శిబికపై త్వదుపలక్షితశరీరమునిల్చె నిన్నునునన్నును నున్న దాని ॥

గీ॥ భూతములుమోచునంతియె భూమిపాల, యవియునడుచుగుణప్రవాహమునఁదగిలి ।
గుణములును కర్మవశ్యతఁ గూరుఁగర్మ, సమితియు నవిద్యఁగలుగునిజంబుసుమ్ము॥

వ॥ ఆత్మ శుద్ధుండ క్షరుండు, శాంతుండు, ప్రకృతికంటెఁబరుండు, వృద్ధిక్షయ
రహితుండు, అఖిలజంతువులయందు నొక్కరుండై యుండుటం జేసి॥ 219

క॥ బలుపును దరుగును నెఱుఁగక, కలకాలము నొక్కతీరుగా నుండంగా ।
బలిసితివనియును నన్నున్, బలికితివది యేమియుక్తిఁ బలికితిచెపుమా ॥ 220

వ॥ భూమిపాదజంఘాదులకు నాకు శిబికాభారంబుసమంబ శిబికాభారంబు
భూతంబులు వహించుంగాని జంతువులుకావు శిబికయు భూతసంగ్రహంబు,
అదియుమమత్వావబృంహితంబై భ్రాంతిఁగొలుపునని పలికి యమ్మహాను
భావుండూరకుండిన॥ 221

క॥ నరపతియును శిబికయతి, త్వరితగతిం డిగ్గనురికి తచ్ఛ్రీపాదాం
బురుహములకెరఁగి నిటలాం, తరమున నంజలిఘటించి నమ్రతఁబలికెన్॥ 222

క॥ విడువిడుఁడు శిబికనేమీ, యెడతప్పానరించినాఁడ నెఱుఁగకనన్నున్ ।
గడలేనికరుణ, తో నిప్పుడుగావఁగవలయుభువనపూజితచరితా ॥ 223

క॥ నీవెవ్వరేమిటికిఁగా, నీవిధమునునుండవలసె నేమిపనికిఁగా ।
రావలసెనిటకుఁజెప్పుము, కోవిదనుతయనిన విభునకున్మనిపలికెన్ ॥ 224

క॥ నే నిట్టివాఁడ ననిభూ, మీనాయక చెప్పఁదరమె మీరనుశబ్దం ।
బేననుచునాత్మఁబలుకుట, యై నెగడుంగాదె యనుచు నమ్మునిపలికెన్ ॥ 225

గీ॥ అవనినాథ యనాత్మయం దాత్మబుద్ధి, నాచరించి యనాత్మ క్షేత్రమనుశబ్ద ।
మాత్మభవమంచుఁబల్కుదురహహ నిజము, తెలియ నాత్మకుశబ్దంబులేల దెల్పుమా ॥

క॥ నాలుక దంతోష్ఠంబులు, తాలువులునునిఖిలశబ్దతతిఁబుట్టింపన్ ।
జాలిన హేతువులిట్లీ, కీలెఱుఁగరు శబ్దమాత్మకృతమే తలఁపన్ ॥ 227

గీ॥ ఇన్నియును శబ్దజననైక హేతువులుగ, నొక్కవాక్కె యనుచుబల్కునోనృపాల ।
యెన్నివిధములనై ననిట్లెంచిచూడ, బలిసితీవను మాటలు పలుకఁ జనదు॥ 228

క॥ తలయును చేతులు కాళ్లుగఁ, గల యంగప్రతతితనకుఁ గలుగుశరీరం ।
బలయాత్మకన్న వేఱని, తలఁచిన నేపేరఁబిలువఁదగునయ్యాత్మన్ ॥ 229

గీ॥ పరుఁడునాకన్న నొకఁడున్న భంగినైన, నితఁడొకఁడు నేనొకండనుమతముకలుగు
భూతతతులందునొక్కండ పురుషుఁడుండు, కాననీవెవ్వఁడనఁజెప్పఁగావశంబె ॥

క॥ నీపల్లకి యిది నీవున్, భూపతి వేమెల్ల మోచుపురుషుల మిదినీ ।
ప్రాపుగలలోకమని యో, భూపాలక తలఁచుటెల్ల పోలదుసుమ్మీ ॥ 231

గీ॥ ధరణివర వృక్షమునఁగల్గి దారువందు, శిబికయనఁగలై శిల్పవై చిత్రిచేత ।
సరగఁదీనికి వృక్ష సంజ్ఞయును దారు,సంజ్ఞయును నింతలో నెందుచనియెఁజెపుమ॥

క॥ నినువృక్షసమారూఢుం,డని కానీ, దారుకూఢుఁడని కానీ, యో ।
జనమనదు శిబికయుఁగా, దన నేటికి దారుసంగ్రహము కాదేమో ॥ 233

క॥ వినుఛత్రశలాకాదుల, కనయముభేదంబు సిద్ధమైన నెచటికిన్ ।
జనెఛత్రమనెడున్యాయము, చనునా నీయందు బుద్ధిచక్కంగనినన్ ॥ 234

చ॥ పురుషుడు కాంత గోవ్రజము భోగి విహంగమ ఘోటకంబుకుం
జరమనుసంజ్ఞ లెల్లను రసాజనవల్లభ కర్మహేతులో, ।
కరచితసంజ్ఞ లెన్నికొనఁగా సురమర్త్యపశుద్రుమాదులె
ల్లరసిననాత్మగాంచు వపురాశ్రితసంజ్ఞలు కర్మకృత్యముల్ ॥ 235

గీ॥ అధిపరాజని భటుఁడనియన్యమైన, వస్తువనియంట తెలియనివార్తనువ్వే ।
సునిశితప్రజ్ఞనరసిచూచిన నినన్ని, నాటకంబులు సంకల్పనామయములు ॥236

క॥ జనకుండవు తనయుకునం, దనుఁడవుతండ్రికి సపత్నునకురిపుఁడవు, మ ।
న్ననపత్నికిఁబతి విట్లగు, నినునెవ్వరనంగవలయు నృపవర చెపుమా ॥ 237

॥ శిరమునీవ్రు, నీదిశిరమొ, యయ్యుదరంబు, నీవ్రు, యుదరమొక్క [illegible]।
అంఘ్రిబాహుముఖ్యమగునంగకములీవ్రు,అదియెనీదియోవు, హత్తచెపుమ ॥

॥ తలఁపసమస్తావయవం, బులకు న్వేఱైననీవు భూపాలకయే।
యొలవున నేనని చెప్పం, గలవాఁడవు నిపుణబుద్ధిఁ గనుమా తెలియన్ ॥ 239

॥ ఇవ్విధంబునఁ దత్త్వస్థితివర్తింప నేనిట్టివాఁడనని యెట్లు చెప్ప నేర్తునని యాబ్రాహ్మణుండు వలికిన పరమార్థసమన్వితంబులగు పలుకులువిని పులకించి యా భూపాల తిలకుం డిట్లనియె ॥ 240

॥ శిబిక నేమోవను శిబికనాపై లేదు, నాకన్న దేహమన్యంబు శిబికె,
దేహంబు మోచెనింతియు, భూతములకెల్ల, కర్తృచోదితప్రవృత్తికలిగియుండు।
కర్మవశ్యత గుణగ్రామంబు దిరుగనే, పనిలేదునాకని పలికితివ్వ
డిదియెల్ల వినినాదుమది విహ్వలించెనో, పరమార్థతత్త్వజ్ఞ భవమునోమి ॥

॥ కపిలమునిఁజేరి పరమార్థకలనఁ దెలుతు,ననుచుఁజనుచోటఁ దెరువునవినుతతత్త్వ
బోధనిధినిన్నుఁ గంటినాపుణ్యమహిమ, కలిమి నిరు పేద పెన్నిధిఁ గన్నయట్లు ॥

॥ సర్వభూతేశ్వరుండైన విష్ణుండు జగద్ధితార్థంబు కపిలుండై యవతరించె. అమ్మహానుభావుండ నన్ను రక్షించుటకు నీరూపంబునఁ బ్రత్యక్షంబగుట సిద్ధంబు. నాకునెయ్యది పరమార్థంబైన శ్రేయస్సు దానినెఱింగించి రక్షింపుమని ప్రణతుండైన సౌవీరపతిం జూచి బ్రాహ్మణుం డిట్లనియె ॥ 242

॥ ఇలలోఁ బరమార్థార్థం, బులు శ్రేయము లెన్నియైన భూనరకలవం।
దులకోలఁది యెన్నిచూచినఁ,బలుకులు నెయ్యేలయవియుఁ బరమార్థము లే॥243

॥ ధరతనయురాజ్యలాభంబు తలఁచి నరుఁడు, దేవతారాధనము చేసి దీనిఁగాంచు।
ధరణినాయక మనమునఁ దలఁచిచూడ, నదియుఁ బరమార్థమైన శ్రేయంబుగాదె॥

॥ తలపఁగ స్వర్గలోకఫలదాయక మౌ క్రతుకర్మమెంచఁగాఁ,
గలిగిన శ్రేయమౌఁగద, యకంపితయోగ సమాధినాత్మునిం।
గ్గలఘుఁగఁజేర్చు శ్రేయమది గాదొకొ భూపలలామ వెక్కువా,
క్కుల పనియేమి శ్రేయములకున్ మితిలేదు తలంచిచూచినన్ ॥ 245

॥ పరమార్థంబైన శ్రేయస్సు సంక్షేపరూపంబునం జెప్పెద. ఏకుండును, వ్యాపియు, సముండును, శుద్ధుండును, నిర్గుణుండును, ప్రకృతికంటెఁ బరుండును, జన్మ మృత్యాద్యాది రహితుండును, సర్వగతుండును, నవ్యయుండును, బరమజ్ఞానమయుండును, నామజాత్యాది వియుక్తుండును, నైన పరమాత్ముని నెఱింగిన జ్ఞానంబు పరమార్థంబైన శ్రేయస్సు. అనిచెప్పినవిని మనంబున సంచలించి

యిదియేమని విచారించు సౌవీరపతింజూచి యమ్మహాబ్రాహ్మణుండద్వై
తాంతర్గతంబైన యితిహాసంబుగలదు చెప్పెద వినుమని యిట్లని చెప
దొడంగె ॥ 2

క॥ ఋభు నామధేయుఁడబ్జ, ప్రభవతనూభవుఁడు జ్ఞానభాసురుఁ డగ్నిం ।
ప్రభుఁడాతముని గలఁ డతనికి, నభిమతశిష్యుఁడు నిదాఘుఁడనుముని వేలయుఁ

వ॥ పులస్త్యపుత్రుండైన యన్నిదాఘుండు ఋభునకుం బరిచర్యచేసి యతనివలనవ్వా ప్తజ్ఞానతత్త్వుండయ్యును, నద్వైతవాసన లేకయున్న గురుండు విచారించుచునుండె. అంతంగొంతకాలంబునకు నాశిష్యుండు దేవికానదీతీరంబ రమ్యోపవన పర్యంతంబును, సకలవస్తు సమృద్ధంబును, పులస్త్యనివాసిం బునునగు నగరాఖ్యపట్టణంబును నివాసంబుచేసెనంత దివ్యవర్ష సహస్రంబు చనిన ॥ 2

సీ॥ గురుఁడు శిష్యునిజూడఁ గోరియప్పురికేగి, తద్గృహద్వారంబుదండనిలువ,
వైశ్వదేవము చేసివచ్చి వాకిటనున్న, ఋభునిం గనుంగొని యభినుతించి ।
యన్నిదాఘుఁడు మ్రొక్కి యర్ఘ్య పాద్యములిచ్చి, లోనికిఁ దెచ్చి యాసీనుఁజే
యన్నంబుభుజియించుఁడనుచుఁ బ్రార్థించిన, నాకునెన్నఁడు కదన్నములుకూఁ

గీ॥ వనిన మాయింటఁగలవు, పాయసగుడాపూప, కలితమోదక సాజ్యముఖ్యంబులైన
భోజ్యములు పెక్కు నీచిత్తమునకువచ్చు, వానిఁగరుణించిభుజియింపవలయుననిః

క॥ ఇవియన్నియును కదన్నము, లపహితమతి మృష్టమైన యన్నంబిడుమ ।
న్నవధూటిఁజూచి యట్టిద, ధన శేషణ పెట్టుమని, నిదాఘుఁ డుపలికెన్ ॥ 24

వ॥ నిదాఘుపత్నియునట్ల శుచియై యలంకరించుకొని మృష్టాన్నంబు పెట్టిన యచ్ఛంబుగా భుజియించి సుఖాసీనుండై యున్న యమ్మునినవలోకించి ప్రశ్రయావనతుండై నిదాఘుండిట్లనియె ॥ 25

సీ॥ మునినాథతృప్తి యయ్యెనె తుష్టిగల్గెనె యాహారమున మనంబలరెనయ్య ।
యెచ్చోటనునికిపట్టెచ్చోటికరుగఁగాఁ దలఁచినారిప్పు డెవ్వలననుండి ।
వచ్చితిరన్న నెవ్వనికినాఁకలిగల దతనికన్నము దిననగునుతృప్తి ।
యాఁకలినాకులే దడుగనేటికిఁ దృప్తిదహనుచేఁ బార్థివధాతువింక ॥

గీ॥ నాఁకలియుధాతువు జలంబునరిగిపోవ, దప్పియునుబుట్టు మర్త్యబృందమునకెల్లఁ
దెలియనాఁకలి దప్పులు దేహులకునె, యవియు రెండును నాకులేవలఘుచరిత ॥26

వ॥ క్షుధపుట్టకుండుటం జేసి నిత్యంబుతృప్తియ మనస్స్వాస్థ్యంబు తుష్టియనఁబరఁగు
ఇవిచిత్తధర్మంబులు. పురుషుఁడువీనిం బొరయండు. నివాసంబెచ్చట యెచ్చో

కింబోయెద వెచ్చటనుండి వచ్చితివని యడిగితి, వినుము. పురుషుం డాకాశంబు భంగివ్యాప్తియు, సర్వగతుండును నగుటం జేసి నీవడిగిన ప్రశ్నం బర్థవంతంబు కాదు. ఎట్టనినం బోవుటయు, వచ్చుటయు, నివాసంబును నాకు లేదనిన నిదాఘుండు మ్రొక్కి పూజించిన నయ్యోగీంద్రుండు యథేచ్ఛం జనియె. నంతసహస్రవర్షం బులు చనిన శిష్యునకుం జ్ఞానదానంబు సేయందలంచి ॥ 253

॥ ప్రమదమునన్ ఋభుండు నగరంబునకుం జనుదెంచి బాహ్యదే
శమునకు వచ్చి నంగనలి శక్షుధనున్న నిదాఘుం జూచిని।
క్యము చెపుమయ్య యేకతముగా నిటులుండఁగ నేల యన్న వా
క్యమువిని గౌరవంబమరఁగా ఋభుఁ జూచి నిదాఘుఁడిట్లనున్ ॥ 254

॥ వినుము భూపతి వాహ్యాళి వెడలి మగిడి, పురికి వడినేగు సమ్మార్గమునకు వెఱచి।
గొలఁగియున్నాఁడననిన నయ్యలఘు తేజుఁ,డని యెమందస్మితసమంచితాస్యుఁడగుచు.

॥ జనపతి యెవ్వం డాతని, జన మెయ్యది యనినన దె గజము మీఁద మహీ।
జనపతి చూడుము వెంటన్, జనునది జనమనిన యోగిచంద్రుఁడు పల్కెన్ ॥256

॥ సామజ మెయ్యది యెక్కిన, భూమీపతి యెట్టివాఁడు పోలింపుమనన్ ।
సామజము క్రింద మీఁదన్, భూమీపతి వాహ్యవాహముల నెఱుఁగరొకో ॥ 257

॥ అనిన యోగీంద్రుం డిట్లనియె ॥ 258

॥ క్రిందిది మీఁదిది యనిపో, లం దెలియదు నాకు దీనిలావు దెలుపుమీ ।
వందముగ ననిన మునికుల, బృందారకనాథుఁ జూచి ప్రియము దలిర్పన్ ॥ 259

వ॥ పలుకులు మాని యాఋభుని పై నతఁ డెక్కి మునీంద్ర మీఁదని
ట్లలవడి వాఁడు రాజు దిగు డై నినువంటిది సామజంబికం।
దెలియుమటన్న నయ్యలఘు తేజుఁ డనూనతరప్రబోధుఁడై
యలరుచు నిట్లు పల్కెఁ బరమాదర వాక్కుల నన్నిదాఘుతోన్ ॥ 260

॥ ఇదియు నాకుఁ దెలియ దెఱిఁగింపుమి దెనీవు, రాజవేను కుంజరంబనైతి ।
నీవనంగ నెవ్వరే నన నెవ్వరే, ర్పఱపుమనిన నతఁడు భయమునంది ॥ 261

క॥ అమ్మహానుభావుని దిగివచ్చి చరణంబులు పట్టుకొని సీవు ఋభుండవు గావలయు నిత రులకు నీయద్వైతసంస్కారంబు కలదే? నీపలుకుల నామానసంబు కలంకం దేరె. నాభాగ్యవశంబున నిన్నుం గంటినని పలికిన ఋభుండిట్లనియె ॥ 262

చ॥ పరమవచోవిశేషముల బ్రాహ్మణవర్య ! త్వదీయమానసాం
తరవిచికిత్స వాపెడి కతంబున వచ్చితి నే ఋభుండమున్

సరవినొనర్చు నీదు పరిచర్యలు మెచ్చినవాఁడ గాన ని
ష్ఫురికరు దెంచి తెల్పితిఁ బ్రబోధవిధం బతిసూక్ష్మవైఖరిన్ ॥ 26

వ॥ అని చెప్పియా ఋభుండు చనియె. నిదాఘుండును గురూపదేశవిశేషంబు
నద్వైతవాసనా వాసితుండై సర్వభూతంబుల నభేదంబునం జూచి ముక్తుండయ్యె
సౌవీరనాయక నీవును తుల్యాత్మరిపుబాంధవుండవై సర్వగతంబైన యాత్మ
జ్ఞానంబు భజియింపుము. నభంబొక్కటయ్యును సితాసితభేదంబుల భ్రాంత
దృష్టులకు భిన్నంబై తోఁచినట్లొక్కండైన యచ్యుతుండు భ్రాంతులకు న
నారూపంబులై తోఁచుననిచెప్పిన నారాజు పరమార్థదర్శనుండై భేదదృష్టి
విడిచె. మైత్రేయ! ఆబ్రాహ్మణుండు జాతిస్మరణాప్తబోధుండై యాజన్మ
మున నపవర్గంబు నొందె ॥ 26

చ॥ భరతనరేంద్రవృత్తము శుభస్థితిఁ జెప్పినఁ బ్రేమ విన్నన
ప్పురుషుల కాత్మమోహములు పుట్టవు నిర్మలబుద్ధి చెందు సం
సరణమునందు నున్నను బ్రసన్నత ముక్తిఘటించు నంచు భా
స్వరవరకీర్తిశాలి యగు శక్తికుమారకుఁ డానతిచ్చినన్ ॥ 26

చ॥ జగదుపకారికారి నుతసత్యవచోనిగమామృతాంబుధి
ప్రగుణవిహారిహారి కకురప్రమదాకుచమండలీగళ
న్మృగమదసారిసారి నిబిరీసభుజాపరిఖేల నావితా
భ్రగపరివారి వారిరుహపత్రరుహోపరిభావిలోచనా ॥ 26

క॥ ప్రణమన్నిధానధానా, ర్పణమాప్తినిధానదానరాజద్గజర
క్షణగాన, గానవిద్యా, చణ వేణ్వసమానమాన సత్కృతస్థానా ॥ 26

భుజంగప్రయాతము.

మహానీలశైలేంద్ర మాణిక్య శృంగా
గ్రహర్మ్యాంతరావాసరంగన్మనోజ్ఞా
మహాలోక నాయాత మానుష్య కేష్టా
వహోరస్థలీనిత్య వాసీకృతాజ్ఞా ॥ 26

గద్య ॥ ఇది శ్రీ సుభద్రాకరుణాకటాక్షవీక్షాలబ్ధకవిత్వతత్త్వపవిత్ర వేంకటామాత్య
పుత్ర కందాళ శ్రీరంగాచార్యకృపాపాత్ర సజ్జనమిత్ర, శ్రీహరిగురు చరణారవింద
వందనపరాయణ కలిదిండి భావనారాయణప్రణీతంబైన శ్రీవిష్ణుపుర
ణంబునందుఁ బ్రియవ్రతుని చరిత్రంబును, అతండు నిజపుత్రులకు స

ద్వీపంబులు పంచియిచ్చుటయు, జంబూద్వీపేశ్వరుండైన యగ్నీధ్రుని సంతాన ప్రకారంబును, భారతవర్షాది నవవర్ష ప్రమాణంబులును, మేరువు ప్రమాణంబును, జంబూద్వీప ప్రమాణంబును, సప్తసముద్ర, సప్తద్వీప ప్రమాణంబులును, మానసోత్తర చక్రవాళశైల ప్రమాణంబును, సప్తపాతాళ ప్రమాణంబులును, నరకలోకవర్ణనంబును, ప్రాయశ్చిత్తంబులును, సూర్యాదినవగ్రహలోకప్రమాణంబులును, సప్తఋషిధ్రువమండల ప్రమాణంబులును, సూర్యరథగతి ప్రమాణంబులును, ఉత్తరాయణ దక్షిణాయనగతులును, విష్ణుపద లక్షణంబును, భూతసంప్లవ ప్రకారంబును, గంగావతరణప్రకారంబును, ద్వాదశమాసంబుల సూర్యరథంబు నడచుప్రకారంబును, చంద్రాదిరథప్రమాణ ప్రమాణంబును, శింశుమారవర్ణనంబును, భరతునిచరిత్రంబును, హరిణలాలనంబును, జడబ్రాహ్మణ చరిత్రంబును, బ్రాహ్మణ సౌవీరపతుల సంవాదంబును, ఋభునిదాఘ సంవాదంబును, ననుకథలంగల ద్వితీయాంశంబునందు ద్వితీయాశ్వాసము ॥ 269



శ్రీ ర స్తు.

# వి ష్ణు పు రా ణ ము.

భావనారాయణకృతము.



## తృ తీ యాం శ ము.



(శ్రీ)ధుర్యనిజనివేదిత
మాధుర్యయుతప్రసాద మహనీయమహా ।
త్త్వాధరితజాతిఘనసం
బాధ జగన్నాథ శ్రీసుభద్రానాథా ॥

క॥ శ్రోత్రసుఖకారిణియును, బవిత్రయునగు భరతుకథనువిని, సుస్థితిమైఁ ।
చిత్రముమదికొనరించఁగ, మైత్రేయుఁడుహర్ష సంభ్రమములంబలికెన్ ॥

చ॥ గురుఁడవు నాపయింగలుగు కూరిమిచేసి సమస్తమేదినీ
ధరసరిదంబురాసుల విధంబు భువస్సువరాదిలోకభా ।
స్వరవిపులత్వముల్, రవినిశాచరముఖ్యనవగ్రహర్క్షసం
చరణమునాగలోకముల చందముచెప్పితి వద్భుతంబుగన్ ॥

వ॥ దేవర్షి దానవాదుల సృష్టియు, చాతుర్వర్ణోత్పత్తియు, నౌత్తానపాద్రి, హైర
కశిప్వాదుల చరితంబులవింటి, నింక మనువుల మన్వంతరాధిపతుల వినిరా
ననిన శ్రీపరాశరుం డిట్లనియె.

గీ॥ ఆఱుమన్వంతరములిప్పుడరిగె వర్తమానమన్వంతరము సప్తమంబునువ్వె ।
భావిమన్వంతరము లేడునీవువినిఁ, దెలియుమిపుడన్నియును నీకుఁదేటపఱుతు॥

వ॥ ప్రథమమనువు స్వాయంభువుండు, ద్వితీయమనువు స్వారోచిషుండు
అందు నీశ్వరశర్వరి, వపుముఖులు సప్తఋషులు, చైత్రకింపురుషాదుల
స్వారోచిష పుత్రులురాజులు. తృతీయమను వుత్తముండు, ఆమన్వంతరం
నందు సుశాంతినామకుండింద్రుండు, సుధాములు, సత్యులు, శివులు, ప్ర
నులు, వనవర్తులు ననవైదు దేవగణంబులు, వసిష్ఠపుత్రు లేడ్వురు సప్తర్షు
లజాదులైన యుత్తమమనుపుత్రులు రాజులు. చతుర్థ మనువు తా

సుండు, ఆమన్వంతరంబునందు సిత్యాశ్వాదులు సప్తవింశతి దేవగణంబులు. శిబి నామధేయుండింద్రుండు, జ్యోతిర్ధామాదులు సప్తర్షులు, నరఖ్యాత్యాదులైన తామస మనుపుత్రులు రాజులు. పంచమ మనువు రైవతుండు. ఆ మన్వంతరంబునందు మను నామధేయుండింద్రుండు. అమితాభవైకుంఠాదులు చతుర్దశ దేవగణంబులు. హిరణ్యరోమాదులు సప్తర్షులు. బలబంధాదులు రైవతపుత్రులు రాజులు. స్వారోచిషోత్తమ తామస రైవతులు నల్వురును ప్రియవ్రతాన్వయసంభవులు. ఆ ప్రియవ్రతుండు విష్ణుదేవు నారాధించి యాత్మవంశసంభవుల నలువురిని మన్వంతరాధిపతులం బడసె. ఆఱవమనువు చాక్షుషుండు. ఆ మన్వంతరంబునందు మనోజవాహ్వయుండింద్రుండు. ఆర్యప్రసూతాదులు పంచదేవతాగణంబులు, సుమేధాదులు సప్తర్షులు. ఊరు, పురుప్రముఖ చాక్షుష పుత్రులు రాజులు. సప్తమమనువు సూర్యపుత్రుండు శ్రాద్ధదేవుండైన వైవస్వతుండు. ఈ మన్వంతరంబునందు ఆదిత్య వసురుద్రాదులు దేవతలు, పురందరాఖ్యుం డింద్రుండు. వసిష్ఠకశ్యపాత్రి జమదగ్ని భరద్వాజ, గౌతమ, విశ్వామిత్రులు సప్తర్షులు. ఇక్ష్వాకుధృష్ట శర్యాతి నరిష్యంతనాభాగవరుణ వృషధ్ర సుమంతులు వైవస్వత పుత్రులు రాజులు. అశేష మన్వంతరంబులయందును ననుపమయగు విష్ణుశక్తి సత్త్వోద్రిక్తమై స్థితియందు దేవత్వంబుచేత నధిష్ఠించియుండు. 6

క॥ వింతగ స్వాయంభువమ, న్వంతరమున యజ్ఞుఁడనఁగ హర్షమున రమా ।
కాంతుఁ డవతారమొందెన, దాంతదురంతాసుర ప్రతతితల్లడిలన్ ॥ 7

వ॥ అక్కాలంబున నార్యాంక మానసులన, దేవతలుపుట్టి మఱియును. 8

సీ॥ వినుము తుష్టియందు విష్ణుండుస్వారోచి, షాంతరమున, నజితుఁడనఁగఁబుట్టెఁ ।
దుషిత దేవగణముతో దుష్టదైత్యసం, తతులకెల్ల గుండెతల్లడిలఁగ ॥ 9

క॥ ఉత్తమమనుకాలమునఁ బ్ర, సత్తిదనర శ్రీవిభుండు సత్యుండనఁగా ।
నుత్తమయగు సత్యకుసం, పత్తి వెలయఁబుట్టె ధర్మపద్ధతినడపన్ ॥ 10

క॥ తామసమనువేళ, జగ, త్స్వామి రమావిభుఁడుపుట్టె సాధ్యకు ధర్మ ।
శ్రీమించ హరియనఁగను, ద్ధామవిశద కీర్తిలతలు ధరణింబర్వన్ ॥ 11

క॥ రైవతమన్వంతరమున, శ్రీవనితావల్లభుఁడు హరియనఁగఁబుట్టెన్ ।
దేవగణంబులతో, సం, భావనసంభూతియందు మహిమదలిర్పన్ ॥ 12

మ॥ తను వైకుంఠుఁడనన్వికుంఠకు సముత్కర్షంబునంబుట్టిన
స్వనజాతాక్షుఁడు చాక్షుషాంతరమునన్ వైకుంఠసంజ్ఞామరుల్ ।

ఘనభక్తిం భజియించు దానవచమూగర్వాంధకారంబు లె
ల్లను జెల్లాచెదరై సనన్ బటుతరోల్లాస ప్రతాపంబితోన్ ॥ 1

క॥ వైవస్వతమనువేళర, మానల్లభుఁడదితికిని సమాహితచిత్త।
శ్రీ వెలయు కశ్యపునకుం, బామనుఁడై జనించె నవ్యప్రతిభన్ ॥ 1

సీ॥ విదళించె నేదేని పదములాంగుష్ఠన ఖాంకురాగ్రమున బ్రహ్మాండభాండ।
మాలించె నేదేని, యు[illegible]ద్గాతజాత మనోంబుజాతతుష్టిఁ।
దేలించె నేదేని దివిజత్తరంగిణీ త్రిభువనంబుల సప్తఋషిజటాలిఁ।
గళగూర్చె నేదేని లలితప్రభావ్యాప్తి నౌత్తానపాది మహార్యగ్రమణుల ॥

గీ॥ నట్టి శ్రీపాదపద్మముదగ్రలీల, ముజ్జగములఁ ద్రిధాన్యస్తముగ ఘటించి।
బలిని వంచించి భువనముల్లలజనేత్రుఁ, డిందమనియిచ్చె మగుడఁ బురందరునకు

క॥ అరయంగా నీమన్వం, తరముల నేడింటఁ బన్నినయనునిమూర్తుల్।
ధరణిపయిఁ బుట్టి ప్రజలం, బరిపాటిం బ్రోచు వృద్ధిఁ బరఁగుచునుండున్ ॥ 1

క॥ కుశలగతి జగములందున, నిశము ప్రవేశించియుండు నిశ్చయముగ స।
ర్వశరణ్యుఁడిట్టులగుట, న్విశిధాత్వర్థంబునమ్ము విష్ణుఁడు తలఁపన్ ॥ 1

చ॥ మనువులు దేవతల్ ఋషులు మానవనాయకులింద్రులిందఱున్
వనజదళాక్షునంశములు, వాక్కులనఁ బనియేమి పద్మలో।
చనుఁ జెజగంబులన్నియును సందియమందఁగ నేలయన్నవో
మునివర భావిమన్వధిపముఖ్యులఁ జెప్పుమటన్న నిట్లనున్ ॥ 1

ఉ॥ త్వష్టతనూజ సంజ్ఞయనఁ దామరసాప్తుని దేవి, సద్వ్రతో
త్కృష్టచరిత్ర, వల్లభునిదీప్తికి నోర్వక, యాత్మయోగవి।
స్పష్టవిభూతిఛాయయను భామనొకర్తు సృజించి భర్తకున్
శిష్టత సేవ చేయుమని చెప్పి తపంబొనరింపఁ బోయినన్ ॥ 1

ఉ॥ ఛాయయుమాయ యేర్పడక సారసబంధుని సేవ యెప్పుడున్
బాయక సేయుచుండె, భయభక్తినయంబు లెలర్పనంత భ।
వ్యాయతితో నపత్యముల, నర్హవిధంబునఁ గాంచె దివ్యతే
జోయుతమూర్తులం బెనుచుచుం బరిపాటి వసించియున్నెడన్ ॥ 20

వ॥ ఇట్లు శనైశ్చరుండును, మనువును, తపతియునను నపత్యత్రయంబుఁ గాంచి।

క॥ మనువును, యముఁడును, యమునయు
నను మువ్వురఁ గాంచి చనియె, నాసంజ్ఞయ, ము।

న్ననయమునఁ గొంతకాలము,
చనఁగ, నమ్మునిసవతితల్లి శపియించుటయుఁ ॥ 22

॥ ఇవ్విధంబున ॥ 23

క॥ ఛాయ జముని శపింపనాచందమరసి, సంజ్ఞ కాదని మదినెన్ని చండకరుఁడు
పోయికనుఁగొనెనపుడు తపోవనమునఁ, గొదమగోడిగ యైయున్న సూర్యపత్ని

శా॥ అశ్వాకారముపూని యాత్మతనుదివ్యచ్ఛాయ పర్వంగ, స,
ప్తాశ్వుండంచితపంచబాణవిశిఖవ్యాలీఢుఁడై యప్పుడ ।
య్యశ్వంజేరి తదీయభవ్యవదనంబాసక్తిఁ జుంబించెఁదా,
శశ్వద్విస్ఫుటహేషికాధ్వనుల, నాశాభిత్తికంపిల్లఁగన్ ॥ 25

వ॥ పరమపతివ్రతాశిరోమణియైన నాసంజ్ఞయు నిజాంతఃకరణ ప్రవృత్తంబు
ప్రమాణంబుగా సకృహనాహయంబు సప్తహయుండయని యంగీకరించి
నిలిచె నీతండును ననంగవశంవదుండై తురంగజాతిచేష్టలు కొన్నిగైకొని మావు
హత్తినన త్తఱింజరమధాతుద్రవ్యోద్గమంబయ్యె. అందువలన రూపసంపన్నులగు
పుత్రులిద్దఱు నాసత్యులనంబుట్టి స్వర్గలోక వైద్యులైరంత ॥ 26

క॥ తమతేమ మునుపటిరూపులు, సముదారక్రీడఁదాల్చి జంపతులుసము ।
ద్యమమున్న నిజవసతికిఁజని, రమితప్రతిభాసమగ్రులగుచు మునీంద్రా ॥ 27

సీ॥ తనతనూభవకు, హితముచేయమదిఁగోరి, ఘనుఁడైన యావిశ్వకర్మ, కమల
బంధునిఁగరసానఁబట్టి యష్టమభాగ, మరుగవైష్ణవతేజమైనదియుఁ ।
బుడమిపైఁబడియు రాపొడియైన నదిగూర్చి, పూదెగాఁగరఁగనాపూదెలోనఁ,
గొంతదానవకులధ్వాంతార్కసిభమైన, చక్రంబుచేసి శ్రీజానికిచ్చెఁ ॥

గీ॥ గొంతశూలంబుచేసి భర్గునకునిచ్చెఁ, గొంతశక్తిగఁజేసి యగ్నుహునకిచ్చెఁ ।
గొంతసురకోటులకునెల్లఁ గోరునాయు, ధములనిర్మించియిచ్చె నయ్యమరశిల్పి ॥

వ॥ ఛాయాపుత్రుండైన మనువు పూర్వమనుసవర్ణుం డగుటంజేసి సావర్ణియనం
బరఁగి యష్టమమనువగు. ఆమన్వంతరంబున నమితాభాదు లేకవింశతిదేవ
గణంబులు. దీప్తిమంతుండు, గాలవుండు, రాముండు, కృపుండు, అశ్వత్థామ,
వ్యాసుండు, ఋష్యశృంగుండు వీరలు సప్తర్షులయ్యెదరు. 29

సీ॥ ఏవీరవరుఁడు మహేంద్రాదులజయించి, సకలలోకములకు స్వామియయ్యె ।
నేకర్మఠుఁడునిరుత్సేకుఁడై శాస్త్రోక్తి, నఖిలాధ్వరంబులు నాహరించె ।
నేపుణ్యుఁడధికసుశ్రీపటుత్వమును బ్రా, ప్యాణభక్తియుక్తిచే నతిశయిల్లె
నేవదాన్యాగ్రణిశ్రీవధూనాధున, కవలీల భువనత్రయంబునిచ్చె ॥

గీ॥ సప్తర్షిసంఘని, ప్రసన్నహారికటాక్షు, నాతికాలాలసమునఁ బాతాళవసతి।
నుండితదనుగ్రహమునఁ బెంపొందనింద్రుఁ, డగుచు, సావర్ణి కాలంబునందు వెలయు

వ॥ విజయ ర్వరివ స్నిర్మోకాదులు సావర్ణిపుత్రులు రాజులుకాఁగలరు, వినుము॥

గీ॥ వర్ణనీయుండు దక్షసావర్ణియనఁగ, ఘనుఁడునవముండు, మనువుసన్మునిప్రశ్రేణ్య
సురలుపారమరీచ్యాదుల రయఁబడిగ, ణంబులద్భుతుఁ డింద్రుఁడున్నతిని వెలయ

వ॥ సవనుండును, ద్యుతిమంతుండును, భవ్యుండును, వసుండును, మేధాతిథియ
జ్యోతిష్మంతుండును, సవ్యుండును సప్తర్షులయ్యెదరు. ధృష్టకేతు, దీప్తికేత
పంచహస్త, నిరామ, పృథుశ్రవః ప్రముఖులు దక్షసావర్ణిపుత్రులు రాజులయె
దరు. దశమమనువు బ్రహ్మసావర్ణి. సుధామ విరుద్ధాదులు సప్తదేవగణంబుల
శాంతినామధేయుండింద్రుండు. హవిష్మత్ప్రభృతులు సప్తర్షులు. నాభాగాదుఁ
పదుండ్రు బ్రహ్మసావర్ణిపుత్రులు రాజులుకాఁగలరు. పదనొకొండవ మను
ధర్మసావర్ణి. విహంగమ, కామగమాదులు లేక త్రింశద్దేవతాగణంబులు. వృ
నామధేయుండింద్రుండు. ఈశ్వరాగ్నితేజోవపుష్మంతులు సప్తర్షులయె
దరు. సర్వత్రగ, సర్వధర్మ, దేవతానీకాదులు ధర్మసావర్ణిపుత్రులు రాజుల
పండ్రెండవమనువు రుద్రపుత్రుండైన రుద్రసావర్ణి. ఋతుధామాఖ్యు
డింద్రుండు. హరితరోహితాదులు పంచదశదేవగణంబులు. తపస్వి, సుత
తపోమూర్తి, తపోరతి, తపోద్యుతి, ధృతి, తపోధనులన సప్తర్షులయ్యెదరు. దే
వ, దుపదేవాదులు రుద్రసావర్ణిపుత్రులు రాజులుకాఁగలరు. త్రయోద
మనువు రౌచ్య నామధేయుండు. సుత్రామ, సుకర్మ, సుధర్మాదులు, త్రయ
స్త్రింశద్దేవగణంబులు. దివస్పతినామధేయుండింద్రుండు. చాక్షుష, పవిత్ర
కనిష్ఠ, భ్రాజక, వాచావృద్ధాదులు సప్తదేవగణంబులు. అగ్ని, బాహుశ
ప్రముఖులు సప్తర్షులు. జౌరుంభ, హితబుద్ధ్యాదులు భౌవుర్యపుత్రు
రాజులు నగుదురు. ఇది చతుర్దశమన్వంతర ప్రకారంబు.

చ॥ వినుము చతుర్యుగాంతమున వేదములన్నియు విప్లవంబు నొం,
దినఁ గృతవేళఁ దొంటిగతి నేర్పునవాని వసుంధరాస్థలిన్।
బనుపడఁజేయ సప్తఋషిమండలి తానయియుండు పద్మలో,
చనుఁడు చతుర్దశాఖ్యగల సర్వమనుప్రవరాంతరంబులన్॥

క॥ ప్రతికృతయుగమున వసుధన్, జతురతమను వుదయమందు సమ్యగ్ధర్మ।
ప్రతిపాలకులగుదురు, తత్సుతులు తదన్వయము వెలయు సూనృతలీలన్॥

క॥ సురలు హవిర్భాగములా, దరమునఁ గైకొంద్రు సవనతంత్రంబుల భా।
సురులై మన్వంతరములఁ, బరిపాటిన్యాయుజాక పటలి యలరఁగాన్॥

గీ॥ ఇంద్ర, దేవ, సప్తర్షి, మను, మనుపుత్రులు మన్వంతరాధికారులుగా నెఱుంగుము. ఇట్లు చతుర్దశమన్వంతరంబులు సహస్రయుగపర్యంతంబగు నొక్క దివసంబగు. అదియొక్కొక్క కల్పంబనంబరఁగు. రాత్రియుఁ దావత్ప్రమాణప్రమిత రాత్రిల్లు. 37

వ॥ కమలజుఁడౌ, రమాపతి జగంబులుమూఁడును మ్రింగి, శేష తల్పమున లయాంబురాశిసలిలంబులపైఁ బవళించి, తన్నిశాంతమునఁ బ్రబుద్ధుఁడై సుజనతత్పరత భువనాళిఁదొంటి చందమున సృజించు, రాజసగుణప్రచురీభవదాత్మతంత్రుఁడై ॥ 38

గీ॥ మనువులు ఋషులింద్రుండును, మనుపుత్రులు దివిజులును రమావిభునంశం బనుపమనత్వోద్రిక్తం, బనియెఱుఁగుము నీమనమునునార్యప్రణుతా॥ 39

వ॥ చతుర్యుగంబులందు నీవిష్ణుదేవుండు స్థితి వ్యాపారలక్షణుండై యుగవ్యవస్థలు నడుపు. కృతయుగంబునఁ గపిలాది రూపధారియై సర్వభూతహితరతుండై, విమలజ్ఞానదానంబు సేయు. త్రేతాయుగంబునఁ జక్రవర్తి స్వరూపంబున జగద్రక్షణంబు సేయు. భూత, భవిష్య, ద్వర్తమానకాలంబుల జగంబులు రక్షించు. మైత్రేయ ! మన్వంతరంబులు చెప్పితి నింక నేమిచెప్పవలయుననిన గురువునకు శిష్యుం డిట్లనియె ॥ 40

క॥ వేదవ్యాసమునీంద్రుఁడు, వేదద్రుమమేవిధమున విభజించెఁదదీ యాదృతశాఖలవెన్ని, శుభోదయుఁడతఁడెన్ని మారులుదయించె మహిన్॥ 41

క॥ హరిపుట్టించు జగంబులు, హరియందును నిలుచుఁ బొలియుహరివలననెయా । హరికన్న సృష్టి రక్షణ, హరణములకు లేదు కారణాంతరమరయన్ ॥ 42

వ॥ అనియడిగిన శ్రీపరాశరుం డిట్లనియె ॥ 43

క॥ వేదతరువునకు, శాఖా, భేదములు సహస్రముల వి పేర్కొనిచెప్పన్ । గాఁదరమెట్లైనఁ జెప్పెద, నాదృతి సంక్షేపమున మహాత్మా తెలియన్ ॥ 44

గీ॥ తామరసలోచనుఁడు, ప్రతిద్వాపరమున, నతులితప్రభ, వ్యాసుఁడై, యవత రించి,
యేకమగు వేదరాశి ననేకభంగి, వెలయఁజేయు జగద్ధితకలనఁ గూర్చి ॥ 45

క॥ బలవీర్య బుద్ధి తేజము, లలవడ వల్పములు మానవాదులకనియ । య్యాలఘుండు వేదభేదము, లెలమినొనర్చెం, దదీయహితమతియగుచున్ ॥ 46

వ॥ వేదంబులు విభజించి, విస్తరించుటంజేసి వేదవ్యాసుండన వాసుదేవుండు వెలయు. వినుము. ఈ వైవస్వతమన్వంతరంబున నిరువదియెనిమిదిమార్లు వేదంబు

మహర్షులచేత వ్యస్తంబయ్యె. ఈ వైవస్వతమన్వంతరంబున ద్వాపరయుగం
బుల నిరువైయెనమండ్రు వ్యాసులుచనిరి. ప్రథమంబుద్వాపరంబున స్వాయం
భువుండు తానవేదంబువ్యస్తంబుచేసె. ద్వితీయద్వాపరంబునఁ బ్రజాపతి
వ్యాసుండయ్యె. తృతీయద్వాపరంబున శుక్రుండు, చతుర్థద్వాపరంబున బృహ
స్పతి, పంచమద్వాపరంబున సవిత, షష్ఠద్వాపరంబునఁ బ్రభువైన మృత్యు
సప్తమద్వాపరంబున నింద్రుండు, అష్టమద్వాపరంబున వసిష్ఠుండు, నవమ
ద్వాపరంబున సారస్వతుండు, దశమద్వాపరంబున శ్రీధాముండు, ఏకాదశం
బునఁ ద్రివృష, ద్వాదశంబున భరద్వాజుండు, త్రయోదశంబున నంతకుండు
చతుర్దశంబున ధర్ముండు, పంచదశంబునఁ ద్రయ్యారుణుండు, షోడశంబున ధన
జయుండు, సప్తదశంబునఁ గృతంజయుండు, అష్టాదశంబున ఋణంజయుండు
తదనంతరంబు భరద్వాజుండు, తదనంతరంబ గౌతముండు, తదనంతరం
హర్యాత్మ, తదనంతరంబ వేనుఁడు, తదనంతరంబవాజశ్రవుండు, తదనంతర
బసోముండు, తదనంతరంబ శుష్మాయణుండు, తదనంతరంబ తృణబిందుండు
తదనంతరంబ ఋక్షుండు, తదనంతరంబ వాల్మీకి, అవ్వల,నస్మజ్జనకుండైన శ
తదనంతరంబ నేను, నాతరువాత జాతకర్ణుండు, అవ్వల కృష్ణద్వైపాయనుండు
ఈ యిరువదియెనమండ్రును నతీతవ్యాసులు. వీరిచేత వేదంబు నాల్గుగు విధ
బుల ద్వాపరాదులయందు విభజింపంబడియె వినుము॥

క॥ భావిద్వాపరమున, సం, భావితుఁడగు ద్రోణసుతుఁడు భాసిలువ్యాసుం
డై, వేదచయము విస్మృత, మై, వెలయింపఁ గనుభూసురాన్వయతిలకా ॥

సీ॥ ప్రణవాఖ్యమేకాక్షరము బృహత్వముబృంహ, ణత్వమ్ముగలకతన మునీంద్ర,
బ్రహ్మంబుసుమ్మందు బరఁగు భూర్భువరాది, సప్తలోకంబులు సకలవేద।
తతియుసర్వంబును దాదృక్ప్రభాసనం,భావిత, మది వాసుదేవరూప,
మక్షయ్యమధికగుహ్యము జగదుత్పత్తి,రక్షణనాశకారణముయోగ ॥

గీ॥ సాంఖ్యనిష్ఠాపరులకు శాశ్వతపుసుగతి, యమృతమాద్యంతరహిత మనంతమజ
మట్టిహరిరూపక ప్రణవాభిధాన, మానిత బ్రహ్మమునకు నమస్కరింతు ॥

వ॥ ఆ ప్రణవంబు నందునున్న ఋగ్యజుస్సామాథర్వణవేదంబులు సర్వాత్మక
డగు పుండరీకాక్షుండుతాన వేదంబులు శాఖలునై విభజింపంబడియె ॥

క॥ ఆదిని,వేదంబుచతు, ష్పాదంబై శతసహస్ర పరిమితమై లో।
కాదృతమై వెలుగొందుశు, భోదయతన్ సకలసన్నుతోన్నతచరితా ॥

వ॥ తదనంతరంబ సర్వకామధుక్కైన యజ్ఞంబయ్యె. అంతమత్పుత్రుండైనవ్యా
డిరువైయెనిమిదవ ద్వాపరంబునఁ జతుష్పాదంబగువేదంబు ఋగ్యజుస్సామ

థర్వణరూపంబుల నాలుగు తెఱంగులుగా విభజించె. ఆకృష్ణద్వైపాయనుండు
సాక్షాన్నారాయణుండుగా నెఱుంగుము. అతండు దక్క నన్యులకు నపార
భారతసాగరంబు నిస్తరింప శక్యంబె. ఆవ్యాసుండు బ్రహ్మచేత నియుక్తుండై
వేదంబు నాల్గు తెఱంగుల విభజించి శిష్యులం జదివించె. తత్ప్రకారంబు
వినుము ॥ 52

సీ॥ శమదమప్రతిభావిశాలుండు పైలుండు, కృతమతిం జేసె ఋగ్వేదపఠన।
సద్గుణాయనుండు వైశంపాయనుండు, శుభా,యతి,యజురామ్నాయమధిగమించె।
వినుతనిష్కామి జైమిని మునిస్వామిసం, భావనాసియతి సామము పఠించె।
మహనీయతరమహామతిమంతుండు సుమంతుం, డధిక ప్రభ,నథర్వమధిగమించె॥

గీ॥ రోమహర్షణతనయుండు రుచిరవినయుం, డతులితఖ్యాతుండౌ సూతుండు లపురాణ।
సహితసకలేతిహాసముల్ చాలం జదివె, నతుల యవ్యాసకరుణా కటాక్షమహిమ॥

వ॥ వేదంబులయందు యజుస్సులచేత యజుర్వేదంబును, ఋక్కులచేత ఋగ్వేదం
బును సామంబులచేత సామవేదంబును, నథర్వంబులచేత నథర్వవేదంబును
నయ్యె. అయ్యథర్వంబు రాజులకు సర్వకర్మ సాధనంబయ్యె. ఇట్లు వేదవ్యా
సుండు వేదకాననంబును జతుర్విధంబుగా విభజించె. అందు పైలుండు ప్రథ
మంబు ఋగ్వేదంబు నింద్ర ప్రమతికి నిచ్చె. ఆయింద్రప్రమతి భాష్కలున కిచ్చె.
ఆభాష్కలుండు బోధ్యాదులైన శిష్యుల కిచ్చె. ఆబోధ్యాదులవలన యాజ్ఞ
వల్క్య పరాశరులు గ్రహించిరి. ఇట్లు శాఖోపశాఖల ఋగ్వేదంబు వెలసె. ఆ
యింద్రప్రమతి నిజపుత్రుండైన మండూకేయునిం జదివించె. అతనిశిష్య
ప్రశిష్యులవలన విస్తరిల్లె. అతనిపుత్రుండు వేదమిత్రుండు ముద్గల, గోముఖ,
వాచ్య,శాలీయ, శౌశికులను శిష్యపంచకంబునకు సంహితాపంచకంబుం జెప్పె.
ఇవ్విధంబున ఋక్కులు బహువిధంబులై కీర్తితంబులయ్యె ॥ 54

క॥ మునివర వైశంపాయన, మునివరుండు యజుర్నిగమము మును పిరువదియే।
డనుపమశాఖలుగావించి, నయంబొప్పంగ నొసంగె శిష్యుల కెల్లన్ ॥ 55

సీ॥ మునివరుల్తొల్లి సమూహమై మేరుభూ, ధరకూటమున నుండి తమరు చేసి।
నొక్కమర్యాద శిష్యులం గూడి యే, ఋషి,యైన నచ్చోటకు నరిగ నేని।
యతనికి సప్తరాత్రాంతరంబున,బ్రహ్మ, హత్యవాటిలునని యది యెఱింగి।
మును లెవ్వరచ్చోటికిని బోవరంత వై, శంపాయనుండు శిష్యసమితితోడ ॥

గీ॥ నచ్చటికిం బోయి యవశాత్ముండగుచు నపుడు, స్వప్రియుని నొక్కబాలకు చరణ తాడ।
నాభినిహతునిం జేసిన నాక్షణంబె, భవ్యునకు నాయనకు వచ్చె బ్రహ్మహత్య ॥ 56

క॥ మునిపతి వైశంపాయనుఁ, డనునయమున శిష్యవరులనను, "సద్వ్రతమీ ।
రొనరింప వలయునాకున్, బనుపడనీ బ్రహ్మహత్య పాసెడుకొఱకున్" ॥ 57

వ॥ అని గురుండు చెప్పిన ॥ 58

క॥ నిరుపమమేధానిధిభా, స్కరతేజుఁడు వారిలోనచతురుఁడు ప్రజ్ఞా ।
చరణుండు యాజ్ఞవల్క్యుఁడు, గురునకునిట్లనియె మెండుకొను సద్భక్తిన్ ॥ 59

గీ॥ అల్పతేజులతి క్లిష్టులైనవీరి, చేత నేమగు చేసినచేయఁదగుదు ।
నేనయనిపూనిపల్క నమ్మౌనివరుఁడు, పల్కెఁగోపారుణానన పద్ముఁడగుచు ॥ 60

క॥ ద్విజవరుల, ధిక్కరించుటఁ, బ్రజనితమైయిపుడు ఘోరపాపమునిన్నున్ ।
భజియించెఁదొలఁగి పొమ్మ,క్కజముగ మాచదువు మగుడ గానిచ్చియనన్ ॥ 61

చ॥ గురుఁడనినీకు నే హితముగూర్చి యొనర్చెదనన్న నిట్టిని
ష్ఠురతరభాషలాడెదవు చొప్పడునే భవదీయవేదవా ।
గ్భరణముదీనిఁగొమ్మనుచుఁ గ్రక్కనఁ గ్రక్కెనరక్తసిక్తభీ
కరయజురాగమంబుఁగొనెఁ గ్రమ్మరనామునిసార్వభౌముఁడున్ ॥ 62

వ॥ ఇట్లు గురునిముందరఁ గ్రక్కినయజుస్సులు తిత్తిరిరూపంబున శిష్యులు గ్రహించి వారలు తైత్తిరీయులనంబరఁగిరి, గురుప్రేరితులై యధ్వర్యులు బ్రహ్మహత్యావ్రతంబుచరించి రంతయాజ్ఞవల్క్యుండు స్వేచ్ఛంజని యజుస్సులభిలషించి ప్రాణాయామపరాయణుండై, యాదిత్యునుద్దేశించి యిట్లు స్తుతియించె ॥ 63

సీ॥ సకలవేదాత్మమోక్షద్వారభూతదీ, వ్యత్తేజనీకివేవందనములు ।
సోమాగ్నిభూతసౌషుమ్న తేజోధారి, భాస్కర నీకివే ప్రణతితతులు ।
కాలస్వరూపయక్షరరూపవిష్ణుస్వ, రూపకనీకివే మ్రొక్కుగములు ।
సురపితృరక్షణోత్సుకహిమ ఘర్మాంబు, కారి,నీకివె నమస్కారచయము ॥

గీ॥ అంధకారాపహరణ, లోకాధినాథ, సర్వకామధురీణ, విశ్వప్రపంచ ।
కారణ,పవిత్రకిరణౌఘధారి,యభ్ర, మణియొనర్చెదనివె ప్రణామములునీకు ॥ 64

క॥ నీవుదయింపక, సత్కర్మావళికి జనుండయోగ్యుఁ డఖిలాంబువులుం ।
గావుపవిత్రములట్టి శు,భావహునకు నీకొనర్తు నభివందనముల్ ॥ 65

క॥ నీకిరణంబులుసోఁకిన, లోకంబుపవిత్ర మగునులోకనయన, పు ।
ణ్యాకరుఁడా తండెవ్వఁడు, నీకమనీయాంఘ్రి భక్తినిరతుఁడు తలఁపన్ ॥ 66

॥ అమృతమయవాజు లేదేవ హైహయరథముఁ, దాల్చిదుర్గమగగన పథప్రచార।
చారుమైఖరిఁడిరుగునా సకలలోక, లోచనునినిన్నుఁ గొలుతుసుశ్లోకచరిత॥ 67

॥ సవిత, సూర్యుండు, భాస్కరుండు, వివస్వంతుండు, ఆదిత్యుండు, దేవాద్యాది
భూతుండునునైన నీకు నమస్కారంబు॥ 68

యగ్రాహి॥

సూర్య తిమిరోన్నమదహార్యభిదురీభవద వార్యచటులోగ్రతరధుర్యవిలసద్భా।
గర్యభుజగాధిపతిధార్యసురసంచయవిదార్యసమరూపబలధైర్యనుత సంజ్ఞా
భార్యనిజకృత్య సురకార్య నిగమాంతసువిచార్య జగదర్చన కదర్యగుణరాశీ।
వర్యహరణప్రవణశౌర్యనలినీ సుఖదచర్య సతతప్రణమధార్యనినుఁగొల్తున్॥ 69

వ॥ అనియనియంతభక్తి నిగమార్థములన్నినుతించు యాజ్ఞవ
ల్క్యునికిఁబ్రసన్నుఁడై పలికె నుగ్రమయూఖుఁడు వాజిరూపుఁడై।
మునివర యేమిగోరితి వమోఘముగా నొసగూర్తునీవుగో
రినపనియన్న నన్నయవరిష్ఠుఁడు చేతులుమోడ్చి యిట్లనున్॥ 70

॥ నలినాప్త మద్గురునకు లేనియాజుష, సంహిత మీకటాక్షముననాకుఁ।
గావలెననినసనాకపటువాజితనూధ, రుఁడు యజుస్తతులు విప్రునకునొసఁగె।
సమ్మునీంద్రుండు శిష్యవరులఁ జదివించె, వాజిసూక్తపఠనవశతవారు।
వాజినులనఁగ భూవలయమునఁ బ్రసిద్ధులైరికణ్వాదుల య్యాగమంబు॥

॥ కొలఁదిమీరఁబదేను శాఖలుగఁ జేసి, రసఘులగు యాజ్ఞవల్క్యశిష్యవరులుర్వి।
నెగడఁజేసిరి మిగుల సన్నిగమమహిమ, మానితాచార మైత్రేయమానివర్య॥ 71

॥ జైమినిముని భేదించెన్, సామనిగమతరువుఁబెక్కుశాఖలుగఁదదీ।
యామితమహిమమువినుచే, తోమోదమునిండఁగ్రమముతోమునినాథా॥ 72

వ॥ జైమినిమునీంద్రుండు సుమంతుని, దత్పుత్రుని సుపార్శ్వుని, నొక్కొక్క
సంహితఁజదివించె. తత్పుత్రుండు సుకర్ముండు సహస్రసంహితాభేదంబుచేసె
ఆసుకర్ముని శిష్యులు హిరణ్యనాభ, కౌసల్య, పౌష్పింజప్రముఖులైన యుదీచ్యు
లాసహస్ర సంహితలు గ్రహించి సామగాతలైరి. హిరణ్యనాభునివలనఁదచ్ఛి
ష్యులు లోకాక్షి, కౌథుకి, కర్మంధి, లాంగలి, దౌష్యందిప్రముఖులు సంహి
తలు గ్రహించిరి. వారిశిష్య ప్రశిష్యులవలన బహుసంహితలు ప్రవర్తించె॥

॥ ధర్మనిరత యథర్వవేదముసుమంతుఁ, డాత్మశిష్యుఁగబంధునినధిగమింపఁ।
జేసె నాతండు చదివించె శిష్యుదేవ, దర్శు, నాతఁడు పథ్యునకుఁదగఁగఁజెప్పె॥

వ॥ దేవదర్శశిష్యులు మేధ, బలి, బ్రహ్మ, శౌల్కాయని, పిప్పలాద ప్రముఖుల
చదివిరి. పథ్యశిష్యులుజాజలికుముదాది శౌనకులు ముగ్గురును సంహితలు చద
విరి. శౌనకుండు రెండు సంహితలుచేసె. ఒక్క సంహితబభ్రునకును, రెండః
సంహిత సైంధవునకునిచ్చె. సైంధవుండు రెండుగా భేదించి ముంజకేశనకున్ను
కిచ్చె. మఱియు నాంగీరసప్రముఖు లనేకశాఖలుచేసి రిది యథర్వప్రకారంబు

గీ॥ అంచితాఖ్యానములునుపాఖ్యానములన, గాథలవిశాలతాఖ్యాతి గలపురాణ।
సంహితలుచేసిరోమహర్షణసుతునకు, సూతునకుఁజెప్పెవ్యాసుఁడస్తోకమహిమ

వ॥ సుమంతుండును, అగ్నివర్చుండును, మిత్రాయువు, శాంశపాయనుండు, అకృ
వ్రణుండు, సావర్ణియునన నార్వురు సూతునిశిష్యులు పురాణంబులు, సంహి
తలుచదివిరి. కాశ్యపి, శాంశాయన, రోమహర్షణియును సంహితాత్రయంబ
చదివిరి. బ్రాహ్మంబు, పాద్మంబు, వైష్ణవంబు, శైవంబు, భాగవతంబు, నా
రదీయంబు, మార్కండేయంబు, ఆగ్నేయంబు, భవిష్యత్పురాణంబు, బ్రహ్మకై
వర్తనంబు, లైంగంబు, వారాహంబు, స్కాందంబు, వామనంబు, కౌర్మంబ
మాత్స్యంబు, గారుడంబు, బ్రహ్మాండంబు, అనునష్టాదశపురాణంబులు స
ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితంబులు తెలుపుచుండు. మైత్రేయా
ఇప్పుడు నీకుఁజెప్పు నిప్పురాణంబు వైష్ణవంబను మూఁడవ పురాణంబు. ఇంద
సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితంబులయందును, సమ
వస్తువులయందును, భగవంతుండైన విష్ణుండ ప్రతిపాదింపంబడు, షడంగ
ములు, నాల్గువేదంబులు, మీమాంసయు, న్యాయవిస్తరంబును, పురాణ
బును, ధర్మశాస్త్రంబును నన చతుర్దశవిద్యలు, ఆయుర్వేదంబును, ధనుర్వేద
బును, గాంధర్వంబును, నర్థశాస్త్రంబునుగూడ నష్టాదశవిద్యలు చెప్పితి. బ్రహ్మ
ర్షులు, దేవర్షులు, రాజర్షులునన ఋషిప్రభృతులు మూఁడు తెఱంగులు. ఇవ
ధంబున శాఖలు, శాఖాభేదంబులు, శాఖాకర్తలు, తద్ధేతువులుం జెప్పి
సర్వమన్వంతరంబులయందును, శాఖాభేదంబులు సమంబ. ప్రాజాపత్యశ్రు
నిత్యంబ. ఇతరంబులు వికల్పంబులు. ఇంక నేమియడిగెదవనిన మైత్రేయ
డిట్లనియె.

క॥ మునివర నేనడిగినవెల్లను నానతియిచ్చితిరి సలక్షణముగ నిం।
క నొకటి యడిగెదనిన్నుం, బనివడి యదియానతిమ్ము ప్రస్ఫుటభంగిన్ ॥

సీ॥ సర్వజ్ఞ యీసారసభవాండ మధ్యస్థి, తాశేషలోకంబులందు, స్థూల,
సూక్ష్మరూపములగు చున్నిండిస్థావర, జంగమంబులు ప్రాణిసముదయములు।

త్రైలోక్నపనెడలేక క్రిక్కిరిసి స్వకర్మ, బంధబంధములయి పరఁగితుదను,
యమునివశమునొంది యాతనల్పొంది కర్మానుగుణంబులై యోనులందుఁ ॥

గీ॥ బుట్టి సుఖదుఃఖములఁ గాంచి భూరికర్మ, వశత నెప్పుడు బోవుచువచ్చుచుండు ।
నిది సకలశాస్త్రనిర్ణయం బిందునొకటి, యడుగుచున్నాఁడ నానతీయంగవలయు॥

మ॥ శమనాజ్ఞావశవర్తులౌట నిజమీజంతువ్రజంబుల్, యథా,
ర్థముగా నొక్కటియానతిమ్ము మునిచంద్రా! యెట్టికర్మంబుచే ।
శమనుం జూడక శాశ్వతప్రతిభమై జంతూత్కరంబొందు ది,
వ్యమహావైభవ మట్టికర్మము వినన్ హర్షంబు పుట్టెన్మదిన్ ॥ 80

చ॥ అనినఁ బరాశరుండు పరమాదృతి నిట్లను దొల్లి భీష్మునిం,
గని నకులుండు నీవడుగు కైవడి నట్లడగంగ జాహ్నవీ ।
తనయుఁడు మాద్రిపట్టిఁ గని ధార్మిక! తొల్లి కళింగదేశసం,
జనితుఁడు విప్రుఁ డొక్కఁడు ప్రసన్నత నాకడ కేగు దెంచినన్ ॥ 81

వ॥ జాతిస్మరుండును, విజ్ఞానసంపన్నుండును నగు నమ్మునీంద్రునిం బూజించి నీవడి
గిన యర్థంబమ్మునీంద్రునినడిగిన నమ్మహానుభావుండు నాకుం జెప్పిన రహస్యంబు
నీకుం జెప్పెదనని యప్పితామహుండు మనుమనిం జూచి యమునకుం గింకరు
సకుఁ దొల్లియొక్క సంవాదంబు ప్రవర్తిల్లె. దానిం జెప్పెద వినుమని
యిట్లనియె ॥ 82

ఉ॥ పంకజమిత్రసంభవుఁడు ప్రస్ఫుటపాశవిపాశహస్తుఁడై,
కింకరుఁ జేరఁబిల్చి పలికెం జెవిలో హరిభక్తులున్న యా ।
వంకకుపోకు మేనును ధ్రువంబుగ నన్యులకుం బ్రభుండ ని,
శ్శంకిత వైష్ణవావళికి సత్యము నాథుఁడఁగాను గింకరా ॥ 83

చ॥ అమరవరార్చితుండయిన యబ్జజశాసనమూఁది సర్వలో,
కముల హితాహితంబు, లవికంపితలీల నెఱింగి, శాసక ।
త్వమున వెలుంగు నాకును యథాకథనంబుగ శాసనుండు శ్రీ,
రమణుఁడు, సద్విహంగమతురంగమసాది సుమీ తలంపఁగన్ ॥ 84

గీ॥ బహువిధవికల్పనాసముద్భాసియయ్యు, జగమిదంతయుఁ బద్మలోచనుఁడె సుమ్ము।
కటకకుండలమకుటాదికప్రభేద, కలితమయ్యును హేమమొక్కటియ కాదె ॥

క॥ అవనీపరమాణువు, లప్పవనగతిం, గానుపించుఁ బవనమణఁగఁగా ।
నవనియ యానట్లన గుణ, నివహ మణఁగ జగము పద్మనేత్రుఁడు సుమ్మీ ॥ 86

చ॥ అమరనరప్రపూజ్యచరణాంబురుహుండగు, నిందిరాధవూ,
రమణు భజించి మ్రొక్కుచు, విరాజితపూజితవృత్తినున్నయ ।
య్యమలుని దండకుం జనకుఁ డాజ్యసమేధితవహ్నిఁ గ్రగ్గఱన్,
గనురునుగాక దేహములు గాఢశిఖావిశిఖాభిఘట్టనన్ ॥ 87

చ॥ అనిన భటుండు కేల్మోగిచి యర్యమసూతికి నిట్లనుం, జనా,
ర్దను పదభక్తుఁడై వెలయు ధన్యుఁడు మానవుఁ డెట్టివాఁడు, త
ద్వినుతచరిత్ర మెట్టిది, వివేకనిధాన! యనూనసత్కృపా,
భినయకటాక్షవీక్షల గ్రహింతఁ గన్గొని చెప్పవేయనన్ ॥ 88

సీ॥ నిజవర్ణధర్మ నిర్ణిద్రుఁడై శత్రుమి, త్రులయందు సమబుద్ధి గలుగునతఁడు,
పరసతి పరధనాపహరణ విముఖుఁడై, లేశమైనను హింసలేని యతఁడు ।
స్థిరమనోవృత్తియై గురు కలికాల క, ల్మషరహితాత్మత మలయునతఁడు,
హృదయ విశ్రాంతలక్ష్మీశుఁడై సమలోష్ట, కాంచనాశ్మత్వంబు గలుగు నతఁడు ॥

గీ॥ సత్యవాచాభిరతి, సౌజన్యనియతి, సతతహరిచింతనామతి, సంభృతధృతి ।
కలితసత్కర్మగతియును గలుగునతఁడు, విష్ణుపదభక్తుఁడనుచు భావించుమదిని ॥

వ॥ మఱియును ॥ 90

గీ॥ స్ఫటికశైలశిలామలప్రభుఁడు విష్ణుఁ, డెక్కడెక్కడ దోషసమేధమాన ।
మానవమనోనివాసమెమ్మాడ్కినుండు, జ్వలనకీలాప్రతాపంబు జలములందు ॥

ఉత్సాహ॥ అమలమతి, యమత్సరాత్ముఁ డధికశాంతుఁ డతిశుభో,
ద్గమచరిత్రుఁ డఖిలమిత్రతముఁడు ప్రియహితార్థవాక్ ।
సముదయుండె మాయుఁడు గతగర్వుఁ డెవ్వఁడట్టి యు,
త్తమునిహృదయమున వసించు దానవారి నిత్యమున్ ॥ 92

గీ॥ వాసుదేవుఁడు నిజమనోవర్తిపద్మైన, పురుషుఁడతిసౌమ్యరూపుఁడై పొలుచు జగతి ।
నయముమీరిన చక్కఁదనమున ధరణి, శలరసము సాలపోతంబు తెలుపుఁగాదె ॥

సీ॥ మహనీయ యమనియమావిధూతసకల, కల్మషయోగసంకలనహితుల,
ననుదినవిష్ణుచింతనసక్తచిత్తులై, పరితోషమునఁ బొంగు భవ్యమతుల ।
మర్దితమదమానమత్సరోద్వేగులై, పరమశాంతతనున్న పురుషవరుల,
దూరతోగిళసహంకారలోభక్రోధ, ములై వికారములేని పావనులను ॥

గీ॥ దూరమునఁ జూచి మ్రొక్కి యాత్రోవఁ జనక, తొలగి దవ్వుగఁ జనుము నీకొలఁది గాదు
తలఁపవారల మహిమ నీతెఱఁమె దీని, సరణి తెలిపితి నీకుఁ గింకరవరేణ్య ॥ 94

॥ అరిదరశార్ఙ్గనందకగదాఢ్యభుజాగ్రుఁడైన యిందిరా,
వరుఁడువసించియున్న జనవంద్యుని మానససీమఁ, బావనం ।
కరమునవచ్చునెట్లు? సువికస్వరభాస్వరరశ్మివారభా,
స్కరుఁడు వెలుంగ, నంధతమసంబు వెసంబరిపోక నిల్చునే ॥ 95

। పరధనము గొనుచుజంతూ, త్కరములఁ జంపుచు వృథానృతములాడుచు ని ।
ష్ఠురవృత్తిఁ దిరుగు, నశుభా, కరునిమది, ననంతుఁడుండఁగాఁ దలఁచఁడొగిన్ ॥96

॥ ఒరుసిరికోర్వలేక సుజనోత్తమనింద యొనర్చుచుం, ద్విజో,
త్కరగురుపూజఁబోవిడిచి, దానము ధర్మములేకయున్న దు ।
శ్చరితుని మానసంబున నిశాచరకాననదావవహ్నియౌ,
హరి నివసించియుండఁడు యథార్థము దీనినెఱుంగుకింకరా ॥ 97

॥ మిత్రబాంధవ పుత్రకళత్రమాతృ, పితృదుహితృభృత్యవితతిపైఁ బ్రేమవిడిచి ।
యర్థతృష్ణ సదాశాఠ్యమాచరించు, దుష్టచేష్టుండు విష్ణుభక్తుండుకాఁడు ॥ 98

॥ ఖలుఁడు విమార్గవర్తనుఁడు కష్టుఁడు దుష్టసమాగముండ మం
గళమతి, ఘోరపాపకృతకర్మనిబంధన బద్ధుఁడైన య ।
త్తులుపి, మనుష్యగర్దభము దూకొననేర్చునె, వాసుదేవ ప,
జ్జలరుహభక్తివాసన, యసహ్యముగానె తలంచునెప్పుడున్ ॥

॥ ఏనునునిజ్జగమెల్లరు, మానారీరమణుఁ డనుచుమది నెన్నెడున ।
మ్మానవమణిఁగని దూరము, గానేగుఁడుతొలఁగి బుద్ధిగలిగినయేనిన్ ॥ 100

త్సాహ॥ కమలనయన వాసుదేవ కలుషహరణ విష్ణుదే
వమహీధరణ నిఖిలమౌనివంద్యచరణ యచ్యుతా ।
యమలశంఖచక్రధారి యరసిపోవునన్నునం
చుమదినెంచు పుణ్యుఁ దేరిచూడకేగుదవ్వుగాన్ ॥ 101

పంచచామరము॥ హరేజగన్నివాస కేశవాచ్యుత శ్రియఃపతే
మురాసురాంతకా ప్రమేయమోక్షదావ, మాంప్రభో ।
పరాత్పరేశయంచునెంచు భాగ్యశాలియెవ్వఁడా
వరేణ్యుఁ డున్నత్రోవఁబోవవద్దు సుమ్ముకింకరా ॥ 102

చ॥ వనజదళాక్షుభక్తజనవర్గముడగ్గరఁ బోవరాదు, పో
యినయపుడే మదాంధదనుజేభఘటావిఘటీకృతప్రచం ।
డనిబిడరోషకేసరి భటా! హరిచక్రము విక్రమించినన్
మనతలలెల్లఁబోవు, ననుమానములేదిది నీకుఁజెప్పితిన్ ॥ 103

వ॥ అనిచెప్పి కళింగబ్రాహ్మణుఁడు గంగాపుత్త్రున కిట్లనియె ॥ 10

క॥ కమలాప్రభవుఁడు నిజభటు, సమరఁగబోధించెఁ గౌరవాన్వయ! నాకా।
కమలాప్రభవుఁడె కరుణన్, గ్రమగతినెఱిఁగించె, వింటిగాదెమదుక్తిన్ ॥ 10

సీ॥ అనిచెప్పిబ్రాహ్మణుం డరిగెనూత్రేయ! దు, స్తరసంసరణవార్ధి దాటఁదరమె? ।
శ్రీహరిభక్తివిశిష్ట నౌకాశ్రయ, ణము లేక యెన్నిచందములనైన ।
యముఁడు తద్భటులును యాతనల్ దండపా, శములును కేశవాసక్తమతికిఁ।
దృణకల్పాయితములు తెల్లమివ్విధమెల్ల, హరిభక్తులకుసాటి యవనికలదె ॥

గీ॥ నన్నునడిగినయట్టి ప్రశ్నమునకిది, సదుత్తరంబవుగదా, మదీయోక్తమగుచు
మనువునికిగంగపట్టి చెప్పినవిధంబు, తెలియఁజెప్పితి నిపుడుమైత్రేయనీకు ॥10

క॥ అనిచెప్పినమైత్రేయుం, డనుమోదరసార్ద్ర హృదయుఁడై, నరులజ్జా।
క్షునినెట్లారాధింతురు, ఘనతరసద్భక్తియుక్తి గలిగిమునీంద్రా॥ 10

క॥ ఆరాధితుఁడగు, మురదైత్యారాతివలనని రంతరారాధనని ।
ష్ఠారతుఁడై ఫలమొందు, ర, మారమణీనాథ భక్తమణిచెప్పంగన్ ॥ 10

వ॥ అని యడిగిన శ్రీపరాశరుం డిట్లనియె ॥ 10

క॥ మునుసగరుఁడ నెడునరపతి, యనుపమభృగువంశభవుని నౌర్వ్వుఁ గనియి।
ట్లనయడిగిన నమ్మునియు, జ్జనపతికిం జెప్పె వినుము చక్కఁగ దానిన్ ॥ 11

వ॥ ఔర్వుండు సగరున కిట్లనియె ॥ 11

గీ॥ భౌమపదమైన నవ్వలిపదములైన, నజునిపదమైన నిర్వాణమైన నొసఁగు ।
శౌరియారాధకుం డేమిగోరితనకు, నర్థినారాధనము చేయునట్లుకరుణ ॥ 11

వ॥ అల్పంబధికంబనువివక్షలేదు, ఆరాధనపరుం డేమిగోరినను నిచ్ఛానుగుణం
బుగా ఫలంబు నలినాక్షుండొసంగు. ఇది ఫలప్రకారంబు. ఇంకనారాధన
ప్రకారంబు చెప్పెదనని యౌర్వ్వుం డిట్లనియె ॥ 11

శా॥ ఆరూఢప్రతిభావిశేషమున నిత్యాత్తోక్తవర్ణాశ్రమా
చారోదారచరిత్రుఁడౌ నరునిచే సమ్యగ్విధింగేశవుం ।
డారాధ్యుండగు నింతకన్న మఱియొండన్యంబు తత్తోషకం
బై రాజల్లెడుత్రోవలేదు నిజమీయర్థంబు రాజోత్తమా ॥ 114

గీ॥ యజనములయజ్వ, యజియించు హరినె, హరినె,
జపితజపియించు హింసించు జంతుహింస ।

కుండుహరినె, యనేకభంగులఁ దలంప,
సర్వభూతేశుండుహరి యాటిసగరభూప ॥ 115

వ॥ కావున సదాచారవంతుండై నిజవర్ణోక్తధర్మానుకారియై పురుషుండు జనార్దను
నారాధింపవలయు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులు స్వధర్మతత్పరులై
సదాచారసంపన్నులై విష్ణుదేవుని నారాధించుట కర్తవ్యంబు. ఒండు ప్రకా
రంబు లేదు ॥ 116

గీ॥ అనృతమాడక, యొరుచెడనాడఁబోక, పరుషవైశున్యవాక్యముల్ పలుకపోక।
మెలఁగుపురుషునిచేత శ్రీజలజనేత్రుఁ, డనుదినంబును సంతుష్టుఁడగు నిజంబు॥117

సీ॥ పరవధూపరవిత్త పరహింసలాత్మలోఁ, దలఁపనొల్లని పుణ్యాతమునిచేత।
గురుదేవ భూదేవవరులకు శుశ్రూష, లొనరించు పరమపావనునిచేతఁ।
దనపుత్రునందు భూతములందు నొక్కచం, దమున మేలొనగూర్చు ధన్యుచేత।
రాగాదిదోషవైరస్యంబు లేని చి, త్తమున వెలుంగు నుత్తమునిచేత॥

గీ॥ సారవర్ణాశ్రమోదార సర్వధర్మ, పథము తప్పక చరియించు భవ్యుచేత।
నబ్జనాభుండు సంతోషితాత్ముఁడగును, సకలసమ్యగ్గుణకలాప సగరభూప ॥ 118

వ॥ అని చెప్పిన ॥ 119

క॥ సగరుండౌర్వునిఁ గనుఁగొని, భృగువరనాకానతిమ్ము ప్రియము మనమునం।
దగ, వర్ణాశ్రమధర్మము, లగణితతావకకృపారసాతిశయమునన్ ॥ 120

వ॥ అని యడిగిన నౌర్వుం డిట్లనియె ॥ 121

సీ॥ అగ్రజన్ముఁడు స్నాతుఁడై నిత్యకృత్యంబు, లాచరించుచు దాన మధ్యయనము।
యజనంబు సురతృప్తికై చేయవలయు భృ, త్యర్థంబు యాజనాధ్యాపనములు।
సత్ప్రతిగ్రహమును జరుపఁగావలయున, గ్నిపరిగ్రహంబును నిఖిలభూత।
మైత్రియు పాషాణమణిహేమములయందు, సమబుద్ధియును బుతుసమయములను॥

గీ॥ పత్నికూటమియును జేసిపరఁగవలయు, నైహికాముష్మికంబుల నందుకొఱకు।
నిగమనిగదితవిధియిది నిగమబుద్ధిఁ, దెలియుమీచందమెల్ల పార్థివవరేణ్య ॥122

సీ॥ క్షత్రియప్రవరుఁ డిచ్ఛకువచ్చినట్టిదా, నములు చేయుచు యజనములు పెక్కు।
లాచరించుచు నధ్యయనము సేయుచు నుశ, స్త్రాజీవమహిరక్షలాత్మవృత్తి।
గాఁబ్రవర్తిల్లుచు క్షమగల్గి ధర్మైక, నిరతి ప్రజారక్షణ రతిమెఱసి।
దుష్టానుశాసనశిష్టసంరక్షణ, క్రమమున రంజకత్వమున వెలసి ॥

గీ॥ ధరణిఁ బ్రజలొనరించు సత్కర్మతతులు, నంశములు తన్నుఁ జెంద దివ్యప్రభావ।
కలితుఁడై యొప్పి వర్ణసంకరము మాన్చి, ప్రవిమలోభయలోకవైభవముఁ గాంచు॥

వ॥ పాశుపాల్యంబును, వాణిజ్యంబును, కృషియును, వైశ్యునకు జీవికగాఁ బితా
మహుండు నిర్మించియిచ్చె. అతనికి నధ్యయన యజ్ఞ దానంబులు ప్రశస్తంబులు.
నిత్యనైమిత్తికకర్మాను ష్ఠానంబును విహితంబు. శూద్రునకుద్విజాతిశుశ్రూషం
బును. ద్విజాతిపోషణంబును, క్రయవిక్రయార్జితద్రవ్యంబునైనను, నితర
కర్మోద్భవద్రవ్యంబునైనను, దానంబును, పాయక, యజ్ఞంబులచేత యజిం
చుటయును, పితృశ్రాద్ధాదికర్మా చరణంబును, నాచరింపవలయు. భృత్యాది
భరణార్థంబునకుఁ బరిగ్రహంబునుం జేయవలయు, సగరభూపాల! స్వభార్య
యందు ఋతుకాలాభిగమనంబును, సమస్తభూతదయయును, తితిక్షయు,
నాతిమానితయు, సత్యశౌచంబులు, అనాయాసంబు, మంగళంబు, ప్రియ
వాదిత్వంబు, మిత్రత్వంబు, నిస్పృహ, అకార్పణ్యంబు, అనసూయయు, సర్వ
వర్ణంబులకు సమానగుణంబులు, ఇంక నాపద్ధర్మంబులు వినుము ॥ 124

గీ॥ బ్రాహ్మణుఁడు క్షత్రియునివృత్తి, రాజువైశ్యవృత్తి, వైశ్యుండుశూద్రునివృత్తినడువ
వలయునాపదనైన శూద్రులనడకలు, బ్రాహ్మణక్షత్రియులకు నర్హములుకావు ॥

వ॥ బ్రాహ్మణక్షత్రియులును; సామర్థ్యంబుగలిగిన; శూద్రవృత్తి మానవలయు.
అత్యంతాపదయైన శూద్రవృత్తియైన వలయుననియుంగలదు. కర్మసంక
రంబు చేయవలదని యూర్వుండాశ్రమ ధర్మంబులు వినుమని సగరున
కిట్లనియె ॥ 126

సీ॥ బాలత్వమునఁ గృతోపనయనుఁడై విప్రుండు, చదువుటకై గురుసదనవాసి ।
యైబ్రహ్మచర్యసమాహితత్వమునశౌ, చాచారవంతుఁడై యధికబుద్ధి ।
గురునకుశుశ్రూషగూర్చి చేయుచునును, వ్రతనిష్ఠవేదమున్నతిఁ, జదువుచు ।
నుభయసంధ్యలనుసూర్యునినగ్నిఁ గొలుచుచు, గుర్వాజ్ఞభైక్ష్యంబుగుడిచినిలిచి ॥

గీ॥ జలసమిన్మృత్కుశములు గురువులకుభక్తిఁ, దెచ్చియిచ్చుచు వేదంబుదృఢమనీష ।
నభ్యసింపంగవలయురాజాగ్రగణ్య, బ్రహ్మచారి సముజ్జ్వలప్రతిభ మెఱసి॥ 127

వ॥ ఇట్లు బ్రహ్మచర్యంబునడిపి గార్హస్థ్యంబునకు ననుజ్ఞాతుండై గురుదక్షిణ
యొసంగి॥ 128

ఉ॥ ధర్మమునన్ యథోక్తగతిదారపరిగ్రహమాచరించి స,
త్కర్మమునన్ ధనార్జనముదారతఁజేసి గృహస్థకృత్యముల్ ।
నిర్మలవృత్తియైనడిపి నిచ్చలు యజ్ఞములైదు చేయుచున్,
బేర్మియెలర్ప సద్గతిలభించు గృహస్థుఁడు లోకపూజ్యుఁడై ॥ 129

వ॥ నివాపంబునఁ బితరులను, యజ్ఞంబున దేవతలను, నన్నంబున నతిథులను, స్వాధ్యాయంబున ఋషులను, సంతానంబునం బ్రజాపతిని బలికర్మంబుల భూతంబులను, వాత్సల్యంబున జనంబులను, దుష్టింబొందించి గృహస్థుండు నిజకర్మసమార్జితంబులగును త్తమ లోకంబులంబొందు॥ 130

క॥ భైక్షము జీవిక, గాఁగల, భిక్షుకులము బ్రహ్మచారిబృందమ్మును స ర్వక్షేమంకరకృత్యవి, చక్షణు గృహమేధిఁజేరి సత్ప్రాణించున్ ॥ 131

ఉ॥ వేదము లభ్యసించుటకు వేమరుతీర్థము లాడఁబుణ్యశై,
లాదులుచూడ నెప్పుడు ధరామరవర్గము సంచరించు న॥
త్యాదృతిఁ బ్రొద్దుకూఁకులు గృహంబులు నీరములన్నముల్మహీ,
వేదులుతల్పముల్ హరియె వి త్తముగా మదిలోన నెంచుచున్ ॥ 132

వ॥ అట్టి యతిథులకు గృహస్థుండాస్పదంబు. అయ్యతిథుల స్వాగతంబుమధురోక్తులనడిగి గృహస్థుండు శయనాసనభోజనంబు లొసంగవలయు॥ 133

గీ॥ అతిథియెవ్వని యింటికి నరిగిరి త్త, పోవుఁదనపాతకములెల్లఁ బూన్చువాని।
సుకృత మెల్లను గొనిపోవుఁ జువ్వెగాన, నతిథినూరకపొమ్మన ననుచితంబు॥

వ॥ అవిజ్ఞయు, దంభంబును, బరితాపోపఘాతంబులును, బారుష్యంబునునతిథుల యెడం జేయరాదు. ఏగృహస్థుండైనను నాతిథ్యంబును సమ్యగ్విధింజేయు నాతండు సమస్త పుణ్యలోకంబులనొందు॥ 135

క॥ తనకువయఃపరిణతిగా, దనయులకడ నిలువనైనఁదన యనుగతినై।
నను, రా నతినియ్యఁగొలిపి, వనమునకుం బోయి యచటవన్యాశనుఁడై॥ 136

వ॥ వనంబుననిల్చి, కేశశ్మశ్రు జటాధరుండును, భూమిశాయియు, మననశీలుండును, సర్వార్థనిస్పృహుండును, చర్మ, కుశ, కాశ, ధృతపరిధానోత్తరీయుండును, త్రిషవణస్నానపరుండును, నగ్నిదేవతాభ్యాగతపూజాతత్పరుండును, భిక్షాబలిప్రదాతయు, వన్యస్నేహకృతగాత్రాభ్యంగకార్యుండును, శీతోష్ణాది సహిష్ణువునై వానప్రస్థచర్యనడపి యతండు, దవానలంబు తూలరాశులంబోలె సర్వదోషంబుల దహించి శాశ్వత పుణ్యలోకంబుఁగాంచు॥ 137

క॥ నాలుగవయాశ్రమము భూ, పాలకయెటిఁగింతు వినుము బ్రాహ్మణుఁడు, విని।
ర్మూలితమదమత్సరుఁడై, వాలాయము భిక్షువృత్తివర్తింపఁ దగున్ ॥ 138

వ॥ పుత్రమిత్రకళత్రాదులపై స్నేహంబువిడిచి త్రైవర్గికంబులగు సర్వారంభంబులు విడిచి శత్రుమిత్రాదులయందు సమతగలిగి సర్వజంతులయందు ద్రోహంబు మానిమైత్రుండై సంగంబువదలి యేకరాత్రంబుగ్రామంబునఁ బంచరాత్రంబు

పురంబున నిలుచుచుఁ బ్రీతి ద్వేషంబులు లేక యింటివారు భుజియిం
పోయి చల్లార్చినకాలంబునఁ బ్రశస్తవర్ణుల యిండ్ల భిక్షాటనంబు చేసి ప్రాణ
ంబులు నిలుపుచుఁ గామ, క్రోధ, దర్ప, మోహ, లోభాది దోషంబులు పరిత
జించి నిర్మలుండై తనవలన సర్వభూతంబులు, భూతంబులవలనఁ దా మన
భయంబు పొరయకుండునట్లుగా మెలంగుచు, నగ్నిహోత్రంబు శరీరంబున
శరీరాగ్నిహోత్రంబులు ముఖంబునను వేల్చి భిక్షుండు మోక్షాశ్రమంబాశ
యించి నిరింధనజ్యోతియుం బోలె శాంతుండై బ్రహ్మలోకంబు నొందున
చెప్పిన॥ 1:

క॥ ఔర్వునినతులప్రతిభా, శర్వునినీక్షించిపలికె సగరుఁడుకరుణా ।
ధూర్వహకటాక్ష! యశ్రుత, పూర్వంబాకటఁడుగవలయుఁబో! మిముఁ దెలియన్

ఉ॥ హత్తియొనర్చు పూరుషునకారయఁ గృత్యములైననిత్యనై
మిత్తికకామ్యకర్మములు మెచ్చుగనే గతియాచరించువా
రిత్తఱిఁ జెప్పుమయ్య, మదిహెచ్చు భవద్వచనావళుల్వినన్
జిత్తమునం, గుతూహలవిజృంభము భార్గవవంశవర్ధనా॥ 1

వ॥ అనిననౌర్వుం డిట్లనియె. పుత్రుండు పుట్టిన నభ్యుదయాత్మకంబైన శ్రాద్ధం
సేయవలయు. బ్రాహ్మణభోజనంబు వెట్టి నాందీముఖులకుఁ బిండప్రదానంబు
దశమదివసంబున నామకరణంబు చేయవలయు॥ 1

గీ॥ వలయుభంగినుత్సవము, చెల్లఁగా, దేవ, నామమైన మనుజనామమైన ।
శుభముహూర్తమున విశుద్ధుఁడై జనకుండు, సుతునకిడఁగ వలయునతులమహి

వ॥ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకుఁ గ్రమంబున శర్మ, వర్మ, గు
దాసాత్మకంబైన నామంబిడవలయు. అర్థహీనంబును, నప్రశస్తంబును,
శబ్దయుతంబును, నమాంగళ్యంబును, జుగుప్సితంబును నగునామంబిడవల
సమాక్షరంబును, నాతిహ్రస్వంబును, నాతిగుర్వక్షరాన్వితంబును, సుఖో
ర్యంబునగు నామంబిడవలయు॥

సీ॥ సరవిననంతరసంస్కారసంస్కృతుఁడై గురుగేహంబు నందువిహిత ।
విధినవలంబించి విద్యాపరిగ్రహణము చేసిగురు దక్షిణాప్రదాన ।
కారియైగార్హస్థ్యకలన కనుజ్ఞాతుఁడై నను మేలు కాదేని బ్రహ్మ ।
చర్యంబుననయుండు సన్న్యాసియైనను, వైఖానసుండైన వలసినట్టిఁ॥ [

గీ॥ ఐముముక్షుత్వమునసత్క్రియాకలాప, మాచరింపంగవలయు బ్రాహ్మణ
విహితవిధియిది దీనిభావించివినుము, మహితగుణసాంద్ర! సగరభూమండలేం

వ॥ గార్హస్థ్యంబు గావలసిన నేకగుణ వర్ణయైనకన్యకను, దానఁ గృహస్థుండు పరి
గ్రహింపవలయు ॥ 146

సీ॥ అతికేశియు,నకేశి, యధికాంగి, కృష్ణాంగి, పింగళన్యూనాంగి,యంగహీన।
రోగిణి, కులట, యరూపిణి, దుష్టవా, త్సల్యసరోషయు, శ్మశ్రువదన।
కాకస్వర, కృశాంగి, ఘర్ఘరస్వర, పురు, షాకృతిబుద్ధ్యాత్మ యరుణాక్షి।
పీనాంగి,వామన, పృథుదీర్ఘసంహత, భ్రూయుగ రూక్షాంగివృద్ధవదన॥

గీ॥ చిత్రదంత,మషీవర్ణ, శ్వేతవర్ణ, కూపగండ, సమున్నతగుల్భ రోమ।
సహితజంఘ, వినిందితాచారయైన, కన్యఁబెండిలియాడఁగఁ గాదుబుధులు॥ 147

వ॥ మాతృపక్షంబునఁ, బంచమియుఁ, బితృపక్షంబున సప్తమియునైన కన్యకను యథావిధివివాహంబు గావలయును. బ్రాహ్మ్యంబు, దైవంబు,నార్షంబు,ప్రాజాపత్యంబు, నాసురంబు, గాంధర్వంబు, రాక్షసంబు, పైశాచంబు ననననిమిది వివాహంబులు. అందేవర్ణంబున కేవివాహంబువిహితం బావివాహంబావర్ణంబువారుచేయవలయు. ఇవ్విధంబున సలక్షణయైన ధర్మచారిణిం బరిగ్రహించి తత్సహితుండై గృహస్థుండు, విహితకృత్యంబులు నడిపినమ్యగూర్ధ్వ మహాఫలంబు నొందునని చెప్పిన సగరుండిట్లనియె ॥ 148

గీ॥ మానినాథ!సదాచార మానతిమ్ము, కరుణతోనాకు శ్రవణేచ్ఛగడలుకొనియెఁ।
దాననడచిగృహస్థుండు మాననీయ, దివ్యలోకసుఖాప్తి మోదించుఁగాదె॥ 149

వ॥ అనిన నౌర్వుండిట్లనియె ॥ 150

మ॥ జననాథోత్తమ చెప్పెద న్వినుము, సదాచారంబు, నిత్యంబుస
జ్జనులత్యాదృతి, నాచరించుట, సదాచారంబనంజెల్లు, స।
జ్జనసంజ్ఞల్ మనువుల్ ప్రజాపతులు నాసప్తర్షులుంజువ్వెత
ద్వినుతాచారపరాయణుండు గను కీవిక్ రెండు లోకంబులున్ ॥ 151

గీ॥ రాజ!వినుధర్మపీడా కరంబులైన, యర్థమునుగామమును మానుటర్హమగును।
అసుఖమై లోకవిద్విష్టమయ్యెనేని, ధర్మమునుమానవలయుభూధరవరేణ్య॥ 152

వ॥ కల్యంబునన్లేచి తననివాసంబునకు నైరృతిభాగంబున నంపకోలవాటినంత దూరముపోయి యచ్చట మూత్రపురీషంబుల విడువవలయు ॥ 153

క॥ తననీడఁ దరువునీడన్, విను గోరవిశిఖిహుతాశవిప్రగురుస్థలం।
గనుచు నెదురుగనువిడువం,జనదు,మలము మూత్రమును,బ్రశస్తునకెపుడున్॥154

గీ॥ వైరులోదుక్కిలో మందపట్టునందు, దేవతలోనిలో నదీతీర్థములను।
మనసమున నేటిసరియందు [illegible], మలమూత్రంబువిడువరాదలఘుచరిత ॥

వ॥ దివాభాగంబున నుత్తరాభిముఖుండును, నిశాభాగంబున దక్షిణాభిముఖుండును
నై విణ్మూత్రంబులు విడువవలయును. ఆపద్గ్రస్తుండై నేష్టముఖుండైన దోషంబు
లేదు ॥ 15

గీ॥ ధరణిఁ దృణమునఁ గప్పి మస్తకము కప్పి, తనప్రావృతుఁడై నిష్ఠూరాప్పులడరనీక ।
మానినయ్యెడిమనందగు మలమూత్రములను సదాచారనిరతుండు జనవరేణ్య

వ॥ పుట్టమన్ను, నెలుకమన్ను, నింటిలోనిమన్ను, శౌచశేషంబైనమన్ను, గోడపూఁ
మన్ను, దుక్కిమన్నును శౌచంబునకుంగాదు. గృహస్థునకొక్కమృత్తిక లిం
గంబునందును, మూఁడుమృత్తికలు గుదంబునను, బదిమృత్తికలు వామ
రంబున, మఱియు హస్తద్వయంబునఁ, బాదంబుల నొక్కొక్కటిం బె
వలయు. స్వచ్ఛంబును, దుర్గంధఫేనవర్జితంబును, నగుజలంబున శౌచంబు
చేయవలయు. అనంతరంబు పాదశౌచంబు చేసి కృతాచమనకార్యుండై
కేశప్రసాధనంబుచేసి, మాంగళ్యదూర్వాదికంబుల ధరించి ॥ 15

గీ॥ తనకులాచారధర్మంబు తప్పకుండ, నర్థమార్జించి యజియించుటర్హవిధము ।
హవియు సోమంబు నన్నంబు నర్థమునన, కలుగుఁ గావున నర్థంబు వలయుఁ గూర్ప

వ॥ నదీతటాకజలంబుల, దేవఖాతజలంబుల, గిరిప్రస్రవణ జలంబులఁ, గూపోద్ధృ
జలంబుల, గృహానీతజలంబులనైన స్నానంబుచేసి శుచివస్త్రధరుండై పిత
తీర్థంబున నంజలిత్రయంబునఁ బితృతర్పణంబుచేసి జలత్రయంబున దేవర్
తర్పణంబుచేసి పితామహప్రపితామహులకును, మాతృమాతామహతత్పిత
మహప్రభృతులకును, గురుపత్నీగురుమాతులాదులకు, రాజునకునుపక
రార్థంబు భూతంబులకుఁ దర్పణంబుచేసి దేవాసుర యక్షనాగ గంధర్వరాక్ష
పిశాచగుహ్యక సిద్ధకూష్మాండతరు, ఖగ, బిలేశయ, భూనిలయవాయ్వాహా
జంతువులును, నరకయాతనా సంస్థితులును, బాంధవులును, నబాంధవులును
జన్మాంతర బాంధవులును, మద్దత్తతిలోదకంబులచేత నాప్యాయనంబు నొంద
దురుగాక యని కామ్యోదకదానంబుచేసి పుణ్యంబునొందు. 16

క॥ ఆచమనముచేసి విశు, ద్ధాచారుండైన మనుజుఁ డర్హ్యమునకుఁగా ।
లోచితగతి నర్ఘ్యంబులు, నేచలనములేనిబుద్ధి నియ్యఁగవలయున్ ॥ 16

శ్లో॥ నమోవివస్వతే బ్రహ్మభాస్వతే విష్ణుతేజసే ।
జగత్సవిత్రే, శుచయే సవిత్రే, కర్మసాక్షిణే ॥ 16

వ॥ అను మంత్రం బుచ్చరించుచు సూర్యార్ఘ్యం బీయవలయు ॥ 16

గీ॥ అగ్నికార్యంబుదీర్చి యనంతరంబ, యభిమతసురార్చనము చేయ వలయు
ప్రకటతరషోడశోపచారములచేత, ధీమతి సద్విజుడు నరనాథ 164

వ॥ బ్రహ్మకుఁ, బ్రజాపతికి, గృహ్యాదేవతలకుఁ, గశ్యపునకుఁ, ననుమతికి, వేల్చిన హుతశేషంబుగాని మణికంబునందుఁ బృథివీపర్జన్యులకు బలియిడి ద్వారంబున ధాతృవిధాతలకు గృహమధ్యంబున బ్రహ్మకు బలియిడి యింద్ర యమ రాజ వరుణ ధనేంద్రులకుఁ గ్రమంబునఁ బ్రాచ్యాది చతుర్దిక్కుల బలులిడి ప్రాగుత్తరదిగ్భాగంబున ధన్వంతరికి బలియిడి తదనంతరంబ, వైశ్వదేవంబు చేసి వాయవ్యభాగంబున వాయువునకుఁ దక్కినదిక్కులం దయ్యై దేవతలకు బ్రహ్మకు, నంతరిక్షంబునకు, భానునకు, బలియిడి విశ్వదేవతలను, విశ్వభూతంబులను, బితరులను, యతిభిక్షులను నుద్దేశించి బలియిడవలయును. తదనంతరంబన్నాంతరంబు పుచ్చుకొని శుచిదేశంబున నశేషభూతంబులకు దేవమనుష్య, పశు, వయస్సిద్ధయక్షో, రగదైత్య,ప్రేత పిశాచ తరు పిపీలికా కీట పతంగాదులు మదన్న సృష్టాన్నంబునఁ దృప్తిఁబొందుదురుగాక యని బలియిడి తదనంతరంబ గృహ బహిర్భాగంబున శ్వచండాలాది జాతులకు బలియిడి యతిథి సంగ్రహార్థము గోదోహనమాత్ర కాలంబునిలిచి ॥ 165

సీ॥ అజ్ఞాతకులనాము, నన్యదేశాగతు, శ్రమజలాసారసంఛన్నవక్త్రు,
నతిపిపాసాక్షుత్సమాధూయమానాంగు, మార్గధూళీ విధ్యమాన దేహు ।
నాభీలగమనపుంజీభూతనిశ్వాసు, రభసాయుమహుర్ముహుర్భంజితోష్ఠు,
ననుపమాకించనత్వాలోకనీయాత్ము, నస్పృష్టసంబంధు నర్చనీయు ॥

గీ॥ నతిథిఁగని మ్రొక్కి సంతోషితాత్ముఁడగుచుఁ, దోడుకొనివచ్చి, లోననిర్దిష్టశాస్త్ర
విధులఁ బూజించి సద్భక్తి వెలయనన్న, మిడఁగవలయుగృహస్థుఁడు నృపవరేణ్య ॥

వ॥ అతిథింబూజింపక భుజించెనేని యధోలోకంబులంబడు. భోజనానంతరంబ స్వాధ్యాయకులాదులడుగవలయు ॥ 167

క॥ మనమునహిరణ్యగర్భుం, డనితలఁచుచు నతిథికెలమినన్నంబిడఁగాఁ ।
జనునతిథి స్వర్గదాయకుఁ, డనిచెప్పుదు రార్యజనము లమలచరిత్రా ॥ 168

వ॥ పిత్రర్థంబు తద్దేశ్యుండును, విదితాచారసంభూతియుఁ, బాంచయజ్ఞికుండును నైన యొక్కవిప్రునిం భుజియింపం జేయవలయు. ఒక్కయెడనెత్తి పెట్టిన హంతకారోపకల్పితంబగు నగ్రాన్నం బొక్కశ్రోత్రియునకుం బెట్టవలయు. పరివ్రాడ్బ్రహ్మచారులకు భిక్షాత్రితయంబు పెట్టవలయు. విభవంబు గలిగిన నవారితంబుగా నిడవలయు. అతిథియుఁ, బిత్రర్థబ్రాహ్మణుండును, హంతకార భోక్తయు, భిక్షావృత్తులగు బ్రహ్మచార్యాదులుంగూడ నాలుగువెఱంగుల

వారును సత్ఫలంబు బడయుదురు. వీరిం బూజించి గృహస్థుండు పాపవిముక్తుం
డగు. 169

శ్లో॥ అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే ।
స తస్మై దుష్కృతం దత్వా పుణ్యమాదాయ గచ్ఛతి ॥ 170

క॥ ధాతృప్రజాపతీంద్రా, గ్నాతసువహ్నిర్వసుగణాగ్ని సంఘమతిథియం ।
దాతతగతినిల్చి, సుసం, ప్రీతింభుజియించు గృహికి మేలొదవంగన్ ॥ 171

గీ॥ కానఁ నతిథిపూజ కర్తవ్యకర్మ, మ,య్యతిథికిడక కుడుచు నట్టివాఁడు
మానవేశ, మలసమానంబుభుజ్మి నీ, వాచరింపుమెపుడు నతిథిపూజ ॥ 172

వ॥ తదనంతరంబ సువాసినీ, దుఃఖవతీ, గర్భిణీ, వృద్ధ, బాలకులకు సంస్కృతాన్నం
బిడి వారు భుజియించిన వెనుక గృహస్థుండు భుజియింపవలయు. వీరు భుజింప
క తా భుజియించినఁ బాపభోక్తయై నరకంబునం బడి శ్లేష్మభోజి యగును॥ 173

గీ॥ జలములాడక కుడుచుట మలముతినుట, యజపుఁడై తింటపూయరక్తాశియగుట ।
నరవరేణ్య, యసంస్కృతాన్నంబుదినుట, సిద్ధముగమూత్రపానంబు చేతసుమ్ము॥

క॥ ఎవ్వరికి నిడక తనమది, నివ్వటిలిన లోభవశత నింద్యచరితుఁడై ।
క్రొవ్వునఁదాన భుజించినఁ, బుర్వులు కడుపారఁదినుట భూరివివేకా ॥ 175

వ॥ గృహస్థుండు శాస్త్రోక్తంబుగా భుజించిన భవబంధంబులు తొలంగు, ఇహంబున
నారోగ్యబుద్ధివృద్ధులు సంభవించు. అనిష్టంబులు వైరిపక్షాభిచారంబులు
శాంతినొందు ॥ 186

ఉ॥ స్నానముచేసి శుద్ధవసనంబులుగట్టి సురర్షిపిత్రనూ,
నానఘ తర్పణక్రియలు న్యాయపథంబునఁ జేసి జాపకుం ।
డై నియతిన్ హుతజ్వలనుఁడై యతిథిద్విజగుర్వశేష భృ,
త్యానుగపాళి కన్నమిడి యాతరువాత గృహస్థుఁడున్నతిన్ ॥ 177

సీ॥ పుణ్యచందనమాల్యములు దాల్చి వస్త్రద్వ, యంబుతో నార్ద్రపాణ్యంఘ్రియగుచు,
సంశుద్ధవదనుఁడై సంప్రీతుఁడై విది, క్కులుమాని ప్రాగుదఙ్ముఖముగాఁగ ।
నాసీనుఁడై యనన్యమనస్కుఁడై ప్రశ, స్తమణిమాణిక్యుఁడై విమలశస్త,
పాత్రంబునందుఁ బవిత్ర మహాన్నంబుఁ, బ్రోక్షణోదకముల ప్రోక్షణంబు ॥

గీ॥ చేసి ప్రాణాహుతులు వేల్చి చెలఁగుమతిని, మానినైయుగృహమేధసమ్మతి భుజించు ।
బహువిధమహాకామముక్తిచేఁ గనహంబు, నగరభూపాలధర్మ్యరత్నావిశాల ॥ 178

వ॥ మంత్రాభిమంత్రితంబులను, ఫలమూలంబులును, శుష్కశాకంబులును, హారితకంబులును, గుడభక్ష్యంబులును, [illegible] దక్కిన [illegible]ంబులు మాని సారంబులు పిసిన వస్తువులుమాని భుజియింపవలయు. మధు, జల, దధి, ఘృత, వస్తువులు దక్కం దక్కిన వస్తువులు నశేషంబుగా భుజియింపవలయు॥ 179

క॥ మునుపు మధురములు రుచిగొని, వెనుకన్ లవణములు దానివెనుకం గటుతి।
క్తనవామ్లద్రవ్యంబులు, గొనవలయు ననామయంబు గూడుటకొఱకున్॥ 180

వ॥ మొదట ద్రవంబులును, మధ్యంబునం గఠినాశనంబులును, నంతంబున ద్రవంబులును భుజియింపవలయు. ఇట్లు భుజియించి లేచి ప్రక్షాళితపాదుండై, స్వస్థుండై, కృతాసనపరిగ్రహుండై, యిష్టదేవతాస్మరణంబు చేసి "యగస్త్యుండును, నగ్నియు, బడబానలంబును, నన్నంబు జీర్ణంబు సేయుదురుగాక. సమస్తేంద్రియదేహియైన విష్ణుండు మద్భుక్తంబైన యశేషాన్నంబు జీర్ణంబు చేయుఁగాక" యని కరంబున నాభినిమిరికొని తగినరీతి ననాయాసకర్మంబులు చేయవలయు. 181

క॥ ఆదృతి సచ్ఛాస్త్రాదివి, నోదంబుల దినమునడిపి నుతగతిసంధ్యా।
ప్రాదుర్భూతంబైనను, హీ దేవుఁడు సంధ్యఁ గొలువ నెప్పుడువలయున్॥ 182

వ॥ దినాంతసంధ్య సూర్యదర్శనంబు చేయుచు ప్రాతస్సంధ్య నక్షత్రంబులు చూచుచు నుపాసింపవలయు. సూతకాశౌచవిభ్రమాతురభయంబులం దక్క నితరకాలంబుల సంధ్యాకాలంబు గడవనీయవలవదు॥ 183

ఉ॥ భానుఁడు గ్రుంకువేళలఁ బ్రభాయుతుఁడై యుదయించువేళలన్
మానవుఁడెవ్వఁడే, నిదురమానకపోవునతండు కౌరవా।
ఖ్యానుపమాననారకములందు వసించురుజాభిభూతుఁడై
నను బాపమంటదని రాజ్యలు మానవలోకనాయకా॥ 184

వ॥ కావున నర్కుండుదయింపక మున్న లేచి పూర్వసంధ్యయు, నిదురింపక సూర్యునిం జూచుచు దినాంతసంధ్యయు నుపాసింపవలయు. కాలాతిక్రమణంబు చేసి సంధ్యోపస్థానంబు చేయని దురాత్ములు తామిస్రనరకంబునుం బొందుదురు. 185

గీ॥ మగుడఁ బాకంబు సేయించి మాపుధర్మ, పత్నియును దాను రేపంటిపగిది వైశ్వ।
దేవముఖ్యక్రియలొనర్చి ధీరుఁడగుచు, నతిథిపూజలొనర్చుటయర్హ మనఘ॥

క॥ శేషటియుతిథికిబలేసే, మాపటిసతిథికిని బూజమహిమనోనర్వన్।
భూపాలపుణ్యమస్థు, తో సేతంబనుచుఁజెప్పి రురుధర్మవిదుల్ ॥ 187

వ॥ కావున మాపటి యతిథిని యథాశక్తి నన్నపానాదు లొసంగి శయ్యాదికంబులఁ దుష్టిం బొందించి, తానునుభుజియించి॥ 188

గీ॥ తెగకకొంగోడుఘ్రాణశృంలత లేక, మలినదళ లేక జంతుసామగ్రి లేక।
పరపుగల్గివిశుద్ధతఁబరఁగుశయ్య, నధివసింపంగవలయుభూపాగ్రగణ్య॥ 189

క॥ తెలియఁగఁదూరుపుదక్షిణ, ములలో నొకవంక నేమమునఁ దలగడమే।
లలఘుగుణ యుత్తరదిక్కులఁ, దలగోనురోగంబులనిరి తత్కర్మవిదుల్ ॥ 190

సీ॥ ఋతుకాలమునఁదనసతి శుభతరంబున, యుగ్మరాత్రులఁబొందుటుచితకృత్య
మస్నాతనాతుర నప్రశస్తననిష్ట, గర్భిణిందలఁకినకాంతఁ గుపిత।
నన్యకాంత, నకామనదయునన్యాసక్త, నాకొన్నకాంతనత్యంతభుక్తఁ
గదియక తానునీకరణిగుణంబులు, లేకస్రక్చందనాలేపనములు॥ [వలయు

గీ॥ పూని యనురాగసహితుండై పూరుషుండు, చెలువుమీఱ వ్యవాయంబు సలు
పైతృకదివసనిశలునుబర్వనిశలు, గురుతరవ్రతనిశలును బరిహరించి॥ 19

వ॥ చతుర్దశియు, నష్టమియు, నమావాస్యయు, బూర్ణిమయుఁ, సూర్యసంక్రమణంబును, నీ యైదును పర్వంబులయందు స్త్రీ, తైల, మాంసని షేవణంబుచేసి పురుషుండు విణ్మూత్రనామనరకంబునొందు. ఇక్కాలంబుల సచ్ఛాస్త్ర వేదధ్యానజపపరుండు కావలయు॥ 19

గీ॥ అవనినాథ! యయోనియందన్యయోని, యందుగురుదేవవిప్రులయగ్రమునన
జైత్యచత్వరతీరస్మశానతోయ, నదుపవనముల రతిచేయఁజనదునరుఁడు॥ 19

వ॥ పర్వంబుల రతిచేసిన దారిద్ర్యంబును, దివాభాగంబుల నాపదలును, జలా
యస్థలంబున రోగంబులునునగు॥ 1

మ॥ పరదారాభిగమంబు నెమ్మదిఁ దలంపగా పాపమా నన్నచో
నరుఁడాత్రోవఁ జరింపనాయువును క్షీణంబై మృతుండైన భీ।
కరదుర్నారకమున్లభించునని వక్కాణింపఁగానేల భూ।
వరమర్త్యుండదది మానిస్వాంగనల సేవంబొంద, ధర్మంబగున్॥ 1

గీ॥ సార్వభౌమయథోక్తదోషములు లేని, యాత్మసతులసకామలనన్నృతువేళ।
నైనఁబొందినదోషంబులంటుకొనవు, వర్ణనీయసదాచారవంతునకును॥ 1

వ॥ అని చెప్పి మఱియు నిట్లనియె॥

కీవగోబ్రాహ్మణాతిథిసిద్ధవృద్ధ గురుర్వర్చనయుభయసంధ్యాభివంద ।
బగ్నిసముపచారం బనుపహత వ, స్త్రస్వయధారణ సౌష్టవంబు ।
యుగారుడ రత్నములుదాల్చి ప్రయతుండై, యమల కేశకలాపుండై సుగంధ।
ాల్యచందన లేపమహితుండై యుండుట, దగుపరస్వంబునుండడవఁబోక ॥

సెన్నృతసుల్పతరంబైన నాడఁబోక, కల్లగూడిన ప్రియమైననొల్లకుడు ।
షములు లెక్కపెట్టకదుష్టయానం, మెక్కకనరుండు వెలయుఁ బెం పెక్కుయపుడు॥

ఋమరునన్యకాంత వెడపల్కులుపల్కక యేటియొద్దనీ
వసియింపఁబోక కులటాకులటాపతి శత్రుమిత్రుడు ।
కులపతిశాస్త్రతో క్తిపరకుత్సితదుర్వ్యయశీలశాత్యకృ
లతతిమైత్రి చేయకసుఖస్థితిఁగాంచునరుండుభూవరా ॥ 199

క్కడుమార్గమునడచుట, చక్కని పనిగాదు వేగజలవాహములన్ ।
ఱక్కలమునమునుపుగఁదా గ్రక్కననవగాహమందఁగాదుమునీంద్రా ॥ 200

ట్టుకొనకొమ్మకెక్కక, చిచ్చుదగిలి, మండుసదనంబుఁజొరక, యొండొండపళ్లు।
ఱకక, క్షుతంబుముక్కునగొనకజృంభ, మాస్యమునఁబోవనీకుండుటర్హ మధిప॥

ఱనిట్టూర్పులుపుచ్చక, కలకలవడినగక ద్రుతముగాఁబోఋనదీ ।
ముులమ్మునుచొరకనఖా, వళిఁగొఱుకక యుండుటర్హ పథము నరేంద్రా ॥

శ్మశ్రు కేశంబులు కొఱుకక లోష్టంబు ద్రుంచక, యపవిత్రుండై ప్రశస్తజ్యోతి
ులు చూడక, నగ్నయగుపరకాంతను, నుదయాస్తమయకాలంబుల
ార్యునింజూడక, శవగంధం బాఘ్రాణింపక మెలంగుట మేలనిచెప్పి మఱి
ఇనిట్లనియె ॥ 203

ామినాథచతుష్పథంబునుస్మశాన, కాననముచైత్యవృక్షంబు కానిదుష్ట ।
ంతసన్నిధియును జేరఁగాదయర్థ, రాత్రములయందుఁబుణ్యచరిత్రులకును॥ 204

ామిాసురులనీడ పూజ్యులనీడదీ, పమునీడదాఁటుట బాగుగాదు ।
ాన్యాటవీస్థలిఁజొరరాదుశూన్య గే, హమునందు నిలువరాదరయనొకఁడు ।
అశుచియైనననార్యమండలిచేరుట, గాదుకోపితుఁ జేయఁగాదుకుటిలుఁ ।
ఋమాఁగుపాముతోఁ జెలిమిసేయుటగాదు, తడవుగానిలుచుండఁదగదుమిగుల ॥

వుని ద్రిత్తుఁడవుటయుఁదడవుమేలు, కొనుటయుఁదడవుగూర్చుంటయునుదఱచుగ
ినపరుఁడౌటమిగుల నాసీనుఁడగుట, యెపుడుదిరుగుటగాదు పృథ్వీశతిలక॥

ంగిటనడుగులు గడుగుట, యెంగిలిపోయుటయుఁగాదు, హితమతితో న ।
ంగళముమానరాదు, వి,నంగాదశ్లీలములు జన స్తుతచరితా ॥ 207

వ॥ నిరంతరశయ్యా సేవసలదు, కేశాస్థి, కంటకా, మేధ్య, బలి, భస్మ, తుషస్నానార్ద్రభూములు ముట్టసలదు. కోరకొమ్ములుగల జీవంబులకు దూరంబునంద మెలంగవలయు. మంచున, నెండను, గాలినిం, దిరుగవలదు. నగ్నుండై - నీరాడుటయు, నిద్రించుటయు, నాచమనంబు సేయుటయుం గాదు. కచ్ఛకట్టక దేవార్చనాచమనంబులు చేయరాదు. ఏకవస్త్రుండై హోమదేవార్చనాచమనజపాదికంబులు చేయరాదు॥ 208

సీ॥ దుర్వృత్తుఁ గదిసిన దోషంబు వాటిల్లు, సజ్జనసంగతిక్షణము చాలు।
ధార్మికుతో విరోధము చేయఁగాఁ జన, దంతకన్నను గూడ దధముతోడఁ।
బెండ్లియు వాదంబు పెంపొందుఁ దుల్యశీలులతోన గాకున్న నలఁతఁ దెచ్చుఁ,
గలహంబు పెంచుట గాదల్పహానికిఁ, దాళఁగావలయు, శాత్రవుని యెడల॥

గీ॥ ధనసమార్జనకార్యంబు తడవరాదు, జలకమాడెడివేళల స్నానశాటి।
నైననిజపాణిచేనైన నవయవములు, దోమఁగారాదు బుధనుతభూమినాథ॥209

వ॥ కేశంబులు విదల్పక, నిలుచుండి వార్వక, కాలుమీఁద కాలు సేర్పక, పూజ్యుల కెదురుగాఁ గాలుచాపక వర్తింపవలయు. గురువుల యెదుట నీచాసనగతుండై వినయంబున నుండవలయు. దేవాగార చతుష్పథంబుల కప్రదక్షిణంబు నడవక, పూజ్యులకు, సోమార్కాగ్న్యంబు వాయువులకు నెదురుగా నిష్ఠీవనంబును, విణ్మూత్రోత్సర్జనంబు నుం జేయక నిలుచుండియు, నడుచుచు మూత్రంబు విడువక, శ్లేష్మవిణ్మూత్ర రక్తంబులు దాఁటక, భోజనకాలంబున శ్లేష్మహాసోత్సర్జనంబులఁ జేయక, బలిమంగళజప్యాదులయందును, హోమకాలంబునను మహాజనసన్నిధిని స్త్రీలనవమానింపక యీర్ష్యలేక, మనస్తాపంబు చేయక, వారి వచనంబులు విశ్వసింపక వర్తింపవలయు. మాంగళ్యపుష్పరత్నాజ్య పూజ్యులకు నమస్కరించి కాని సదాచారపరుం డిల్లు వెడలరాదు. చతుష్పథంబునకు నమస్కరించుచు, కాలంబున హోమపరుండగుచు దీనానాథసాధువుల నుద్ధరించుచు, బహుశ్రుతుల నుపాసించుచు, దేవర్షిపితృ పూజనంబులు సల్పుచు, నాతిథ్యంబు చేయుచు, వర్తించు పురుషుండుత్తమ లోకంబులం బొందు॥ - 210

గీ॥ అదన,హితమిత్రుతోడ వశ్యాత్ముఁ డౌచుఁ,బ్రియములాడిన యతఁడు సంప్రీతితోడఁ।
బొందు నాహ్లాదకములైన పుణ్యలోక, చయములక్షయములుగాఁగ జనవరేణ్య॥

క॥ మతియును, లజ్జయు, క్షమయును, నతులవినయగతియు నీతియాస్తికతయు నూ।
ర్జితగతి కల్గిన మనుజుఁడు, చతురతఁ గను పుణ్యలోక సౌఖ్యము లెల్లన్॥ 212

వ॥ మఱియును నకాలగర్జితాదుల యందును, బర్వాశౌచకాలములను, నుపరాగాదులయందును, ననోధ్యాయంబు చేయవలయు. ఎవ్వఁడేనియుఁ గోపితులైన సర్వబంధువుల నాశ్వాసించి శమంబునొందించు నతండు శ్రమ లోకంబులనొందు, స్వర్గంబననెంత, మఱియు వర్షాతపాదుల యందు ఛత్రధారియగును, రాత్రులనడవులయందు దండధరుండును, నై సదా పాదుకలు ధరించియు నడువవలయు, మీఁదును, దూరంబును, నడ్డంబును జూడక నడవవలయు, యుగమాత్రంబు మహీతలంబు చూచుచునడవవలయు ॥ 213

గీ॥ ఎవ్వఁడేనిదోషహేతువులగువాని, నెల్లవిడుచుచుశక్య హృదయుఁడగుచు ।
నతనిపూరుషార్థ వితతికినింతైన, హానికలుగనేరదధి పముఖ్య ॥ 214

వ॥ పాపిష్ఠుఁడైన పురుషునియెడనైనఁ బ్రియంబు పలుకుచు నంతఃకరణశుద్ధుండగు పురుషునకు ముక్తికరతలామలకంబు, కామక్రోధ లోభంబులకు గోచరులుగాక సదాచారవంతులగు, పురుషుల యనుభావంబుచేత నిమ్మహీమండలంబు ధరియింపఁబడి యున్నదిగావునఁ బరప్రీతికారణంబైన సత్యంబు పలుకవలయు. ఆసత్యంబ పరదుఃఖకరంబైనఁ బలుకక యూరకుండవలయు. ప్రియంబైనను హితంబుగాకుండినఁ బలుకవలదు. అప్రియంబైన శ్రేయస్సంపాదకంబైన హితంబు పలుకవలయు ॥ 215

గీ॥ ఇన్నిచెప్పంగనేల భూమీశతిలక, యెల్లభూతోపకారకంబగుచునిహము ।
పరము నొసఁగెడువాక్యంబు పలుకవలయు, మనసుననుజుంజుకరణత్రయంబుచేత॥

వ॥ అనిచెప్పి మఱియు నిట్లనియె ॥ 217

క॥ సూనుఁడుపుట్టిన, గృహపతి, దానస్నానములుపలయుఁ, దండ్రికినంతన్ ।
భూనాథజాతకర్మవి, ధానక్రమమాచరింపఁ దగునర్థాగలిన్ ॥ 218

వ॥ అభ్యుదయార్థంబు శ్రాద్ధంబుచేయవలయు. యుగ్మంబులుగా దేవపితలనుద్దేశించి బ్రాహ్మణుల భోజనంబు సేయింపవలయు. ప్రాఙ్ముఖుండైన, నుదఙ్ముఖుండైనను దధ్యక్షతబదరంబుల దేవతీర్థంబుల దేవతలకుఁబితృతీర్థంబులఁబితలకుంగా, నాందీముఖదేవగణంబులకుఁ బిండప్రదానంబు చేయవలయు. ఇంకఁ బ్రేతకర్మ క్రియావిధి వినుము ॥ 219

క॥ మృతుఁడైనఁ బ్రేతదేహం, బతులశుభస్నాన చందనామోదనుమ ।
ప్రతతులసలంకృతముచే, సి తగ విమానమునఁ బెట్టిచెలువగుకేతిన్ ॥ 220

వ॥ పురబాహ్యముసకుం గొనిపోయి యగ్నిసంస్కారంబుచేసి సచేలస్నానంబు చేయవలయు. బాంధవులు దక్షిణాభిముఖులై గోత్రనామంబులు చతుర్థ్యంత

సమేతంబులుగాఁ జెప్పి జలాంజలినీయవలయు. అంత గోవులు ప్రవేశించు వేళ నక్షత్రదర్శనంబు సేయుచు గ్రామంబు ప్రవేశింపవలయు. భూమిఁ కటుప్రస్తర శాయిత్వంబు వలయు. అనుదినంబును ప్రేతార్థంబు భూమియందుఁ పిండంబు విడిచి దివాభాగంబున మాంసవర్జంబుగా భుజియించి తమదినంబుల్లు వెళ్లింప వలయు. ప్రథమ, తృతీయ, సప్తమ, నవమదినంబుల వస్త్రత్యాగ బహి స్స్నానంబులుచేసి తిలోదకంబు లీయవలయు, మూఁడవదివసంబునస్థిసంచ యనంబు సేయవలయు ॥ 221

గీ॥ అస్థిసంచయనము చేసినంతనుండి, యవనినాథ సపిండుల నంటవచ్చు।
వినుసమానోదకులు భోగవిధులుఁదక్క,నర్హులగుదురుసర్వక్రియలకునధిప॥222

వ॥ సంచయనంబు చేసినవెనుక సమానోదకులకు, సపిండులకు స్త్రీసమాగమంబు చేయరాదు. బాలుండును, దేశాంతరస్థుండును, బతితుండును, మునియు, జలా గ్న్యుద్బంధనాదుల యందు మృతులైన జ్ఞాతులకు సద్యశ్శౌచంబు విధియింపఁ బడియె. మృతబంధుని యన్నంబు పదిదినంబులు భుజియింపరాదు. దానప్రతి గ్రహణయజ్ఞ స్వాధ్యాయంబులుం జేయరాదు. విప్రునకుఁ బదిదినంబులును, రాజన్యునకుఁ బండ్రెండు దినంబులును, వైశ్యునకుఁ బదేను దివసంబులును, శూద్రునకు మాసంబును నాశౌచంబు. వీరలుస్వకులోచితంబుగాఁ శ్రాద్ధంబు చేయవలయు ॥ 223

గీ॥ భూపవర్య, యయుగ్మకంబులుగవిప్ర, వరులభుజియింపఁ జేయఁగావలయుశ్రద్ధ
దనరఁబిండంబునిడఁదగు దర్భతతుల, పైనిమృతుఁగూర్చి యుచ్ఛిష్టపార్శ్వభూమి।

వ॥ ఇట్లుయథోక్తంబున శ్రాద్ధంబుచేసి సపిండీకరణంబుచేసి ప్రేతత్వంబుమాన్పి పితృత్వంబునొందించి యుత్తరక్రియలు నడుపవలయు. పుత్త్రులు,దౌహిత్రులు తత్పుత్త్రులు వీరలెవ్వరైనను నుత్తరక్రియలు నడుపవలయు. అవియేఱింగించె దవినుమనియౌర్వుం డిట్లనియె ॥ 225

చ॥ జలజభవేంద్రరుద్రవసుసారసమిత్రహుతాశనానిలం
బులు, పితృవిశ్వదేవగణముల్ ఋషిమానుషపక్షిపన్నగం।
బులుపశువుల్ సమస్తమగు భూతగణంబులుఁ దృప్తినొందుని
శ్చలమగుశ్రద్ధతో నరుఁడుశ్రాద్ధముచేసినఁ బార్థివోత్తమా ॥ 226

వ॥ ప్రతిమాసంబున నమావాస్యయందును శ్రాద్ధంబుచేయవలయు. ఇంకఁగామ్య శ్రాద్ధంబు వివరించెద. వ్యతీపాతయోగంబున, విషువత్ కాలంబున, సూర్య సోమగ్రహణకాలంబునఁ ,బండ్రెండు సంక్రాంతుల, నక్షత్రగ్రహపీడల, దుష్ట స్వప్నావలోకనంబుల, నవసస్యాగమంబుల నిచ్ఛాశ్రాద్ధంబు సేయవలయు॥227

॥ సార్వభౌమ! యమావాస్యస్వాతితోడ, మైత్రితోడవిశాఖతోఁ జిత్రలలఁ ।
గూడువేళలశ్రాద్ధంబు గోరిచేయఁ, దృప్తిపితరులకష్ట వార్షికిజనించు ॥ 228

క॥ పొలుపగు కృష్ణపంచదశిఁ బుష్యపునర్వసు రౌద్రతారలం
గలసినవేళమానవుఁ డకంపితమైతగు శ్రద్ధశ్రాద్ధము।
త్కాళికనొనర్పఁదృప్తియగు ద్వాదశవత్సరముల్ పితృవ్రజం
బులకునృపాలచంద్ర! యిదిపూనికతో నొనరింపఁగాఁదగున్ ॥ 229

॥ వరుణతారతోడ, వాసవతారతోఁ, బూర్వభద్రతోడఁ బొసఁగఁగూడి।
యున్నతత్వమమర నున్నయమావాస్య, దేవదుర్లభంబు భూవరేంద్ర ॥ 230

క॥ ఈతొమ్మిదినక్షత్రంబులతోఁ గూడిన యమావాస్యయందు శ్రాద్ధంబుచేసినఁ
బితృతృప్తియగునని చెప్పి యార్యుండు సగరున కిట్లనియె ॥ 231

చ॥ ఘనపితృభక్తివైభవముగల్గు నిలాసుతుఁడౌ పురూరవుం
డనఘు సనత్కుమారుఁగని యాదృతివేఁడిన నమ్మునీంద్రుఁడా ।
జనపతిఁజూచి కౌతుకవశంవదుఁడై యెఱిఁగించెనట్లుస
ద్వినుతవచోర్థమీవును బ్రవీణతతో వినుమంచునిట్లనున్ ॥ 232

వ॥ భాద్రపద మాసంబునఁ గృష్ణపక్షత్రయోదశి యందును, మాఘమాసం
బున నమావాస్యయందును, సూర్యసోమగ్రహణ కాలంబులయందుఁ ద్ర్యష్ట
కలయందును, నయనద్వయంబు నందును, బితరులనుద్దేశించి శ్రద్ధాసమన్వి
తుఁడై తిలోదకంబులనైన నీయవలయు, శ్రాద్ధంబుచేసెనేని సహస్రసం
వత్సరతృప్తియగును ॥ 233

ఆ॥ మనుజనాథవినుము మాఘంబునందమా, వాస్యఁగూడెనేని వరుణతార ।
యదియెపితలకును మహాపుణ్యకాలంబు, పరమభాగ్యమదియె దొరకెనేని ॥ 234

వ॥ అమ్మాఘామావాస్యయును, సూర్యగ్రహణకాలంబును ధనిష్ఠతోఁ గూడిన
నందుఁ బితరుల నుద్దేశించి శ్రాద్ధంబుచేసిన నయుతకులంబులతోఁ బిత
లు తృప్తినొందుదురు. ఆయమావాస్య పూర్వభాద్రతోఁ గూడిననందు
శ్రాద్ధంబుచేసినఁ బితలు యుగపర్యంతబును దృప్తినొంది సుఖింతురు,
గంగ, శతద్రువు, విపాశ, సరస్వతి, నైమిశంబు, గోమతి, గోదావరి, యనుని
మ్మహానదుల నవగాహించి పితలనుద్దేశించి శ్రాద్ధంబు చేసినఁ బాపంబులం
బాయుదురు ॥ 235

చ॥ అనుపమమాఘమాసమున నర్థినమాతిథి యందుఁదోయమై
ననుదనయాదులిచ్చిన మనంబునఁ దృప్తులమై సుఖింతుమం

సోమవిక్రేతలు శ్రుతిమానునాతండు, తల్లిదండ్రులఁ బ్రోవనొల్లనతఁడు,
భ్రాతృపరిత్యాగిసూతి *పోష్టయునింది, తుఁడువృషలీపతియునతండు ।

గీ॥ కన్యకాదూషయితయు, రోగగ్రస్తుండు, దేవలకుఁడాదిగల్గు భూదేవవరుని ।
జెప్పఁగారాదు శ్రాద్ధంబుచేయుటకును, ధర్మశాస్త్రార్థవిదులు భూధరవరేణ్య ॥

వ॥ శ్రాద్ధంబునకుఁ దొలునాఁడ పితృదేవతార్థంబు శ్రోత్రియాదుల నిమంత్రింపవలయు. అనిమంత్రితులైనను, యతుల భుజియింపఁజేయవలయు. నిమంత్రణానంతరంబున యజమానుండువిప్రులును గ్రోధవ్యవాయాయాసంబులు చేయరాదు. వ్యవాయంబులు చేసినవారిపితరులు రేతోగర్తంబుననుందురు. కావునఁ బ్రథమంబ, నిమంత్రింపవలయు. స్నానంబు చేసిగృహంబునకు వచ్చిన విప్రుల పాదప్రక్షాళనంబుచేసి యాసనంబులం గూర్చుండంబెట్టి పితలకు నయుగ్మంబుగను దేవతలకు యుగ్మంబుగను నొక్కొక్కరినైనను యథేచ్ఛంబునుగా నియమింపవలయు. మాతామహశ్రాద్ధంబును నివ్విధంబుననె చేయవలయు. ఇందు వైశ్వదేవంబులు వికల్పంబనిరి. దేవతలకుఁ బ్రాఙ్ముఖంబును, పితలకును దఙ్ముఖంబును ప్రశస్తంబు. దేవపితలకు శ్రాద్ధంబు పృథక్కరణంబనికొందఱు చెప్పుదురు. కొందఱేకపాకంబునఁ గూడం జేయవలయునని చెప్పుదురు. 244

గీ॥ ధరణినాయక విష్టరార్థంబుదర్భ, సమితియిడిపూజచేసి శాస్త్రవిధినర్ఘ్య ।
మిచ్చియావాహనముచేసి యెసఁగుభక్తిఁ బితలకుఁను బ్రీతిసేయుట పెద్దమేలు॥

వ॥ తదనంతరంబ దేవతల నిట్లు పూజింపవలయు. తిలాంబువులు పితరులకు, యవాంబువులు దేవతలకు, నర్ఘ్యంబీయవలయు. స్రగ్గంధధూపదీపాదులిచ్చి సవ్యాపసవ్య ప్రకారంబుల దేవపితల నర్చింపవలయు. 246

క॥ క్షితిపరయకాలంబున, నతిథియటకు నన్నకాంక్షియైవచ్చిన న ।
మ్మతిసతనిఁబూజచేసిన, నతులితగతిఁ బొందు శ్రాద్ధమానంత్యంబుఁ ॥ 247

వ॥ అతిథిని గడపిపుచ్చిన శ్రాద్ధంబునిష్ఫలంబగు. అనంతరంబ విప్రులచేత ననుజ్ఞాతుండై యగ్నియందు నాహుతి త్రయంబు యథావిధి వేల్చిహుత శేషంబల్పాల్పంబులగు పాత్రలయందుఁ బెట్టవలయు. తదనంతరంబ మృష్టంబును, నభీష్టంబును, సంస్కృతంబును నగునన్నంబు వెట్టి "యథాసుఖం జుషధ్వ"మ్మని యనిష్ఠురంబుగాఁ బలుకవలయు. విప్రులును దచ్చిత్తులై భుజియింపవలయు. యజమానుండును రక్షోఘ్నమంత్రపఠనంబుచేయుచుఁ దనపితలధ్యానంబు చేయవలయు. ఇట్లైనఁ బితృపితామహప్రపితామహులు తృప్తినొందుదురు. తదనంతరంబ పిండప్రదానంబుచేయవలయు ॥ 248

* సూతపోష్ట—'వృషలీసూతిపోష్ట' అనియుండనగును శూద్రాపత్రపోషకుఁడని యర్థము.

మ॥ హరియజ్ఞేశ్వరుఁ డప్రమేయుఁడు సదాహవ్యంబు కవ్యంబు ని,
ర్భరవృత్తింగొను దేవుఁ డీపితృసుతంత్రంబుం గటాక్షించు నా।
సరసీజాక్షుని సన్నిధానమున రక్షస్సంఘభూతాదులీ,
ధరణిం జేరకపోవుఁగాక వికలత్వం బొంది నల్దిక్కులన్ ॥

వ॥ తదనంతరంబు విధానోక్తంబుగా వికిరంబుచేసి యుచ్ఛిష్టసన్నిధి పిం
నంబుచేసి పూజించి బ్రాహ్మణులకాచమనంబిచ్చి హస్తప్రక్షా
రంబున సుస్వధేత్యాశీర్వాద పూర్వకంబుగా దక్షిణ యొసంగి పితృ
బును పితృ పూర్వకంబుగా దేవతలను విడిచి యా ద్వారపర్యంతం
వర్తింపవలయు, మాతామహశ్రాద్ధం బిట్లు చేయవలయు. తదన
వైశ్వదేవంబుచేసి పూజ్యభృత్యబంధువులుం దానును భుజిం
ఇవ్విధంబున బుధుండు పితృశ్రాద్ధంబును మాతామహశ్రాద్ధంబున
వలయు. చేసిన సుప్రీతులై సర్వకామంబుల నొసంగుదురు.

గీ॥ జనవరేణ్యవినుము శ్రాద్ధకర్మమునకు, మూఁడుకడుపవిత్రములు దలఁ
కూఁతుకొడుకు, తిలలు, కుతపకాలంబును, గానవీనిఁగూర్పఁగలుగువే

వ॥ రజతదానకీర్తనంబులును, రజతదర్శనంబును, ననునివిపవిత్రములు.
బును, నధ్వగమనంబును శ్రాద్ధకర్తయు, భోక్తయు వర్జింపవలయు.

క॥ క్షితినాయక వినుసోముఁడు, పితలకునాధారమవనిఁ బెంపగుయోగం।
బతనికి నాధారంబీ, కతనన్ముఖ్యుండుయోగి గణుతింపంగన్ ॥

వ॥ అట్టి యోగీంద్రుండు శ్రాద్ధంబునకుఁ బ్రశస్తంబు. శ్రద్ధానియు
యోగీంద్రుండు పితరులను భోక్తలను, యజమానినిఁ దరింప
యౌర్వుండు సగరున కిట్లనియె.

గీ॥ మనుజనాథహవిష్యంబుమత్స్యశశక, నకులమాంసంబులునుభాగలక
గవయరురుహరిణీ శల్యకముల మాంసములునునిడనెల్లపితరులకొలయ

వ॥ మేషమాంసంబును మాసతృప్తికరంబు, ఖడ్గమాంసంబును, కాలశా
దేనెయు మహాప్రశస్తంబులు, గయకుంబోయి యచ్చట శ్రాద్ధం
బితృ తృప్తియగు. చేసిన యతని జన్మంబు సఫలంబు, ప్ర
బులు నీవారంబులు, శ్యామాకంబులు, శ్రద్ధార్హంబులైన వనా
యవలు, ప్రియంగువులు, ముద్గంబులు, గోధూమంబులు,
తిలలు, నిష్పావంబులు, కోవిదారంబులు, సర్షపంబులు, శ్రా
యోగ్యంబులు. ఆగ్రయణేష్టికిరాని, ధాన్యజాతంబును, రాజమా

అణువులు, మసూరంబులును; మానవలయు. అలాబువును, గృంజనంబును, పలాండువును, పిండమూలకంబును, గాంధారకంబును, కలంభంబును, లవణంబును, సౌవీరంబును, నారక్తనిర్యాసంబులును, ప్రత్యక్ష లవణంబును, వర్జితంబులు. వాగ్దూష్యంబు నక్తాహృతంబును, నుచ్ఛిష్టంబును, నష్టంబ. గోవులు త్రాపనివియు, దుర్గంధ ఫేనిలంబులును నగు జలంబులుగావు॥ 256

చ॥ జనవరయొంటి డెక్కగల జంతువులిచ్చినపాలు, గొఱ్ఱెపా
లును నెను పెంటియిచ్చినవి లొట్టియయిచ్చిన పాలుకూడ వెం।
దునుమృగజాతిపాలుగడు దూష్యములంచుఁ బితృక్రియావిదుల్
వినుతబహుస్మృతుల్వేదకి విశ్రుతలీలలఁజెప్పిరొప్పుగన్ ॥ 257

క॥ అపవిద్ధుఁడుపాషండుఁడు, శ్వపచుఁడురోగాతురుండుచండుఁడునగ్నుం।
డపవిత్రసూతకాశౌ, చపరులుకనుఁగొనిన్గాదు శ్రాద్ధంబధిపా ॥ 258

వ॥ (వీరు) చూచినను రజస్వలలు చూచినను, కుక్కుట, వానరగ్రామసూకరంబులు చూచినను శ్రాద్ధంబునఁ బితలును దేవతలును భుజియింపరు. కావున నివి దొరలకుండ శ్రద్ధాసమన్వితుండై చేయవలయు. తొల్లి కలాపపురోపవనంబున మనుపుత్రుండైన యిక్ష్వాకుని ముందరం జెప్పిన పితృగీతలైన గాథలు కొన్ని గలవు. వానియర్థంబు వినుమని యిట్లనియె ॥ 259

గీ॥ మాకులంబునఁ గొకఁడుసన్మార్గశీలుఁ, డుదయమైగయకేఁగియందొసరఁబిండ।
మిడునొకో యట్టులైనమేమిందుఁఅమును, దృప్తినొందెదమిప్పుడు ప్రియముతోడ ॥

ఉ॥ అనిన వేడ్కమాకులమునందు జనించినవాఁడు శ్రద్ధతోఁ
దేనెయు నేయుఁ బాయసము తెచ్చి మఘర్క్షమునంద్రయోదశిఁ।
స్నానక వార్షికంబులగు మాసములన్నముఁగూర్చి పెట్టునో
కొక్కనిరపాయతృప్తినపుడొందుదుమట్లయినన్ముదంబునున్ ॥ 261

గీ॥ గౌరియగు కన్యవిప్రపుంగవునకర్థి, దానమిచ్చిన, నల్లనిదానివృషభ।
మ్రమువిడిచిన, దక్షిణావంతమైన, తురగమేధంబుచేసిన దొరకుతృప్తి ॥ 262

వ॥ ఇవ్విధంబున నౌర్వుండు సగరునకు సదాచారంబుచెప్పె. ఇవ్విధంబున నడిచిన యతండుత్తముండు. దీనినుల్లంఘించి నడిచిన యతండు నిరయంబునంబడు. అనిచెప్పిన పరాశరునకు మైత్రేయుం డిట్లనియె. 263

చ॥ మునివరనగ్నుఁడెవ్వఁడు వినూఘతనేపని చేయనగ్నుఁడౌ
వినవలతున్దదీయమగు వృత్తముసత్కరుణాకటాక్షవీ।

క్షునెరయనావయిన్నిలిపి సర్వము దెల్పుమటన్న నప్పుడా
వినుతతపోధనుండు కడువేడుక నమ్మునిఁజూచియిట్లనున్ ॥ 264

గీ॥ సన్నుతిఋగ్యజుస్సామవేద, ములుత్రయీసంజ్ఞ వెలయుమర్త్యులకునదియె।
యావరణముగుదానిఁబోనాడునట్టి, పాతకుఁడునగ్నుఁడిదివేదభాషితంబు ॥ 265

వ॥ సర్వ వర్ణంబులకును, సంవరణంబు వేదత్రయంబు. అట్టి వేదత్రయంబు విడిచినవాఁడునగ్నుండనంబరఁగు ॥ 266

సీ॥ ధన్వవర్తనుఁడు మందాకినీసుతుఁడునీ, వడిగినయట్లతన్నడుగుటయును।
మాతాతకరుణాసమగ్రుఁడై యక్కుమా, రోత్తమునకుఁజెప్పిన త్తెఱంగు।
విన్నాఁడఁజెప్పెదవినుముమైత్రేయదే, వానురులకుమహాహవముదివ్య।
వత్సరంబులునూఱువర్తిల్లెఁదొల్లియం,దసురవర్గములోనహ్లాదముఖ్యు ॥

గీ॥ లైనయసురలు బలియులై యాక్రమింప, సురలునిర్జితులై పరిస్ఫురణమాలి।
విరిగిపోయిచలచ్ఛుభ్రవీచికావి, తతసురోదన్వదుత్తరతటముచేరి ॥ 267

వ॥ తపంబుచేసి, తటంబున॥ 268

లయగ్రాహి ॥

మెండుకొనిరక్కసులుభండనమునంబొడువదండిచెడియోడిచనినిండుమతితోనా
ఖండలముఖద్యుచరకాండమునుతించె,మురఖండనునమేయగుణమండనువిరాజ।
త్కుండలిశయానుమృదుగండవిలసన్మకరకుండలరుచిప్రచయుఁజండకిరణోద్య
న్మండలనివాసిజగదండసముదాయకపిచండిలునఘౌఘతరుషండదవవహ్నిన్ ॥

గీ॥ విశ్వలోకేశ్వరుండైన విశ్వదేవు, నవ్యకమలాక్షు నారాధనంబుచేయఁ।
గోరిమేమందరమునుమిక్కుటంపుభక్తిఁ,బొగిడినబ్రసన్నుఁడై మమ్ముఁబోచుఁగాత॥

క॥ నెట్టుకొని భూతజాలము, పుట్టున్ లయమందునే ప్రభునియందు, మదిన్।
బుట్టినసాహసమునమే, మట్టిహరింబొగడఁగలమె యర్హతవెలయన్ ॥ 271

ఉ॥ ఐనను దైత్యబాధఁ బరమార్తిమునింగినవారమై నినున్,
బూనినుతించి సంతసముబొందఁగఁ జేసివిపత్తిఁ బాయఁగాఁ।
గానిభవద్గుణాబ్ధికడగాంచి యథార్థమెఱింగికాదు ను,
మ్మో! నిగమాంతవేద్యమగు మీమహిమల్ వినుతించఁబూనుటల్ ॥ 272

ఉ॥ భూమి జలంబు వాయువు నభోజ్వలనంబులునీవ, శబ్దము
ఖ్యామితతద్గుణంబులు నహంకృతిబుద్ధులునీవనీవ, యు।

ద్ధామతర ప్రధానమును దత్పరుఁడౌ పురుషుండవీవ, ల
క్ష్మీమహిళేశ నీవ, వినుజీవునకుం బరమాత్మ వారయన్ ॥ 273

గీ॥ అఖిలభూతాత్మయేకమై యలరునీదు, వపువె మూర్తమమూర్తంబునపరిమితము।
బ్రహ్మమొదలుగ స్తంబ పర్యంతమైన, జగమిదంతయుఁ దానయై నెగడుఁ జూవె ॥

క॥ చతురాననత్వమున నూ, ర్జితగతి జగములు సృజించి సృష్టికరణకృ ।
త్యతఁ బరఁగు నీకు మ్రొక్కెద, మతిశయితకృపార్ద్రదృష్టి నరయుము మమ్మున్ ॥

క॥ మరుదగ్ని శక్ర శశిదిన, కరవసురుద్రాది దేవ గణరూపుఁడవై,
యిరవొందు నీకు మ్రొక్కెద, మరవిందవిశాలనేత్ర యరయుము మమ్ముఁ ॥ 276

క॥ శమదమవర్జితమజ్ఞా, నమయము దంభాత్మకంబు, నయహీనము దు ।
ర్దమమును నగు నీదైత్యో, త్తమరూపంబునకు మ్రొక్కెదముకమలాక్షా ॥ 277

గీ॥ నాతివిజ్ఞాన మయమును నాతినష్ట, తేజమును నైన తావకోద్దీప్తయక్ష। [రించి॥
రూపమున కేము పలుమరు మ్రొక్కువార, మంబురుహనేత్ర మముఁ గావుమాద

క॥ పరికింపఁ, గ్రౌర్యమాయా, భరితంబై యసితమగుచుఁ బరఁగిన నీభీ ।
కరరజనీచరరూప, స్ఫురణమునకు మ్రొక్కెదము ప్రచురతరభక్తిన్ ॥ 279

క॥ సురలోకప్రాపకమై, నిరతము సత్పురుషమాననీయంబై భా ।
సురగతి నెయ్యది దగు నా, స్థిరధర్మంబైన నిను భజించెద మెలమిన్ ॥ 280

సీ॥ గగనయానమున సంగముగల్గి చెన్నొందు, సిద్ధాత్ము నినుఁ గొల్తుమిద్ధభక్తిఁ
గ్రూరత్వము, ద్విజిహ్వతారూక్షతయుఁ గల్గు, నాగాత్ము నినుఁ గొల్తుమాగమోక్తి।
శాంతియు సుజ్ఞానసంపత్తియును గల్గు, ఋష్యాత్ము నినుఁ గొల్తుమిష్టభక్తి
నఖిల భూతములఁ గల్పాంతంబున హరించు, కాలాత్ము నినుఁ గొల్తుమేలు మనుచు॥

గీ॥ నిఖిలజగములభక్షించి నృత్యమాడు, ఘోరరుద్రాత్మకుని నిన్నుఁ గొల్తుమెపుడు ।
రాజసంబునఁ గర్మకారణతఁ గల్గు, మనుజరూపకు నినుఁ గొల్తుమనుపమాత్మ ॥ 281

క॥ పదునెనిమిది పదివధములు మొదలఁ గలుగు తామసమును మూఢతలోనన్ ।
గదిరిన విశ్వాత్మకు నిను, సదమలతం గొల్చెదము ప్రసన్నతకొఱకున్ ॥ 282

గీ॥ సకలయజ్ఞాంగభూతమై పస్వధమయి, ముఖ్యమై, సిద్ధికరమయి మొనయువృష ।
శైలరూపికి నీకు నిశ్చలపుభక్తి, మ్రొక్కెదము మమ్ముఁ గావు నిరూఢమహిమ ॥

క॥ సర్వాత్మ సర్వకారణ, సర్వగుణాధార గుణవివర్జిత కరుణా ।
ధూర్వహపురుషోత్తమ మము, గర్వితరక్షోవిజయులఁ గావుము కరుణన్ ॥ 284

వ॥ దేవా! తిర్యఙ్మనుష్య దేవాది రూపకుండవును, వ్యోమాదిభూతమయుండ
వును, శబ్దాది గుణరూపకుండవును, సర్వాత్మకుండవునైన నీకు నమస్కా
రంబు. ప్రధాన బుద్ధ్యాదిమయ స్వరూపకుండును, సమానాధిక రహితుండును
కారణ కారణంబును నగు నీకు నమస్కారంబు. శుక్లాది, దీర్ఘాది, ఘనాది
విశేషణ రహితుండును, శుద్ధాది శుద్ధుండును, బరమర్షి దృశ్యుండును నగు
నీకు నమస్కారంబు. అశేష పూర్ణంబై యక్షయంబైన బ్రహ్మంబగు నీకు
నమస్కారంబు. సనాతనుండును, నజుండును, బరమ పదాత్మవంతుండును
నశేష బీజభూతుండును ననాదినిధనుండును నగు వాసుదేవునకు నమస్క
రించెదమని స్తుతియించిన స్తోత్రావసానంబునందు॥ 585

మ॥ కరుణాశస్తుండు శంఖచక్రయుగరంగద్దీర్ఘహస్తుండు శ్రీ
తరుణీపూరితవక్షుఁడాశ్రితజనోద్ధార క్రియాదక్షుఁడు।
ద్ధురనాగాంతకవాహుఁడంబుదరుచిస్ఫూర్తోరుదేహుండు శ్రీ
హరిసాక్షాత్కృతినొందె దేవసముదాయంబుల్లసంబొందఁగన్॥ 286

వ॥ ఇట్లు సాక్షాత్కరించిన సంభ్రమాకులచిత్తులై ప్రణిపాతపురస్సరంబుగా బృం
దారకు లిట్లని విన్నవించిరి॥ 287

క॥ కరుణించి ప్రసన్నుఁడవై, శరణాగతుల మమ్ముఁ గావు సమదనిశాటో।
త్కరములఁ బరిమార్చి, రమాతరుణీవర భక్తసౌఖ్యదాయక కృష్ణా॥ 288

సీ॥ యాగభాగాదులజ్జిదిమిభక్షించిరి, చేసాపనింతైనఁ జనుమలేక।
నందనద్రుమరాజినటికి రెండైనచో, నీకకొక్కటిద్దైన నిలువనీక।
పొందామరలు వీఁకి రెండు మిన్నేటమందున, కైనవెదకిన దొరకనీక।
వెడలిపోఁద్రోలిరి వెదకిమా నెలవుల, నొదిగియొక్కెడనైన నుండనీక॥

గీ॥ కెరలియచ్చరపడఁతులఁ జెఱలువట్టి, దివిమిస్వారాజ్య మాక్రమించిరి విధాత
యాతతనుతాజ్ఞ మీఱిబలావలేప, చాపలాపరిమేయు రక్షః ప్రవరులు॥ 28

క॥ భవదీయాంశజులము, మేమవిరళ దివ్యప్రభాసమైన యవిద్యా।
తివిమూఢాత్ములమై యీ, భువనము నీకన్న భేదముగఁ జూతుమజా॥ 29

వ॥ సర్వగోధర్మాభి రతులును, దేవమార్గానుసారులును, తపోవృతులును, నగుటఁ
జేసి యారక్కసులం జంప శక్తులముగాము, వారల నధించు నుపాయంబా
తీయవలయునని విన్నవించినఁ గరుణావశంవదుండై శ్రీహరి తన శరీరంబువల
మాయామోహుండను నొక్క పురుషుని నుత్పాదించి సురలకతని నిచ్చి
వారికిట్లని యానతిచ్చె॥ 29

సీ॥ విబుధపక్షములార వినుఁడు మాయామోహుఁ, డితఁడు దానవుల మోహింపఁ జేయఁ
గలఁడు మోహితులయి, ఘనవేదమార్గబహిష్కృతులై వీర్యమెడలి చెడుదు
రందఱు వారు నేనఖిలస్థితికిఁ గర్తఁ, గాన శత్రులఁ జంపఁగాదు నాకుఁ
గమలజునకు నధికారమిచ్చితిఁ గానఁ, దదధీన మీసర్వదైత్యవర్గ

గీ॥ మట్లు గావున నితఁడె మీయర్థమెల్లఁ, జేయఁగలఁడు భయంబేల శీఘ్రముగను
డనుచు నంతర్హితుండయ్యె నాదిదేవుఁ, డమరులును మ్రొక్కి చనిరి హృష్టాత్ములగుచు॥

వ॥ మాయామోహుండును నమ్మహాసురలున్న కడకుం జనియె. తత్ప్రకారంబు
వినుము॥ 293

శా॥ మాయామోహుఁడు వోయి కన్గొనియె శుంభద్వీచి మన్నర్మదా
తోయస్ఫారితతీరకాననమునందున్నందితప్రస్ఫుర
ద్ధీయుక్తిం దపమాచరించుచుఁ బ్రశస్తిం బెంపుదీపించు దై
తేయశ్రేష్ఠుల వేదచోదితసముద్దీప్యత్క్రియానిష్ఠులన్ ॥ 294

వ॥ ఇట్లు కాంచి దిగంబరుండును, ముండుండును, బర్హిపత్త్రధరుండును, నై దైత్యు
లం జేరంబోయి మాయామోహుఁడు మధురవచనంబుల నిట్లనియె ॥ 295

గీ॥ దైత్యపతులార యేమియర్థంబుఁ గోరి, తపము చేసెద రైహికార్థంబొ గాక ।
స్థిరతరాముష్మికార్థమో చెప్పుఁడనిన, వారలిట్లనిరతనితో ధీరఫణితి ॥ 296

క॥ పరలోకఫలము చిత్తాం, బురుహంబులఁ దలఁచి తపము పూనితిమి గుణా ।
కర యక్కట యేమిట్లీ, వరయుటకన వారిఁ జూచి యతఁడిట్లనియెన్ ॥ 297

చ॥ వినుఁడు విముక్తిఁ గోరినఁ, బ్రవీణత, మద్వచనేరితార్థముల్ ।
ఘనతరధర్మయుక్తములు, కాంక్షితమోక్షఫలప్రదంబు, లీ ।
రనితరబుద్ధులై మదుదితామలధర్మములాచరింపుఁడిం ।
దును సరిలేని మీవరమనోరథముల్ సఫలత్వమొందెడిన్ ॥ 298

వ॥ ఇది ధర్మం బిదియధర్మం బిదిసాధువిదియ సాధువు, ఇదిముక్తియొసంగు నిది
ముక్తియొసంగదు. ఇది పరమార్థం బిదియపరమార్థంబు. ఇది కార్యం బిదియ
కార్యంబు. ఇది స్ఫుటం బిదియస్ఫుటంబు. ఇది దిగంబరధర్మం బిదిబహువస్త్ర
ధర్మంబని బహుయుక్తిదర్శన చర్చితంబులగు నతని వచనంబులు విని విశ్వసించి
యనేకాంత వాదపరులై యల్పకాలంబునస త్రయీత్యాగంబు చేసిరి. తద
నంతరంబ మఱియును ॥ 299

క॥ ధర్మపరులౌచు వైదిక, కర్మాచరణప్రవణవికాసితతనులై ।
నిర్మలత నున్న కొందఱు, నర్మిలిఁగని యధికపంచనాలికుశలుండై ॥ 300

క॥ కాషాయధారియై సం, భాషానిపుణత్వమమర మాయామోహుం।
డీపదనిశ్చితకుహనా, వేషతఁ బాషండవృత్తి వెలయంబల్కెన్॥ 301

క॥ దనుజవరులార మీ రి, ట్లొనరించిన పనికి స్వర్గమో, మోక్షంబో।
వినుత ఫలంబక్కట యిం, కనయినఁ బశుహింసమానఁగాదే మీకున్॥ 302

క॥ జ్ఞానంబు కారణము వి, జ్ఞానమయమశేషమనుచు, సకలవిబుధులున్।
బూనివివరించిరి కనన్, జ్ఞానవిదులుగాఁగవలయుఁ జయ్యనమీరల్॥ 303

వ॥ వినుండిజ్జగంబనాధారంబై భ్రాంతిజ్ఞానార్థతత్పరంబై, రాగాదిదుష్టంబై, భవ
సంకటంబునందు భ్రమించుచుండు॥ 304

శా॥ కార్యంబంచు నకార్యమంచు నిట వక్కాణింపఁగానేల, మీ।
రార్యుల్ చూడుఁడు, పుట్టిరంగనలు భోగార్థంబె యిక్కాట, ని
ర్మర్యాదంబుగ భోగముల్గనుఁడు కామక్రీడ నెంచం, దనూ,
నిర్యాణంబయిన న్గనంగలరె, నిర్ణిద్రోపభోగక్రియల్॥ 305

గీ॥ చిత్తగించినవెల్ల భక్షింపవలయు, క్షణికతనువిది చిత్తంబుకట్టఁదగునె।
జగతిలో భక్ష్యమిది, యభక్ష్యంబిదనుచు, నెంచుకొనుమాటలెల్లనువంచనంబు॥

వ॥ ఇవ్విధంబు తెలియుండు మద్వచనంబులు చేయుండనుచు ననేక హేతుదృష్టాంతంబులుచూపి చెప్పుమాయామోహుని వచనంబులవలంబించి నక్తంచరులు కించిత్కాలంబునన శ్రుతిస్మృత్యుదితంబగు ధర్మంబువిడిచి యన్యోన్య బోధకులై శిష్యాచార్య పరంపరల వలన నందఱుఁ బాషండధర్మపరులై రప్పుడు॥

సీ॥ పలుసంతమాటల పాఁతజోలిభళీర, నడిపడ్డ యీావట్టి చదువులేల।
పదమంచునమ్మి నిబ్బరపుఁగర్మపయోధి, మునిఁగిరయ్యా వీరిముచ్చటేల।
పరుఁడు పెట్టకకాని బ్రతుకలేరయ్యారె, బడుగువేలుపుల, బంబదిరి యిదేల,
పూరి కట్టెలు మేఁక పోతులు నేతులు, నవుర జన్నపు బూమెలాటలేల॥

గీ॥ డంబులివియేల పరమధర్మంబహింస, యనుచు వేదద్విజామరయజ్ఞతతుల।
నతులపాషండచండయుక్త్యతిశయముల,గములనిందింతురసురపుంగవులు,కష్టులు

వ॥ మఱియు నమ్మాయామోహుండు॥ 309

క॥ జగతినహింసయె పరమం, బగు ధర్మమధర్మమనుచుఁ బొటింపంగాఁ।
దగునె క్రతు హింసయుక్తికి, మొగయవుగాయిట్టి యర్థములు చర్చింపన్॥ 310

మ॥ క్రతువుల్ పెక్కులుచేసి దేవుఁడయి స్వర్గంబేలు, న్నాకాశచీ,
పతియంచుర్భ్రమమందనేల యనలప్రాంచచ్ఛిఖాదగ్ధమై।

వితథంబై న హావిక దంబకము భావింపం ఫలావాప్తియాఁ,
జతురంబే యహహ్హవినందగునె యీజంజాటముల్వల్కి నన్ ॥ 311

క॥ అనయము, క్రతువున మృతిబొం, దిన పశువు దివంబుగనుటనిజమే, యట్లై ।
నను యజమానుఁడు నిజజన, కుని జంపఁగ నలదెదివముఁ గూర్చెడికో యఱుకన్॥

చ॥ ఒకరుభుజింప నన్యులకు నొందదుగాపరితృప్తి, శ్రాద్ధముల్,
వికలతఁ జేయువారు కడువెఱ్ఱులు, తృప్తి నిజంబయేని, యూ ।
రికిఁ జనువారు చల్దులు ధరించి చనంబనిలేద, యింటి వా,
రకుటిల చిత్తులై కుడువనక్కడవారికిఁ దృప్తిగల్గెడిన్ ॥ 313

వ॥ ఈయంతయుంజనశ్రద్ధేయముగాఁ దలంచి యుపేక్షింపవలయు.ఆప్తవాదంబులా కసంబుననుండి యూఁడిపడవుగదా ! యుక్తియుక్తంబైన వచనంబు గ్రహింప వలయు. నావచనంబులు మీకు రుచియించినఁ జేయుండని పెక్కుదెఱంగుల బోధించు మాయామోహుని మతంబవలంబించి పాషండధర్మపరులై వేద మార్గంబు విడిచి చరించిరంతం గొంతకాలంబు చనిన ॥ 314

క॥ హరిహయరథభటకోటి, స్ఫురణము మిన్నందఁ గదలిపోర మహాసం ।
గరి మొనరించిరి దైత్యులు, సురగణములతో సమగ్రశూరత్వమునన్ ॥ 315

వ॥ ఇట్లు పోరిదేవగణంబులచేత నిహతులైరి. మైత్రేయా ! వేదోదితంబైన స్వధర్మంబు వారికిఁ గవచంబైయుండెనట్టి వేదమార్గంబు విడుచుటంజేసి నష్టకవచులైరి, దేవగణంబులు సుఖించిరనిచెప్పి పరాశరుండు మైత్రేయున కిట్లనియె ॥ 316

క॥ మాయామోహోదితమగు, మాయామార్గముననడుచు మనుజుఁడునగ్నుం ।
డీయర్థమునకు సంశయ, మేయెడల న్లేదుమునికులేశ్వరవింటే ॥ 317

వ॥ బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, పరివ్రాట్సంజ్ఞలుగల యాశ్రమంబులు నాలుగుగాని యేనవయాశ్రమంబులేదు. ఎవ్వండేని క్రమంబున నాశ్రమధర్మంబులు నడపకయుండు నప్పాతకుండు నగ్నుండనంబరఁగు. శక్తుండయ్యును నిత్యకర్మంబు నడపండేని యద్దినంబుననే యతండు పతితుండగు. ఆపదలేకయు, నొక్కపక్షంబు నిత్యక్రియాహానిచేసినను మనుజుండు మహాప్రాయశ్చిత్తంబున శుద్ధుండగు. సంవత్సరంబు క్రియాహానిచేసిన మనుజునిఁజూచి సూర్యావలోకనంబు చేయవలయు. ముట్టిన సచేలస్నానంబు చేయవలయు. సంవత్సరక్రియాహానికరునకు శుద్ధిలేదని వేఱచెప్పనేల ? దేవర్షి పితృతిథి భూతంబులం దృప్తులంజేయని వానికన్నఁ బాతకుండులేఁడు. అట్టి పాతకితో యానాసనపరి

[illegible]సుప్రశ్నంబులచేతఁ గలిసి వర్తించిన యతండు తత్తుల్య[illegible]ను ॥ 318

[illegible]లఁ బితరులను భూ, తావళి నతిథివ్రజంబు, నర్చింపక వాం ।
[illegible]త్తిం, [illegible]డిను, పా, [illegible]నహులనకుఁ గలదెని ష్క్రియాకలన మహీనో ॥

[illegible] నాలుగువర్ణంబులవారును స్వధర్మవిముఖులై హీనధర్మంబులనడిచిన, నగ్నులనఁబడుదురు. ఆనగ్నుల సర్వకాలంబుల దర్శనస్పర్శనాదులను వర్జింపవలయు. శ్రద్ధా[illegible]తులాచరించు శ్రాద్ధంబు నగ్నులచేతం జూడఁబడిన నిష్ఫలంబగు [illegible]ంబున కొక్కయితిహాసంబుగలదు. ఆకర్ణింపుము॥ 320

సీ॥ [illegible]లఁ[illegible] శతధన్వుఁడనురాజు, కలఁడు లోకైకవిఖ్యాతయశుఁడు।
[illegible]భార్య యుత్తమపతివ్రతశుభ, లక్షణాన్వితశుభశ్లాఘ్యచరిత।
[illegible]లు సరోజాక్షు జనార్దను, జపహోమదాన పూజావ్రతముల।
[illegible]లబినారాధించి కొలుచుచునొకనాఁడు, కార్తికమాసమాంగళికపౌర్ణ॥ [యు।
గీ॥ మాసి, నుపవాసముండి నేమమునగంగ, తోయములఁ దీర్థమాడి సంతుష్టహృదలగుచుఁదటమున కేతెంచునవసరమున, నృపతిసఖుఁడొక్క పాషండుఁ డేగుదెంచె॥

ఉ॥ వచ్చినవానితో నవనివల్లభుఁడల్లన మాటలాడఁగ
న్విచ్చిలతాంగివానిఁ గని విహ్వలయై కమలాప్తుఁజూచివా।
తొచ్చరణంబు మానిచనె నోయ్యననయ్యవనీశుఁగూడినం
వచ్చయ పేటిగ్రైన ప్రతిభావిలసన్నిజరాజధానికిన్ ॥ 322

వ॥ ఇట్లు నిజపట్టణంబునకువచ్చి యథాన్యాయంబుగాఁ బుండరీకాక్షు, నర్చన పూజాదికంబులం దుష్టింబొందించుచుండిరంతఁ గొంతకాలంబునకు నమ్మహీకాంతుఁడు నితాంత సమరక్రీడా పరిశ్రాంతుండై యంతంబునొందిన నతని కాంతారత్నంబును, ధర్మక్రమంబునఁ జితారోహణంబుచేసె. ఉపవాస దినంబునఁ బాషండసల్లాపంబు చేసినదోషంబుననమ్మేదినీనాథుండు వైదేశాఖ్యపురంబునందు శునకంబై జన్మించె. ఆతని యుత్తమాంగనయు సర్వలక్షణసంపన్నయై కాశీరాజునకుఁ గూఁతురై జన్మించి జాతిస్మరత్వంబుఁ గలిగి యుండె ॥ 323

క॥ తనతండ్రి పెండ్లియాడఁగఁ, దనకుఁ బరిణయంబు చేయఁదలఁచిన నపుడ।
వ్వనజాక్షి తెకుణవలదని, జనకునివారించెఁ గలితజాతిస్మరయై ॥ 32[illegible]

గా॥ ఆకన్యామణియాత్మయోగభవదివ్యజ్ఞానదృష్టిన్ ధరి
త్రీకాంతున్నిజవల్లభుంగనియె వైదేశంబునన్శ్వ నీ।

చాకారంబగు కుక్కపుట్టువున దుఃఖాక్రాంతుఁడై యుండఁగా
నాకాలంబునఁ బోయెఁ డగ్గఱ మహావ్యాసక్తిన వీఁటికిన్ ॥ 325

వ॥ అచ్చటికిం బోయి తదవస్థుండై యున్న పతింజూచి దుఃఖించి యచ్చంచలాక్షి సౌత్కాంత ప్రవణంబగు వరాహారంబొసంగ భక్షించుచు, లాంగూలచాలనంబును, నధశ్చరణావపాతంబులును, భూలుంఠనంబును, వదనోదర దర్శనంబును, మొదలైన స్వశ్వజాతిలలితచాటుక్రియలు చేయ నతి ప్రీడితయై కుయోని జాతుండైన పతింజూచి దుఃఖించి ప్రణామపూర్వకంబుగా నిట్లనియె ॥ 326

క॥ ధర్మైకపరాయణుఁడవు, నిర్మలుఁడవు విష్ణుభక్తినిరతుండవు న।
త్కర్ముఁడవు శతధనుండను, నిర్మలవృత్తంబుగలుగు నృపతివితలఁపన్ ॥ 327

గీ॥ అరయకుపవాసకాలంబునందుఁ దొల్లి, యధికపాషండుతో మాటలాడునట్టి।
దోషమున నీకునిటువంటి కొనఁగువచ్చె, నాత్మఁదలఁపుము నాఁటివృత్తాంతమెల్ల ॥

వ॥ అని యివ్విధంబున ॥ 329

మ॥ లలనారత్నము తన్నుఁజూచి మృదుసల్లాపంబు గావింప పీ
నులు నిక్కించుచు నాలకించిమదిలో నూల్కొన్న జాతిస్మర।
త్వోలసజ్జ్ఞానమునన్ శరీరముతగుల్ వర్జించి జన్మించెన।
వ్వాలఁగోలాహలనామ భూధరము చెంపన్ నక్కయై గ్రక్కునన్ ॥ 330

వ॥ అప్పతివ్రతాతిలకంబును సంవత్సర ద్వయంబునకు నగ్గిరికింబోయి, సృగాలంబై యున్నతనవల్లభుంజూచి యిట్లనియె ॥ 331

సీ॥ రాజేంద్ర ! మఱచితివే జను లెఱుఁగఁగా, శునకమైనీవున్నచోట్కి నేను।
జను దెంచిపాషండసల్లాపజంబైన, దోషంబు దెలిపితిఁదొడరినీకు।
ననవిని నక్కజీవనముపై వాంఛపో, విడిచినిరాహారవృత్తిఁదనువు।

... ... ... ...

గీ॥ ద్రోఁఱఁగివృకమయి జన్మింప నెఱిఁగిసాధ్వి, వనమునకు నేగితోడేటి తనము దాల్చి।
యున్న పతిఁజూచి యక్కటా యోమహాత్మ. మఱచితే నీవుపూర్వజన్మపుఁజరితము॥

క॥ మునుపాషండునితోఁజ,య్యనవ్రతదివసమునమాటలాడినకతనన్।
వినుకుక్క నక్కతోడే, లనునీపుట్టువులుగల్గె నక్కటనీకున్ ॥ 333

క॥ అని తలఁపించిననపుడ,య్యనఘుఁడు వృకతనువు విడిచియటవి జనించెన్।
ఘనగృధ్రమగుచునయ్యెం, గన యప్పుడు దెలుపనతఁడుకాకంబయ్యెన్ ॥ 334

ఉత్సాహ.

కామినీలలామునెక్కఁగాకిఁగూడియక్కటా,
భూమినృపతులెల్ల నీకు భూరిబలులొసంగఁగా ।
స్వామినైచరించు నీవసద్బలిప్రభోక్తవై,
తేమిగల్గదు పూర్వకర్మమింతవింతచేయఁగాన్ ॥

వ॥ పాషండ సల్లాప దోషంబున శునక, సృగాల, వృక, గృధ్రజన్మంబులె యిప్పుడు కాకంబవై తేయని తలఁపించిన.

గీ॥ కాకతనువువిడిచి గ్రక్కునకొంగయై, యున్నవిభునికడకు నొయ్యఁజేరి ।
చెలియ మెప్పట్లు తలఁపింపనమ్మహీ,విభుఁడు నెమిలియయ్యెవిప్రవర్య ॥ 3

చ॥ విభుఁడుమయూరజన్మము, నవీనత నెత్తుకొటెంగి, యప్పుడ ।
యిభరిపుమధ్య దానికినభీష్టవరాభ్యవహారకృత్యముల్ ।
ప్రభనొనరించుచున్సుకృతపాకముఁగోరుచుఁ బెంచుచుండఁడ ।
చ్చుభచరితంబు పక్వమగు చొప్పునఁ గాలముపీలవచ్చినన్ ॥ 3

వ॥ అక్కాలంబున జనకభూపాలుండు వాజిమేధ మహాక్రతువుచేసి తత్సమాప్తంబయిన యవబృథస్నానంబుచేయ నప్పుడప్పువ్వుఁబోఁడి మయూరంబు దానునవబృథస్నానంబుచేసి యమ్మయూరంబుంజూచి పాషండసల్లాప దోషంబున శునక సృగాల, వృక, గృధ్ర, కాక, బకజన్మంబులెత్తి యిప్పుడు మయూరంబవై యున్నాఁడవు. తలంచుకొనుమని తలఁపించిన జాతిస్మరుండై మయూర దేహంబు విడిచి యజ్జనకమహీపాలునకుం బుత్రుండై జన్మించి శీఘ్రకాలంబున సంప్రాప్త యౌవనుండయ్యెనంత. 33

ఉ॥ మానిని తండ్రితోడ ననుమానముమాని మదీయపాణిపీ,
డా నుపమానయత్నమునకై యిపుడీవుస్వయంవరంబు పెం ।
పూనఁగఁజేయుమన్న ముదమొందుచుఁ గాశివిభుండు చేసెఁ బెం,
పై నెగడన్ స్వయంవరమహం బరుదెంచిరి రాజనందనుల్ ॥ 340

గీ॥ ముదముతోడ స్వయంవరమునకు రాజ, పుత్రులేతేరనందులోఁ బూవుఁబోఁడి ।
జనకభూపాలనందనుఁ జారుకీర్తిఁ, దనపతివరించె ధర్మపథంబువెలయ ॥ 341

వ॥ అక్కాంతారత్నంబుతో నారాజనందనుండు, బహుభోగంబు లనుభవించి తండ్రిపరోక్షంబున వైదేహదేశంబునకు రాజై సాంగదక్షిణాకంబుగా బహుయజ్ఞంబులుచేసి యనేకదానంబులు ధర్మంబులుచేసి పుత్రుల నుత్పాదించి శాత్రవులజయించి యథాన్యాయంబుగా రాజ్యంబుపాలించి ధర్మక్రమంబున

సంగ్రామంబులో నక్షీణవిపక్ష ప్రక్ష్వేడనక్షతవక్షఃస్థలుండై దివంబునకుం జనిన నతనిధర్మపత్ని చితారోహణంబుచేసి యతండుం దానును సర్గక్షయపర్యంతంబును నక్షయంబులైన స్వర్గాదిభోగంబు లనుభవించిరని చెప్పి శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె॥ 342

॥ పాషండ సల్లాపదోషంబు, నశ్వమే, ధావభృథస్నానజాతి మహిమ।
యును నిట్టితెఱఁగు సుమ్మనఘాత్మ, కావునఁ, బాపిష్ఠపాషండ భాషితంబు।
సంస్పర్శనంబును జాలింపవలయు వి, శేషించి వినుపుణ్యశీలురైన।
వారు యాగాది దీక్షారంభవేళల, సద్వ్రతాద్యుపవాస సమయములను॥

। గూడిపాషండుతో మాటలాడఁజనదు, మానివరయొక్క నెలక్రియల్ మానునెవ్వఁ।
డతనిఁగని భానుఁజూడంగనర్హ మెపుడు,నన్నియును మానువానిమాటడుగనేల॥

। పాషండులను, వికర్మస్థులను, బిడాలవ్రతికులను, శఠులను, హైతుకులను, బకవృత్తులను, వాఙ్మాత్రంబుచేతనైన నర్చింపంజనదు. దురాచారులును, బాపిష్ఠులునునైన పాషండులతో సంసర్గసల్లాప సహాసనస్థితులు వర్జింపవలయు. ఇప్పుడు నాచేతంజెప్పంబడిన వీరు నగ్నులనంబరఁగుదురు. దృష్టిమాత్రంబున శ్రాద్ధంబు చెఱుపంజాలుదురు. వీరితో సంభాషించిన దినకృతపుణ్యాంబులు చెడు. కావున బుధుండు వీరిసమీపంబునకుం బోవలవదని చెప్పి శ్రీపరాశరుండి ట్లనియె. 344

। కలగొనుజ్ఞానమేమియును గానక మాఢ్యమున న్వృథాజటల్
తలలధరించి శౌచమును ధర్మమువైతృకపిండతోయముల్।
తలఁపనిదుష్టచిత్తుల కథల్ చెవిఁదార్చినఁ, దోడఁబల్కినన్
జులుకనమర్త్యులొందుదురు సుమ్ముమహానరకప్రపంచమున్॥ 345

అని చెప్పుటయు॥ 346

నీలక్ష్మాధరవాస, వాసరకరోన్నిద్రారివహ్నిచ్ఛటా
తూలద్దైత్యవిలాస,కాసర శిరః స్తుత్యోక్తృతాంతార్థికే।
లీలోల్లాత్మ విలాస,లాసమహపాళీ ద్రష్టుకామాంతలో।
కాలక్ష్యప్రతిమాన, మాస రసభావాశ్లిష్ట దోరంతరా॥ 347

మంజుగ సంసృతిసింధుమి! మంజుమాధ్వరజ్ఞై కదీక్ష,మహితపిపాసా।
సంక్షోభరోహణమిళ, ధ్వాంతపయోమోక్షదానదక్షిణవీక్షా॥ 348

తోటకము.

నిజభక్తమహత్త్వ వినిర్దళితా, ప్రజహాత్సుమహాత్తర పాపతతీ ।
సుజనస్తవనీయ యశస్తిలకా, వ్రజపద్మభవాండఫలప్రతతీ ॥

గద్య॥ ఇది శ్రీమత్సు భద్రాకరుణాకటాక్ష వీక్షాలబ్ధకవిత్వ తత్త్వపవిత్ర వేంకటామాత్యపుత్ర కందాళ శ్రీరంగాచార్య కృపాపాత్ర సజ్జనమిత్ర శ్రీహరిగురు చరణారవింద వందనపరాయణ కలిదిండి భావనారాయణ ప్రణీతంబైన శ్రీవిష్ణుపురాణంబునందు స్వాయంభువాది చతుర్దశమనువుల చరిత్రంబును, వ్యాసావతారంబును, యాజ్ఞవల్క్య చరితంబును, సూర్యస్తుతియుఁ, జతుర్వేద సంప్రదాయంబును, నష్టాదశ విద్యాసంఖ్యానంబును, యమభటసంవాదంబును, భగవదారాధనప్రకారంబును, వర్ణాశ్రమాచారంబులును, సదాచారంబును, శ్రాద్ధప్రకారంబులును, నగ్నప్రకారంబును, దేవాసురయుద్ధంబును, దేవతలు శ్రీహరిని స్తుతియించుటయు, మహామోహనిర్మాణంబును, బౌషండాచారవర్ణనంబును, శతధన్వోపాఖ్యానంబును, ననుకథలుగల తృతీయాంశంబునందు తృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

# విష్ణుపురాణము.

భావనారాయణకృతము.

చతుర్థాశ్వాసము.



రంజితమాళవభూ,
మీరమణసహస్ర వాజిమేధ ఫలీభూ ।
తారూఢ కల్పభూజా,
కార మహానీలశైలకటక విహారా ॥

గీ॥ మఱియునప్పుడు మైత్రేయమౌని వరుఁడు, హర్షసంభ్రమపరిపూరితాత్ముఁడగుచు ।
శ్రీపరాశరు పాదరాజీవయుగళి, మౌళిఁ గీల్కొల్పి పల్కె సమ్మతి దలిర్ప ॥ 2

చ॥ ధీరకులాగ్రగణ్యా, సముదీర్ణ భవద్వచనంబులన్సదా.
చారము సర్వధర్మములు చక్కఁగవింటిఁ బ్రహృష్టమయ్యె హృ ।
త్సారసమింక నొక్కటి ప్రసన్నతఁ జెప్పుము రాజవంశ వి,
స్తారము దారతన్వినుము దంబు మనంబునఁ బుట్టె దట్టమై ॥ 3

వ॥ అనివిన్నవించిన శ్రీపరాశరుం డిట్లనియె ॥ 4

చ॥ కమలజుఁడాదియై యశముగల్గి మహత్తర శూరయజ్వరా,
ట్సము దయభాషితంబయి విశంకట మానువంశమీవు ప్రే ।
మమున వినందగున్నలుషమండలి వాయుటకై తదీయ ది,
వ్యమహిమ పెంపులెన్నఁ దరమా పరమార్థ వివేకతత్పరా ॥ 5

గీ॥ వసుధ బ్రహ్మాద్యమగు మనువంశమెవ్వఁ, డేని నిత్యంబు వినుదృఢంబైన భక్తి ।
సకలకాలంబు నతనివంశంబు వృద్ధిఁ, బొందుచుండును శాంతసంపూర్ణహృదయ ॥

వ॥ సకల జగదనాదియై ఋగ్యజుస్సామాది మయుండై భగవద్విష్ణు మయ బ్రహ్మంబు, మూర్తరూపంబైన హిరణ్యగర్భుండు బ్రహ్మాండంబునఁ బ్రథమంబా విర్భవించె. ఆ బ్రహ్మ దక్షిణాంగుష్ఠంబున దక్షుండు పుట్టె నాదక్షు

నికి నదితి. యదితికి వివస్వంతుఁడు, వివస్వంతునకు మనువు, నామ్మనువున కిక్ష్వా
కుండును, నృగుండును, ధృష్ట, శర్యాతి, నరిష్యంత ప్రాంశు నాభాగ, దిష్ట, కరూ
పృషధ్రాఖ్యులు పదుగురు పుత్రులు పుట్టిరంత ॥

గీ॥ మనువు మిత్రావరుణులకు మఖము చేసి, తనకుఁ దనయులు గావలెనని తలం
పహోతయపచారముననందునుదయమయ్యెఁ, గన్యయొక్క తెయిలయనఁగామునీఁ

క॥ ఆయిల మిత్రావరుణుల, యాయతకృప, మగుడఁ బురుషుఁడై సుద్యుమ్న ।
స్థాయన్నామంబునఁ, దగి యాయెడ శాపమునఁ గన్యయయ్యె న్మగుడన్ ॥

వ॥ ఇట్లు సుద్యుమ్నుండు క్రమ్మఱంగాంతయై సోమ పుత్రుండగు బుధ
యాశ్రమ సమీపమునం బరిభ్రమించుచుండ ॥

చ॥ కుసుమశరాశుగ ప్రచయకుంఠితుఁడై శశి పుత్రుఁ డప్పు డం,
బ్బుసరుహనేత్రపై మిగులఁ బ్రేమవహించి రమించె నెందు న ।
ప్పసముగ నేకతంబ శతపత్రవిలోచనఁ గాంచి భ్రాంతుఁడై,
యసమశరార్తి నెట్టి బుధుఁడైనఁ జలింపక నిల్వనేర్చునే ॥

వ॥ ఇట్లు రమించి బుధుండిలయందుఁ బురూరవుంగనియె నంత ॥

చ॥ ఇలకుఁ బురూరవుండు జనియింప మహర్షులు యజ్ఞపూరుషుం,
జలజదళాక్షు వేదమయుఁ, జాలఁ బ్రసన్నునిఁ, జేసి యయ్యిలా
లలనకుఁ బుంస్త్వరూపమగు లాగొనరించిరనంతరంబ య,
య్యలఘున కుద్భవించెఁ దనయత్రితయంబు నయంబుమీఱఁగన్ ॥

వ॥ ఇట్లు సుద్యుమ్నునకు నుత్కల, గయ, వినతులను మువ్వురు కొడుకు
పుట్టిరి. సుద్యుమ్నుండు స్త్రీపూర్వుండుగాన రాజ్యభాగంబున కర్హుండుగాకున
దండ్రి వసిష్ఠువచనంబున నతనికిం బ్రతిష్ఠానపురంబిచ్చిన నతండు
పుత్రుండైన పురూరవున కిచ్చె ॥

క॥ మనుపుత్రుండగు పృషధ్రుఁడు, తనగురువులగోవుఁ జంపితా శూద్రుండై ।
జనగర్హితత్త్వమునఁ బడి, చనియె, నెచటికేనియును, విచారముగదురన్ ॥

వ॥ కరూషునివలన కారూషులను బలపరాక్రమ సంపన్నులైన క్షత్త్రియులు
గిరి. దిష్టునకు నాభాగుండు కలిగి వైశ్యుండయ్యె. అతనికి బలంధనుండు నత
నత్సప్రీతియు నతనికిఁ బ్రాంశువు నతనికిఁ బ్రజాపతియు నతనికి ఖనిత్రుఁడు
నికిఁ జాక్షుషుండు, నతనికి వింశుఁడు నతనికి వివింశకుఁడు నతనికి ఖనినేత్రు
నతనికి నతివిభూతియు నతనికి గరంధముండు, నతనికి, నవిక్షితుండు, నత
మహాబలుండైన మరుత్తుండు పుట్టె ॥

సీ॥ అతని యధ్వరములఁబోలు నధ్వరంబు, గలుగనేరదు భూమిచక్రంబునందు ।
హైమము లెకాని యాగభూమ్యంతరమున, సమ్యయాగోపకరణంబులరయ లేవు ॥

చ॥ సురపతి సోమపానమునఁ జొక్కి మదించె, ధరామరేంద్రులు,
దురవరదక్షిణార్థములఁ దుష్టివహించిరి, సభ్యులుత్విగు ।
త్కరములు దేవబృందము నుదారసమర్హణ ముఖ్యలాల సా,
భరమునఁ బ్రీతిఁ బొందెఁ దలపన్వశమానె తదీయ యజ్ఞముల్ ॥ 18

వ॥ అమ్మరుత్తునికీర్తి నేడునుం జెప్పంబడు. చక్రవర్తియగు నమ్మరుత్తునకు నరిష్యంతుండుపుట్టె. నతనికి దముఁడు, దమునకు రాజవర్ధనుండు జన్మించె. నతనికి సువృద్ధియు నతనికిఁ గేవలుండును నతనికి సుధృతియు నతనికి నరుఁడును నతనికిం జంద్రుఁడును నతనికిఁ గేవలుండును నతనికి బంధుమంతుండును నాతనికి వేగవంతుండును నతనికి బుధుఁడును నతనికిఁ దృణబిందుండు. నాతనికి నిలబిలయను నొకకన్యకయుఁబుట్టె వినుము. 19

ఉ॥ ఆతృణబిందుభూవిభుని నచ్చర లేమ యలంబుసాఖ్య కా,
మాతురయైవరించి, సుతు, నర్కసము జ్వలతేజులోక వి ।
ఖ్యాత్ము విశాలునింగనియె, నాతనిపేర విశాలయన్నము,
ద్యోతితభూతి యా నగరమొప్పె మహీమహిళా విభూషితయై ॥ 20

వ॥ ఆ విశాలునకు హేమచంద్రుండు, నతనికిఁ జంద్రుండు, నతనికి ధూమ్రాక్షుండు, నతనికి సృజయుండు, నాతనికి సహదేవుండు నతనికిఁ గృశాశ్వుండు నతనికి సోమదత్తుండుపుట్టి శతాశ్వమేధంబులుచేసె. ఆసోమదత్తునకు జనమేజయుండు, నతనికి సుమతి జనియించె, వీరలు వైశాలేయులనం బ్రసిద్ధులై వెలయుదురు. 21

గీ॥ వినుముతృణబిందునిప్రసాదముననృపాలు, రందఱునునుర్విపై వైశాలులనఁగఁదగిరి ।
ధార్మికులువీర్యవంతులు నిర్మలులుబ, లాయురున్నతులునునై మహామునీంద్ర ॥

వ॥ శర్యాతికి సుకన్యయను కుమారికయు, నానర్తుండను కుమారుండును గలిగిరి ఆసుకన్యకను చ్యవనుం డుద్వాహంబయ్యె. పరమధార్మికుం డైనయానర్తునకు రేవతుఁడు పుట్టె ॥ 23

క॥ రేవతుఁడు తండ్రియేలిన, భూవిదితానర్త విషయములు పాలించెన్ ।
శ్రీవెలయంగఁ గుశస్థలి, నావిశ్రుతికలుగు పురమునన్వసియించెన్ ॥ 24

వ॥ రేవతునకు రైవతుండనఁ గకుద్మియనఁ బర్యాయనామంబులుగల పుత్రుండు కలిగె. అతనికి రేవతియను కన్యక జనించి పెరుగుచున్నంత ॥ 25

ఉ॥ రైవతుఁ డాత్మపుత్రికిఁ గరగ్రహణార్థము రాజపుత్రుఁడీ
క్షోణితలంబునం దెవఁ డలపోయఁగ నెవ్వఁడొ కోయటంచు నా
కేశవుఁ డోలిఁ గాంచు, నిబిరీసగతి ప్రతిభాప్తిఁ, బోయె, తా
జీవభవాలయంబునకుఁ జిత్తము తత్తర పాటునొందఁగన్ ॥ 2

వ॥ ఇట్లు సత్యలోకంబు నకుం బోయి తదంతికంబున హాహా, హూహూ నావ
గంధర్వులతి రాగంబున దివ్యగానంబు చేయ వినుచుండె. అద్దివ్యగానంబ
త్రిమార్గపరి వృత్తంబైనను ననేకయుగ పరివృత్తంబైనను ముహూర్తంబుగా
దలంచుచుండి గీతావసానంబయిన నబ్జయోనిం గని సాష్టాంగ నమస్కారంబ
చేసి యిక్కన్యకు యోగ్యుండైన వరుం డెవ్వరని యడిగిన రైవతునకుఁ జత
రాననుం డిట్లనియె ॥ 2

గీ॥ వసుధనీకు మనసువచ్చిన యల్లుఁడే, పగిదివాఁడటన్నఁ బార్థివుండు।
మ్రొక్కి స్వామిచిత్తమునకు వచ్చినవాఁడె, వనజముఖికి యోగ్యుఁ డనుచుఁ బలికె

సీ॥ వనజగర్భుఁ డొకింతవడి విచారించి, భూపాగ్రణిఁ జూచి యిట్లనియె నీవు।
తలఁచినవారి సంతతులు సపుత్ర, పౌత్రాదిగా వసుధపై నణఁగిపోయె ।
గానంబు వినుచుండఁగా బహుకాలంబు, పోయె నిప్పుడు భూమిఁ బొడముఁ గలి
యున్నది, కలియుగంబిన్నలినాక్షి, నెవ్వరి కిచ్చెదవు బంధువర్గకోశ ॥

గీ॥ బలము లెవ్వియు లేవు నీకిలనటన్న, సాధ్వసమునొంది యారాజు జలజభవుని ।
కనియె "నిక్కన్యనింక నెవ్వనికి నిత్తు", ననినఁ దలవంచి మనసులోనరసి యజుఁడు

వ॥ నీవిచ్చటికి వచ్చిన వెనుక నష్టావింశతి చతుర్యుగంబులు చనియెనని పల
యేకాగ్ర మనస్కుఁడై సప్తలోకగురుండగు నంభోజయోని గృతాంజలియ
రాజున కిట్లనియె ॥

సీ॥ ఎఱుఁగలే మెప్పుడు నేజగన్మయుని, స్వభావస్వరూప సంపద్బలములు ।
కళ మొదల్ యుగచర్య కడపలగాఁగల, కాలమే విభుభూతిఁ గడపలేదు ।
సృష్టిరక్షణనాశ కృత్యార్థమే దేవు, వలనమూర్తిత్రయంబెలమిఁ గలిగె ।
శక్రాదిరూపియై సకలలోకంబులు, పాలించునే పరాత్పరుఁడు, నియతిఁ ॥

గీ॥ చంద్రసూర్యాకృతులు దాల్చి జగతితమము సకలమును బాఱఁద్రోలు నే స్వప్రకాశ
డగ్నిపవనాంబువియదవన్యాత్ముఁ డెవ్వఁ, డట్టిసర్వేశుఁ డవతారమయ్యెనపుడు ॥

వ॥ జగంబులు తానయ్యె గలుగఁజేసి రక్షించి త్రుంచునట్టి శ్రీవిష్ణుదేవుం డిప్పు
నిజాంశంబున నవతరించి మీకుశస్థలి ద్వారకయను పట్టణంబుగా నందుఁ

దేవుండన నఖండప్రభావంబున నున్నవాఁడు. అమ్మహాను భావునకుఁ గన్యా
రత్నంబునిమ్ము పొమ్మనిన రైవతుండు భూలోకంబునకు వచ్చి ॥ 32

గీ॥ కుఱుచలై యల్పతేజులై గుణవివేక, బలసమృద్ధులఁ దక్కులై ప్రబలు ప్రజలఁ ।
గాంచి వెఱఁగొందుచును, ద్వారకానగరికి, వచ్చిరామునకక్కన్యనిచ్చెనృపుఁడు॥

చ॥ బలుఁడు నతిప్రమాణయగు పద్మదళాయత చారులోచనన్
హలమునవంచి యంచితశుభావయవస్ఫుటగాత్రిఁ జేసి పెం
పలవడఁ బెండ్లియై ప్రముదితాత్మకుఁడై యనురాగభాగనే
కలలితకామ భోగములు గైకొని యుండెనఖండ సంపదన్ ॥ 34

క॥ అనురూప వరునకాత్మజ, ననువొందఁగనిచ్చి ప్రముదితాత్మకుఁడై యా ।
జనవిభుఁడు తపము చేయన్, జనియె హిమాచలమునకుఁ బ్రసన్నత్వమునన్ ॥35

వ॥ రైవతుండు బ్రహ్మలోకంబునకుం బోయి రాకయున్న వెనుకఁ బుణ్యజనసంజ్ఞలుగల రాక్షసులు కుశస్థలిపై దాడివెట్టిన రైవతుని తోఁబుట్టువులునూర్గురు రాక్షసపరాజితులై నానాదిక్కులకుం బోయిరి. వారలయన్వయంబునం బుట్టి నక్షత్రియులు సర్వదిక్కు లందునిలిచిరి. ధృష్టునకు ధార్ష్టంబను క్షత్రియ కులంబుపుట్టె. నాభాగునకు నాభాగుండు, నాభాగునకు నంబరీషుండు, నంబరీషునకు విరూపుండు, విరూపునకు పృషదశ్వుండు, పృషదశ్వునకు రథిరతుండుపుట్టె వీరాంగీరసులను క్షత్రోపేతులైన ద్విజులైరి ॥ 36

క॥ క్షుత మొనరింపఁగ, మనువున, కతుల ఘ్రాణమునఁ బుట్టె, నాత్మజుఁడు, బలా ।
న్వితుఁడిక్ష్వాకుఁ డనంగా, *నతనికినూర్వురు కుమారులైరి మునీంద్రా ॥ 37

వ॥ వారిలోపల మువ్వురువికుక్షినిమిదండాఖ్యులు శ్రేష్ఠులు. శకుని ప్రముఖులేఁబండ్రు ఉత్తరాపథంబునకు రాజులైరి. నలువదియెనమండ్రు దక్షిణాపథంబునకు రాజులైరి. అయ్యిక్ష్వాకుం డొక్కనాఁడు ॥ 38

సీ॥ అష్టకాశ్రాద్ధకర్మారంభ మొనరించి, యర్హమాంసంబు తెమ్మనుచుఁ దనదు ।
కొడుకువికుక్షిఁ బేర్కొనిపిల్చిపంపిన, నడవికిఁబోయి యర్హంబులైన ।
మృగములవధియించి మించినయాకటఁ, జనలేకయందొక్క శశముదిని,క ।
డమమాంసమంతయుఁ దమతండ్రికిచ్చిన, నది ప్రోక్షణముచేయ నరుగుదెంచి ॥

గీ॥ కులగురుండువసిష్ఠుఁడక్కొడవయెఱిఁగి, కనలియీమాంసమర్హంబుగాదు,వీఁడు।
మీఁదువుచ్చెనటన్న నమ్మేదినీశుఁ డాత్మనందనువిడిచె సంయమివరేణ్య ॥ 39

* “నతనికి నేకశత పుత్త్రులైరి మునీంద్రా.” ?

వ॥ గురుండు ... శశాదుండని పలుకుటం జేసి వికుక్షి శశాదుండ నంబరఁగి, తండ్రి పిమ్మట రాజయ్యె. ఆ శశాదునకుఁ బురంజయుండను పుత్రుండు పుట్టె ॥ 40

సీ॥ నానాయుగ త్రేతాయుగంబున దేవదానవ, తతులకు ఘోర యుద్ధంబు గలిగె ।
అందు బలాఢ్యులైన రాక్షసవర్గ, మమరవర్గము నెల్ల నాక్రమింప ।
విజిగిపోయిన సవనివిశ చపద్మదళాక్షు, భగవంతునచ్యుతుఁ బ్రార్థనముల ।
నలరించి,వరదుఁడై యఖిలజగత్ప్రరా, యణుఁడు నారాయణుం డఖిలసురల ॥

గీ॥ నాదరించి,గభీర వాక్యములననియె, నాత్మ నెఱుఁగుదు నేను మీయభిలషితము।
వినుము భూమిస్థలిశశాదుఁడనునృపాలతనయుఁడు పురంజయుండనఘనుఁడు గలఁడు॥

వ॥ అతని శరీరంబున స్వాంశంబునం బ్రవేశించి యశేషదోషాచరులం జంపెద. మీరును బురంజయు నసురవధోద్యోగంబునకు నుద్యుక్తుం జేయుండనినఁ బుండరీకాక్షునకు నక్షీణభక్తి తాత్పర్యంబునం బ్రణమిల్లి పురంజయు పాలికిం బోయి సాదరంబుగా బృందారకు లిట్లనిరి ॥ 42

ఉ॥ క్షత్త్రియవర్య ప్రార్థనముగైకొను మిప్పుడు ఘోరనిర్జరా
మిత్రులతోడఁ బోరొదవె, మేముతదుద్ధతి కోర్వలేము, హే
త్రిత్రుటితాఖిలద్విష దధీశుఁడవీవు సహాయమైన నా
శాత్రవకోటి నోర్చెదము చయ్యననీచన విమ్ము లెమ్మనన్ ॥ 43

గీ॥ సకలలోకాధినాథుఁ డీశతమఖుండు, స్కంధముననన్ను మోవఁగాఁగదలిపోయి।
జాగ్రదుగ్ర ప్రతాపదుస్సాధదనుజ, కోటిఁగెలిచెదనిది మీకుఁగూడెనేని ॥ 44

వ॥ ఇవ్విధంబున కొడంబడిన సహాయంబు చేసెద ॥ 45

గీ॥అనిననొడఁబడి రమరులయ్యచలభేది యపుడువృషభాకృతి వహించె నతనిమూఁపు।
రంబుపై నెక్కిలీలఁ బురంజయుండు, కదలె శాత్రవకోటిపై ముదమెలర్ప ॥ 46

వ॥ ఇట్లింద్రుఁడు వృషభంబైనఁ దత్కకుదారోహణంబుచేసి వైష్ణవతేజో విశేషోపబృహింతుండై రాక్షసులఁ గెలిచి పురంజయుండు కకుదారోహణ నిమిత్తంబునఁ గకుత్స్థుండనంబరఁగె. అతనికి ననేనుండు, నతనికిఁ బృథువు, నతనికి విష్టరాశ్వుండు, నతనికిఁ జాంద్రుండు, నతనికి శాబస్తుండునుబుట్టె. అతండు శాబస్తియను పురినిర్మించె. ఆశాబస్తునకు బృహదశ్వుండు నతనికిఁ గువలయాశ్వుండునుబుట్టె. 47

చ॥ అమలచరిత్ర యాకువలయాశ్వుఁడుదంకు నకున్మహాపకా,
రము నొనరించు దుందుఁడను రాక్షసుతో సమరంబుచేసె దు ।

రథిష్ణు తేజమున, రంజిలి యర్వదిరయొక్క వేయుద్ధై,
హిత సారస్వాహస నిరంకుశులాత్మ జలధ్ధిఁగొల్వఁగా ॥ 48

యుద్ధంబు చేయునప్పుడు దుందుముఖనిశ్వాసాగ్ని దగ్ధులై యేకవింశతి
సేనందనులు మృతులైనఁ గువలయాశ్వుండు దుందుని జంపె. తన్నిమి
న నతనికి దుందుమారుండను పేరుకలిగె. అతనికి దృఢాశ్వ చంద్రాశ్వ
శ్వులన హతశేషులగుముగ్గురు పుత్రులుగలరు. అందు దృఢాశ్వునకు
శ్వుండు, నతనికి నికుంభుండు, నతనికి నమతాశ్వుండు, నతనికి గృశా
, నతనికిఁ బ్రసేనజిత్తు, నతనికి యువనాశ్వుండుఁ బుట్టె. 49

వనాశ్వుఁడ పుత్రకుఁ, డై యతివిహ్వలత, మునుల యాశ్రమములకున్ ।
, యుపాసించినఁగరు, ణాయత్తతవారు నతనికభ్యుదయముగన్ ॥ 50

దలంచి పుత్రోత్పాదనంబునకునిష్టి గావించి యదియు మధ్యరాత్రం
నివృత్తంబగుచుండ మంత్రపూతజలపూర్ణ కలశంబు వేదిమధ్యంబునం
మహామునులు నిద్రించుటయు నవ్వేళయభూపాలుండతి తృష్ణాకు
యాశ్రమంబునకువచ్చి నిద్రాళువులైన యాకృపాళువుల మేలుకొలుప
యపరిమేయ మాహాత్మ్యమంత్రపూతకలశజలంబులు ద్రావిన నంత
ని మునులజ్జలంబుగానక యిట్లనిరి. 51

ప ద్రావిరీ సలిలమేధితవై దికమంత్రభావితం,
సుధాతలేశ సతికిందుల నిందులనత్సుతుండు మే ।
టిలంగఁబుట్టి ధరణీవలయంబఖిలంబు నేలు ని,
మివచ్చె నీపనికయో యనువాక్యము లాలకించుచున్ ॥ 52

యేగు డెంచి మునిసత్తములార మదీయమాధ్య మి,
ముము తెచ్చెనంచు వినయంబునఁ బల్కెడు నంతగర్భమై ।
వృద్ధిఁగాలమరు డెంచిన దక్షిణకుక్షి వ్రచ్చినం,
డుదయించె నయ్యవని నాయకుఁడు న్మృతిఁబొందె గ్రక్కునన్ ॥ 53

మును లబ్బాలకుండే నామంబు ధరియింపంగలండని పల్క ॥ 54

సనుఁడరు డెంచి బాలుఁజూచి, "ఏపమమాంధాస్యతియ" టంచు నెంచుకతన
ఁడుచాల్చెనపుడుమాంధాతృనామ,మఖిలలోకై కవిశ్రుతంబగుచునుండ॥

లకుని వక్త్రంబున నింద్రుండ మృతస్రావిణియైన నిజప్రదేశిని యిడిన
మృతపానంబుల నల్పదినంబులనే వృద్ధిఁబొంది చక్రవర్తియై సప్త

ద్వీపంబుల నేకాతపత్త్రంబుగా ననుభవించె, తదీయశ్లాఘా, పరంబై యొక్క శ్లోకంబుకలదు. దానియర్థంబు వినుము.

గీ॥ ఉదయాస్తమయములౌనంతమేర,యవనియెల్లను యువనాశ్వపుత్త్రుఁడౌన
యమాంధాతృ మేదినీధవునిసొమ్ము, ఇతరులకుఁ జేరి చూడఁగానెట్లు వచ్చు

వ॥ ఏవంవిధ ప్రభావుండగుచు రాజ్యంబు సేయుచుండి ॥

గీ॥ బిందుమతి పేరుగల శశిబిందుతనయఁ,బరిణయంబయి మాంధాతృధరణివిభుఁడు
సనఘుఁ బురుకుత్సువిఖ్యాతునంబరీషు ఘనునిముచికుందుఁగనియె నక్కాంతయందు

వ॥ మఱియు నేబండ్రు కన్యకలుగలిగిరి వినుము ॥

సీ॥ వేదవేదాంత సంవేది సౌభరియను, మునిజలంబులయందు మునిఁగియుండ ।
ద్వాదశాబ్దంబులవ్వారిలో సమ్మద, నామమా నొక్కమీనంబతి ప్ర ।
మాణదేహంబుతో మానినీ పుత్త్రపౌ, త్త్రాది బంధువులమేయములు క్రింద
మీఁదఁ బార్శ్వములఁ గ్రమ్మిచరింపసంతుష్టి, నొంది క్రీడించుచునుండఁగాంచి

గీ॥ మానియేకాగ్రతా సమాధానముడిగి, బళిరయీమీనవిభుని సౌభాగ్యమఖిల
బంధుసామగ్రి పుత్త్రసంపత్తిపౌత్త్ర, వృద్ధిదార విలాసంబు నెన్నఁదరమె ॥ 6

వ॥ ఏనునిట్టి సుఖంబనుభవింప నలదేయని జలంబులు వెల్వడి మాంధాతృమహీ
పతి పురంబునకుంబోయి తనరాక యెఱింగించి వచ్చిన నమ్మేదినీకాంతుఁ
డెదుర్కొని యర్ఘ్యాది విధులంబూజించిన నర్హాసనాసీనుండై సౌభరి
యిట్లనియె ॥ 6

క॥ తిరముగ సంసారంబున, నరవల్లభ నిలువఁదలఁచినాఁ డస్నికున్ ।
వరతనయలుగల రందొక, తరుణీమణి నిమ్ముసమ్మదము దళుకొత్తన్ ॥ 6

వ॥ కన్యార్థినై వచ్చితి. మదీయయాచ్ఞాభంగంబు చేయకుము. కకుత్స్థవంశస
భవులైన రాజుల నడిగినవారు రిత్తపోవరు రే యని సవినయంబుగా
బ్రార్థించిన ॥ 6

సీ॥ ఉచ్ఛూనతరసిరా ప్రచ్ఛాదిత శరీరుఁ బరికంపమాన దుర్భర శిరస్కు ।
నాలంబమానవళీ లక్షితాననుఁ, శిథిలితనిపతితా శేషదశను ।
సంఛన్నపటల ధూసరితాక్షిగోళకు, శ్లేష్మఘుర్ఘురరవాశ్లిష్టకంఠుఁ ।
నాలంబ దండ భంగుర విరుద్ధాకారుఁ బలితలోమశ్మశ్రుబద్ధకేశు ॥

గీ॥ ఘనతనిర్భరతర జరాభారజర్జ, రావయవు, నమ్మునీంద్రుఁగన్నారఁజూచి ।
చూచి "యే,మారు చెప్పనీసున శపించు" నంచు నెంచుచుఁజింతించెనవనివిభుఁడు

వ॥ ఇట్లు చింతించు మాంధాతృ మహీమండలేశ్వరునకు మునీశ్వరుం డి
ట్లనియె ॥ 66

గీ॥ ఏల చింతించె దింత భూపాలవర్య, తగనిమాటలు వల్కఁగదా యొకైనఁ ।
గన్యకామణి నీయక కానిపోవ, రాదు సుమ్మయ్య నన్నుఁ దిరస్కరించి ॥ 67

మ॥ అనమాంధాతృఁడు శాపభీతమతియై యయ్యా! మదీయాన్వయం,
బునకు న్వన్నియ కాదె మీ మనసు సమ్మానంబు నొందించు టెం
దును, మీమాటల నొచ్చెమున్నదె వచింతున్నా కులాచార వ,
ర్తన మాలింపుము కన్య తాన, వరుగోరుం బెండ్లియా నెప్పుడున్ ॥ 68

వ॥ ఇప్పుడును, దత్సమయ పరిపాలనంబే కర్తవ్యంబని తలంచెద ననిన మునిపతి
తన మనంబున ॥ 69

ఉ॥ బాలిక నీయలేక తడఁబాటొనరించి వచించె నీ మహీ
పాలుఁడు మేలుగాక యొడఁబాటొనరించెదఁ గొంచనేల యం।
చాలసమానమానిత తపోధికుఁ డిట్లను రాజుఁ జూచి చిం,
తాలులితత్వమేల కులధర్మము దప్పకచేయు మప్పనిన్ ॥ 70

వ॥ నన్నుం గన్యాంతఃపురంబునకు ననిచిన కన్యకలలో నెవ్వతెయైన వరించినమేలు.
'ధర్మోజయతు' అని వచ్చెదననిన హర్షించి రాజు కన్యాంతఃపుర చారియైన
యొక్క వర్షధరుం బిలిచి యమ్మునిం జూపి యితనిం దోడ్కొని కన్యాంతఃపురం
బునకుం బోయి కన్యకలకుం జూపి మదీయ శాసనంబు చెప్పి యొవ్వయ్యేని
యొక్క కన్యక యితని వరించుత మని చెప్పుమని యొప్పగించిన నా హెగ్గడియును
దోడ్కొని పోవునప్పుడు ॥ 71

క॥ మారునిరూపము ధనదకు, మారుని సౌందర్యమును సమంచితనాస ।
త్యోరువిలాస ముగైకొనె, బోరున నమ్మునివరుఁడు తపోవిభవమునన్ ॥ 72

వ॥ ఇట్లు దేవగంధర్వ మనుష్యాతిశాయియైన రూపంబు దాల్చి యంతఃపురంబు
ప్రవేశించిన మునిం జూపి కన్యకలతో వర్షధరుం డావృత్తాంతంబు
చెప్పుటయు ॥ 73

క॥ మహనీయ రూపవిభ్రమ. సహితుని నమ్మౌనిఁ గాంచి జనపతిసుతల ।
త్యహమహమికఁ దత్పాణి, గ్రహణము చేసిరి నితాంతకామాతురలై ॥ 74

గీ॥ ఇతఁడ, నాపతి యితఁడు నా హృదయనాథుఁ, డితఁడె నా ప్రాణవల్లభుఁ డితఁడు నామ ।
నోనురంజకుఁ డనుచు నమ్మానవతులు, కలహమత్తులై వరించి రయ్యలఘుతేజు ॥

చ॥ వనజదళాక్షులందఱు, నవారితలై చనుదెంచి, యత్తపో
ధనునివరించు చెల్ల, విశదంబుగ, వర్షధరుండు చెప్ప, న
జ్జనపతియంతరంగమునఁ, జాలవిచారమునొంది, కొంతప్రొ
ద్దునకొకతీరుసమ్మతముతో శమితోత్సవలీలను న్నెడన్

క॥ మంగళసమాచరణమొక, భంగిన్నడచుటయునంతఁ బ్రతిభాన్వితుఁడై ।
యంగనలఁదోడు కొనిముని, పుంగవుఁడరుదెంచె నిజతపోవనమునకున్ ॥

వ॥ అచ్చటికి నశేషశిల్ప కల్పనానల్ప శర్మయగు విశ్వకర్మ రావించి
మనోవ స్తనం బెఱిఁగించిన నతండును నొక్కొక్క కాంతకుఁ బ్రోత్ఫుల్ల పం
కజాతకలహంసకారండవాది జలవిహంగ మాభిరామజలాశయ సఁ
రన్మంద పవనంబులగు నుపవనంబులును, సోపధానసావకాశ సాధుశయ
పరిచ్ఛద సప్రసాదంబులగు మణిప్రాసాదంబులు నిర్మించిచనిన నమ్మునీంద్ర
డందు నిరపాయబహువిధ నిధిసంపదల నావహించిన ననవరత భక్ష్యభో
జ్యలేహ్యచోష్యాద్యుపభోగంబులచే తను, ననేకభృత్యానీతకుసుమచందన భూష
ణాంబరాదులచేతను, నిరంతరం బాకాంతలు నకాంతలై యనుభవించుచు
రంతకొంత కాలంబుచనిన ॥

శా॥ మాంధాతృక్షితి పాలశేఖరుఁడు శుంభత్పుత్రి కాస్నేహసం
బంధంబాత్మఁగలంప, వృద్ధమునియేఁబంధ్రంజలంబేర్పడన్ ।
సంధాబంధురుఁడై వరించి నిజవన్యాభూమికింబోయె, ని
ర్బంధంబయ్యెఁ, దనూభవామణులకుం బ్రాక్కర్మదౌష్ట్యంబునన్ ॥

గీ॥ హారివస్త్రాన్నపుర సౌధవారసార, తూలతల్పంబులొందు నాదుహితలకును ।
నారచీరలువన్యాశనమ్ములటవు, లుటజములుభూమి శయ్యలునోద వెనకట॥

వ॥ అని చింతించి యత్తపోధన వర్యుని యాశ్రమంబునకు వచ్చి యతిరమో
పవనజలాశయంబును, స్ఫురదంశు మాలాజటిలంబును నగు ప్రాసాద ము
లంబుచూచి యందొక్క ప్రాసాదంబు ప్రవేశించి తనూజంజూచి యాలి
నంబుచేసి కృతాసన పరిగ్రహుండై హర్షాశ్రువులు దొరుగనిట్లనియె ॥

గీ॥ అమ్మసౌఖ్యంబుకలదె మహామునీంద్రుఁ, డెలమిఁజనవిచ్చునే మమ్మునెప్పుడైన
దలఁతువేయాత్మలోనన్నుఁ దండ్రిపలుక, వినితనూభవపలికె సద్వినయమున

మ॥ మునిశార్దూలుని, సత్కృపామహిమ సొమ్ముల్చీరలాస్వాదవ
ద్వినుతాన్నంబు,లుదారగంధ సుమనోవీటీ పటీరాదులిం ।

దు,నవీనద్యుతిసౌధముల్ గలవ్రేకొండుండక్కువా, యెంతయై
ననువిభ్రాంతిఁదలంపరే మగువలన్నా! కన్నవారిన్నదిన్ ॥ 83

ఉ॥ సంతతభోగసంపదలు సంభృతవైభవ సంభ్రమంబుల
త్యంతవినోదముల్ గలవహర్నిశముం బతిసన్నుఁబాయఁడి
ట్లింతని చెప్పఁదున్ భగినులెన్నఁడుభర్త మొగంబుగానరే
చింతదురంతమై మనసుచిల్లులువుచ్చుచునున్న దెప్పుడున్ ॥ 84

వ॥ అని పలికినయమ్మహీపతి యచ్చటనుండి మఱియొక్క ప్రాసాదంబునకు వచ్చి
యచ్చట నలంకృతయైన తనూభవంగాంచి కౌఁగిలించి కుశలంబడిగిన నదియును
మునుపు చెప్పిన కుమారిక పగిదిఁజెప్పిన నిప్పగిది నందఱి ప్రాసాదంబులకుం
బోయి యడిగిన నందఱు తమకుఁదమక సకలభోగంబులుకలవు. వల్లభుండు
తమతమకె వశ్యుండని చెప్పినసంతసించి యేకాంతావస్థితుండగు సౌభరిం
గాంచి సత్కృతుండై మాంధాతృం డిట్లనియె॥ 85

గీ॥ మౌనికులనాథ నీతపోమహిమకోలఁది, తలఁపశక్యంబె, దేవతాతతులకైన।
భూరితరమైన దేవరవారిదివ్య, వైభవముగంటి నేత్రపర్వంబుగాఁగ ॥ 86

చ॥ అనిపొగడియాడి భూమిపతియమ్మునిచేఁ బ్రతిపూజనొందియ
త్యనుపమభోగభాగ్య విభవాతిశయంబుల కాత్మ మెచ్చుచున్
దినములుకొన్ని యచ్చట నతిప్రమదంబున నిల్చిపోయెది
గ్వినుతధనాదిసంపదల విశ్రుతియౌనిజ రాజధానికిన్ ॥ 87

గీ॥ అంతఁగొంతకాల మరుగనారాజకన్, న్యకలయందు వరుసన త్తపోభి ।
రాముఁడర్థిఁగాంచెఁ బ్రాజ్ఞులనూటయేఁ, బండ్రునందనులఁ బ్రభావయుతుల ॥88

క॥ నందనులఁగాంచి పరమా, నందంబుననుండె మౌనినాథుఁడువనితా ।
బృందముదానును బెనుచుచు, నందందమహామ మత్వమగ్గలమైనన్ ॥ 89

సీ॥ బాలురననుముద్దుఁబల్కు లెన్నఁడువినఁ, గలుగునోయని కోరఁబలుక నేర్చి।
రవనిమీఁదకుమారు లడుగిడినడుచుటెం, న్నఁడోకోయనుచుఁ గోరనడవనేర్చి ।
రర్భకులారూఢ యౌవనులగుటెన్నఁ, డోయనికోరఁ బెంపొందెఁబ్రాయ ।
కూతుజులుద్వాహమగుటయెన్నఁడోకోయ,నుచుఁగోరఁ బెండ్లిండ్లరుచులుగనిరి॥

గీ॥ సుతులుగనఁజూతు రోయనసుతులఁగనిరి, పౌత్రిదమనుమల నెత్తు దురోయనంగ ।
మనుమలంగనుఁగొనుభాగ్యమహిమఁగనిరి, సౌభరికుమారకులుపితృస్వాంతమలర॥

వ॥ ఇవ్విధంబున దినదినప్రవర్ధమాన విషయలాలసుండై యమ్ముని యిట్లని చిం
తించె ॥ 91

తే॥ ఉపవర్షంబులకు నైననశ్యత్వ, గరిమగ్గి కొనికొ్ర త్తలై కడలుకొ్నియె ।
నా ... గోర్కులు, గలుగదంతంబు,వీని కారయారమదీయ మోహాతిశయము

ఉ॥ నిపుణాంబుత్రకుల్ని డవనేర్చిరి బాల్యమువీడనాడిర
చ్చపునవయౌవనంబునఁ బ్రసన్నని శాకరబింబవక్త్రలన్ ।
విపులం ... శస్కులై మిగుల వేడ్కవరించి సుపుత్రపౌత్రవృ
ద్ధిఁ ... నాంచి చెప్పటికిఁ దీరవుమామక కాముకక్రియల్ ॥

క॥ తనయుల మనుముల మమతలు పెనుపంగాఁగంటి మిగులఁబెరుగంజొచ్చెన్
... సంతానస్పృహ, దినదినమును నాకు విషయతృష్ణావశతన్ ॥

ఉ॥ ... జని తేడుగాకి శకులాగ్రణి జోకయెకాదె మోహసం,
జననివానమై తపము, సందడిపాలుగఁ జేసె, మన్మనో ।
వినుకై సమాధిఁ గూల్చె, నతివిస్మయమందఁ, బరిగ్రహంబుకీ,
... మునుల్వధూమణుల నక్కటయేల పరిగ్రహించితిన్ ॥

వ॥ కాంతాపరిగ్రహంబునంగాదె పుత్రపౌత్రాదులు గలిగిరి. వీరివలన మోహం విస్తరిల్లె. పరమ దుఃఖహేతువై మమతా సాగరంబునం ద్రోచె. మఱియు

సీ॥ నిర్ద్వంద్వవృత్తిమానిత సుదుశ్చరతప శ్చర్యపూనితి నేల జలములోన ।
తపముచేసిన నేమి చపలవిూనకుటుంబ, సంగబంధంబేల సంభవించె ।
సంగి మొందిన నేమి జంగమనిరయాభ, బాలాపరిగ్రహంబేలకలిగె ।
సతులుకల్గిన నేమి సంపూర్ణపుత్రపౌ, త్రాభివృద్ధియిదేల యతిశయిల్లె ॥

గీ॥ ప్రజలుపుట్టిన నేమి నిర్భర మనస్స, మాధిగిరి భిదురీ భవన్మహిత మోహ ।
మేలననుముంచెవిషయకల్లోలజాల, లోల దుస్తరభవ వార్ధిలోననకట ॥

చ॥ చతురతపము క్తినొందు, దుర సంగమునన్, యతిపుంగవుల్మహో
ద్ధృతగతి దోషసంఘముల, దూరొనుసంగము,కర్మయోగసి ।
ద్ధతగలయోగిమైనఁ జెడుఁ దథ్యనుసంగముచేత నన్నచో
మతకరియల్పసిద్ధిగల మర్త్యకథల్ మఱిచెప్ప నేటికిన్ ॥

గీ॥ ఘనబలిష్ఠ పరిగ్రహగ్రాహగళిత, బుద్ధినై మోసపోయినఁబోదుఁగాని ।
యింకనైన మదాత్మకుహితముచేయు, వాఁడసంసారసంబంధవాంఛఁదొరఁ

వ॥ సర్వంబునకు ధాతమై, యచింత్యరూపకుండై యణువునకు నణువై, య
ప్రమాణుండై, సితాసితుండై, యీశ్వరులకు నీశ్వరుండైన శ్రీవిష్ణుదే
నారాధించెద.

గీ॥ ధన్యుఁ డవ్యక్తవిస్పష్టతనుఁ డనంతుఁ, డఖిలరూపుఁ డశేషతేజోనిధానుఁ [illegible]
యనఁగఁ బొగడొందు శ్రీవిష్ణునందు నాదు, చిత్తమిడి ముక్తిఫలము వాంఛింతు

క॥ గురువులకుఁ బరమగురువగు, సరసీరుహపత్రనేత్రు శరణార్థిజనో।
త్కరసుఖదాయకుఁ గరుణా, భరణున్ శ్రీవిష్ణుదేవుఁ బ్రార్థింతు మదిన్॥ 102

వ॥ అని యివ్విధంబున సౌభరి, తనుదాన యుపశమించుకొని పుత్రగృహాసన శయనపరిచ్ఛదాదికంబగు వస్తుజాతంబును విడిచి సకల భార్యాసమేతుండై వనంబు ప్రవేశించి యందు, ననుదినంబును వైఖానస నిష్పాద్యంబగు ననేక క్రియాకలాపంబు నిష్పాదించి క్షపిత సమస్తపాతకుండును, బరిపక్వమనోరథ వృత్తియునగుచు నగ్నుల నాత్మారోపణంబుచేసి భిక్షుకుండై యజన్మవికారమరణాదికంబగు నచ్యుత పదంబునొందె. ఇది మాంధాతృదుహితృ సంబంధాఖ్యానంబు. 103

ఉ॥ పేర్మిఁ దలిర్ప సౌభరిచరిత్రము విన్నఁ బఠించి చెప్పినన్,
ద్దామవిభూతి, జ్ఞానము, సదాతనధర్మము, నిర్మమత్వమున్।
గామజయిత్వముం, గని సుఖస్థితిమానవుఁ డొందు మోక్షల,
క్ష్మీమహనీయ సౌఖ్యము భజించు నచంచలతన్మునీశ్వరా॥ 104

వ॥ ఇంక మాంధాతృ పుత్రసంతతి వివరించెద, మాంధాతృపుత్రుండైన యంబరీషునకు యువనాశ్వుండు, యువనాశ్వునకు హారీతుండు, హారీతునకాంగిరసులన షట్కోటిసంఖ్యాతులు పుత్రులుపుట్టిరి. రసాతలంబున మౌనేయ నామ గంధర్వులు నాగకులంబుల ధనరత్నాధిపత్యంబులు హరించిన గాంధర్వవీర్యావధూతులై నాగపతులు చని. 105

సీ॥ అఖిలదేవేశు నుద్యత్పుండరీకలో, చను యోగనిద్రావసాన సుప్ర।
సన్నుఁ బన్నగశాయి శరణుఁ జొచ్చి భుజంగ, పతులెల్ల తమపడ్డపాటు విన్న।
వించిన నిందిరావిభుఁడా దరించి కొం, దలమేల మీకు మాంధాతృపుత్ర।
కుఁడు పురుకుత్సుఁ డనురు బలాఢ్యుఁ డుగలఁ, డతని శరీరంబు నధివసించి॥

గీ॥ దుష్టగంధర్వతతి నెల్లఁ ద్రుంతుఁ బోయి, యతనిఁ బురికొల్పుఁ డనుచు దేవాదిదేవుఁ।
డందఱును జూడఁగా నదృశ్యత్వ మొందె, భుజగపతులును నిజపురంబునకు వచ్చి॥

మ॥ జగతీశర్మద నర్మదన్ భుజగరాజన్యాగ్రణుల్వొంపఁ, శీ
ఘ్రగయై యా పురుకుత్స భూవిభునిఁ జేరం బోయి తత్కార్యము।
చ్చగఁ జెప్పన్ విని వచ్చి విష్ణుఘన తేజోవర్ధితుండై యటఁ బ,
న్నగలోకంబు సుఖింపఁగీటడఁచె గంధర్వేంద్రుల న్వ్రీల్మిడిన్॥ 107

వ॥ ఇట్లు. 108

క॥ పురుకుత్సుండు గంధర్వో, త్కరముల వధియించి చనియె దనపురమునకున్ ।
హరికరుణాసాతలమునఁ, బరమానందంబునొందెఁ బన్నగకులమున్ ॥ 109

వ॥ సకల పన్నగ ప్రభువులును నర్మదం జూచి యెవ్వండేని నిన్నుఁ జేరుకొనువానికి సర్పవిష భయంబు లేదని వరంబిచ్చిరి. ఇందుల కొక్క శ్లోకంబు గలదు వినుము. 110

శ్లో॥ నర్మదాయై నమః ప్రాతర్నర్మదాయై నమో నిశి ।
నమోస్తు నర్మదే తుభ్యం త్రాహి మాం విషసర్పతః ॥ 111

వ॥ ఇట్లని యుచ్చరించుచు నంధకారంబు ప్రవేశించిన సర్పంబులు కఱవవు ఇది స్మరించుచు భుజించిన విషంబరుగు. 112

క॥ ధరణీ భర్త త్రసదస్యుని, పరఁగునవిచ్ఛిన్నమై శుభస్థితినంచున్ ।
బురుకుత్సునకు భుజంగో, త్కరములు వరమిచ్చెనధిక గౌరవమొప్పన్ ॥ 113

వ॥ ఆ పురుకుత్సునకు నర్మదయందు త్రసదశ్వుని గనియె. త్రసదశ్వునకు ననరణ్యుండు పుట్టె. అతని రావణుండు దిగ్విజయంబునందు వధియించె. అనరణ్యునకు హర్యశ్వుండు, నతనికి హస్తుండు నతనికి సుమనుండు నాతనికిఁ ద్రిధన్వుండు, నతనికిఁ ద్రయ్యారుణియు, నతనికి సత్యవ్రతుండును గలిగె. ఆ సత్యవ్రతునకుఁ ద్రిశంకుండను నామంబును గలదు. అతండు కర్మవశంబునం జండాలుండై యుండె. 114

సీ॥ ధరణిపై ద్వాదశాబ్దంబు లనావృష్టి, యైనయన్నము లేక గ్లానిపొంది ।
పౌరులు విశ్వామిత్ర పుత్రమిత్రకళత్ర, ములకుఁ బ్రతిగ్రహకలితదోష ।
మంటకుండుండ నిత్యము గంగ దరిమఱ్ఱి, మ్రానితో వనమృగమాంసమంటు ।
గట్టిపోవందు చేఁ గఱవువెళ్లించి కా, శిరుఁడా త్రిశంకుని చేఁత మెచ్చి ॥

గీ॥ తనతపశ్శక్తి నాతని తనువుతోన, స్వర్గమునకనిల్పెనిట్టి యాశ్చర్యమహిమ ।
గలుగునే యన్యమునులకు గాధిపట్టి, కట్టిమహిమ ఘటిల్లె సంయమివరేణ్య ॥ 115

వ॥ ఆ త్రిశంకునకు హరిశ్చంద్రుండు, నతనికి లోహితాశ్వుండు, నతనికి హారీతుండు, నతనికి జంచుండు, నతనికి విజయ, వసుదేవులన నిద్దఱు పుత్రులుఁ గలిగిరి; అందు విజయునకు, రురుకుండు, రురుకునకు వృకుండు, నతనికి బాహుకుండుఁ గలిగె; ఆ బాహుకుండు హైహయ తాలజంఘాదులచే నపజితుండై గర్భిణియగు మహిషియుం దానును వనంబు ప్రవేశించెనందు. 116

గీ॥ సవతి తన యీర్ష్యచేత బాలన్న సతికి, గర్భసంస్తంభనమునకై గరము వెట్టె.
విషవశంబున గర్భంబు వెలిపడక, సప్తవర్షంబు లుండె నాశ్చర్యముగను ॥ 117

సీ॥ బాహుకుండతిజరాభారపీడితుఁడయి, యౌర్వాశ్రమము చేర్వ ననుచయంబు ।
వీడినఁ దత్పత్ని విభునితో ననుగమిం, పఁదలంప నదియెల్ల మది నెఱింగి ।
యౌర్వుండు కాలత్రయాభిజ్ఞుఁ డరుదెంచి, యాసాధ్వితోడ నిట్లను మృగాక్షి ।
యీయసద్గ్రాహిహమిళ్లలచేసెడు నృప, కడుపున లోకవిఖ్యాతకీర్తి ॥

గీ॥ తనయుఁ డుదయించి శాత్రవతతులఁ ద్రుంచి, యమితదక్షిణ లిచ్చి జన్నములు చేసి ।
నిఖిలభూమండలము నేలు నిపుణమహిమ, వెలయఁగాఁ జక్రవర్తి కాఁగలఁడు సుమ్ము॥

ఉ॥ సాహసమేల నా పలుకు సత్యము నమ్ము మునీవసం, దదు
త్సాహము మానియాశ్రమపదంబునకుం గొనివచ్చి, పూనిసం
దోహవిభుండు పోవఁగ, మనోభవసుందరుఁ గాంచెఁ బుత్రకుం
బాహుబలాఢ్యు బాహుక నృపాలక గేహిని యద్భుతంబుగన్ ॥ 119

గీ॥ గరముతోఁ గూడఁ బుట్ట సగరుఁ డటంచు, నామధేయం బొసంగి మాణవకునకును ।
నౌర్వుఁ డుపనయనము చేసి సర్వవేద, శాస్త్రములు చెప్పి దివ్యాస్త్రసమితి యిచ్చె॥

వ॥ ఆగ్నేయాస్త్ర భార్గవాస్త్రాదు లొసంగిన బుద్ధిమంతుండై యొక్కనాడక్కుమా
రుండు తల్లి కిట్లనియె ॥ 121

గీ॥ అమ్మ మన మేల యుంటిమీ యడవిలోన, మజ్జనకుఁ డెందుఁ బోయె నమ్మద మెలర్పఁ।
జెప్పుమన్నఁ దనూజుతోఁ జెప్పె నప్ప, తివ్రతామణి సర్వంబు దెలియఁబడఁగ ॥122

వ॥ సగరుండు పితృరాజ్యాపహరణామర్షితుండై హైహయతాలజంఘాది వధంబు
నకుఁ బ్రతిజ్ఞ చేసి యందు మిక్కిలియు హైహయులం జంపె. అంత శకయవన
కాంభోజ పారదపల్లవులు హన్యమానులై సగరకుల గురుండగు వసిష్ఠుని శర
ణంబు చొచ్చిన వారల జీవన్మృతులంగాఁ దలంచి సగరున కిట్లనియె ॥ 123

క॥ పాపఁడ జీవన్మృతులీ, యాపన్నులు వీరిఁ గావవయ్య, ద్విజత్వ ।
శ్రీపాతితులై, ద్విజసం, గాపాయము నొంది రేమి యనఁగలదింకన్ ॥ 124

వ॥ వీరలు స్వధర్మ పరిత్యాగులైన నీ ప్రతిజ్ఞ చెల్లెనని నందద్గురు వచనం బభినందించి
వారలకు హాస్యవేషంబు చేసె. ఎట్లనిన యవనుల ముండితశిరస్కులను, శకుల
నర్ధముండితులను, పారదులఁ బ్రలంబకేశులను, బల్లవుల శ్మశ్రుధరులను నన్య
క్షత్త్రియుల నిస్స్వాధ్యాయ వషట్కారులను జేసె. వారలు నాత్మధర్మ పరి
త్యాగంబున బ్రాహ్మణులచేత విడువంబడి మ్లేచ్ఛత్వంబు నొందిరి. సగరుండును

స్వాధిష్ఠానంబునొంది యస్ఖలిత చక్రుండై సప్తద్వీపవతియైన వసుంధర
కాతపత్రముగా నేలె ॥ 12

క॥ సుమతియుఁ గేశినియునునను, ప్రమదలు కశ్యపవిదర్భపతిసుతిలాభ్యా।
ధమణునకు భార్యలైరు, త్తమపాతివ్రత్యనిత్య ధర్మము వెలయన్ ॥ 12

వ॥ అసుమతి కేశిను లిరువురు పుత్రార్థినులై యౌర్వునిం బ్రార్థించిన నత్తపోధ
నుండు వారికిట్లను- ఒక్కతె వంశకరు నొక్కపుత్రుని, నొక్కతె బలపరా
క్రమ సంపన్నులగు నఱువదివేల పుత్రులను గనంగలరు. వలయునట్లు కోరు
డనిననట్లు కాకయని కేశిని వంశకరుంగోరి యల్పదినంబుల కసమంజ సుండను
పుత్రునింగనియె. సుమతి యరువదివేలపుత్రులంగనియె. అసమంజునకు వంశు
మంతుండుకలిగె. అయ్యసమంజ సుఁడు బాల్యంబునుండి పాపవృత్తుండైనఁ
దండ్రి చింతించి బుద్ధిమంతుండు కాఁడని పుత్రకున్విడిచె. తక్కిన యఱువది
వేవురునునసమంజసునట్లు పాపవృత్తులై జగంబున యజ్ఞాదిసన్మార్గంబులఁ
చెఱిచిన ॥ 127

సీ॥ పురుషోత్తమాంశ సంభూతుండు నిర్దోషుఁ, డఖిలవిద్యామయుండైన కపిల।
మునిపాలికేతెంచి మొక్కి దేవతలెల్ల, విన్నవించిరి దేవవిశ్వమునకు।
సాగరుల్ చేయు నల్లజిచెప్పఁదరముగా, దీయుపద్రవమింక నెన్నఁడణఁగు।
ధరణిరక్షింప దేవరవారలీరీతి, నవతరించుటఁ జేసియైన కార్య ॥

గీ॥ మంతయును విన్నవించితిమనిన నల్పదివసములలోన సాగరు ల్తీరిపోవఁ।
గలరనుచు దేవతలతోడఁ గపిలమౌని, తెలియనానతియిచ్చెమైత్రేయవినుము॥

క॥ అంతటిలో సగరమహీ, కాంతుఁడు హయమేధమఖము కావించి సుదు।
ర్దాంతులగు సుతుల హయునవ నంతరగాములుగఁ జేసి యంపిన వెనుకన్ ॥ 129

క॥ తురఁగము మ్రుచ్చిలి మాయా, పురుషుఁడొకఁడు ధరణిఁజొచ్చిపోయిన నత్యు।
ద్ధురులై సుమతికుమారులు, ధరనొక్కొక యోజనంబు త్రవ్విరివరుసన్ ॥ 130

ఉత్సాహ. ధర రసాతలంబు దాఁకఁ ద్రవ్వి యచ్చటంబరి,
స్ఫురణనున్న యశ్వరత్నముందదంతి కంబునన్।
వరవిభా విశేషజిత దివాకరుం, దపోధురం,
ధరునిఁ గపిలుఁగాంచిరపుడు ధారుణీశనందనుల్ ॥

క॥ కనిపీఁడె హయమలిమ్లుచుఁ, డనుకంపఁదొఱంగి పొడువుఁడడువుఁడు చంపుం।
డనిచుట్టుముట్ట నమ్ముని, కినియక యలవ్రాకకంటికేవఁ గనుఁగొనన్ ॥ 132

క॥ స్వకృతాపరాధ తనుభవ, వికటదహనానల శిఖాభివృతరాజకుమా ।
రక నీరసతరగహనము, నకలంబును నపుడు భస్మసాత్కృతమయ్యెన్ ॥ 133

క॥ తన తనయులెల్ల నీవిధిఁ, జనిన తెఱంగపుడు వచ్చి చారులు చెప్పన్ ।
విని హయము తేర జనపతి, మనుమని మతిమంతు నంశుమంతునిఁ బంపెన్ ॥ 134

చ॥ మహితగుణాభిరాముఁ డసమంజసపుత్రకుఁ డంశుమంతుఁడు,
మ్మహిబిలమర్గిఁ జొచ్చి నడుమ న్మహనీయ మహామహోన్నతిన్ ।
గ్రహపతిఁ బోలునా కపిలుఁ గాంచి సమంచితభక్తి మ్రొక్కి లో,
క హితచరిత్రుఁ డిట్లనియె గౌరవమొప్పఁగ నక్కుమారుతోన్ ॥ 135

ఉ॥ పాపఁడ సాగరుల్ స్వకృతపాపముఁ జేసి హతులైరి వీరలు,
ద్దీపిత నాకమొందుటకుఁ దెచ్చు భవత్సుతపుత్రకుండు ది ।
వ్యాపగ నివ్వసుంధరకు నధ్వరవాహముఁ గొంచుఁ బొమ్ము దీ,
ర్ఘోపరుఁడై సతాతకు వికాసముపుట్టఁగ నీక్షణంబునన్ ॥ 136

వ॥ భవత్పౌత్రుండు మందానికిం దెచ్చి భస్మీభూతులైన సాగరులం దడిపి స్వర్గంబు నొందింపంగలండు. సాక్షాద్భగవత్పాదాంగుష్ఠ నిర్గతంబగు గంగాజలంబు జగతి నెవ్వరి శరీరాస్థి చర్మ భస్మస్నాయు మేదః కేశంబులఁ దడుపు వారు స్వర్గం బారోహింతురు. తన్మాహాత్మ్యంబు వర్ణింప శక్యంబె యనిన నమ్మునీంద్రునకు నక్కుమారుండు ॥ 137

తే॥ మ్రొక్కి యశ్వరత్నముం గొని వేగంబె, తాతకడకుఁ బోవ, ధరణివిభుఁడు ।
సప్తతంతువిధి సమాప్తంబు గావించి, పుణ్యగరిమఁ ద్రిదివమునకుఁ జనియె ॥ 138

వ॥ ఆ సగరుండు పుత్రవాత్సల్యంబున సాగరంబుం బుత్రునిగాఁ జేసికొనియె. తత్పౌత్రుం డంశుమంతునకు దిలీపుం డతనికి భగీరథుండు గలిగె. అతండు కదా స్వర్గంబుననుండి భూమికి మందాకినిం దెచ్చి భాగీరథీ నామంబు గావించె. ఆ భగీరథునకు సుహోత్రుండు నతనికి నాభాగుండు నతనికి నంబరీషుండు నతనికి సింధుద్వీపుండు, నతనికి నయుతాయుండు, నతనికి ఋతుపర్ణుండు గలిగిరి. అతండు కదా నలసహాయుండై యక్షహృదయజ్ఞుండయ్యె. ఋతుపర్ణునకు సర్వకాముండు, నతనికి సుదాసుండు, నతనికి సౌదాసుండు పుట్టె. అతండు మిత్రసహుండును ననంబరఁగు ॥ 189

ఉ॥ ఆ నృపుఁ డొక్కనాఁడు మృగయారతుఁడై వనభూమిఁ ద్రిమ్మరం,
గా నొకరెండు బెబ్బులులు గన్పడఁ బన్పఁడ వీనిచేత ని ।

క్కానఁ మృగప్రజంబు నేఁ గాన వధించుటమంచిదంచుఁ జేఁ
బూనిన హేతినొక్కపులి బొంకుగఁజంచిన నాక్షణంబునన్ ॥ 14

క॥ మృతిఁబొందె నొక్కసుండై యితరవ్యాఘ్రుసునెమంచి దిదిమఱవకు నేఁ ।
ప్రతికినికిఁ జేయుదునని, యాలినినె వెఱపించి మాయమై పోయెవడిన్ ॥ 14

ఉత్సాహ॥ అంత గొంతకాలమునకు నరివిభేది యమ్మహీ,
కాంతుఁడొక్క మఖము చేయఁగా వశిష్ఠమౌనియ ।
త్యంతనియతిఁ దత్క్రియల్ ప్రయత్నమున నొనర్చి యా
చాంతికొంత బోవ రాక్షసపతి తా వశిష్ఠుఁడై ॥ 142

క॥ చను దెంచి మాంసయుత భోజనమొసఁగుము నాకునని, జనపతియాఁగా ।
కనమగిడి వత్తునని చే, గినచనియా యసురసూపకారుండగుచున్ ॥ 143

సీ॥ మనుజేంద్రుననుమతి మానవమాంసంబు, తెచ్చిపక్వముచేసి దీప్తకనక ।
పాత్రికనందీయధాత్రీవిభుఁడుగురుం డే తేరముందరనిడినఁజూచి ।
యౌరయీరాజుదుశ్చరిత్ర మామిషం, బిడవచ్చునే యిది యేమియొక్కొ ।
యనుచులోఁ దలపోసి మనుజమాంసంబుగాఁ దెలిసిమహాక్రోధకలుషితాత్ముఁ॥

గీ॥ డై శపించె నృపాలకు ననిశమును మనుష్యమాంసంబు దినుచునుండుదువుగాక ।
యనిమఱియుజ్ఞానదృష్టి చేనరసిదనుజ, కృతమనుచుసత్కృపాపరిస్పృష్టుఁడగుచు॥

వ॥ ద్వాదశాబ్దంబులకు శాపనివృత్తి యయ్యెడమనియె. అమ్మహీపతియును, శాపంబుఁ బరిగ్రహించి మగిడి శాపోదకంబులు చేపట్టి గురునిం బ్రతిశపింపఁ దలంచిన ॥ 145

క॥ మదయంతియనెడు నవ్విభు, సుదతికడున్వేఱచి భర్తఁజూచికులగురున్ ।
సదమలదివ్యజ్ఞానా, స్పదమూర్తిం దగునె యకటశపునిఁజేయన్ ॥ 146

వ॥ శపించుట ధర్మంబుగాదని ప్రార్థించిన శపియించుటమాని జగద్రక్షణార్థంబు శాపోదకంబులు భూమ్యాకాశంబులఁ జల్లక నిజపాదంబులపైఁ జల్లుకొనినఁ బాదంబులుగాలికల్మషవర్ణంబు లగుటం గల్మాషపాదుండనం బరఁగి గురుశాపంబున రాక్షసభావంబునొంది వనంబునం దిరుగుచు ననేకులైన మానవుల భక్షించుచుండె ॥ 147

క॥ ఒకనాఁడొక మునిబుతుకా, లకృతస్నానక, స్వభావలావణ్యవతిన్ ।
వికసితముఖుఁడై కదియఁగఁ, బ్రకటితుఁడై రాజుదనుజ భావముతోడన్॥ 148

చ॥ కనలు మన్నార్చి పట్టుకొనఁగాఁబఱతెంచిన వారు భీతులై,
వనమునఁ బాఱిపోవఁగ జవంబున వెన్నడిపోయి విప్రునిం।
బనుపడఁ బట్టుకొన్నఁగని బ్రాహ్మణియిట్లను విప్రుఁబుణ్యవ
ర్తనుని. మదీయవల్లభుని ధర్మముతప్పి వధింపఁబోడియే॥ 149

గీ॥ అకట యిక్ష్వాకు వంశంబునందుఁబుట్టి, నట్టి నృపతులు ధర్మమార్గైకరతులు।
నీవు తత్కులమునఁబుట్టి నింద్యకర్మ,మాచరింపంగఁదగునయ్య నీచవృత్తి॥150

వ॥ నీవు మిత్రసహాండను మహారాజవు, రాక్షసుండవుగావు; స్త్రీధర్మసుఖాభిజ్ఞుం
డవు; మన్మనోరథంబుగాకుండ మద్వల్లభుని వధియింపవలదని బహుప్రకారం
బుల విలపించుచుం బ్రార్థించిన వినక వ్యాఘ్రంబు పశువుం జంపినవిధంబున
బ్రాహ్మణుంజంపి భక్షించె. అంతనా బ్రాహ్మణి యగ్ని ప్రవేశంబు చేయం
దలంచి కోపోద్దీపిత మానసయై॥ 151

గీ॥ నామనోరథమునకు విఘ్నంబు చేసి, భర్తఁజంపితివీ పాపఫలముకతన।
నంగనామణిఁగవిసిన యపుడునీవు, పంచతభజించుమనుచు శపించెనపుడు॥ 152

వ॥ ఇట్లు శపించి పతిననుగమించె. నంత ద్వాదశాబ్దంబులు నిండిన శాపకృత
రాక్షసభావంబు పోయిన మిత్రసహుండు నిజపురంబునకు వచ్చి నిజపత్ని
యగు మదయంతి రావించి మదనక్రీడ లపేక్షించిన నద్దేవియు శాప
ప్రకారం బెఱింగినదై వారించె. అతండును రతి పరాఙ్ముఖుండై యుండె
నంత. 153

క॥ అనపత్యుండై నృపాలుడు, తనగురుని వశిష్ఠమౌనిఁదగఁ బ్రార్థింపన్।
మునియును మదయంతికిను, ఘనచిత్తాంబురుహుండగుచు గర్భముచేసెన్॥

గీ॥ కాంతమదయంతి యేడేండ్లు గర్భభరము, పూనివేసరియొకతాతఁబొడిచికొనిన।
గర్భముకలంగి సుతుఁడు భాస్కరనిభుండు, పుట్టెనశ్మకుఁడని జగంబులునుతింప॥

వ॥ అయ్యశ్మకునకు మూలకుండగు పుత్రుండు కలిగె. అతండెకదా పరశు
రాముండు భూతలంబు, నిఃక్షత్త్రంబుసేయు నెడ వివస్త్రలైన స్త్రీలచేతం
బరివృతుండై రక్షింపంబడి నారీకవచుండనం బరఁగె. అట్టి మూలకునకుద
శరథుండు, నతనికి నిలిబిలి యతనికి విశ్వసహుండు నతనికి ఖట్వాంగుండు
కలిగె. 156

సీ॥ ఖట్వాంగ మేదినీకాంతుండు దేవాసు, రాహవంబున సమభ్యర్థితుండయి।
సురలకుఁదోడ్పాటుచూపిదైతేయులఁ, బరిమార్చి గెల్చినసురలు మెచ్చి।

వరమునఁగోరుము ధరావర యనవరమిూయ, నాత్మఁగోరితి రేనియస్నదాయు।
రవసాన మెఱిఁగింపుఁడనిన నొక్కముహూర్త, మనిచెప్ప వేగిమైయవనికరుగ

గీ॥ తెంచియిట్లనితలఁచె భూదివిజులకుఁగఁ, దాల్మిమై దేహమైనను, దారపకీర్తి।
విహితధర్మంబు లేమర, వృకుమనుజ, పశుతృణాదులయందుఁశ్రీభర్తఁగాంత

వ॥ ఎప్పుడును నిట్టివాఁడనై చరింతునింకను॥ 1

చ॥ మునిజనభాగధేయము సమున్నత వేద శిఖావతంస మా
ర్యనివహకల్పకంబు సచరాచర సర్వజగత్స్వరూపమై।
పనుపఁడు వాసుదేవుఁడను బ్రహ్మము నెమ్మది నాశ్రయింతునం
చనితరభక్తియుక్తినసుధాధిపుఁడస్పృహచిత్తవృత్తినై॥ 1

వ॥ వాసుదేవ బ్రహ్మంబునందు లీనుండై ముహూర్తంబున, ముక్తుఁడయ్యె॥ 1

గీ॥ పుడమిఁఖట్వాంగభూపతిఁ బోలునృపతి, కలఁడెదివమునసుండి భూస్థలికివచ్చి
రెండుగడియలఁ జేరె నిశ్శ్రేయసంబు, ననుచుఁబొగడిరిన వ్వర్షులతనికీర్తి॥ 1

వ॥ ఆఖట్వాంగునకు దీర్ఘబాహుండును, దీర్ఘబాహువునకు రఘువు, రఘువున
నజుండు, నజునకు దశరథుఁడును గలిగె॥ 1

సీ॥ శ్రుతిశిరోవ్యాహారవితతికింతింతని, కొలఁదిపెట్టగరానియలఘుమహిమ।
మరవిందభవభవేంద్రాది దివ్యులకు, దుష్ప్రాపితమంబైన పరమపదము।
సనకాది పరమహంసవతంసములదహ, రాంబరస్థలిఁద్రోచునతుల తేజ।
మణుమహత్పరిమాణగణితాఖిలప్రపంచాంతఃస్థమైన యనాదినిధన॥

గీ॥ మమలమవితర్క్యమక్షయ్యమప్రమేయ, మైననారాయణ బ్రహ్మమవతరించి
రాముఁడనఁదారక బ్రహ్మనామసోమ, ధామముద్దామమైపర్వదశరథునకు॥ 1

వ॥ రామలక్ష్మణ భరత శత్రుఘ్నులన నాలుగు రూపంబుల నుదయించి॥ 1

చ॥ జనకుని యాజ్ఞఁగౌశికుని జన్నముగావఁగఁ బోనఁద్రోవలో
ఘనవిజిఘాంసనై యెదురుగాఁబఱతెంచిన తాటకానిశా।
టని నలఘ్రాశుశ్రోచుచుఁ, దటాలుననధ్వరవిఘ్నకర్తలా।
దనుజులగెల్చి తాచెసుణధాముఁడురాముఁడు మానియాగమున్॥ 1

సీ॥ కఠినశిలీభవద్గ్రావము పెన్రియసతి, కలుషపహ్నికిఁ దొలుకారుమొగులు।
చండీశకోదండ పుండ్రేక్షుకాండంబు, నకును ... ... ఉన్మదగజంబు।
పృథ్వీతనూభవాదృక్చకోరికలాల, సమునకుఁ బూర్ణిమా చంద్రబింబ।
మువయ భార్గవసముద్యద్దర్పశిఖరిని, ర్భేదనక్రీడకుభిదురధార॥

గీ॥ అడుగునెత్తమ్మిరజము బాహాబలంబు, చక్కఁదనముపరాక్రమసౌష్ఠవంబు।
దనకుననుకూలగతినొప్పధరణిఁబరఁగె, శ్రీమహితదివ్యవిభుఁడుశ్రీరామవిభుఁడు॥

గీ॥ జనకసత్యవచః ప్రతిష్ఠాపనమున, కనుజసీతాసమేతుఁడై యటవికేఁగ।
మునికృతతపఃఫలంబుచేరినవిధమున, వల్కపరిధానుఁడై జటావళిధరించి॥ 167

చ॥ అహరధిపప్రతాపుఁడు జనాధిపుఁడాదరణీయవైఖరిన్
గుహపరివస్యఁగైకొని మనోహరకానన చిత్రకూటస।
న్మహిభృదధిత్యకా స్థలులమానుల గోష్ఠివసించెనిచ్చలున్
మహితనయానుజన్ములు సమగ్రతఁదన్ను భజించుచుండఁగాన్ ॥ 168

సీ॥ కౌసల్యమొదలుగాఁ గల్గుతల్లులతోడ, వరమూలబలముతో గురులతోడ।
శత్రుఘ్నుఁడుందాను జనుదెంచిభరతుండు, సాగిలిమ్రొక్కి రాజన్యవరుని।
కడఁజెప్పితత్క్రియల్ గడపినపిమ్మట, ధరణిఁబాలింపఁ బ్రార్థనముచేయ।
నంగీకరింపక యామ్నాయమస్తక, న్యస్తప్రశస్తము న్యాత్మభావ॥

గీ॥ భవ్యపాదూద్వయం బిచ్చిపంపిమగిడి, మగిడివచ్చెద రిందుండిమనుటగూడ।
దనుచుననుచుసముత్సాహమగ్గలముగ, నగ్గిరీంద్రంబుడిగ్గి రామావనిపుఁడు॥169

వ॥ కతిపయ ప్రయాణంబుల దక్షిణపథంబు వట్టిచనిచని॥ 170

సీ॥ గంధదంతావళోత్కరకరోచ్చైః క్షిప్త,వమధువర్షత్ర సద్వనచరంబు।
గిరిదరీపరిసర ధ్వరిఘునారభటీవి, నిర్దళద్గర్భకైణీగణంబు।
బిలనిద్రితద్వీపి వలమానఘుటఘుట, స్వానస్వనితకుంజపుంజితంబు।
తరునిష్కుహాంగణస్థ భుజంగమఫణా గ్రరత్నదీపనిరస్త రజనితమము॥

గీ॥ పోల్లసత్పాదపోల్లలద్భల్లుకేంద్ర, సాంద్రతనుమేచక ప్రభాశంకనీయ।
తతకుహూమధ్యరాత్రంబుదగ్రదాన, వైథితము దండకారణ్యమెదుటఁగాంచి॥

వ॥ తటియం జొచ్చి చనునప్పుడు॥ 172

శా॥ స్వర్గావణ్యవతీ విహారఘనవి స్రంభార్హ గోదావరీ
వార్లోలల్లహరీ వికంపితవిభావత్పంక జాతోత్పలాం
తర్లీనభ్రమరాతిగీతి రసకర్తల్పంత తాయోగినీ
దుర్లంఘంబులుదండకానిలముతేతుల్ చూపె భూపాలుపై॥ 173

ఉ॥ ఆరవివంశవర్ధనుఁ, డుదారధనూరవభిద్యదుగ్రకాం
తారమృగీపలాయన విధానమున న్ధరణీతనూజవి।

స్మేరముఖాబ్జుఁ జేయుచు గమించుచుఁ దారొక్కెడఁ ద్రుంచెఁగల్పిత
క్రూరనిరోధు, దుస్సహవిరోధు విరాధు నిశాతహేతిచేన్ ॥

క॥ శరభంగ సుతీక్ష్ణమునీ శ్వరపుణ్యాశ్రమములకు, వివస్వద్వంశో
త్తరుఁడు,చని తత్సపర్యలఁ, బరితుష్టింబొంది యనుజభార్యాన్వితుఁడై ॥

పంచచామరము.

అగస్త్యమౌనియున్న పావనాశ్రమంబు చేరనా
ప్రగల్భతాపనుండు శాస్త్రభంగి పూజచేసికాం ।
తిగళ్ళునైంద్ర కార్ముకంబు దివ్యఖడ్గమక్షయా
శుగంబుతూణ యుగ్మకంబు చోద్య లీలనిచ్చినన్ ॥

వ॥ పరిగ్రహించి యచ్చట నివాసంబు చేసియుండునంత ॥

సీ॥ జటిలులువల్కలాచ్ఛాదనుల్కృష్ణాజి, నోత్తరీయాంతరీ యోరుతనులు ।
దండకమండలు ధారులుకాషాయ, పటవసానులు తపోభారకృశులు ।
పవనభోజులు, జీర్ణపర్ణఖాదనులు, నీవారముష్టింపచోదారవృత్తు ।
లంబుభక్షణులు శాకాశనుల్మూలకం, దఫలశిలోంఛ వర్తనసహితులు ।

గీ॥ యాయజూకులు బ్రహ్మవిద్యానిపుణులు, దండకారణ్య సతతవాస్తవ్యులవని
వినుత తేజోనిరస్త దమునులు,మునులు, వేడ్కఁజనుదెంచిరా రామవిభునిఁజ

చ॥ ఎదురుగనేగి వారికినభీష్టత, సాగిలిమ్రొక్కి భక్తిలోఁ
బొదలఁగఁదోడితెచ్చి, నయమున్భయమును, దగనర్హపీఠులన్
ముదముననుంచి, యంచితమనోగతి నర్ఘ్యమొసంగి, మాధురీ
సదుదితరీతి స్వాగతముచక్కఁగ నీయఁగనత్తపోధనుల్ ॥

వ॥ పెక్కుతెఱంగుల నాశీర్వదించుచు నిట్లనిరి ॥

గీ॥ విశ్వవిశ్వంభరా చక్రవిపులభార, మానిప్రజనెల్లఁ బ్రోచుచుమీయభ్యుదయ
గోరుకొనిమీకు ధర్మంబుఁగోరు పెట్టు, కొనుచునుందుదు మెపుడునీవనముఁ

సీ॥ త్రిషవణవ్రతులఁగాఁతియపెట్టినీళ్ళఁదొ్రొక్కుదురుముక్కునసూర్పు మెదలకో
ప్రేలఁగట్టుదురు, బల్విడిఁదలక్రిందుగా, వరకపాలాస నాదరులఁదరుల ।
ఐణపట్టములఁగూయఁగ ఉిం భకులమోము, బిగఁగట్టుదురుపట్టి బీతుకుడు
కెరలియంగములపై ఘృతము చల్లుచు,దుందు మూలయాజకులనే ర్తురలమటి

గీ॥ పలితదీర్ఘజటా వల్లిభరముపట్టి, పట్టిబెడ్డలపై నెత్తు రుట్టజరర ।
తాపసులనీడ్చురా శ్రమస్థలులఖలులు, రక్కసులుపిక్కటిల్లిదుర్దారంభులగు

మ॥ భయదవ్యాఘ్రమదేభసింహకిటిరూపంబుల్, దగం దాల్చి దు
ర్నయతం, బల్లెలుఁ జొచ్చి హెచ్చిన మదాంధత్వంబునన్ సత్తపః
ప్రియులన్ మౌనులఁ బట్టి చంపుచు, ననల్పీభూతనిర్ఘాత ని
ర్దయఘోరారభటీకులై దనుజభర్తల్ పొదరిచ్చాగతిన్ ॥ 183

సీ॥ దర్భగుప్పెఁడు మోవఁ దాళని, జీర్ణసన్న్యాసులు గుఱ్ఱపుగడ్డి మోసి మోసి ।
జలకుండి దేర వేసరు, నమాంసలభిక్షులా సక్థ్యమున నీళ్లు మోసి మోసి ।
యిధ్మమేరఁ గలేని వృద్ధయజ్వలు పాకములకుఁ గట్టెలదిండ్లు మోసి మోషి ।
భైక్షపత్రపుటి కోపని జరద్వాచంయములు బోనగాపళ్లు మోసి మోసి ॥

గీ॥ విసిగి యీడ్గిలఁ బడ మెడల్విఱుగఁ గ్రుద్ది, దిక్కులేమికి నగుదురు రక్కసులు ని ।
జాశ్రమంబులఁ దిగు తుడుమూలకించి, దూరముగఁ గాలు గలవారు పాఱిపోవ ॥

ఉ॥ ఈసున బాసఁ దిట్టి మెడలెల్ల బడల్పడ, గ్రుద్ది గెంటుచున్
దీసుక పోయి దండములు దెచ్చి భుజంబులఁ బెట్టి దైత్యు లెం ।
తేనుఖలీలనందలము లెక్కిన మోతుము, తన్ని తాంతపీ
తాసవవాసవాసనల యావడిఁ బ్రేవులు వాతఁ దొట్టఁగన్ ॥ 185

వ॥ యాగంబు లాగంబులయ్యె, యోగంబులు వియోగంబులయ్యె, సాంఖ్యంబులు సంఖ్యంబులయ్యె, జపంబులు నెపంబులయ్యె, తపంబు లాతపంబులయ్యె, గాత్రంబులు ముష్టిఘట్టనపాత్రంబులయ్యె, ఆశ్రమంబు లాశ్రమంబులయ్యె, వ్రతంబులు గతంబులయ్యె, స్నానంబులు కుంజరస్నానంబులయ్యె. కందమూలాది భోజ్యంబులు త్యాజ్యంబులయ్యె. అధ్యయనంబు లాధ్యయనంబులయ్యె, శాస్త్రంబులు శస్త్రంబులయ్యె. శ్రీరామచంద్ర! సాంద్రభవత్కారుణ్య కటాక్షంబుల మమ్ము నీక్షించి రాక్షసబాధ మాన్పు మని విన్నవించిన ॥ 186

గీ॥ పరమఋషిపుంగవుల విన్నపములు విన్న, యన్నరాధీశువదన నభోంగణమున ।
భ్రూకుటివ్యాజకేతు విస్ఫురణముఖల, దానవవినాశ పిశునమై కానిపించె ॥ 187

క॥ శ్రీరాముఁడు కారుణ్య, శ్రీరామారమణుఁడై ఋషిప్రవరులకున్ ।
ధీరత, నభయం బిచ్చి, యుదారాలాపముల నిట్టులనుచుం బలికెన్ ॥ 188

గీ॥ శంబదంభప్రహేళ నారంభశుంభ, దాత్మదోస్స్తంభ ఖడ్గ ధారాంచలమునఁ ।
బాపకర్ములరాక్షస భటులఁ బట్టి, చక్కుచీరికఁ జేయుదుఁ జనుఁడు మీరు ॥ 189

వ॥ ఇవ్విధంబునఁ బరమఋషుల నాదరించి ॥ 190

క॥ చొక్కు మదిలోఁ దలంచుచు, రక్కసచనుదేర హాస్యరసముగ నసిచే।
ముక్కును జెవులును గోసెన, స్రుక్కణములు మోసు వెంటజిలజిలఁ దొరఁగన్॥1

చ॥ అరితతి వేఁటలాడు వసుధాధిపసూనుఁడ నల్వనై పుణీ
వరకరలాఘవంబున నవారణ నేయు విచిత్రపత్రి, యా।
ఖరముఖదైత్య నాథులను కైదుల బోరలుసించి కొన్ని
ష్ఠురవరవిక్రమాస్తిఁ జవిచూచె గనుంగొనువారు మెచ్చఁగన్॥ 1

శా॥ మారీచాంతకుఁడై కబంధవధకుం భక్త్యాయకుండై చమ
త్కారోత్ఖండితసప్త భూమిరుహుఁడై దర్పోజ్వలద్వాలిహృ।
ద్ఘోరాద్రిప్రవిదారణోగ్రపవియై, దుర్వారుఁడై యాసమి
చ్ఛారాగ్రేసరుఁ డేలెఁ గింకరునిఁగా సుగ్రీవు నుగ్రాంశుజున్॥ 1

చ॥ భవుకసితాబ్జపత్ర రుచిపక్కన నవ్వు నృపాలువాలుఁగ
న్గవకొన కెంపుఁ గాంచుచుఁ దొఁగర్చఁగఁ దద్విశిఖాంచలంబునన్।
దవిలెఁ బయోనిధానమవధానముగాఁ, దరుశాఖనొప్పు కెం
జివురు తుదన్వసించునొక చిన్నతుషారలవంబు చాడ్పునన్॥ 1

సీ॥ స్నానకృత్యముఁ దీర్చె సంచరన్మకరాక్ష, రాక్షసోదరమహాస్రస్రవంతి।
నాపోశనంబెత్తెనధిక దృప్యత్కుంభ, కర్ణదీర్ఘోర్వ సృగర్ణములను।
ప్రాణాహుతులు వేల్చెఁ బటునిశాటభటప్ర, కాండచ్యవన్మాంసఖండములు
భోజనంబొనరించె భూరిరత్నకిరీట, కలితరావణ శిరఃకబళములను॥

గీ॥ సుఖశయన మొందె మణివిభాశోభమాన, మాననీయ నిషంగధామంబునడుమ
నెంత నిష్ఠాగరిష్ఠమో, యినకులీన, చంద్రుబాడబసము దివ్యసాయకంబు॥ 1

వ॥ ఇట్లు రావణ వధంబు చేసి లంకారాజ్యంబున విభీషుని బట్టముగట్టి సీతాస
తుండై శ్రీరామవిభుం డయోధ్యానగరంబు ప్రవేశించి రాజ్యంబు పాలిం
నంత.

గీ॥ కడఁగి మూఁడుకోట్ల గంధర్వనాథుల, బాహుబలము మెఱయఁ బట్టి చంపి
వారి దేశములు బలారూఢిఁ గైకొనె, భరతుఁడధిక కీర్తి భరితుఁడగుచు॥

మ॥ అరిజైత్రున్మధు పుత్రకున్ లవణునుద్యద్బాహుసాహాయ్యకో
ద్ధురుఁడై యాహవకేళిఁ గిటణఁచి శత్రుఘ్నుండు గట్టించె భా।
సురలీలన్మధురాఖ్య పట్టణము సంస్తుత్యంబుగా నందు సుం
దరసంపత్ప్రతిభాఢ్యులై జనులు సాంద్రప్రీతి వర్ధిల్లఁగన్॥

వ॥ ఇట్లు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు జగంబులకు సుఖస్థితి సంపాదించి దివంబునకుంజనిరి. భగవదంశసంభూతులగు వారియందు ననురాగంబుగల కోసలజానపదులు తన్మనస్కులై తత్సాలోక్యంబునొందిరి. రామునకుఁ గుశలవులును, లక్ష్మణునకు, నంగద చంద్రకేతులును, భరతునకుఁ దక్షపుష్కరులును, శత్రుఘ్నునకు సుబాహు శూరసేనులును గలిగిరి. అందుఁగుశునకున తిథి నతిథికి నిషధుండు, నిషధునకు నలుండు, నలునకు నభుండు నభునకుఁ బుండరీకుండు, పుండరీకునకు క్షేమధన్వుండు, క్షేమధన్వునకు దేవానీకుండు దేవానీకునకు నహీనగుండు, నహీనగునకు రురుండురురునకుఁ బారియాత్రుండు పారియాత్రునకు, దేవళుండు దేవళునకు వచ్ఛలుఁడు వచ్ఛలునకు నుత్కుఁడును నుత్కునకుఁ దైలుండు, తైలునకు ఉక్తుండు, ఉక్తునకుఁవజ్రనాభుండు వజ్రనాభునకు శంఖణుండు, శంఖణునకు ద్యుషితాశ్వుండు ద్యుషితాశ్వునకు విశ్వసహుండు, విశ్వసహునకు హిరణ్యనాభుండుగలిగె. అతండు జైమిని శిష్యుండైన యాజ్ఞవల్క్యునివలన యోగంబభ్యసించి యోగీశ్వరుండయ్యె. ఆ హిరణ్యనాభునకుఁ బుష్యుండు పుష్యునకు ధ్రువసంధి ధ్రువసంధికి సుదర్శనుండు, సుదర్శనునకు నగ్నివర్ణుండు నగ్నివర్ణునకు శీఘ్రగుండు శీఘ్రగునకు మరుండునుగలిగె. అతండు యోగీశ్వరుండై కలాపపురంబున నున్నవాఁడు. ఆగామియుగంబునందు సూర్యవంశవర్తకుండు కాఁగలఁడు. ఆమరునకుఁ బ్రశుశ్రుకుండు నాతనికి సుసంధి నతనికి సమర్షణుండు నతనికి విశ్వభవుండు నతనికి బృహద్బలుండును గలిగె. బృహద్బలుండు కదాభారత యుద్ధంబుననర్జనపుత్రుండైన యభిమన్యుని చేత హతుండయ్యె. వీరలిక్ష్వాకువంశ భూపాలకుల ముఖ్యులు. వీరల చరితంబులువినిన సర్వపాపక్షయంబగునని చెప్పి శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె,

సీ॥ ధన్యుఁడిక్ష్వాకునందనుఁడైననిమి సహస్రాబ్దయజ్ఞంబొక్క టాహరింపఁ ।
దలఁచి ప్రార్థించెహోతవు గమ్మనుచువశిష్ఠుని నమ్మునీంద్రుఁడిట్లనియెనింద్రుఁ ।
డిపుడుపంచశతాబ్దకృత్యాధ్వరముచేయ, నూహించిపిలిచిననొప్పినాఁడ ।
వజ్రికార్యముదీర్చివచ్చి నీమఖముసా, గించెదనని పోయెక్షితివరుఁడును ।

గీ॥ గౌతమాదులఁగూర్చి యాగంబుచేయు,చుండెనంతటిలో వశిష్ఠుండుమఘవు ।
మఘముసేయించి భూమికిమగిడివచ్చి, యన్యుచే జన్నమొనరించునధిపుఁగాంచి॥

॥ జన్నము సేయించుటకై, నన్ను నొడంబఱిచి పిదపనాయాగమునం ।
బెన్నక యిటుగావించిన, యిన్నీచుని దుష్టకృత్య మేమనవచ్చున్ ॥ 201

॥ అని కోపించి ॥ 202

క॥ మోహాతిరేకమున సం,దేహింపక యిజ్యకోరి దెచ్చుకొని నయిా।
సాహసిక గ్రామణి, నిజ, దేహమెడలుఁగాక, తా విదేహుండనఁగన్ ॥

చ॥ అనుచు శపింప మేలుకని యక్కట యేమరి నిద్రనున్ననన్
గినిసి శపించెనా యెడల కిల్బిషమింతయుఁ జూడ లేదు గా।
మునముని యు న్స్వకీయతనువుం బెడ బాయుత మంచుఁ బల్కి యు,
జ్జనపతి మేనుపొత్తెడలె సభ్యులు విస్మయవార్ధిఁ దేలఁగన్ ॥

వ॥ నిమిశాపంబున వసిష్ఠుని తేజంబును మిత్రావరుణుల తేజంబునం బ్రవేశి
ఊర్వశీదర్శనంబున మిత్రావరుణులకు రేతః పాతంబైన నందువలన
ష్ఠుండు దేహాంతరంబునొందె. నిమిశరీరంబును నతిమనోహర తైలగంధ
సంస్క్రియమాణంబై క్లేదాది దోషంబుల నొందక యుండె. అంత
సమాప్తియగుచునుండ యాగభాగంబులకు వచ్చిన దేవతలం జూచి ఋత్
లి ట్లనిరి.

గీ॥ మాననీయాత్ముఁడగు యజమానునకును, వరమొసంగుఁ డటన్న దేవతలు వేఁ
మనిననిమివారితోడ నిట్లనియె వినయ, సంభృతత్వంబు దీపింపశ్లక్ష్ణఫణితి ॥

సీ॥ కఠినకీకస సముత్కర నిరంతరకీర్ణ ముల్లసద్బహుసిరావేల్లితంబు।
సాంద్రరోమపరీత చటులచర్మపినద్ధ, ముద్వేలమాంస నిషద్వరంబు।
నవవిధద్వారసంతతగళద్దుర్గంధ మస్రపూయక్రిమివ్యాచితంబు।
మూత్రపురీష సంపూర్ణకుతూస్రాయ, మామయాధిరుజాశుగాకరంబు ॥

గీ॥ పాతకము దేహమిది పాయుభాగ్యమబ్బె, నొల్లనిఁక దానితోడుసు, నేనుండఁ
నాఁడ, జంతుతతుల లోచనములయందు, నీవరంబిండు నాకు నభీష్టకరము॥

వ॥ అనిన దేవతలును నతఁడు కోరిన వరంబిచ్చిరి. నిమియును సకల ప్రాణు
చనంబుల యందువసించె. అది మొదలు ప్రాణులకు న్మేష నిమేషంబ
గలిగె. అంత నరాజకభీరువులై యాజకులపుత్రకుండగు నిమిశరీరం
యందుఁబెట్టి మధించిన నందు కుమారుండు గలిగి జననంబు కతంబున
కుండు మధనంబు కతంబున మిథియుఁ,దండ్రి విదేహుండగుట కతంబున వై
హుండునను నామంబులఁ బరఁగె. ఆ జనకునకు నుదావసుండును, నతనికి
వర్ధనుఁడు నతనికి సుకేతుండు నతనికి దేవరాతుండు, నతనికి బృహదుక్థుఁ
నతనికి మహావీర్యుండు నతనికి సుధృతి, నతనికి ధృష్టకేతుండు నతకి హ
శ్వుండు నతనికి మనుండు నతనికిఁ బ్రతికుండు నతనికిఁ గృతరథుండు న
దేవమీఢుండు నతనికి విబుధుండు నతనికి మహాధృతి యతనికిఁ గృతరా
డు నతనికి మహారోముండు నతనికి స్వర్ణరోముండు నతనికి హ్రస్వరోము

నతనికి సీరధ్వజుండును గలిగె. అతండు పుత్రార్థంబుయజన భూమి దున్ను నపుడు సీరసీతా ముఖంబునఁ గుమారికయైన సీతజనించె. ఆ సీరధ్వజునకు సాంకాశ్యాధిపతియైన కుశధ్వజుండు కలిగె. నతనికి భానుమంతుండు నతనికి శతద్యుమ్నుండు నతనికి శుచి నతనికి నూర్జుండు నతనికి శతధ్వజుండు నతనికి కృతియతనికి నంజనుండు నతనికి గురుచిత్తును నతని కరిష్టనేమి యతనికి శ్రుతాయువు నతనికి నుపార్శ్వుండు నతనికి స్వజయుండు నతనికి క్షేమావి యతనికి ననే నుండు నతనికి భౌమిరథుండు నతనికి సత్యరథుండు యతనికి నుపగుండు నతనికి స్వాగతుండు నతనికి స్వానందుఁడు నతనికి సువర్చుఁడు నతనికి సుపార్శ్వుఁడు నతనికి సుభాషుఁడు నతనికి సుశ్రుతుండు నతనికి జయుండు నతనికి విజయుండు నతనికి ఋతుండు నతనికి సునయుండు నతనికి వీతహవ్యుండు నతనికి ధృతి యతనికి బహుళాశ్వుండు నతనికిఁ గృతి యాకృతియందు జనకవంశంబు నిలిచె. వీరు మైథిలులు. ఆత్మ విద్యా ప్రవీణులైన భూపాలురని చెప్పినశ్రీ పరాశరునకు మైత్రేయుం డిట్లనియె ॥ 208

చ॥ వరగుణశాలులైన రవివంశ నృపాలురఁ జెప్పి మన్ననో,
దురితము బాఁదోలి పరితోష మొనర్చితివింక సద్గుణా ।
కొరమెగుచంద్ర వంశ మెఱుఁగన్మదిఁగోరెదఁ జెప్పుమయ్యతఁ,
ద్గురుతరవంశవారినిధిఁదోఁచెఁ గదా బహురాజరత్నముల్ ॥ 209

వ॥ అని యడిగిన శిష్యున కాచార్యుండిట్లనియెః 210

గీ॥ మునికులోత్తంస పరఁగసోముని పవిత్ర, వంశమందు జనించిరి వరగుణాఢ్యు ।
లైననహుషయయాత్యర్జునాదిరాజు, లిందుకుల భూషణములై సమిద్ధమహిమ ॥

వ॥ అట్టి చంద్రవంశంబు చెప్పెద వినుము. అఖిల జగత్స్రష్టయై భగవంతుఁడైన శ్రీమన్నారాయణుని నాభి సరోజంబు నందబ్జయోనియై బ్రహ్మపుట్టె, బ్రహ్మకు నత్రి యత్రికి సోముండుకలిగె. అశేషౌషధీ ద్విజనక్షత్రాధి పత్యంబునకుం జతురాననుండతని నభిషిక్తునిం జేసె. అంత ॥ 212

గీ॥ అనుపమిత వైభవస్ఫూర్తియాధిపత్య,గర్వసంపూర్తియునుగూడఁగాఁ,బ్రకాశ।
విశదసత్కీర్తి జగమెల్ల వెలయఁజేసె, నంబుభవసూతి రాజసూయాధ్వరంబుః

చ॥ అపరిమితాధిరాజ్యవిభవాతిశయంబున రాజసూయయా
గపరమకర్మకృత్త్వమున, గంజవిరోధి మహావిరోధియై ।
విపులమదాతిరేకమున వేలుపుటొజ్జయనుంగుటాలి బ్రా
ద్యుపుజవరాలిఁదారయను నంబుజలోచనఁ దెచ్చెనింటికిన్ ॥ 214

గీ॥ బలిమినాంగీరసుని భార్యఁబట్టితెచ్చి, నగరిలోవేసికొని నిరంతరము మదన ।
కేళిఁదేలుచు శశియుండె జాలిహొంది, గురుఁడు తన్నెంత వేఁడినఁ గొమ్మనీక

క॥ మోహితుఁడై హిమధాముఁడు, ద్రోహమనక యాచరించెఁ దోడ్తోగురు ప ।
త్నీహరణము "భువికామాం, ధోహీనపశ్యతి"యటన్న నొడువునిజముగాన్ ।

క॥ రాజఁట చక్కనివాఁడఁట, రాజసమదియౌవనంపు రహియఁట విభవ ।
శ్రీజయగర్వోద్ధతుఁడఁట, పూజితులకు నిజనివాసములు గలుగునొకో ॥ 21

సీ॥ కాలకంఠకఠోర కంఠకోటరసము, ద్భటవిషానల కీల ప్రాపుచూపు ।
దుర్వారతర మహాగర్వ సర్వస్వని, ర్దిష్టదుష్టవి చేష్ట తేటమాట ।
కుహనాపరంపరా గహనావిషహ్యాసాం, ద్రీభవద్దుర్మాయదినుసుమనసు ।
బహుతరద్రోహసంభవ దఘౌఘప్రభా, గణనీయ నిరయాప్తికడకనడక ॥

గీ॥ రాజులేయూరు పూజ్యవర్గప్రసన్న, దృష్టియేయూరు తిమిరౌఘ తేజములకుఁ
గలుగదుకదా సమానాధికరణ లాభ, మధిపతులపొందు, భుజగనాయకులవింద

వ॥ అది యట్లుండె॥ 21

చ॥ అంటినయార్తిచేఁబొగిలి యాంగిరసుండతిదీనవృత్తి. నిం,
టింటికిఁబోయినైజ కథయెల్లనుమెల్లనఁ జెప్పిచెప్పి క్రిం ।
గంట జలంబుదెచ్చుకొనఁ గంజభవాదిసురల్ హిమాంశువె,
న్వెంటనెపోయిచెప్పిన గణింపఁడ, తద్వచనేరి తార్థముల్ ॥ 2

వ॥ వినకున్నం గోపించి॥ 2

సీ॥ పవిఝుళిపించె జంభసురారిదమనుండు, కెరలికీలలుమాపెఁ గృష్ణవర్త్మ ।
కోరమీసలు నులిగొల్పెదండధరుండు, తళుకుఁగోరలు దీఁటెదనుజవిభుఁడు ।
వలిత్రాటిమెలివిప్పె జలరాశినాథుండు, మృగిఁబల్లకట్టె సమీరణుండు ।
గదబెట్టుద్రిప్పె వేడ్కమనుష్యధర్ముండు శూలంబుసారించెఁగాలగళుఁడు ॥

గీ॥ సురలువెనుబొబ్బలిడిరి యక్షులుధనుర్గు, ణధ్వనులుచేసిరఖిల గంధర్వగరుడ ।
వరులు పరవళ్లుద్రొక్కిరి వారిజారి, దలఁచికయ్యంబునకుఁ గాలుద్రవ్వుకొనఁ

వ॥ ఇట్లు కడంగిన నింద్రాదులం గూర్చుకొని బృహస్పతి చంద్రునిపై నడి
నంత॥ 2

గీ॥ అంగిరునివద్ద రుద్రుఁడభ్యస్త సకల, విద్యుఁడై నకతంబున విప్రవర్య! [వెలఁ
ధూంగిరసునకు సాహాయ్యమాచరించెఁ, బ్రమథగణములుదానుసంభ్రమః

వ॥ బృహస్పతి మీఁది ద్వేషంబున శుక్రుండు చని యింద్రుని పార్ష్ణి
గ్రాహుండై నిల్చె; శక్రారులై జంభకుంభ పురోగములైన దైత్యవీరులు
చంద్రునకుం దోడై సురలపై సమరోద్యమంబు చూపిరి. ఇట్లు తారాపక్ష
మునం దారకై తారకామయంబైన సంగ్రామంబు ప్రవర్తిల్లె. అందు దైత్య
దానవులు, దేవగణంబుల మీఁద దివ్యాస్త్రంబులు ప్రయోగించిరంత సకల
జగన్నిర్మాణ చతురుండైన చతురాననుండే తెంచి సొచ్చి రుద్రపురోగము
లైన దేవతలను, జంభకుంభాదులైన దైత్యులను, సమ్మతించి సన్నాహంబు
లుడిపి సుధాకరుని బోధించి గురునకుం దార నిప్పించిన నవప్రసవయైయున్న
తారం జూచి గురుం డిట్లనియె॥ 225

గీ॥ అంబురుహనేత్ర నాభార్యవకట యొరుని, కొడుకు నీగర్భమునఁ బెట్టుకొనఁగవలెనె।
విడువుమననట్లచేసె నప్పుడఁతియప్పు డనఘుసతి దేవతా మణియోటఁ జేసి ॥ 226

వ॥ ఇట్లు గర్భంబొక్క యిషీకాస్తంబంబు పై విడిచె. ఆక్షణంబున సకలజన
మనోహరుండైన యతని సౌందర్య సౌకుమార్యంబులఁ జూచి చంద్ర బృహ
స్పతులు సాభిలాషులౌటయెఱింగి దేవగణంబులు తారతో నిట్లనియె ॥ 227

ఉ॥ నిక్కము చెప్పుమంబురుహనేత్ర యపత్రపయేల నీకు నీ
చక్కని చొక్కపుం గొడుకుఁ జందురు సంగతిఁ గంటివో! కడు
న్నక్కవమున్న జీవుని సమాగమనంబునఁ గంటివో మదిన్
జిక్కిన సంశయంబుడుగఁ జేయుము పాయుము సాధ్వసక్రియన్ ॥ 228

క॥ అనిసురలడిగిన నయ్యం, గన లజ్జా సాధ్వసములఁ గడ చెప్పకయుం।
డిన తనయుఁడు కుపితుండై జనయిత్రిం బలికె నధిక సంరంభమునన్ ॥ 229

గీ॥ తరిమియెంతడిగినను మా తండ్రిపేరు, చెప్పవటు గాన నిన్ను శిక్షింపవలయు।
శాపమిచ్చెదఁ గొనుమనిశమును మంద బుద్ధివై యుందుగాక యీపూన్కి తరిగి॥230

వ॥ ఇట్లు శపియించెను నంత ॥ 231

ఉ॥ తానపుడబ్జసూతి, వనితామణి నల్లన చేరఁ బిల్చియో
మానిని తప్పలేదు వినుమా కనమా యిటువంటికృత్యముల్
పూనికమీఱ నీతల నెపుట్టెనె పుట్టినమాట చెప్పుమెం
దైనను బుత్రజన్మకథ లారయ తల్లి యధీన లోఁగదా ॥ 232

వ॥ అని బుజ్జగించి యడిగిన ॥ 233

గీ॥ తారకేల్దమ్మిదోయి మస్తకముఁజేర్చి, మోమువాంచిపాదాంగుష్ఠమునధరిత్రి ।
వ్రాయుచువిధాతఁబలికె నల్పంపుఫణితి,నలినవైరికిఁగంటి నందనునిననుచు ॥ 234

వ॥ ఇట్లుతార, తేరనాడిన నానందాశ్రుధారా సారంబుజారను దారపులకావారంబు
ఘోరంబుగా శృంగారంబు దొంగలించినభంగి నంగంబులఁ బొంగనఖండహాస
సుధామండల ఖండంబులు గండ మండలంబులం దాండవింప సుధాకరుండు
కుమారు నాలింగనంబుచేసి సాధువాదంబుల నాదరించి ప్రాజ్ఞుండవైతివని
బుధుండనుపేరు వెట్టె. ఆబుధుండిలాకన్యయందుఁ బురూరవుండను పుత్రునిఁ 23
గనియె. అతండు చక్రవర్తియయ్యె ॥

ఉ॥ దానపరుండు, యజ్వ,విశదస్థిరకీర్తి, ఘనుండుసత్యవా
క్యానుపమానుఁ డాహవవిహార వినోదిమనోజ్ఞరూపరే
ఖానవసూన కార్ముకుఁడఖండ విభూతిపురూరవుండు తే
జోనిధియేలెఁ బ్రాభవముచూపుచు నేపుననెల్లదీవులన్ ॥ 23

సీ॥ ధరణిసురేంద్ర మిత్రావరుణులశాప, మునవూర్వశీకాంత మనుజలోక ।
మునవసింపఁగఁగోరి భూమికివచ్చిపు, రూరవునధికసురూపుఁజూచి ।
కామించెనతఁడును గమనీయరూపలా, వణ్యవతియగునవ్వనిత వలన ।
మదనాతురుండయ్యె ముదితమనోజవ్య, థోపేతచిత్తులై యొండువనులు ॥

గీ॥ మానియుండిరంత మనుజాధిపుఁడుదేవ, వనితఁజూచిపలికె మనసిజాస్త్ర ।
విద్ధతనుఁడనైతి వెలఁదినన్బరిణయం, బైమనోజకేళి నాదరింపు ॥ 23

చ॥ అనుటయు హావభావలలితాకృతియై సురకాంతవల్కెనో
జనసుత,సత్యశీల, బలసంయుత, యీసమయంబు చేసినన్
నినువరియించుదాన ననినిక్కముతత్సమయంబుచెప్పమీ
వన,వనజాక్షియిట్లనియె నాదృతినాధరణీశలేశుతోన్ ॥ 2

గీ॥ వసుమతీశ్వర బిడ్డలవలెనెపెంచు, కొంటినీమేషముల రెంటినంటివాయ ।
నింకనాశయనము చేర్వనెపుడునుండ, నీయవలయును వీని నాకిష్టమిట్లు ॥ 2

క॥ వినునగ్న త్వముతోనా, కనుఁగవకుంగానఁ బడుటగాదీవు ఘృతా ।
శన మొనరించుచునుండుదు, నన్ఘానీయొద్దఁ జేయుమాసమయంబున్ ॥ 2

వ॥ ఇట్టి సమయంబుచేసిన నీకు భార్యనగుదు, సమయభంగం బయినంబోవుదా
ననిన నొడంబడి యారాజు రాజవదనయుం దానుం గూడి ॥ 2

సీ॥ అలకాపురాది దివ్యపురీమణీహేమ, కమనీయతుంగ సౌధములయందుఁ ।
జైత్రరథాదిరాజన్ని ర్ఝరవిహార, శృంగారవనతరు శ్రేణులందు ।

మానసాదిసరోవరా స్థానతరదర, న్నవపుండరీక షండములయందు ।
హిమవదాదిమహేంద్ర సముదారశృంగములం, భర్ఝరీకుంజగర్భములయందు ॥

గీ॥ భహువిధవిచిత్ర సురతసంబంధబంధ, బంధురత్వంబు నేపింపఁ బార్థివుండు ।
నూర్వశియుఁ గ్రీడసలిపిరొండొరులమీఁది, ప్రేమదినదినమాత్మ నభివృద్ధిఁబొంద ॥

వ॥ ఇవ్విధంబున ననేకవర్షంబులూర్వశి యయ్యుర్వీశ్వరునితో సంభోగ క్రీడలం దగిలి స్వర్లోక సుఖంబులు మఱచియుండె ॥ 243

గీ॥ సురపురీభోగ్య సౌభాగ్యగరిమ కెల్ల, నూర్వశీకాంత లే కున్న నొప్పదటంచి ।
నపుడుసమయజ్ఞుఁడగుట తానపుడు దెంచి, దివిగంధర్వ విభుఁడువిశ్వావసుండు ॥

వ॥ ఊర్వశీపురూరవుల సమయంబెఱింగిన వాఁడై, విశ్వావసుండొక్క నాటినిశా సమయంబునవచ్చియూర్వశి శయనసమీపంబున నున్నమేషంబులలో నొక్క దానింబట్టుకొని యాకాశంబునకుం బోయిన దానిశబ్దంబువిని యూర్వశి యిట్లనియె ॥ 245

గీ॥ హాహామునఁబెంచుకొన్న నాముద్దుకొడుకు నకటయెవ్వఁడుగొనిపోయెననదనైతి।
నరసియెవ్వరువిడిపించెదరుమదీయ, దీనదశమాంచియిప్పుడుద్వ్రతిమెఱసి॥ 246

వ॥ అని పలుకు నూర్వశి వచనంబులువిని రాజుతద్దర్శన భయంబునం బోకయున్న గంధర్వులు రెండవపొట్టేటినిం బట్టుకొని పోయిన దానికూఁతవిని యూర్వశి యిట్లనియె॥ 247

చ॥ అకటయనాధనైతిఁ బురుషాధము చేపడి శౌర్యహీనుఁడీ
పురుషుఁడ దెట్లు నాకొడుకుగుఱ్ఱలపట్టుకొ పోవుచున్న మో ।
పశునివధించి తేఁగలఁడె చాలనవజ్ఞ ఘటిల్లెనాకునీ
వికలతవాపనేరినిఁ కవేఁడుదు, నేఁడు దురంతదుఃఖనై ॥ 248

వ॥ ఇట్లార్తయై పలుకుచున్న యన్నలినానన పలుకులువిని కోపించి కించిదరుణాయమానసేత్రాంచలుండై రాజపంచాననుండంధ కారంబు కావున సుధాంధః కాంతతన్నుం జూడదనితలంచి దిగంబరత్వంబున లేచి ఖడ్గంబంకించి చోరులకు నాపుండర నెక్కిడికిం బోవచ్చునని వెన్నుదగిలిన గంధర్వులు మాయావిద్యుత్పరంపరయు త్పాదించిన నావెలుఁగున నతనినగ్నత్వంబు చూచి యూర్వశి చనియె. రాజును గంధర్వులందోలి, యురణకద్వయంబుం గొనివచ్చి శయన తలంబున నూర్వశిలేకుండుట చూచి నగ్నభావంబుననున్నట్టురూప కుండై యయ్యంగన వెదకుచు నెల్లెడల పరిభ్రమించుచు ॥ 249

ఉ॥ క్షత్త్రియవర్యుఁడీగతి దశల్వరికించుచుఁ బోయియాకురు
క్షేత్త్రమునందుఁ బద్మసరసీతటిఁగాంచె మనోజ్ఞదేవకాం
తాత్రితయంబుతో మెలఁగుతామరసానన నూర్వశిన్ సుమా
స్త్రత్రుటితావిజేయ విలసత్ప్రవిజాగ్ర దుదగ్రధైర్యుఁడై ॥ 2

ఉ॥ చూచినృపాలుఁ డోమృగకిశోరవిలోచన! జాయవీవునా
కీచటుఁగాటవీస్థలుల, నేలచరించెదు, రమ్మటన్నవ్యా
కోచపయోజ పత్త్రము లఁగొంకఁగ జేయుకటాక్షవీక్ష,నా
రాచతనంపు బూమెవలరాయనిఁ జూచిలతాంగియిట్లనున్ ॥ 2

వ॥ మహారాజా యీయవివేక చేష్టితంబు చాలింపుము. ఇప్పుడేను గర్భిణి
యున్నదాన, ఒక్క సంవత్సరంబునకు మగిడిరమ్ము. కుమారుండు జనియిం
గలండు, నీకిత్తునొక్కనాఁడు నీతోడంగూడి యుండెదనని పొమ్మన్న హర్షిం
నిజపురంబునకుం జనియెనంత ॥ 2

గీ॥ అచ్చరలువిస్మయం బందియడుగ,నూర్వ, శీలతాతన్వి చెప్పెఁ దచ్చిత్ర చరిత
మారయీరాజుఁగూడుభాగ్యంబుమాకుఁ,గలుగునాయనియాత్మఁదలంచిరపు

వ॥ సంవత్సరంబు పూర్ణంబైన పురూరవుం డచ్చటికింబోయిన నూర్వశియు నా
ర్నామధేయుం గుమారునాతనికిచ్చి యారాత్రియతనిం గూడియుండి పం
పుత్త్రోత్పత్తినిమిత్తంబైన గర్భంబుదాల్చి యారాజుతో నిట్లనియె, అ
త్ప్రీతికరులై గంధర్వులునీకు వరంబీయవచ్చిరి కోరుమనిన గంధర్వులం జూ
పురూరవుం డిట్లనియె ॥ 2

గీ॥ అఖిలరిపుకోటి గెలిచితి నమితకోశ, బంధుబలసం యుతుండనెప్పట్టునందుఁ ।
గొదవనాకింతయును లేదు,మదిఁదగిలిన, దీలతాతన్వియందు నభీష్టలీల ॥2

వ॥ కావున నీ యూర్వశిసాయుజ్యంబు గలుగ వరంబిండనిన గంధర్వు లత
నగ్నిస్థాలి యొసంగి యిట్లనిరి. ఆమ్నాయానుసారంబున నగ్నిం ద్రిధా
జించి యూర్వశి సాలోక్యంబు నుద్దేశించి యజింపుము, నీ యభిలాషం
సాయుజ్యంబు సఫలంబగుననిన నగ్నిస్థాలిఁగొని చనుచు నిట్లని చింతించె॥ 2

క॥ ఆలలన లేనియగ్ని, స్థాలియిదేమిటికి, డించి, చనియెద నిచటన్ ।
హాలిపురంబున కని చని, యాలోన నిశీథసమయమరిగిన పిదపన్ ॥

వ॥ నిద్రలేక యిట్లని తలపోయు. అక్కటా! యూర్వశి సాలోక్యార్థంబు
ధర్వులిచ్చిన యగ్నిస్థాలి యరణ్యంబునం బెట్టి వచ్చితిఁ బోయి తెచ్చెద
లేచివచ్చి యచ్చట నగ్నిస్థాలిఁగానక "శమీగర్భంబైన యశ్వత్థంబగు

ఇది యే పురంబునకుం గొనిపోయి యరణిచేసి మథించి యందునుత్పన్నంబైన
యగ్ని నుపాసించెద"నని పురంబునకుం బోయి యరణి నిర్మాణంబునకై గాయ
త్రిని బఠించిన గాయత్ర్యక్షర సంఖ్యాంగుళీప్రమాణంబులైన యరణి
త్రయంబైన నందు నగ్నిత్రయంబు మథియించి యూర్వశీ సాలోక్యంబు
గోరి యామ్నాయానుసారియై వేల్చి గంధర్వలోకంబునొంది యూర్వశిం
గూడి సుఖంబుండె. అగ్నియొక్కండయ్యును, నీమన్వంతరంబునఁ బురూరవునిచేఁ
త్రివిధంబై వికల్పింపంబడియెనని శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె॥

క॥ వరగురుఁడైన పురూరవు, చరితంబిది చెప్పితిం బ్రసన్నహృదయతా।
స్ఫురితుఁడవై తద్వంశము, పరిపాటిని వినుముని గమ భవ్యాచారా॥ 259

వ॥ పురూరవునకాయువు, ధీమంతుండు, నమావసుండు, విశ్వావసుండు, శ్రుతా
యువు, శతాయువు నయుతాయువునను నార్వురు పుత్త్రులుగలిగి రందు
నమావసునకు భీముండు, భీమునకుఁ గాంచనుండు, కాంచనునకు సుహో
త్రుండు, నతనికి జహ్నుండు పుట్టె॥ 260

సీ॥ నుతకీర్తియైన జహ్నుఁడు పరస్మాత్పరు యజ్ఞపూరుషుఁ గమలాధినాథుఁ।
గురించి యాగము చేయుతఱి, రంగదుత్తుంగభంగపరంపరా భంగయగుచు।
గంగ తన్మఖవాటిఁ గలయముంచినఁ జూచి కోపించి యారాజకుంజరుండు।
పరమయోగిసమాధిపరతఁ దద్గంగాజలంబెల్లఁ ద్రావనుల్లమునఁ దలఁకి॥

ఆ॥ మునులు చనుదెంచి యారాజముఖ్యు నధిక, వినయమున వేఁడి, గంగనీతనయదీని।
విడువుమనిసన్నుతించిన విడిచె నృపతి, యది మొదలు గంగ జాహ్నవియనఁగఁ బరఁగె॥

వ॥ ఆ జహ్నునకు సుమంతుండు, నతనికి నజకుండు, నతనికి బలాకాశ్వుండు, నతనికిఁ
గుశుండు, కుశునకుఁ గుశాంబ, కుశనాభాధూర్తరజో వసువులను నలుగురు
పుత్త్రులు గలిగిరి. అందుఁ గుశాంబుండు. 262

ఉ॥ శతమఖతుల్యుఁడైన సుతుఁ జయ్యనఁ గాంచెదనంచుఁ గోరియున్,
వ్రతమటు సేయ నింద్రుఁడు ధరావరుఁ జేరఁగవచ్చి నేననీ।
సతికిఁ దనూజభావమున జన్మమునొందెద నంచుఁ బోయెన,
క్షతభుజవీర్యశౌర్య నిధి గాధిజనించెఁ గుశాంబుఁ డుబ్బఁగన్॥ 263

వ॥ కుశాంబ పుత్త్రుండైన గాధికి సత్యవతియను కన్యకపుట్టె, భృగువంశోత్త
రుండగు రుచికుండు వచ్చి యా సత్యవతి నడిగిన గాధికోపించి॥ 264

తే॥ వృద్ధుఁడీ బ్రాహ్మణుండు సమృద్ధరూప, శీలసౌభాగ్యయైన యీచిగురుఁబోఁడి।
నెవ్విధంబున నడిగె నెట్లిచ్చువార, మైన నొక నేర్పు కలదని యతనిఁ జూచి॥ 265

వ॥ ఒక్కచెవి నలుపును, శరీరంబెల్ల తెల్లనయు, వాయువేగంబునుం గల యశ్వ
సహస్రంబిక్కన్యకుం గానఁ బెట్టి పరిగ్రహింపుమనిన నమ్మునియును వరుణు
నడిగి యశ్వతీర్థ సముత్పన్నంబగు తాదృశతురగ సహస్రంబు దెచ్చి యారా
జున కిచ్చి సత్యవతినిం బరిణయంబై యక్కాంతకు నపత్యంబుఁ గోరి చరు
నిర్మాణంబు చేసిన సత్యవతి తమతల్లికిఁ బుత్రుండు కావలెనని పతిం బ్రార్థిం
చినఁ దత్ప్రార్థితుండై క్షత్రియ వరపుత్త్రోత్పత్తి కారణంబైన యొక్క
చరువు నిర్మించి సత్యవతి కిట్లనియె ॥ 266

గీ॥ బ్రహ్మతేజోఘనుండైన పట్టి నీకుఁ, గలుగు నిందుల నిందుల నలఘువీర్య। [మీరు॥
ధనుఁడు క్షత్రియుఁ డుదయించుఁ దత్సవిత్రి, కెలమితో నుపయోగింపుఁడి పుడు

వ॥ అని చెప్పి వనంబునకుం బోయినఁ జరూపయోగకాలంబున సత్యవతిం జూచి
తల్లి యిట్లనియె॥ 268

గీ॥ పుత్త్రి వినుమెవ్వరైన నను బుత్త్రుఁ డధిక, గుణునిఁ గోరుట యెందు నిక్కువము సుమ్ము।
భార్య తమ్ముని గుణములు పాటిగొనరు, మునియు నిజపుత్త్రు ఘనునిఁ గాఁగనక పోఁడు॥

వ॥ బ్రాహ్మణునకు బలవీర్య సంపదలేల ? క్షత్రియునకైన సర్వ భూమండలం
బును నేలుఁ గావున నీ చరువు నా కిచ్చి నా చరువు నీవు గైకొనుమనిన నట్లకాక
యని సత్యవతి తన చరువు తల్లికిచ్చి తల్లి చరువు తా నుపయోగించె. అనం
తరంబ వనంబుననుండి చనుదెంచి రుచికుండు సత్యవతిం జూచి యిట్లనియె॥ 270

ఉ॥ పాతకురాల యేమి తడఁబాటొనరించితి వత్యుదగ్రరౌ
ద్రాతులమయ్యె నీయొడల నస్త్రపథంబున మాతృభావవి।
స్ఫీత చరూపయోగమప భీతి నొనర్చితివో నృపాలకా
హ్లాతిక ఘోరభీకరగుణాకర మా చరు వెన్ని చూచినన్ ॥ 271

క॥ అనఘంబు బ్రహ్మతేజో, భినుతము నీ చరువు దానిఁ జెడ చేఁత భవ।
జ్జననికి నిచ్చితివకటా ! కనఁగల వెమహోగ్ర దుష్టకర్మునిఁ గొడుకున్ ॥ 272

చ॥ అనవినికంపమాన హృదయాంబుజయై లలితాంగి భర్తప
ద్వనజయుగంబుఁ బట్టుకొని వల్లభ యేనపరాధినిఁ గా ననున్।
వినుత దయావలోకన నవీన సుధాప్లుతి నాదరింపు నం,
దనుగననోపనిష్ఠురగుణప్రవణప్రతిభాసమేతునిన్ ॥ 273

వ॥ పుత్త్రుండు క్రూరుండౌట కోప నవ్విధంబు వాఁడు మనుమండుగా ననుగ్ర
హింపవలయునని ప్రార్థించిన నట్ల యనుగ్రహించె, ఆ సత్యవతియు జమ
దగ్నిం గనియె, సత్యవతి తల్లియు విశ్వామిత్రునిం గనియె, సత్యవతియుఁ గౌశిక

యనుసద్గియయ్యె, జమదగ్నియు నిక్ష్వాకువంశోద్భవుండైన రేణుకుని పుత్రిక యైన రేణుక నుద్వాహంబై యక్కాంత యందు భగవంతుండైన శ్రీ నారాయణుని యంశంబైన పరశురామునిం గనియె, వినుము ॥ 274

సీ॥ క్షత్రియసాను మత్సమితి కెవ్వనికోప, మదయనిష్ఠుర ఘోరభిదురధార।
రాజన్య రాజీవ రాజి కెవ్వని కనుం, గొనచూపు సమదదిక్కుంభికరము।
బాహుబాహ్యద్భవాటవీపటలి కెవ్వని నట, ద్భ్రుకుటిదవానల స్ఫురితకీల।
పార్థివాంభోధి సంపదల కెవ్వవి యట్ట, హాసరేఖ యగస్త్యహస్తచుళుక ॥

ఆ॥ మవనినాథాంధ తమససంహతికి నెవ్వ, నిమహితోద్దండ భుజదండనిహితపరశు।
దీప్తియుదయాద్రిశిఖర ప్రదీపితార్క, బింబమా రాముఁ డాహవభీముఁ డొప్పు॥

వ॥ భార్గవుండైన శునశ్శేఫుండు విశ్వామిత్రునకు దేవతలచేత నియ్యంబడి దేవరాత నామంబున విశ్వామిత్రునకుఁ బుత్త్రుండయ్యె మఱియు విశ్వామిత్రునకు మధుచ్ఛంద, ధనంజయ, కృతదే, వాష్టక, కచ్ఛప, హారితాఖ్యులు పుత్త్రులు కలిగిరి. వారలకు ననేకంబులైన కౌశిక గోత్రంబుల ఋష్యంతరంబులయందు వైవాహ్యంబులు గలిగెనని చెప్పి శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె॥276

క॥ ప్రేచురవిజ్ఞాన, వినుపురూరవునియగ్ర, నందనుండాయునతఁడు కన్యాలలామ।
రాహుపుత్రికఁ బెండ్లియై ప్రకటబలులఁ, బుత్రకులఁ గాంచె నేవురఁ బుణ్యమతుల॥

వ॥ వారలు నహుష, క్షత్రవృద్ధ, రంభ, రజ్య, నేనులను నైదుగురు. అందుక్షత్రవృద్ధునకు సుహోత్రుండును, సుహోత్రునకుఁ గాశ్యప కాశ, గృత్సమదులను మువ్వురుపుత్త్రులు గలిగిరి. అందుగృత్సమదునకు శౌనకుం డనంగలిగి చాతుర్వర్ణ్య ప్రవర్తకుండయ్యె. కాశ్యపునకుఁ గాశేయుండు నతనికి రాష్ట్రుండుకలిగె. రాష్ట్రునకు దీర్ఘతపుండు, దీర్ఘతపునకు ధన్వంతరి కలిగె. అతండు శ్రీనారాయణుని చేత వరంబువడసి కాశీరాజగోత్ర పతియై యెనిమిది ప్రకారంబుల నాయుర్వేదంబు నిర్మించె. ఆధ్వంతరికిఁ గేతుమంతుండు, కేతుమంతునికి భీమరథుండు, భీమరథునకు దివోదాసుండు, దివోదాసునకుఁ బ్రతర్దనుండుపుట్టె. ఆతండు భద్రశ్రేణ్యవంశ వినాశకారియగుట శత్రుజయంబు కారణంబుగా, శత్రుజిత్తనం బరఁగె; ఆతనికివత్సుండుపుట్టె. ఆతండు సత్యపరుండగుట ఋతధ్వజుం డనంబరఁగె. కువలయం బనునశ్వంబు గలుగుటం జేసి కువలయాశ్వుండనంబరఁగె. అట్టివత్సునకు నలర్కుండుగలిగె, నయ్యలర్కుండఱువదాఱువేల వత్సరంబులు మనోజ్ఞయావనుండై మేదినీ భాగంబను భవించె. నయ్యలర్కునకు సన్నతి, సన్నతికిసునీథుఁడు, సునీథునకు సుకేతుండు, సుకేతునకు ధర్మకేతుండు, ధర్మకేతునకు సత్యకేతుండు, సత్యకేతునకు విభుండు, విభునకు సువిభుండు నతనికి సుకుమారుండు,

సుకుమారునకు ధృష్టకేతుండు ధృష్టకేతునకు వీతిహోత్రుండు,నతనికి భార్గుండు భార్గునకు భార్గభూమిపుట్టె. అతనివలనఁ జాతుర్వర్ణ్యంబునుం బ్రవర్తించె నీవు కాశ్యపరాజు లింక రజిసంతతివినుమని శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె ॥ 27

క॥ రజికేఁడనూ ఱవ్రులాహవ, విజయులుసత్కీర్తి ధనులువిఖ్యాతమహా ।
భుజవీర్య ధుర్యులేనూ, అజితులుగల్గిరి, జగన్నుదావహు లగుచున్ ॥ 27

వ॥ అక్కాలంబున దేవాసురులు పరస్పరజిగీషువులై యుద్ధంబునకు నుపక్రమించి వారై చతుర్ముఖు పాలికింబోయి మ్రొక్కి యిట్లనిరి ॥ 28

క॥ సరసిజ సంభవ,దేవాసురులము మేమాహవమ్మునుద్యోద్యభుజావి ।
స్ఫురణమునఁ జేయఁదలఁచితి, మిరువాగునవిజయ లక్ష్మియెవ్వరిదొక్కో ॥28

వ॥ అని యడిగిన దేవాసురులకుఁ జతురాననుం డిట్లనియె ॥ 28

క॥ రజియెవ్వరి కిందోడై, భుజవిస్ఫురణంబు చూపుఁబోరన్వారిన్ ।
విజయశ్రీచేరుననన్, రజనీచరవరులుచనిరి రజికడకువడిన్ ॥ 28

వ॥ ఇట్లుచని తమకు సహాయంబుకోరిన నసురలకురజి యిట్లనియె ॥ 28

ఉ॥ మీకుసహాయుఁడై, యతిసమృద్ధభుజా బలలీల,దేవతా
నీకముతోడఁ బోరెద నని న్నను నింద్రునిఁ జేసికొల్వుఁడిం ।
తేకుతుకాప్తిమీరలన నిట్లనిరింద్రుఁడు మాకునాహవా
స్తోకభుజావలేప బలధుర్యుఁడవార్యుఁడు శౌర్యలీలలన్ ॥ 28

వ॥ ప్రహ్లాదుండుండ ని న్నింద్రుఁజేయ నొల్లము.తదర్థంబ యుద్ధంబును ననియసురుఁ చనిన సురలు రజికడకువచ్చి సహాయంబువేఁడిన రజిదేవతల కిట్లనియె ॥ 28

గీ॥ అసురతతులగెల్చి, నాహవంబుననను, నింద్రుఁజేసికొలువుఁ డీరలనిన ।
యుక్తమనుచుదానికొప్పి తోకొనిపోవ, రజియుఁగలన దనుజరాజినడచె ॥ 2

ఉ॥ అంతశచీవిభుండు వినయంబున నన్నరనాథుఁబాదపీ
ఠాంతికభూమిఁజేరి చరణాంబుజముల్ తలసోక మ్రొక్కిభూ
కాంతభయంబు మాన్పితివిగావునఁ దండ్రివిగావెనీవునా
కెంతసవచ్చునీ మహిమయిన్ని జగంబులుపుత్త్రుఁడేలినన్ ॥ 2

వ॥ అనిచాతుర్య పురస్సరంబుగాఁ బ్రార్థించిన రజియుమంద స్మితవదనారవిందుండై యట్లకాకయనుచు నిజపురంబునకు వచ్చికొంతకాలంబునకుఁ బరలోగతుండైన యనంతరంబారజి పుత్త్రులురాజ్యంబు చేయుచున్నంత ॥ 2

ఉ॥ నారదుఁ డొక్కనాఁడు నరనాథతనూభవులున్న చోటికిన్
గౌరవమొప్పఁ బోయి బలఘాతిభవత్పితృపుత్రకుం డత।
ద్భూరివిభూతికిం దగను బ్రభులెచ్చనికైకొనుఁ డంచుఁ దెల్పినన్
వారుసతిత్వరంబని దివస్పతిఁ గన్గొని పల్కి రల్కతోన్ ॥ 290

ఉ॥ నీవును నేము నారజికి నెయ్యపుఁ బుత్త్రుల మాటమాకు నం
భావనఁ స్వర్గరాజ్య పరిపాలనమర్హ మటన్న నీక, వాం
ఛావృతి నున్న యింద్రుని విశంకటవృత్తి జయించి స్వఃపురీ
భావుకరాజ్యమంతయు నభంగురులై వడి నాక్రమించినన్ ॥ 291

వ॥ ఇంద్రుండు పరాజితుండై తొలంగిపోయె. బహుకాలంబు చనిన నొక్కనాఁ డేకాంతంబున బృహస్పతిం జూచి యల్లన దివస్పతి యిట్లనియె ॥ 292

గీ॥ క్రతువుచోరసీయ కేలాగ బ్రతుకవచ్చు, దాఁచనేటికి మొకమెల్లవాఁచెనిట్టి ।
కడిఁదియొఱుఁగఁ బురోడాశఖండమొక్క రేగుపండంతదైన వారింపకిడరు॥293

వ॥ అనిన బృహస్పతి యిట్లనియె, ఇత్తెఱంగుమున్నును నెఱింగించితివి. అందులకుఁ బ్రతికార్యంబు విచారించుచున్నవాఁడ, నెట్టైననునీకు రాజ్యంబు కలుగు నుపాయంబు చూచెద, అనిపలికి రజిపుత్త్రుల బుద్ధిభ్రంశంబునకును నింద్రుని తేజోభివృద్ధికొఱకునునొక్కయిష్టి కల్పించివేల్చె, అందుకతంబున రజిపుత్త్రులు బుద్ధిచలించి వేదోక్తకర్మత్యాగులై బ్రహ్మద్వేషులై ధర్మపరాఙ్ముఖులైరంత యపేతధర్మాచారులైనవారి నింద్రుండు నిర్జించి పురోహితాప్యాయిత తేజుండై త్రిదివంబాక్రమించె. ఎవ్వరేనియు నీయింద్రుని స్వపదచ్యవనారోపణంబులు వించురు స్వపదభ్రంశంబు గాదు, దౌరాత్మ్యంబు తొలంగు. రంభుండ నపత్యుండయ్యె. క్షత్త్రవృద్ధునికిఁ బ్రతిక్షత్త్రుం డతనికిఁ సంజయుం డతనికి జయుం డతనికి విజయుం డతనికిఁ గృతుం డతనికి హర్యశ్వుం డతనికి సహదేవుం డతనికి నదీనుం డతనికి జయత్సేనుం డతనికి సంకృతి యతనికి క్షత్త్రధర్ముండు పుట్టె వీరలు క్షత్త్రవృద్ధుని వంశంబు వారలింక నహుషుని వంశంబుచెప్పెద. నహుషునకుయతి, యయాతి, సంయాత్యాయాతివియాతికృతి సంజ్ఞులార్గురు పుత్త్రులుకలిగి రందు, యతిరాజ్యంబొల్లఁ డయ్యె, వినుము ॥ 294

సీ॥ అతులతేజుండు యయాతిరాజై కావ్యుని తనూజ దేవయానియును,దనుజ ।
పతివృషపర్వునిపట్టి శర్మిష్ఠయు, భార్యలుగాఁగ భూభాగమేలె ।
యదుఁడుదుర్వసుఁడును న నదేవయానియి, ద్దఱునందనులఁ గాంచె దైత్యపుత్త్రి।
ద్రుహ్యుఁడు ననుఁడు పూరుఁడు ననమువ్వర, సుందరాకారాఢ్యుల సుతులఁగాంచె ॥

గీ॥ సంతకాన్యుఁడలిగి యల్లునినతిజరా, పీడనొందుమని శపించుటయును ।
నృపతి,మామపాద సీరేజములవ్రాలి, తాళఁబట్టి ప్రతి విధానమేఁగి ॥ 29

వ॥ కొడుకులరావించి యందు న్యగ్రనందనుండైన యదువున కిట్లనియె. 29

ఉ॥ తామసుఁడై ,యకాలముగదా యనియెంచక మించిసీదుమామ
తామహాఁడల్గియిచ్చె నతిదారుణశాపము సీవునాజరా।
భూమికపూనినాకొసఁగు భోగ్యభవ న్నవయౌవనంబుని
త్యామితభోగముల్గని సహస్రసమా ప్తిగ నిత్తుఁగ్రమ్మరన్ ॥ 29

వ॥ యదుండును జరాగ్రహణంబున కంగీకరింపకయున్న రాజ్యంబున కర్హుతె
కుండునట్లుగా శపించిక్రమంబున దుర్వసు, ద్రుహ్వ్యానువుల నడిగినవారున
నొడంబడకయున్న శపించి వారికందఱికిన్ గనిష్ఠుండగు పూరునిఁబిలిచి యౌ
నం బడిగిన నతండు ॥ 29

ఉ॥ సాగిలి మ్రొక్కిలేచి కరసారసముల్ముకుళించి యోమహా
భాగ కృతార్థతాగరిమవాటిలె మీావచనంబుచేయుటన్ ।
భాగగుయౌవనంబుఁగొని పాటిలుసీజర నాకునిచ్చిను
శ్రీగురుభోగభాగ్యములుచే కొనుఁడంచు నొసంగెఁబ్రీతితోన్ ॥ 29

వ॥ ఇట్లు పూరుండు యౌవనంబిచ్చినం బుచ్చుకొని యయాతితన జరపూరునకిచ్చె
ధర్మావిరుద్ధంబులును, యథాకాలోప పన్నంబులును యథోత్సాహనిర్వర్త్య
బులునునైన కామోపభోగంబులు వేయేండ్లనుభవించి తనవిచనకయొక్క
నాఁడిట్లని గానంబుచేసె ॥ 30

చ॥ విసువక యెన్నినాళ్లనుభవించిన శాంతివహించదెంతక,
క్కసము భళీర కామము నికామము నాజ్యసమర్పణంబునన్ ।
బసచెడునే మహాశనుఁడు, మర్త్యుఁడు దీనికి లొంగనేని సం,
తసములభించఁగాఁ గలఁడె, నాకముఖాఖిలరాజ్యమేలినన్ ॥ 301

క॥ దంతములువదలె కేశము, లెంతయుపలితంబులయ్యెఁ దృష్ణయు బ్రతుకన్ ।
భ్రాంతియుఁ దరుణమలయ్యెడు, నంతంతకునెట్టి చిత్రమతివృద్ధునకున్ ॥ 302

ఉ॥ పూనిక భూరివైషయిక భోగమహానుభవంబు చేయఁగా,
నేనినుపారి నూఱుపదులేండ్లు చనెన్విషయంబులందునిం ।
తైనను దృష్ణమానదు నిరంతరముం ఘనవృద్ధిఁబొందెడుం
గాని విచిత్రమిత్తెఱఁగుఁగానముగా వివరింపనెందులన్ ॥ 303

వ॥ కావున నీ తృష్ణం బరిత్యజించి వాసుదేవ బ్రహ్మంబునందు మానసంబు చేర్చి ద్వంద్వంబులు గెలిచి మమకారంబు విడిచి వనంబున మృగంబులం గూడి చరించెదనని తలంచి పూరునకు యౌవనం బిచ్చి తన జర మగుడం బుచ్చుకొని దక్షిణ పూర్వదిశయందు దుర్వసుని, బ్రతీచియందు ద్రుహ్యుని, దక్షిణదిశయందు యదువును, నుదీచియందు ననువును మండలాధిపత్యంబునకుం బూరునభిషిక్తుం జేసి వనంబునకుం జనియెనని చెప్పి శ్రీ పరాశరుండు మైత్రేయునకిట్లనియె. 304

చ॥ అనుపముఁడౌ యయాతిసుతుఁడైన యదుండు, తదన్వయంబు పా,
వనము తదీయకీర్తన మవారిత భూరిత రాఘకోటినా।
శనము శుభప్రదంబు సురసన్నుతి పాత్రమునీకుఁ జెప్పెదన్
వినుము మునీంద్రచంద్ర శ్రుతివీథుల పండువు చేయుచుండఁగన్॥ 305

చ॥ కలగొనఁ బద్మజాండమునఁ గల్గు సురాసుర మర్త్యపన్నగా,
దులు తపమాచరించి పరితోషమునం బురుషార్థవర్గమే।
యలఘుతరానుభావు కృపనందుదు రట్టి పరాత్పరుండు శ్రీ,
నిలయుఁడు విష్ణుఁ డంబురుహనేత్రుఁడు పుట్టెఁ దదన్వయంబునన్॥ 306

॥ అట్టి యదువునకు సహస్రజిత్, క్రోష్టు, నల, నహుష, సంజ్ఞలుగల నలుగురు పుత్రులుగలిగి రందు సహస్రజిత్తునకు శతజిత్తు, శతజిత్తునకు హైహయ హేహయ, వేణుభయులను ముగ్గురు పుత్రులు పుట్టిరందు హైహయునకు ధర్ముండు ధర్మునికి ధర్మనేత్రుండు, ధర్మనేత్రునకుఁ గుంతి, కుంతికి సహజిత్తు, సహజిత్తునకు మహిష్మంతుండు, మహిష్మంతునకు భద్రశ్రేణ్యుండు, నతనికి దుర్దముండు నతనికి ధనకుండు, ధనకునకుఁ గృతవీర్య, కృతాగ్ని కృతధర్మ, కృతౌజసులన నల్వురు పుత్రులు జనించిరందుఁ గృతవీర్యునకు॥ 307

॥ బాహుసహస్రసంభృతివిభాసి మహాసివినిర్దళద్రిపు,
వ్యూహుఁడు సప్తసాగరపయో వృతివిస్ఫురితాంతరీప సం।
దోహనిఖాతయూపుఁడు మనోహర సత్యవచో విశేషణో
త్సాహుఁడు పుట్టె నర్జునుఁడు దగ్రయశో మహిమాభిరాముఁడై॥ 308

అక్కార్తవీర్యార్జునుండు సప్తద్వీపాధిపతియై భగవదంశ భూతుండును, నత్రిపుత్త్రుండునునగు దత్తుని నారాధించి యమ్మహాత్మునివలన బాహుసహస్రంబధర్మసేవా నివారణంబుగా ధర్మంబునఁ బృథివి జయించునట్లుగా ధర్మంబునఁ బృథివిపాలించునట్లుగా నపరాజయంబుగా నఖిల జగత్ప్రఖ్యాత పౌరుషంబుకలుగునట్లుగా మృత్యువులేకుండునట్లుగా వరంబువడసి యట్లు

సకల ధరాస్థలంబులుం బాలించి యజ్ఞసహస్రంబులుచేసి రాజులెవ్వరు
నశేషగుణంబులఁ దనకుఁ సాటిలేనట్లుగా మెలంగి యెనుబదేను వేలేండ్ల
వ్యాహతారోగ్య శ్రీబలపరాక్రమ సమేతుండై మాహిష్మతీ నగరంబు
రాజధానిగానుండు సమయంబున॥ 309

సీ॥ కాంతాసమేతుఁడై కార్తవీర్యుఁడు వేడ్క, నర్మదనవగాహనంబుచేయ।
సకలదిగ్విజయంబు సాధించి దశకంఠుఁ, డాహవోత్సాహుఁడై యటకువచ్చి।
ప్రౌఢచూపనారాజపుంగవుండపుడల, ప్రాకనాదనుజేంద్రుఁ బోదివిపట్టి।
నిఖిలసురాసురానీక సంగరరంగ, విజయగర్వంబెల్ల వీటఁబుచ్చి॥

గీ॥ చెలఁగఁ జేతులు వెనుకకునులిచితీసి, మొట్టవెట్టంగ లాకలుమోయవిఱిచి।
కట్టి పసరమునవలెఁ ద్రాటఁబట్టి తెచ్చి, గేలిఁబెట్టించి తనచెఱసాలఁబెట్టె॥ 310

వ॥ పంచాశీతివర్ష సహస్రోపలక్షణ కాలావసానంబున శ్రీమన్నారాయణాంశ
భూతుండైన పరశురామునిచేత నుపసంహృతుండయ్యె. అయ్యర్జునునకుఁ
బుత్రశతంబు పుట్టె నందు శూరసేన, వృష, మధు, జయధ్వజ, సంజ్ఞులు
శ్రేష్ఠులందు జయధ్వజునకుఁ దాలజంఘుం డతనికిఁ దాలజంఘాఖ్యగల్గ పుత్ర
శతంబుపుట్టె. అందు జ్యేష్ఠుఁడు వీతిహోత్రుఁడు. వేఱొక్కఁడు భరతుండు.
అతనికి వృషుఁడు వృషునకుమధువు, మధువునకు వృష్ణిప్రముఖ పుత్రశతంబు
గలిగె. అందువలన వీరిగోత్రంబునకు వృష్ణిసంజ్ఞగలిగె. మధువువలన మధుర
గలిగె. యదుకుల సంభవులగుట యాదవులైరి. మఱియు యదుపుత్రుండైన
క్రోష్టువునకు ధ్వజినీవంతుడు నతనికి స్వాతి యతనికి రుశంకుండు, నతనికిఁ
జిత్రరథుం డతనికి శశిబిందుండుపుట్టి చక్రవర్తియయ్యె॥ 311

మ॥ శశిబిందుండలరున్ సమస్తధరణీచక్రేశుఁడై పూర్ణిమా।
శశిబింబాస్యల లక్షభార్యల విలాసక్రీడలం దేల్చుచున్।
దశలక్షాత్మజులన్ మహాభుజులఁ బొందంగాంచి హర్షించుచున్।
దశదిగ్భిత్తులఁ గీర్తిచంద్రికలు నిత్యస్ఫూర్తి నిండించుచున్॥ 312

వ॥ ఆశశిబిందు పుత్రులలోఁ బృథుయశుండు, పృథుకర్మండు, పృథుజయుండును,
పృథుకీర్తి, పృథుదానుండు, పృథుశ్రవుండుననన నార్వురు శ్రేష్ఠులందు
పృథుశ్రవునికిఁ బృథుతముండునతనికి నుశనుండుపుట్టె. అతండే కదా వాజి
మేధ శతంబాహరించె. అయ్యుశనునకు శితపుండు, నతనికి రుక్మకవచుండ తనికి
పరావృత్తు, నతనికి రుక్మేషు పృథు జ్యామఘవలిత హరితసంజ్ఞులైదుగురు
పుత్రులు. అందు జ్యామఘుండు రాజయ్యెవినుము॥ 313

గీ॥ అవనిలో భార్యలకు వశులైన భూత, భావిభవదధిపతులలో నేవిధమున ।
జ్యామఘుండె శ్రేష్ఠుఁడనుచు నుద్దామలీల, జనులు చెప్పుదు రెపుడు నాశ్చర్యముగను॥

వ॥ ఆజ్యామఘుండు భార్యయైన శైబ్యకు వశుండై యుండు. అతం డనపత్యుం డయ్యును శైబ్యకు వెఱచి భార్యేతర పరిగ్రహంబు చేయక పెద్దకాలంబుండె॥

ఉ॥ జ్యామఘుఁ డొక్కనాఁడు చతురంగబలంబులు గొల్వ జైత్రయా
త్రాముదితాత్ముఁడై కదలి ప్రస్ఫురిత ప్రకటప్రతాపరే ।
ఖామిత్థలీల శాత్రవధరాధిపులం బరిమార్ప వారు సం
గ్రామ భయార్తులై నిజపురంబులు వెల్వడి పాఱిపోయినన్॥ 316

వ॥ తదీయనగరంబులు సొచ్చి సర్వధనంబులు గొల్లగొట్టుకొని విజయంబు గైకొని మగుడునప్పు డొక్కయెడ॥ 317

సీ॥ భయచంచలీభవన్నయనాంచలాంచిత, ద్యుతిచంచలల దిశల్ దొంగలింపఁ ।
ద్రాసకంపితకుచస్తబకవేల్లిత తనూ, వల్లి చూపఱకు భావంబు గొలుప ।
నిబిడీభవద్దీర్ఘనిశ్వాస భరపీడ, చేతఁ గెమ్మోవి చిగురు కంద ।
నయనాశ్రుబిందుసంతతి మీనముఖవాంత, సరసముక్తాపరంపరలఁ బోల॥

గీ॥ నన్ను రక్షించు కావంగ దయ్య తండ్రి, తల్లి ప్రోవుమటంచు నార్తస్వరమున ।
సొలసి యేడ్చుచు దిక్కులు చూచు రాజ, కన్యకామణి నొక్కతెఁ గాంచె నృపుఁడు॥

వ॥ ఇట్లు గాంచి యనపత్యుండైన నాకు దైవయోగంబున నిక్కాంత గలిగె. దీనిం బరిణయంబై యపత్యంబులం గనియెద, నరదంబుపై నిడికొని శైబ్యానుమతంబునఁ బరిణయం బయ్యెదం గాక యని యరదంబుపై నిడికొని బలసమేతుండై పురంబునకుం జనినఁ బౌరామాత్య మూలబలంబులతోఁ గూడి శైబ్యవల్లభున కెదురువచ్చి రథంబుపైనున్న కన్యకం గాంచి కించిదుద్భూతామర్ష స్ఫురదధరపల్లవయగుచు వల్లభున కిట్లనియె॥ 319

గీ॥ అతిచపలచిత్త నీ విమ్మృగాయతాక్షి, నెచటఁ దెచ్చితి విది యెవ్వ రేల యనిన ।
భీతిమరుమాటతోఁ జకిన్నాతి నీదు, కోడలన నవ్విభునకు నాకొమ్మఁ బలికె॥ 320

క॥ మనుజవరపుత్రకుని నే, గనుటయె లేదన్యకాంత కలుగదు నీకున్ ।
దనయుని గనుటకు విను మే, యనువున నిది కోడలయ్యె నని పల్కుటయున్॥ 321

వ॥ నిజప్రేయసీకోప కలుషిత వివేకుండై భయంబున దురుక్తి పరిహారార్థంబుగా నిట్లనియె॥ 322

గీ॥ కాంత నీవు సుతునిఁ గనియెదవింక నో, తనికిఁ బెండ్లి సేయఁదలఁచి దీనిఁ ।
దెచ్చినాఁడ ననిన దేవి నవ్వుచు తాను, నతఁడుఁ గూడి నగరి కరిగె నంత॥ 323

వ॥ వయఃపరిణతయయ్యును, నల్పదినంబులలోన శైబ్య గర్భంబు దాల్చి కుమ
రునిం గనియె. అతనికి జ్యామఘుండు విదర్భ నామంబిడియె. అతండు సంప్రా
ప్తయౌవనుండై స్నుషయగు నారాజకన్యం బరిణయం బయ్యె. వారి కిద్దఱికి క్ర
కైశిక, రోమపాదులను మువ్వురుపుత్రులు పుట్టిరి. అందు రోమపాదునకు
బభ్రుండు, బభ్రునకు ధృతిపుట్టె. కైశికునకుఁ జేది చేదిసంతతి యందుఁ జైద్యు
లను రాజులుపుట్టిరి. అందు క్రథుండను స్నుషాపుత్రునకుఁ గుంతి, కుంతికి
ధృష్టి, ధృష్టికి నిధృతి, నిధృతికి దశార్హుండు, దశార్హునకు వ్యోముండు,
వ్యోమునకు జీమూతుండు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుండు, భీమ
రథునకు నవరథుఁడు నతనికి దశరథుఁడు నతనికి శకుని, శకునికిఁ గరంభి కరంభికి
దేవరాతుండు, దేవరాతునకు దేవక్షత్రుండు, దేవక్షత్రునకు మధుండు, మధు
నకుఁ గుమారవంశుండు, కుమారవంశునకు ననుండు, ననునకుఁ బురుమిత్రుండు
పురుమిత్రునకు నంశుండు, నంశునకు సత్వతుండు సత్వతునకు సాత్వతుం
గలిగిరి. ఇది జ్యామఘుని సంతతి, దీని సమ్యక్ఛ్రద్ధావంతులై వినినఁ బాప
ములం బాయుదురని చెప్పి శ్రీపరాశరుఁడు మైత్రేయున కిట్లనియె ॥ 3

క॥ మునివర సాత్వతవంశము, వినుమురదీయ శ్రవణము వివిధాఘహరం ।
బనుపమ సంపత్కారణ, మనవరత శుభాస్పదము ప్రియంబు తలఁపఁగన్ ॥ 32

వ॥ సాత్వతునకు భజన, భజమాన, దివ్యాంధక, దేవావృధ మహాభోజ వృష్ణి
సంజ్ఞులు పుత్రులుకలిగిరి. అందు భజమానునికి నిమి, వృక, వృష్ణులను
పుత్రులుపుట్టిరి. మఱియుఁ దద్ద్వైమాత్రులు శతజిత్సహస్రజి దయుతజిత్సం
జ్ఞలుపుట్టిరి. దేవావృధునకు బభ్రుండుకలిగె ॥ 32

క॥ దేవావృధుఁడును బభ్రుఁడు, నేవిశ్వములోన నధికు లెన్నినచోటన్ ।
భావిభవద్భూతధరి, త్రీవల్లభకోటిలోనఁ బృథుగుణగరిమన్ ॥ 32

వ॥ దేవావృధుండు దేవసముండు. అక్కాలంబునఁ బదునాల్గు వేలున్నఱు
దార్గురు పురుషులు, బభ్రుదేవావృధులవలన నమృతత్వంబు నొందిరి. మహా
భోజుండతిధార్మికుం డతని యన్వయంబున భోజ, మార్తికావరులుపుట్టిరి
వృష్ణికి సుమిత్రుండు, యుధాజిత్తునుం బుట్టిరి. యుధాజిత్తునకు ననమిత్రుండును
శినియును, ననమిత్రునకు నిఘ్నుండును, నిఘ్నునకుఁ బ్రసేన సత్రాజిత్తుల
పుట్టిరి. ఆసత్రాజిత్తునకు భగవంతుండైన సూర్యుండు సఖుండయ్యె వినుము ॥

క॥ జలనిధి తీరమునకు నిశ్చలమతితో నేగి యచట సత్రాజిత్తుఁడ ।
త్యలఘుతర భక్తియుక్తిన్ జలజాప్తుం గొలిచి పొగడె సారస్తుతులన్ ॥ 32

క॥ స్తవమొనరుమెచ్చి భానుం, డవనీపతియెదుట నిలిచెనపుడ స్పష్ట।
ప్రవిమలతనుఁడై యదిగని, రవికిఁగరద్వయము మొగిచి రాజిట్లనియెన్॥ 330

గీ॥ వహ్నిశోభగు ప్రాయువపువున నభమున, సంచరింతురెపుడు స్వామివారు।
అవ్విధముననిట్లు నరుదెంచినారు మీ, దివ్యమూర్తియెట్లు తెలియువాఁడ॥ 331

వ॥ స్పష్టంబుగా దేవరవారిదివ్యదేహంబు నాకన్నులకుం గానంబడదేని మీరు ప్రసన్నంబౌటకు ఫలంబేమియనినఁ గృపావశంవదుండై యాదిత్యుండుతన కంఠంబునంబెట్టిన స్యమంతకనామ దివ్యమణి శ్రేష్ఠంబుతీసి యొకడంబెట్టిన॥

గీ॥ హ్రస్వమై తప్తతామ్రాభమై సమంచ, దీషదాపింగళాక్షమై యెసఁగుభాను।
దివ్యదేహంబుగాంచిపార్థివవరుండు, హర్షమై మ్రొక్కియున్నఁబద్మాప్తుఁడపుడు॥

క॥ వరమడుగు ధరణివరయన, సరసిజహితుఁ జూచినృపుఁడు స్వామీనాకీ।
వరమణి నిమ్మననాయం, బరమణి యదియొసఁగిచనియె మఱుడందివికిన్॥ 334

వ॥ సత్రాజితుండును నమ్మహామణి కంఠంబునంధరించి యాదిత్యుండునుంబోలె తేజోవిశేషంబున దిగంతరంబులు వెలిగించుచు ద్వారకకువచ్చినఁ బౌరులెల్లను విస్మయమునొంది జగద్భారావతరణార్థంబు మానుషరూపధారియైన యాదిపురుషుం బురుషోత్తముఁగాంచి యిట్లనిరి॥ 335

చ॥ కమలదళాక్ష, మాధవ, జగత్పరిరక్షణదక్ష, కృష్ణ, య
క్కమలహితుండు మీచరణకంజము లిప్పుడుగొల్వవచ్చెని॥
క్కమనుచువిన్నవించిన వికస్వర హాసవిభాసితాస్యప
ద్మమలర వారికిట్లనియె, దానవభేదితదర్థవేదియై॥ 336

క॥ ఇతఁడురవిగాఁడు, సత్రా, జితుఁడింతేకాని భానుసేవించి తదా।
ర్జితకృప స్యమంతకంబను, నతులితరత్నంబు దెచ్చెనని చెప్పుటయున్॥ 337

వ॥ పౌరులెల్ల విశ్వసించిచనిరంత, సత్రాజితుండం తఃపురంబు ప్రవేశించి స్యమంతకంబును దాఁచె. అమ్మణియును బ్రతిదినంబును నెనిమిది బారువులకనకంబీనుచుండు తత్ప్రభావంబున రాష్ట్రంబున నుపసర్గానావృష్టివ్యాళాగ్ని తోయదుర్భిక్షాగ్ని భయంబులు లేకయుండె. అంత॥ 338

సీ॥ పుండరీకాక్షుఁడెప్పుడు కోరునద్దివ్య, మణియుగ్రసేనభూమండలేశ్వ।
రునకెయోగ్యంబని, మనమున, నట్లయ్యు, గోత్రభేదభయంబగున్యథార్థ।
మని మణిగాననొల్లఁడయ్యె సత్రాజితుం, డచ్యుతుండడుగునో యనెడుశంక।
భ్రాంతియింతయులేక భ్రాంతకిచ్చిన నాప్ర, సేనుండమ్మణిఁ జెలఁగిగొనియె॥

గీ॥ అదియుఁ దన్ను దాల్చునతఁడు శుద్ధుండైన, సర్వసంపదలు నొసంగి నట్టి ।
గాక యశుచియగుచుఁ గైకొన నతనినే, సాగి బ్రతుకనీక సంహరించు॥ 339

వ॥ ఆ ప్రసేనుండును నమ్మణిశకలంబు వధరించి తురగారూఢుండై యటవికిం మృగ
యావినోదార్థియై చనిన. 340

క॥ సింగంబొక్కటి తుంగా, భంగత్వరఁ బొలుచెంచి పార్థివ సుతునిన్ ।
రంగత్తురంగమముతో, డంగీటడఁగించి మణిఁ గటాలునఁ గొనియెన్ ॥ 341

గీ॥ నోటఁగఱచుకొని మనోవేగమునఁ బోవ, నడుగుజాడపట్టి యంటిదానిఁ ।
జంపిపుచ్చుకొనియె జాంబవంతుండు దే, దీప్యమానమైన దివ్యమణిని ॥ 342

ఉ. భల్లుకవల్లభుండు రవిభాస్వరమామణిఁ గొంచునంధకా ।
రోల్లస దద్రిగహ్వర గృహోత్తమమున్ దఱిఁజొచ్చి వేడ్కసం ।
ధిల్లఁగ నందు నాత్మసుతునిన్ సుకుమారునిఁ జూచివానికిన్ ।
సల్లలితోరుఖేలనము సాగుటకై మణిఁ ద్రేలఁ గట్టినన్ ॥ 34

వ॥ మణిసమాలోక నోత్సుకుండై బాలుండు క్రీడించుచుండె ॥ 34

గీ॥ హరికిమణిమీఁద స్పృహగల దడిగికొనుట, లాఘవంబని తలవేచి లాఁచియుండి
విపినమునకుఁ బ్రసేనుండు వేఁటపోవఁ, జంపిమణి హరియించె శార్ఙ్గధరుఁడు

వ॥ అని సమస్త యదులోకంబును మెల్లన గుజగుజలంబోవ లోకాపవాదంబు
వచ్చెనని భగవంతుండైన యచ్యుతుండు యదుసైన్య వరివృతుండై ప్రసేను
తురంగంబు పోయిన మార్గంబుఁబట్టి చనిచని 34

మ॥ అనివార్యద్విపవైరి నిష్ఠురచపేటాఘాతనిర్భిన్న సం
హననప్రస్రవదస్ర పంకిలదరణ్యాంతంబునం, గూలిచ ।
చ్చినవాహంబు బ్రసేనునింగని ప్రహర్షస్వాంతుఁడై దైత్యసూ
దనుఁడా చందము దెల్పెనందఱికి నిందావాదముల్మానఁగన్ ॥ 34

క॥ హరిజాడ నేగి యామ్ముం, దరకుప్యద్భల్లుకేంద్ర నఖనిర్దళిత ।
ద్విరదారిఁ జూపియందలి, పరిపాటిం దెలిపి ఋక్షపతి చనుత్రోవన్ ॥ 34

వ॥ భల్లుకేంద్రునిజాడఁబట్టి చనిచనిముందర నొక్క మహాశైలంబుం గాంచి త
టంబున సేనలనిల్పి తద్బిలంబు ప్రవేశించి. 34

ఉత్సాహ॥
సింగమొకటి వెంటఁబడి ప్రసేనుజంపిదానిను,
తుంగభుజబల ప్రభాసితుండు జాంబవంతుఁడు ।

జొప్పింగిచింపె నీకు మణిప్రభుత్వమమరఁ జేరెనే,
ద్వంగనేల మోక్షమారపర్యయంచు సంచునన్ ॥ 350

వ॥ సుకుమారుని దాది జోలవాడ నాలించి పాంచజన్యధరుండు స్యమంతకంబు
ద్వార కైనని తలంచి లోపలికింబోయి దాదిచేతఁ దేజోజాజ్వల్యమానంబగు
మణింగాంచి పుచ్చుకోఁదలంచునంత. 351

గీ॥ ఎన్నఁడునువిని కనియును నెఱుఁగనట్టి, భూరిసౌందర్యనిధియైన పురుషమణినిఁ ।
గాంచి యాదాదిమదిలోన ముంచుకొన్న, భీతిమొఱవెట్టెనప్పుడు బెట్టుగాను ॥

వ॥ ఇట్లు దాది మొఱయిడిన॥ 353

చ॥ ఉదుటున నచ్ఛభల్లపతి యోడకుమేఁ గలుగంగ నీకునీ,
యదవద యేలవచ్చితి మదద్భుతదుస్సహబాహుసారసం ।
పద కెదిరింపఁగాఁగలఁడె మానవుఁడంచును దగ్రమూర్తియై,
చదలద్రు వంగనార్చిమురశాసను డాఁకె నియుద్ధపద్ధతిన్ ॥ 354

వ॥ ఇట్లు దాఁకినఁ బరస్పరజయకాంక్షులై మహారోషంబున నిరువదియొక్క దినం
బులుం ఘోరయుద్ధంబు చేసి రంతకుమున్న యదుసైనికులు సప్తాష్టదినంబు లెదు
రుచూచి కృష్ణుఁడు రాకున్నఁ బగరచేఁ జిక్కవలయు లేకున్న నిమ్మహానుభావు
నకు శత్రువధకై యిన్నిదినంబులు పట్టునే, యనినిశ్చయించి ద్వారకకువచ్చి
బంధువులకుఁ జెప్పిన యథోచితక్రియలు నిర్వర్తించియుండి రంత ॥ 355

గీ॥ బంధువర్గంబతిశ్రద్ధఁ బాత్రములస, మిద్ధమృష్టాన్నపానంబులిడుటఁ జేసి।
పంకజాతాక్షునకు బలప్రాణపుష్టి, లాభమొనఁగూడె ఘనతరోల్లాసమొదవ ॥

క॥ ఋక్షాధిపతికిలోకా, ధ్యక్షునిముష్టి ప్రహారతతులకతమునన్ ।
లక్షించిచూడబలపుష్టి క్షీణత నాఁడునాఁట సిద్ధంబయ్యెన్ ॥ 357

సీ॥ మదిలో వివేకసంపద పెంపుదీపింప, జాంబవంతుఁడు జగత్స్వామిపాద ।
ములవ్రాలి యోజగన్మూల కారణభూత, నారాయణుఁడ వీవు నాఁడు జలధి ।
బంధించి రావణుఁబట్టి చట్టలుచీరి, తారకబ్రహ్మమంత్ర పదదివ్య ।
నామధేయం బొప్పనన్నేలి రక్షించి, నావు నిన్నెదిరింప దేవగణము ॥

గీ॥ లైననోపవటన్నఁ దిర్యక్కులప్రజాత మద్విధ జంతుప్రసక్తియెంత ।
తెలియకిప్పుడు నిన్ను నెదిర్చినట్టి, తప్పులోఁగొని నను గావు దైత్యదమన॥ 358

వ॥ అని ప్రార్థించిన జాంబవంతుని శరీరంబు కరంబున నిమిరి విగతవేదనునిం జేసినఁ
బునః ప్రణామంబాచరించి, జాంబవతియను తనపుత్త్రిం దోడ్కొనివచ్చి

"గృహంబునకు వచ్చిన దేవరకు నర్ఘ్యంబు సమర్పించుటకు నర్హావస్తువు లేవు. ఈకన్యకామణిం బరిగ్రహింపు"మని సమర్పించి ప్రణతుండై న్యమంతకమణియును సమర్పించినం గైకొనననొల్లక యబంధువ్వులకుం జూపవలసి కొని జాంబవంతునునిచి జాంబవతిం దోడుకొని ద్వారకాపురంబునకు వచ్చి

క॥ శ్రీవిలసిల్లె గృహంబుల, భావంబులు పరమహర్ష భరితములయ్యెన్ ।
కేవల వృద్ధజనములకు, యౌవన మరుదెంచెనప్పుడా హరిరాకన్ ॥ 3

వ॥ ఇవ్విధంబునఁ బురప్రవేశంబుచేసి జాంబవతి నంతఃపురప్రవేశంబు చేయిఁ సత్రాజితుం బిలిపించి సమస్త యాదవసమక్షంబున నధోక్షజుండు మణివృత్తాంతంబుఁ దెలిపి మిథ్యాపవాద కల్పనాలజ్జితుండగు నతనికి మణియిచ్చిన ॥ 3

గీ॥ హృదయమున నే పరాత్పరునిడిన నిఖిల, పాపములువాయు నప్పద్మపత్రనేత్రు
మీఁదనపరాధమిట్లు నిర్మించినట్టి, నాకునిష్కృతికలదె యెన్నటికినైన ॥ 3

వ॥ అని సత్రాజిత్తు నిర్వేదించి యపరాధ క్షమార్పణంబునకై తనకూఁతు సత్యభామ నచ్యుతునకిచ్చె. అంత॥ 3

సీ॥ జతగూడి యక్రూర కృతవర్మ శతధన్వ, వజ్రప్రముఖ యాదువరులు కరులు
వినకుండఁ దారుమంతన మాడిరందునా, శతధన్వుఁ బలికిరీ చంద్రదమోందుఁ
గంటిమెమనలోనె కలికినిచ్చెదనని, పలికి యిప్పుడు సత్యభామ నచ్యు
తునకిచ్చె సత్రాజితుఁడు వీనిఁజంపుమి, ప్పని కేము నీకుఁ దోడ్పడుదుమబ్జ ॥

గీ॥ నయనుఁ డిందులకగ్గెనాభయమువలదు, నూడుదీరిన చాలునీచోప్పచేయు ।
మనినశతధన్వుఁడగుఁ గాకయనుచుదాని,కుత్సహించి ప్రతీక్షించి యుండెనఁ

చ॥ లఘుగతిఁ బాండునందనులు లక్కనొనర్చిన యిండ్ల నగ్నిచే
నఘపరిభూతులౌట వినియచ్యుతుఁ డప్పుడు రాజరాజుదు ।
ర్విఘటనచిత్తగించియుఁ బ్రవీణతతోఁజనె వారణావతా
ఖ్యఘనపురీ లలామమునకా ధృతి వారల కార్యమారయన్ ॥

సీ॥ హరివారణావత పురికేగ శతధన్వుఁ, డర్ధరాత్రమున నిద్రాప్తినుండ ।
సత్రాజితునిఁ బట్టి చంపిరత్నముగొని, చనియె రథంబెక్కి సత్యభామ ।
హరికడకేగి దుఃఖార్తయై నిజపితృ, వ్యాపాదనము చెప్ప నబ్జనాభుఁ ।
డడరి సత్యాయుతుండై ద్వారకాపురి, కరుదెంచి హలపాణినపుడుచూచి ॥

గీ॥ కంటిరేనాఁడు వెంటలోఁగాలవశత, నడఁగిపోయెఁ బ్రసేనుఁడు గ్రాసిథారఁ
దునిమె సత్రాజితుని శతధనుఁడు నేఁడు, మానికము వీరి కొమ్మదుగానిజం?

వ॥ శతధన్వునింజంపవలయు రథంబెక్కుఁడనిన నట్ల కాకయనియె. ఇట్లు రామ కృష్ణులిద్దఱు సన్నద్ధులగుచు నుండిరంత॥ 367

గీ॥ రామకృష్ణులఘన రోషరభసమెఱిఁగి, తలఁకికృతవర్మ కడకేగి తనకుఁదోడు।
పిలుచుశతధన్వుఁబలికెనాకొలఁదియగునె, హరికిఁబగచేయననుచునయ్యదుకులుండు॥

వ॥ ఇట్లుకృతవర్మచేత నిరాకృతుండై యక్రూరునికడకుం బోయి తోడుపిలిచిన॥

చ॥ పదకమలప్రహారమునఁ బద్మభవాండము బ్రద్దలై పడున్,
మదవదపారదైత్య బలమండలయంత్రనితాంతతీవ్రతా।
స్ఫదవిదితారిదీధితి విభాసితహస్తుఁడులోకశస్తుఁడా,
యదుపతికోపగించిన నహోమన మెంతటివార మెంచుమా॥ 370

గీ॥ ప్రబలహాలముఖనిర్భిన్నభానుజామ,హాప్రవాహుండుబలుఁడుమహామహుండు।
తద్విరోధంబుసేయుట దహనకీల, ననుచితంబుగ నొడిగట్టుకొనుటగాదె॥ 371

క॥ చనుమెచ్చటికైనను నీ,వనియక్రూరుండు పలుకనాశతధన్వుం
డును మణినైనను దాఁచుము, ననుదాఁపఁగనోపవేని నాపై కరుణన్॥ 372

క॥ అనవిని ప్రాణాంతంబై, నను నెక్కడఁజెప్పవేని నాకడనిడుమీ।
వినుతమణియేనిసఁగాని, మ్మని యమ్మణియతనికిచ్చి యరిగెన్బలుచన్॥ 373

వ॥ ఇట్లు॥ 374

ఉ॥ తామసవర్తనుండు శతధన్వుఁడుబెగ్గిలి యెక్కెనాఁటనూ,
ఱామడపోవుగోడిగ నహంకృతినెక్కితొలంగిపోవను
ద్దాములురామకేశవులు తత్పదవింజని రద్భుతత్వరా,
శ్రీమహనీయమౌరథము శీఘ్రతనెక్కిమహోగ్రలీలతోన్॥ 375

వ॥ శతధన్వుని గోడిగయు నూఱామడచనియె. మఱియుందఱిమిన మిథిలాపు రోప వనోద్దేశంబునఁ బ్రాణంబులువిడిచె. పడిన బడబనచ్చోటవిడిచి పాదచారియై పఱువెత్తిన శతధన్వుంజూచి యచ్యుతుండు బలదేవున కిట్లనియె॥ 376

గీ॥ శైబ్యసుగ్రీవమేఘపుష్పప్రధాన, మైన యీరథ్యనికురుంబమలసినట్లు।
దోఁచెనిచ్చోటుద్రొక్కెనఁదురగములకుఁ, గీడువాటిల్లుఁగాఁబోలుచూడుమిపుడు॥

వ॥ ఈరథంబుపై మీరిచ్చటనిలువుండు, పగఱుపదాతియై పాఱిపోయె. ఏనునుబదాతినై వెనుదగిలి చక్రంబెట్టివచ్చెదనని బలదేవునినిలిపి హరి, తోనే వెనుచని క్రోశమాత్రంబునం గూడముట్టి॥ 378

క॥ అరినికరభయదతేజ, స్స్ఫురణమహాదివ్య చక్రమునఁ దలద్రుంచెన్ ।
మురహరప్రముఖాచ్యుతా, దరుఁదరుగుల్మాంతరితు నధము శతధనునిన్ ॥

వ॥ ఇట్లు శతధన్వుం జంపి వాని శరీరాంబరాదులయందు బహుప్రకారంబుల శో
ధించి గానక మగిడిబలదేవు పాలికివచ్చి ॥

గీ॥ ద్రోహిశతధన్వుఁ జూరకే త్రుంగివాని, చేతరత్నంబులేదన సీరపాణి ।
మఱి పలికెయిట్టు వల్కు నీమాటలెల్ల, నర్థలోభికి నీకు నిత్యములుకావె ॥

వ॥ నన్నుఁ బ్రమోహించి మణియపహరించితివి. భ్రాతవుగాన నిన్నేమనవ
నీతెఱంగునం బొమ్ము ॥

సీ॥ నాకుద్వారకయేల బాంధవులతోడి, కూటమదియేల నీతోడిగోడవయేల ।
పోకొనవటంచుమిథిలకుఁబోయెబలుఁడు, జనకుఁడెదురుగవచ్చితోడ్కొనుచుఁ

వ॥ ఇట్లు బలదేవుండు కోపించిపోయిన వాసుదేవుండు ద్వారకానగరంబున
కేంచె. నక్కడ ॥

ఉ॥ శ్రీలువెలంగ సద్గుణవశీకృతుఁడాజనకుండు నిచ్చలున్,
లాలనఁ జేయుచుండ మిథిలాపురిసుండె హలాంకుఁడంతటన్ ।
లాలసమొప్పఁగౌరవకుల ప్రవరుండుసుయోధనుండు మే,
ల్వాలఁగరామునొద్దగదసాదన నేర్చుటకేగుదెంచినన్ ॥

వ॥ సుయోధనునకు గదాకౌశలంబు శిక్షించుచున్నంతవర్షత్రయంబు గ
బభ్రూగ్రసేనప్రభృతి యాదవులు మిథిలకుంబోయి కృష్ణుండు మణి
యించుటలేదని బలరామునకుఁ బ్రత్యయంబగునట్లుగాఁ దెలిపి ద్వా
రోడితెచ్చి రంత ॥

సీ॥ అక్రూరపక్షీయులైన భోజులుసాత్వ, తునిప్రపౌత్రకుని శత్రుఘ్ననాము
జంపియచ్చటనుండ శంకించియక్రూర, సహితులైపురివాసి చనిరియనఘుఁ
డక్రూరుఁడరిగినయది మొదల్ ద్వారకా, పురమునదుర్భిక్షదురితమారి ।
కాదిదోషములుపైకొనె నచ్యుతుఁడు పె, ద్దలనెల్ల రావించిపలికెనిట్లు

గీ॥ ఘోరదుర్భిక్షముఖదోషకోటియొక్క, మాటుగావచ్చెనిదియేమిమాడ్కి దీ
హేతువరయుఁడుమీరన్న నిట్టులనియె, నంధకాహ్వయుఁడొక వృద్ధయాదవు

క॥ వినుఁడు, శ్వఫల్కుండనఁగా, ఘనుఁడీయక్రూరుతండ్రి గలఁడతఁడెందుం
డినచట లేవు దుర్భిక్షనితాంతావగ్రహాదికలుషములెల్లన్ ॥

క॥ మునుకాశీపతి దేశంబున వానలు లేక కరువుముంచుకొనినన ।
జ్జనపతి శ్వఫల్కునచటికి, వినయంబునఁదోడి తేరవిస్మయమొప్పన్ ॥ 389

క॥ సెళపెళనుఱుముచు మెఱపులు, తళతళమన సాంద్ర కరకతతులు రాలన్ ।
జలజలరాలఁగ మేఘంబులు జోరునవానగురిసె భూస్థలినిండన్ ॥ 390

సీ॥ మునుపు కాశీపతివనిత గర్భముదాల్పఁ, గన్యకయందుండి కాలమైన ।
వెడలకయుండెనావడువునఁ బండ్రెండు, సంవత్సరంబులుచన్నఁ దండ్రి ।
గర్భంబులోనున్న కన్యకఁబలుకునో, పుత్త్రియిదేటికిఁ బుట్టవీవు ।
మోముచూచెడి వాంఛముప్పిరిగొనెనాకు, వెడలిరమ్మనుడు నప్పుడుచుతల్లి ।

గీ॥ కడుపులోనుండి పలుకునిప్పుడు మొదలుగ, దినమునొకగోవుచొప్పున ద్విజులకిమ్ము ।
మూఁడుసంవత్సరములంతముదము పొదల, నుదయమొందుదునిట్లుచేయుము మహీశ ॥

వ॥ అనినఁగాశీపతియును నట్లుచేసిన సంవత్సరత్రయంబుగడచిన కన్యకపుట్టిన నక్కన్యకకుఁ బ్రతిదిన గోదానంబు కతనగాందిని యనునామంబిడియె నట్లు పకర్తయు గృహాగతుండునునగు శ్వఫల్కునకు నర్ఘ్యంబుగా గాందినినిచ్చిన నమ్మిథునంబునకు నీయక్రూరుండు గలిగె. ఇతనికిఁ దండ్రిప్రభావంబుగలదు. ఇతండు పోయిననాటనుండియు నీయుపద్రవంబులుపుట్టె. ఇతనిందేవలయునని చెప్పినసంధకుని వచనంబులువిని యక్రూరునకునభయంబిచ్చి ద్వారకకుండె చ్చిన సర్వోపద్రవంబులు శాంతిఁబొందెనంత. 392

చ॥ పనివడియొన్నిచూచిన శ్వఫల్కునిగౌరవమల్పమెట్టులీ
ఘనవిపదార్తివాపెడిని గాందిదిసౌరమణిప్రభావమీ ।
యనుపనివిందుమీయనకునమ్మణి యాశతధన్వుఁడిచ్చెలే,
దనిన నజస్రయాగకరణాధికసంపద లేడగల్గెడిన్ ॥ 393

చ॥ అనివనజాతనేత్రుఁడు నిజాత్మగతంబుననెన్నియొక్కనాఁ
డనుపమితోత్సవంబు నిలయంబునవర్తిలఁజేసి గాందినీ ।
తనయుఁడులోనుగాఁగల ప్రధానయదూత్తములకు సమాజము,
బునఁబిలిపించి ప్రస్తుతముపుచ్చి ప్రసంగము తెచ్చి నవ్వుచున్ । 394

ఉ॥ మందరశైలధారి మతిమంతుఁడు భక్తుఁడునైన గాందినీ,
నందనుఁజూచినీకు సలనాఁడుమణిన్ శతధన్వుఁడిచ్చెనా ॥
కందువనేనెఱుంగుదు సుఖస్థితినీవపరిగ్రహింపుమే,
పొందునుగామపాలు హృదయాబ్జమునమ్మదునన్ను నెంతయున్ ॥ 395

వ॥ బలదేవునకుఁ బ్రత్యయంబైన వెనుక నీవపరిగ్రహించెదవు గాని మణిచూపు
మనిన నక్రూరుండవ్వేళమణి తనవద్దన యుండుటంజేసి యిట్లనిచింతించె. 396

క॥ లేదనిబొంకిన మాటలు, గాదనిశోధించి మానికముగొనునీడా।
మోదరుఁడీదానవకుల, ఛేదికిఁగీడాచరింప భీతియొదవదే॥ 397

వ॥ అనినిశ్చయించుకొని యక్రూరుండిట్లనియె. 398

గీ॥ నేఁటరేపటనెల్లుండి నీరజాత, నయనుఁడడిగెడునిచ్చెద నాకుదాఁపఁ।
దరమెయనిదాఁచిదాఁచి వేసరితిననుచు, ముందటంబెట్టెమణితన ముల్లెవిడిచి॥

వ॥ దివ్యరత్న ప్రభాప్రభావితులై సభాసదులు సాధువాదంబుల నగ్గించిరప్పుడు
బలదేవుండు కృష్ణునకుం దనకు సమానంబైనను నమ్మణియందభిలాషంబిడియె
పితృధనంబుగావున సత్యభామ సకామయయ్యె. ఇవ్విధంబు చిత్తగించి ముకుం
దుండు గాందినీనందనున కిట్లనియె॥ 400

సీ॥ ఓదానపతివిను నుగ్రాంశుకారుణ్య, దత్తమౌనీస్యమంతకముదాల్చు।
నాతఁడుశుచియు నుద్యద్బ్రహ్మచర్యుండు, కావలెనారీతి గానివాఁడు।
ధరియించెనేనియుఁ దాననాశమునొందుఁ, గావుననిది తాల్ప నీవెతగుదు!
వరయరాముఁడు మదిరాస్వాదముఖభోగ, ములుమానలేఁడు నాకొలఁదిచూడ

గీ॥ షోడశసహస్రవనితల జోడువదల, నెన్నివిధముల మేము వహింపలేము।
మారుమాటాడవలదుమా మనవివినుము, సారమణిపూనులోకోపకారమునకు

వ॥ అనిన నగుంగాక యని యక్రూరుండు నిర్భయంబున మణికంఠపథంబు సంధరింప
తేజోవిరాజమానుండై వెలింగె॥ 40

గీ॥ జలజలోచన మిథ్యాభిశస్తిహరణ, మైనయీచరితమువిన్న యనఘమతికి।
జగతినెన్నఁడు మిథ్యాభిశస్తిలేదు, పాపహరమునునగు మునిప్రవరతిలక॥ 40

వ॥ అనమిత్రునకుశని, శనికి సత్యకుండు, సత్యకునకు సాత్యకి, కలిగె. అతండయ
యుధానుండును ననంబరఁగు. ఆ సాత్యకికిసంజయుండు. నతనికిఁగు కుణి, యు
నికి యుగంధరుడుగల్గిరి. వీరలు శైనేయులు, అనమిత్రుని యన్వయంబున
వృష్ణి, వృష్ణికి శ్వఫల్కుండు గలిగె. అతని ప్రభావంబు వింటివికదా! ఆశ్వ
ఫల్కునికిఁ గనిష్ఠభ్రాత చిత్రకుండు, శ్వఫల్కునివలన గాందినియందు నక్రూ
రుండు కలిగె. మఱియును పమద్గమృదామదవిశ్వారి మేజయ గిరిక్షత్రో
క్షత్ర శతఘ్నారి మర్దన ధర్మదృగ్ దృష్టధర్మగంధ మోజవాహ ప్రతివ
హాఖ్యులు పుత్త్రులు సుతారయను కన్యకయుంగలిగె. అక్రూరునకు వేదవంతు
డును, నుపవేదుండును నను నిద్దఱు పుత్త్రులుకలిగిరి. చిత్రకునకు పృథు విపృథ

ముఖ్యులు పుత్రులుగలిగిరి. అంధకునకుఁ గుకుర, భజమాన, శుచి, కంబల, బర్హిషాఖ్యులు నలుగురు గల్గిరి. కుకురునకు ధృష్టుఁడు డతనికిఁ గపోతరోముం డతనికి విలోముండు డతనికిఁ దుంబురుసఖుండైన యనుండు డనునకు నానకదుందుభి, డతనికి నభిజిత్తు, డతనికి బునర్వసుండు డతనికి నాహుకుండును, నాహుకియను కన్యయుం గలిగిరి. అయ్యాహుకునికి దేవకుండును నుగ్రసేనుండును గలిగిరి. దేవవదుపదేవ, సహదేవ దేవరక్షితాఖ్యులు నలుగురు పుత్రులు దేవకునకుం గలిగిరి. ఈనలుగురికిఁ వృకదేవ యుపదేవ, దేవరక్షిత, శ్రీదేవ, శాంతిదేవ, సహదేవ దేవకియను నేడ్వురుతోఁ బుట్టిన కన్యకలు. ఈ యేడ్వురను వసుదేవుండు పెండ్లియాడె. ఉగ్రసేనునికిఁ గంస, న్యగ్రోధ, సునామానక, శంకు, సుభూమి రాష్ట్రపాల, యుద్ధ, తుష్టిసుష్టిమత్సంజ్ఞులు పుత్రులు కలిగిరి. మఱియుఁ గంస, కంసవతి, సుతను, రాష్ట్రపాలికయను కన్యకలుం గలిగిరి. భజమానునికి విదూరథుండు, డతనికి శూరుండు, డతనికి శమి, యతనికిఁ బ్రతిక్షత్రుండు, డతనికి స్వయంభోజుండు, డతనికి హృదికుండు, డతనికిఁ గృతవర్మ, శతధను దేవార్హ దేవగర్భాదులు పుత్రులు గలిగిరి. దేవగర్భునకు శూరుండు, శూరునకు మారిషయను కాంతయందు వసుదేవాదులు పదుగురు పుత్రులు పుట్టిరి. అవ్వసుదేవుని జన్మకాలంబున భగవదంశావతారంబు నిరీక్షించి దేవతలు దివంబున నానకదుందుభులు మొఱయించిన వసుదేవునికి నానకదుందుభి నామంబుకలిగె. అవ్వసుదేవుని భ్రాతలు దేవభాగ, దేవశ్రవాష్టక కకుచ్చక్రవత్సధారక సృంజయ, శ్యామ, శమిక, గండూష సంజ్ఞులు తొమ్మండ్రుగలరు పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవ, రాజాధిదేవి యను నామంబులంగల కాంతలు వసుదేవాదులకుఁ దోఁబుట్టినవారు. శూరునకుఁ గుంతియను సఖుండు కలఁడు. అతం డపుత్రకుండై యుండ నిజపుత్రియైన పృథనతనికి విధిపూర్వకంబుగఁ బుత్త్రిఁగానిచ్చె ॥ 404

చ॥ భరితయశోవిశాలుఁడగు పాండునృపాలుఁడు పెండ్లియాడెభా
స్వరకమలేక్షణం బృథనవంధ్యత ధర్మమరున్మరుత్పతి
స్ఫురదతులప్రభావమునఁ బుట్టిరి ధర్మజ భీమఫల్గునుల్
వరగుణలాపృథాసతికి వారిజవైరికులప్రదీప్తులై ॥ 405

గీ॥ కన్యయగుచుఁదండ్రి కడనుండియాపృథా, వనితకమలబంధు వరమువలన ।
కర్ణుఁగనియెజగతిఁ గానీనుఁడననాతఁ, డధికకీర్తిశాలి యగుచుఁబరఁగ ॥ 406

క॥ ధవళాయతాక్షి యాపృథ, సవతికిమాద్రికి సురూపసంపన్నులుసం ।
భవిలిరినందను లిద్దఱు, నవినయులాశ్వినులు నకులసహదేవులనన్ ॥ 407

వ॥ శ్రుతదేవను, వృద్ధశర్మ యను కారూశుండు పెండ్లియాడె, అయ్యంగనయందు
దంతవక్త్రుండను మహాసురుండుపుట్టె. శ్రుతకీర్తిని కేకయరాజు పెండ్లియాడె,
అయ్యంగనయందు సంతర్దనాదులు కైకయులేవురు పుట్టిరి. రాజాధిదేవిని నవంతి
పతి పెండ్లియాడె, అయ్యంగన యందు విందానువిందు లననిద్దఱుపుట్టిరి. శ్రుత
శ్రవను చేదిపతియగు దమఘోషుండు పెండ్లియాడె, అయ్యంగనయందు శిశు
పాలుండు పుట్టె ॥ 408

సీ॥ ఆదిపూరుషుఁడొక్కఁడాది హిరణ్యాక, శిపునామదైత్యుఁడై విపులబుద్ధి ।
త్రైలోక్యజనులఁబరాభవింపఁగ రమా, ధిపుఁడు శ్రీనరసింహ దేహుఁడగుచు ।
విదళింపనమ్మనువిడిచి యపక్రప, రాక్రమ క్రముఁడుసర్వజగదధిక ।
సంపత్తిధుర్యశ్లాఘ్యుండునగురావ, ణాసురుండయి పుట్టివానవాది ॥

గీ॥ సురలఁబీడింప హరియుదాశరథియగుచు, తలలుద్రుంచిన దమఘోషధరణిపతికి ।
బుట్టిశిశుపాలుఁడై వానిఁబట్టిచంపె, చక్రిశ్రీకృష్ణుఁడై వాఁడుచనియెదివికి॥409

వ॥ భగవంతుండు ప్రసన్నుండై భక్తుని కభిలషితంబు లేవిధంబు నొసంగునవ్వి
ధంబున, నప్రసన్నుండయ్యును వధించి యభిలషితంబు లొసంగునని చెప్పి
శ్రీపరాశరునకు మైత్రేయుం డిట్లనియె ॥ 410

మ॥ అరవిందాక్షునిచే హిరణ్యకశిపుండై రావణుండై మహా
పురుషుంజావున భూమిఁజచ్చివిలసద్భోగముల్చెందిని
స్ఫురదృప్తిన్శిశుపాలుఁడై బుధజనిస్తుత్యారి ధారాహతిన్
త్వరసాయుజ్యము చెందెనంటిరిగదా ధర్మజ్ఞ చర్చింపఁగన్ ॥ 411

క॥ మునుపటిరెండు భవంబుల, వనజాక్షుఁడుచంపె నపుడువరసాయుజ్యం ।
బొనరక మూఁడవ భవమున, నొనరుటకిదియేమి హేతువ మునినాథా ॥ 412

వ॥ ఈ యర్థంబు సమర్థింప మీరెసమర్థులని ప్రార్థించిన శ్రీపరాశరుండు మైత్రే
యున కిట్లనియె ॥ 413

చ॥ పురుబలుఁడాహిరణ్యకశిపుండురణాంగణ భూమి శ్రీనృకే
సరినతిఘోరవిక్రమ విశంకటజంతువుగాఁ దలంచి భీ
కరుఁడుదశాస్యుఁడా హవముఖంబున రామునినొక్కమర్త్యుఁగా
గరిమఁదలంచి ముక్తినిధిఁగానక గాంచిరభీష్టభోగముల్ ॥ 414

వ॥ ఇట్లు హిరణ్యకశిపుండు శ్రీనరసింహదేవుని జంతుమాత్రంబుగాఁ దలంచిరావ
ణుండు రామచంద్రు మర్త్యుఁగాఁ దలంచి కామాతురుండై జానకీసమాసక్త
చిత్తుండై మృతింబొందిముక్తిచేరక హరిచేతఁజచ్చుట కారణంబుగా నవ్వా

హాత్తైశ్వర్య సంపన్నుండగు శిశుపాలుండై పుట్టి భగవన్నామంబులందు విరో
ధంబుచేసి యనేకజన్మ సంవర్ధిత విద్వేషానుబంధి చిత్తుండై వినిందనతర్జ
నాదులయందుఁ దన్నామంబు నుచ్చరించుచు ॥ 415

సీ॥ సజలజీమూతభాస్వర దేహునురువిభాలాలి తాజానుప్రలంబిబాహు ।
వలమానమకరకుండలకర్ణుఁ ద్రిజగతీకమనీయదివ్యశృంగారపూర్ణు ।
వైజయంతీసముజ్జ్వలవక్షు శరదాగమావదాతాంభోరుహాయతాక్షు ।
హేమకౌశేయసంహితకటీరు నుదారహీరకోటీరోరుతారహారు ॥

గీ॥ శంఖచక్రగదాహస్తు సకలలోక, సుప్రశస్తుని శ్రీకృష్ణుఁజూచిచైద్యుఁ ।
డనిశవైరానుబంధుఁడై యాత్మదలఁచి,చక్రమునఁద్రుంగిసాయుజ్యసరణిఁజెందె

వ॥ ఇత్తెఱంగు నీకుం జెప్పితి; వినుము॥ 417

గీ॥ పలుకఁదలపోయ వైరానుబంధకలనఁ, జలముగొనితూలనాడనే చందమైన ।
పుండరీకాక్షుఁడిచ్చు, నద్భుతవిముక్తి, భక్తులకునిచ్చునను చుఁజెప్పంగనేల ॥

వ॥ వసుదేవునకుఁ బౌరవీ, రోహిణీ, మదిరా, భద్రా, దేవకీ ప్రముఖులు బహు
భార్యలుకలరు. అందు రోహిణికి బలభద్ర, శఠసారణ, దుర్మదాదులు
పుత్త్రులు కలిగిరి. అందు బలదేవుండు రేవతియందు విశఠోల్ముకుల సుపుత్త్రుల
నిర్వురంగనియె. మఱియు సార్ష్టిమార్ష్టిశిశు సత్యసత్యధృతి ప్రముఖులు సారణ
పుత్త్రులు. భద్రాశ్వ, భద్రబాహు, దుర్గమ, భూతాదులు రోహిణీకుల
జాతులు. నందోపనందకృతకాదులు మదిరాపుత్త్రులు. ఉపనిధి, గదాదులు
భద్రాపుత్త్రులు. కౌశికుఁడు వైశాలీపుత్త్రుఁడు. దేవకీదేవికిఁ గీర్తిమత్సు
షేణోదాయు భద్రసేనఋజదాస భద్రదేవాఖ్యులార్వురు పుత్త్రులు పుట్టిరి.
వారలఁ గంసుఁడు చంపె. అనంతరంబ భగవత్ప్రహితయై యోగనిద్ర
యర్ధరాత్రంబున దేవకిసప్తమ గర్భంబుఁగొనివచ్చి రోహిణిజఠరంబునం
బెట్టిన బలభద్రుండు పుట్టి గర్భసంకర్షణంబున సంకర్షణుండనంబరఁగె. అనం 419
తరంబ ॥

సీ॥ స్థావరజంగమాత్మక జగత్తరుమూల మసమవేదాంతవేద్యాభిధాన ।
మమలయోగీంద్ర చిత్తాంభోజవాస్తవ్య, మనుపమానంద కందాలవాల ।
మఖిలసురాసురాభ్యర్చితాంఘ్రిసరోజ, మవితర్క్యనిబిడమాయానిధాన ।
మాశ్రితశ్రమపరిహారిభూరి మహీధ్ర మసురాంధతమస బాలార్కబింబ ॥

గీ॥ మాద్యమవ్యాసుదేవాఖ్యమైనబ్రహ్మ, మజుఁడుప్రార్థింప భూమిభారాపహార 420
మాచరింపంగ నవతారమయ్యె దేవ,కీవధూటికి శ్రీకృష్ణదేవుఁడనఁగ ॥

చ॥ హరిమహితప్రభావ మహిమాతివివర్ధితయోగనిద్రసుం,
దరసుగుణాభిరామయగు నందవధూమణికుక్షిఁ బుట్టిన ।
త్త్రతతిగ్రహతారకాళి, విశదస్థితిఁ బొల్చె, నపేతభీతినై,
పరఁగె జగంబు ధర్మమయపద్ధతివర్తిజనానుభావ్యమై॥ 421

గీ॥ భూమిభారంబు వారింప భూతలమున, నవతరించినఁ బుండరీకాక్షునకును ।
భూరిశృంగారవతులు పదాఱువేలు, నూటనొక్కరు భార్యలై నారునమ్ము॥

వ॥ ఇందు రుక్మిణీ సత్యభామాజాంబవతీ ప్రముఖలెనమండ్రు పట్టమహిషులైరి. అనాదినిధనుండైనహరి యక్కాంతలయందు నెనుబదిలక్షల పుత్రులం గనియె, వారిలోఁ బ్రద్యుమ్న, చారుధేష్ణ, సాంబాదులు పదుముగ్గురు శ్రేష్ఠులు, అందు. 423

గీ॥ ఘనుఁడు ప్రద్యుమ్నుఁ డధిక విఖ్యాతిమేన, మామరుక్మితనూభవ మహితసద్వి ।
నయకుముద్వతియనెడు కన్యాలలామఁ, బ్రేమదళుకొత్తఁగా వేడ్కఁ బెండ్లియాడ

వ॥ వారలకు ననిరుద్ధుండు పుట్టె. ఈయనిరుద్ధుండు రుక్మిపౌత్రి సుభద్రం బెండ్లియాడె. వారికి వజ్రుండు వజ్రునకుఁ బ్రతిబాహుండు పుట్టె. ప్రతిబాహునకు సుచారుండు గలిగె. ఇట్లనేక పురుషసంఖ్యగల యదుకులంబు పుత్త్రసంఖ్య వర్షశతంబులకైన లెక్కింపశక్యంబుగాదు. అక్కుమారవర్గంబులకు విద్యలఁ గఱపు గురువులు మూఁడు కోట్ల యెనుబది యెనిమిదిలక్షలు దేవాసుర యుద్ధంబున హతులైనమహాబలులగు దైతేయులు మనుజలోకంబునం బుట్టి జనోపద్రవకారులై యుండ వారలవధించి భూభారంబుఁ బాపుటకై భగవంతుండగు హరి యదుకులంబు ననవతరించి ముఖ్యంబైన యదుకుల శతంబునకుఁ బ్రభువై యుండె. ఇట్లు యాదవులు వృద్ధిం బొందిరి. ఈయాదవ సంపత్తి విన్నవారు పాపంబులం బాయుదురని చెప్పి శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె॥

క॥ యదువంశం బెఱిఁగించితి, ఁబదపడి దుర్వసుని వంశపద్ధతి నీకున్ ।
విదితంబుగ నెఱిఁగించెద, హృదయంబేకాగ్రవృత్తి నెసఁగఁ గవినుమా॥ 426

వ॥ తుర్వసునకు వహ్ని, వహ్నికి భార్గుండు, భార్గునకు భానుండు, భానునకుఁగ్గరందముండు, కరందమునకు మరుత్తుండు పుట్టె. అతం డనపత్యుండై పౌరవుండైన దుష్యంతుని బుత్త్రునింగాఁ గల్పించుకొనియె, ఇట్లు యయాతిశాపంబున దుర్వసువంశంబు పౌరవవంశంబు నాశ్రయించె, ద్రుహ్యునికి బభ్రువు నతనికి సేతువును గల్గిరి. సేతువునకారబ్ధుండు, నతనికి గాంధారుండు, నతనికి ధర్ముండు, నతనికి ఘృతుండు, ఘృతునకు దుర్దముండు, నతనికిఁ బ్రచేతుండు, నత

ర్ముండుపుట్టె నతఁడు ధర్మబహుళులైన యుదీచ్య మ్లేచ్ఛులకు
ని చెప్పి శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె ॥ 427

యయాతికిఁ గలఁ, డనుఁడను నాలవకుమారుఁడతనికిఁ బుత్రుల్ ।
ష్కలు ముువ్వురు, సునిశితబుద్ధి ప్రణుతులు శూరాగ్రసరుల్ ॥

నల చక్షుఃపరమేషు సంజ్ఞులు. అందు సభానలునకుఁ గాలానలుండు
సృంజయుండు నతనికిఁ బురంజయుండు నతనికి జనమేజ
తనికి మహాశాలుండు నతనికి మహామనుండు నతనికి నుశీనర,
నిరువురు పుత్రులుపుట్టిరి. ఉశీనరునకు శిబి, నృగ, నవ, కృమి,
లైదుగురు పుత్రులు గలిగిరి. అందు శిబికి వృషదర్భ, సువీర,
ద్రకులు నల్వురు పుత్త్రులు గలిగిరి. తితిక్షునకుఁ రుశద్రథుండు
యుండు హేమునకు సుతపుండు నతనికి బలిపుట్టిరి. అతని క్షేత్ర
ర్ఘతమసాంగ, వంగ, కళింగ, సుహ్మ, పౌండ్రాఖ్యం బైనబాలే
లంబుపుట్టె. తన్నామ సంతతి సంజ్ఞలంగలిగి యైదు విషయంబులు
లయ్యె. అంగునకు ననపానుండు నతనికి దివిరథుండు నతనికి ధర్మ
తనికిఁ జిత్రరథుండు గలిగెనతండు రోమపాదసంజ్ఞంబరఁగు. అనప
యారోమపాదునకె కదా యజపుత్రుండైన దశరథుండు శాంతయను
హాతుంగా నిచ్చె. రోమపాదునకుఁ దురంగుండు తురంగునకుఁబృథు
నతనికిఁ జంపుండుగలిగె. అతఁడు చంపనామనగరంబు నిర్మించె.
హర్యంగుండు. హర్యంగునకు భద్రరథుండు నతనికి బృహద్ర
నతనికి బృహత్కర్మండు బృహత్కర్మనకు బృహద్భానుండు నత
న్మనుండు నతనికి జయద్రథుండు జయద్రథునకు విజయుండు
ధృతి ధృతికి ధృతవ్రతుండు నతనికి సత్యకర్మ సత్యకర్మనకు
పుట్టె. అయ్యతిరథుండుకదా గంగకువచ్చి మందసంబులోఁ దేలి
థాపవిద్ధునిఁ గర్ణ నామధేయుఁ బుత్రునిగాఁ గైకొనియె. కర్ణునకు
డు గలిగె. వీరలంగపతులు. పూరునివంశంబు వినుము. 429

గల్గెఁ బుత్రుఁడు, ధీరుఁడు జనమేజయుం డు దీర్ణత, నతఁడ ।
లీలఁగాంచెన్, శ్రీరాజితగుణగణుని బ్రచిన్వంతు సుతున్ ॥ 430

తునకుఁ బ్రవీరుండు, ప్రవీరునకు మనస్యుండు, మనస్యునకుఁ
డు వానికి సుద్యుండు నతనికి బహుగతుండు, బహుగతునకు
సంయాతికి నహంయాతి, యహంయాతికి రౌద్రాశ్వుండు,
నకు, ఋతేషు ప్రముఖులు పదుండ్రుపుత్త్రులు గలిగిరి. అందుఋతే

షునకు సంతినారుండు సంతినారునకు సుమిత్య ప్రతిరథ ధ్రువులనఁ ముగ్గురు కొడుకులు గలిగిరందు అప్రతిరథునకుఁ గణ్వుండు కణ్వునకు మేధాతిథిగల్గిరి. ఆతనివలనఁ గణ్వాయనులగు ద్విజులు గల్గిరి. అప్రతిరథునకు మఱియు నైలీనుఁడను పుత్రుండు గలిగె. అతనికి దుష్యంతాదులు నలుగురు పుత్త్రులు కలిగిరందు దుష్యంతుండు ముఖ్యుండయ్యె॥ 431

శా॥ ఆదుష్యంతధరాతలాధిపతి కుద్యద్బాహుశౌర్యోజ్జ్వల,
శ్రీదుర్వారుఁడఖర్వగర్వ రిపురాజిభ్రాజి తత్త్వాధర।
హ్రాదిన్యాభుఁడు సంభవించె భరతుండాశాంతదంతావళ,
ప్రోద్యద్గ్ర శ్రుతిమూలచామరిత విస్ఫూర్జద్య శోభారుఁడై॥ 432

వ॥ ఆభరతునకు ముగ్గురుభార్యలయందుఁ దొమ్మండ్రు పుత్త్రులు గలిగిన భరతుండుచూచి యిప్పుత్త్రులు నాకుం దగిన వారు కారనిన వారితల్లులు నిజపరిత్యాగభయంబునఁ బుత్త్రులంజంపిరి. ఇట్లు పుత్త్రజన్మంబు వితథంబైనఁ బుత్త్రార్థియై భరతుండు మరుత్తులఁ గూర్చి యాగంబుచేసిన బృహస్పతితేజంబుననుతద్భ్రాతృపత్నియైన మమతయందుఁబుట్టిన భరద్వాజుని మరుత్తులను గ్రహించిరి. ఆభరతునకుఁ దొల్లి పుత్త్రజన్మంబు వితథంబగుటం జేసి వితథుండను నామాంతరంబు గలిగె. అవ్వితథునకు మన్యుండు, మన్యునకు బృహత్క్షత్ర, మహావీర్య, నగర గర్గులన నలువురు పుత్త్రులుగలిగిరి. అందునగరునకు సంకృతి, సంకృతికి గురుప్రీతి రంతిదేవులు గలిగిరి. గర్గునకు శిని, యతనికి శైన్యులను క్షత్త్రోపేతులైన ద్విజులుకలిగిరి. మహావీర్యునకు దురుక్షయుండు నతనికిఁ ద్రయ్యారుణి పుష్కరిణ కపులను యనుపుత్త్రత్రయంబుగల్గి విప్రత్వంబు నొందె. బృహత్క్షత్రునకు సుహోత్రుండు నతనికిహస్తి, కలిగెను. అతండు హస్తినాపురంబు నిర్మించె. ఆహస్తికి నజామీఢ, ద్విజమీఢ, పురుమీఢులన ముగ్గురునందనులు గల్గిరి. అందజామీఢునకుఁ గణ్వుండు నతనికి మేధాతిథి గల్గెను. ఆతనివలన గణ్వాయన నాములైన ద్విజులుపుట్టిరి. అజామీఢునకు మఱియును బృహదిషుండను పుత్త్రుండు గలిగె. అతనికి బృహద్ధనుండు నతనికి బృహత్కర్మ, యతనికి జయద్రథుండు నతనికి విశ్వజిత్తు నతనికి సేనజిత్తు నతనికి రుచిరాశ్వ, కాశ్య, దృఢహనువత్స హనుసంజ్ఞులు గలిగిరి. అందు రుచిరాశ్వునకుఁ బృథుసేనుండు నతనికిఁ బారుండు నతనికి నీలుండు అతనికి నూర్గురుపుత్త్రులుగల్గిరి. అందుఁ బ్రధానుండు కాంపిల్యాధిపతియైన సమరుండు. సమరునకుఁ బార, సుపార, సదశ్వులను ముగ్గురు పుత్త్రులు గలిగిరి. అందు సుపారునకుఁ బృథుండు, పృథునకుసుకృతి, సుకృతికి విభ్రాజుండు, విభ్రాజునకు ననుహుండు పుట్టెరి. అతండు శుకునిపుత్త్రికయగు కృత్విని బెండ్లి

యూడె. అయ్యనుహన్నునకు బృహదత్తుండు నతనికి విష్వక్సేనుండు నతనికి సుడక్సేనుండు నతనికి భల్లాభుండుకలిగె. ద్విమీఢునకు యవీనరుండు నతనికి ధృతిమంతుండు నతనికి సత్యధృతి యతనికి దృఢనేమి యతనికి సుపార్శ్వుండు నతనికి సుమతి యతనికి సన్నతిమంతుండు నతనికిఁ గృతుండు కలిగె. ఆకృతునకు హిరణ్యనాభుండు యోగంబునేర్పెను. ఆకృతుండు చతుర్వింశతి సామసంహితలుచేసె. అట్టికృతునకు నుగ్రాయుధుండు గలిగె. అతండు నీపక్షత్త్రియక్షయంబుచేసె. అయుగ్రాయుధునకు క్షేమ్యుండు నతనికి సుధీరుండు నతనికిఁ రిపుంజయుండు నతనికి బహురథుండు కలిగె. వీరలుపౌరవులు. అజామీఢునకు నళినియనుపత్నియందు నీలుండను పుత్త్రుండుగలిగె, అతనికిశాంతి, శాంతికి సుశాంతి, సుశాంతికిఁ బురంజయుండు నతనికి ఋక్షుండు నతనికి హర్యశ్వుండు నతనికి ముద్గలిస్సృంజయ బృహదిషు యవీనరకాంపిల్యులు గలిగిరి. వీరలీపంచవిషయంబులు రక్షింపసమర్థులని పితృదత్తనామంబున పాంచాలసంజ్ఞంబొందిరి. ముద్గలునకు, మౌద్గల్యులన, క్షత్త్రోపేతులైన ద్విజులుగలిగిరి. ముద్గలునకు హర్యశ్వుండు నతనికి దివోదాసుండును, నహల్యయుసన మిధునంబుపుట్టె, ఆయహల్యను గౌతముండు వరించె. ఆయహల్యయందు గౌతముండు శతానందుంగనియె. శతానందునకు ధనుర్వేదపారగుండైన సత్యధృతి గలిగెను॥

సీ॥ పేవాభుఁగుసత్యధృతియొక్క నాఁడప్సు, రస్త్రీవిశిష్టయైన నుర్వశి నిజాగ్ర ।
ధరఁజూచినపుడ రేతః పాతమయ్యె న త్తేజంబురెల్లు పైఁబెట్టు గట్టి ।
రెండుభాగములై పరి స్ఫుటంబుగఁ గన్య, కయుఁగుమారుండునై రయనియుక్తి ।
కురుపతిశంతను క్షోణీశ్వరుఁడువెంట వచ్చియా శిశువులవంకఁజూచి ॥

గీ॥ కృపకతంబునవారికిఁ గృపియుఁ గృపుఁడు ననుచుఁబేరిడిముద మునఁబెనిచెనందుఁ।
గృపిని ద్రోణుండువరియించి పృథుభుజాచ, లాభిశోభితుఁబుత్త్ర కునధిపుఁగాంచి॥

వ॥ అశ్వత్థామయను పేరిడియె, దివోదాసునకు మిత్త్రాయువు మిత్త్రాయువునకుఁ జ్యవనుండు, చ్యవనునకు సుదాసుండు సుదాసునకు సౌదాసుండు, సౌదాసునకు సహదేవుండు, సహదేవునకు సోమకుండు, సోమకునకు జంతుండు పుత్త్ర శతజ్యేష్ఠుండై పుట్టె. వారలలోఁ గనిష్ఠుండు పృషతుండు. పృషతునకు ద్రుపదుండు, ద్రుపదునకు ధృష్టద్యుమ్నుండు, ధృష్టద్యుమ్నునకుధృష్టకేతుండుపుట్టె. అజామీఢునకు మఱియును ఋక్షనామకుండు పుత్త్రుండు గలిగె. ఋక్షునకు సంవరణుండు, సంవరణునకుఁ గురువుకలిగె. అతండ కదా తనపేరఁ గురుక్షేత్త్రంబుచేసె. కురువునకు సుధనుర్జహ్నుపరీక్షిత్ప్రముఖులు గలిగిరి. సుధనువునకు సుహోత్త్రుండు నతనికిఁ జ్యవనుండు నతనికిఁ గృతకుండు నతనికుపరి

చరవసువు నతనికి బృహద్రథ, ప్రత్యగ్ర, కుశాంబ, కుచేలమాత్స్య ప్రముఖు లేడ్వురు గలిగిరి. బృహద్రథునకుఁ గుశాగ్రుండు నతనికి వృషభుండు నతనికిఁ బుష్పవంతుండు నతనికి సత్యహితుండు నతనికి సుధన్వుండు నతనికి జతుండుగలిగె. మఱియు బృహద్రథునకుఁ గుమార శకలద్వయంబు పుట్టె. అది జరచేత సంధింపం బడుటం జేసి జరాసంధుండనఁ బుత్రుండు గలిగె. అతనికి సహదేవుండు నతనికి సోమపుండు నతనికి శ్రుతిశ్రవుండు, కలిగె. వీరలు మాగధులను భూపాలురైరని చెప్పి శ్రీ పరాశరుండు మైత్రేయున కిట్లనియె ॥ 435

క॥ వినుము మునీంద్ర ! పరీక్షి, జ్జననాథునకాత్మజులు విశాలయశస్కుల్ ।
జనియించిరి నలువురు, తద్ఘనచరితమునీకుఁ జెప్పెదం బరిపాటిన్ ॥ 426

వ॥ పరీక్షితునకు జనమేజయ శ్రుతసేనోగ్రసేన, భీమసేనులు నల్వురుపుత్రులు కలిగిరి. జహ్నునకు సురథుండు సురథునకు విదూరథుండు, విదూరథునకు సార్వభౌముండు, సార్వభౌమునకు జయత్సేనుండు, జయత్సేనునకు నారాధితుండు, నారాధితునకయుతాయువు, నయుతాయువునకు నక్రోధనుండు నక్రోధనునకు దేవాతిథి, దేవాతిథికి ఋక్షుండు, ఋక్షునకు భీమసేనుండు, భీమసేనునకు దిలీపుండు నతనికిఁ బ్రతీపుండు, ప్రతీపునకు దేవాపి, శంతను, బాహ్లీకులు ముగ్గురు పుత్రులు పుట్టిరి. అందు దేవాపి కొండుకనా డరణ్యంబు ప్రవేశించిన శంతనుండు రాజయ్యె వినుము ॥ 437

క॥ శంతనుఁ డశేషశాత్రవ, కృంతనుఁడై జలధివృత నిఖిలభూవలయా ।
క్రాంతిమహనీయతర వి, క్రాంతి విభాసితుఁడు వెలసె రవి చందమునన్ ॥438

గీ॥ చేతనంటినవృద్ధుండు చిఱుతవయసు, నొందిమహనీయశాంతిఁ బెంపొందుకతన ।
శంతనుండనితనుజనుల్ సన్నుతింప, వెలసెఁగొనియాడదరమె యవ్విభునిమహిమ ॥

వ॥ ఇట్లు రాజ్యంబేలుచున్నంత ॥ 440

ఉ॥ శంతనుఁడేలు దేశము ప్రజల్ బెగడొందఁగ వృష్టిమాన్చె జం,
భాంతకుఁ డద్భుతంబొదవ నబ్దములాఱును నాఱునమ్మహీ ।
కాంతుఁడునంత విప్రతతిఁగన్గొని నాయపరాధ మేమి దు,
ర్దాంతనితాంతలోక భయద ప్రళయావహ వృష్టిహానికిన్ ॥ 441

క॥ అని తము నడిగిన యాశం, తనుఁగనుగొని విప్రవరులు,నరనాయక! యీ ।
యనుపమితావగ్రహ మిట్లొనరుటకుంగలదు, హేతువొక్కటివినుమా ॥ 44?

గీ॥ అన్న దేవాపియాది రాజ్యార్హుఁడుండ, నీవు మేదిని యేలుచున్నావు ... భవనినాయక ! పరివేత్తవైతి వేత, దఘముకతన ననావృష్టి ... 443

వ॥ అనిన, శంతనుండింక నేనేమి చేయవలయుననిన ... వేద పతనాది దోషములచేత నభిభూతుండు గాకయు ... రాజ్యంబునకు నతండర్హుండతనికి రాజ్యంబీయవలయు ... మంత్రి ప్రవరుం డరణ్యంబునకుంబోయి తపస్వుల ... లంగాఁ బ్రయోగించిన వారిచేత దేవాపి ఋజుమతి ... భ్రంశంబునొంది వేదవాదంబులు దూషించి ... ణులు శంతను పాలికింజని యిట్లనిరి ॥ 444

గీ॥ దమ్మునృపవరయింత నిర్బంధమేల, శాంతమయ్యె నవగ్రహాక్రాంతిదోష ! మితరమింక నేల దేవాపి పతితుఁడయ్యె, వేదవేదంబు దూషించుకారణమున 445

వ॥ అన్న, పతితుండైనఁ దమ్మునికిఁ బరివేత్తృత్వంబు లేదు, దమ్మునిపిలిచిన శంతనుండు పురంబునకు వచ్చి రాజ్యంబుచేసె. దేవాపి పతితుండైనఁ బర్జన్యుండు ... అఖిలధరా మండలంబున సస్యసంపదలువొదివె. బాహ్లీకునకు సోమదత్తుండు సోమదత్తునకు భూరి భూరిశ్రవశ్శల్య సంజ్ఞలుగల పుత్రత్రయంబు గలిగె. శంతనునకు జాహ్నవియందు నుదారకీర్తియు నశేషశాస్త్రార్థ వేదియునైన భీష్ముండు గలిగె. ఆశంతనునకే సత్యవతియందు చిత్రాంగదవిచిత్ర వీర్యులను నిద్దఱు పుత్రులుగలిగిరి. అందుఁ జిత్రాంగదుండు బాలత్వంబునన చిత్రాంగ దుండను గంధర్వునితోఁ బోరి తెగిన విచిత్రవీర్యుఁడు రాజై కాశిరాజదుహి తల, నంబి కాంబాలికలం బెండ్లియాడి నిరంతరరతదుపభోగంబున రాజయక్ష్మ గృహీతుండై యస్తమించిన సత్యవతీదేవి తత్పుత్రుండైన కృష్ణద్వైపాయను నియోగించిన మాతృవచనంబు పాటించి విచిత్రవీర్య క్షేత్రంబుల ధృతరాష్ట్ర పాండులను, దత్పరిచారికయందు విదురునిం గనియె. ధృతరాష్ట్రుండును దుర్యో ధనదుశ్శాసన ప్రధానంబైన పుత్రశతంబుం గనియె. పాండుండును నరణ్యం బున మృగశాపోపహత ప్రజననసామర్థ్యుండై, ధర్మ, వాయు, శక్రులవలనఁ గుంతియందు యుధిష్ఠిరభీమసేనార్జునులం గనియె. అశ్వినులవలన మాద్రి యందునకుల సహదేవులం గనియె. ఇట్లు పాండవులేవురైరి. వారలకు ద్రౌపది యందు, గ్రమంబునఁ బ్రతివింధ్య, శ్రుతసేన, శ్రుతకీర్తి, శ్రుతానీక శ్రుత కర్ములనం గలిగిరి. మఱియును యుధిష్ఠిరుండు యౌధేయియను కాంతయందు దేవకుండను పుత్రుంగనియె. భీమసేనుండు హిడింబయందు ఘటోత్కచుఁ గనియె. మఱియు భీమసేనుండు కాశియను కాంతవలన సర్వగుండను పుత్రునింబడసె. సహదేవుండు విజయయందు సుహోత్రునింగనియె. నకు

లుండు రేణుమతి యందు నిరమిత్రునింగనియె. అర్జునుండులూపియను నాగకన్యకయందు నిలావంతుండను పుత్రునింగనియె. మఱియు నర్జునుండు మణిపూరపతి పుత్రియైన చిత్రాంగదయందుఁ బుత్రికాధర్మంబున బభ్రువాహనునం గనియె, సుభద్రయందు బాలుండయ్యును నతిబలపరాక్రమ సమస్తాతిరథ విజేతయైన యభిమన్యునిం గనియె ॥ 446

క॥ ఉత్తర పెండిలియైయాఁ, కోత్తరుఁడభిమన్యుఁడు రుగుణోజ్వలుధరణీ।
భృత్తిలకాయితుఁ గరుణా, యత్తుఁపరిక్షిత్తుఁగనియె నద్భుతచరితుఁ ॥ 447

వ॥ అప్పరిక్షితుండు తల్లిగర్భంబున నున్న యప్పుడశ్వత్థామ యపాండవంబుగా దివ్యాస్త్రంబు ప్రయోగించినఁ జరాచరగురుండగు హరికరుణించి రక్షించె, కులంబు క్షీణించు తఱింబుట్టుటంజేసి పరిక్షిన్నామం బితనికింగలిగె. అప్పరిక్షితుం డిప్పుడు ధర్మక్రమంబున భూమండలం బేలుచున్నాఁడని శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె ॥ 448

క॥ భరితవివేక భవిష్య, న్నరపాలురవినుము సజ్జనస్తవనీయా।
త్తరకీర్తికా ముదీవృత, ధరణీకకుబంతరుల సుధాకరనిభులన్ ॥ 449

వ॥ ఇప్పుడు భూమండలంబేలు పరిక్షిత్తునకు జనమేజయ, శ్రుతసేనో, గ్రసేన, భీమసేనులన నలువురు పుత్త్రులు పుట్టెదరు. అందు జనమేజయునకు శతానీకుండు పుట్టును ఆ జయనమేజయుండు యాజ్ఞవల్క్యునివద్ద వేదంబుచదివి కృపుని వలన దివ్యాస్త్రంబులు వడసి విషయవిరక్తచిత్తుండై శౌనకోపదేశంబున నాత్మవిజ్ఞాన ప్రవీణుండై పరమ నిర్వాణంబునొందఁగలండు. శతానీకునకు నశ్వమేధ దత్తుండు నతనికి నధిసీమ కృష్ణుండు, నతనికి, నిచక్నుండు పుట్టును. అతఁడు హస్తిపురము గంగాపహృతము కాఁగాఁగౌశాంబియందు నివసింపఁ గలండు. అతనికినుష్ణుండు, నతనికి విచిత్రరథుండు నాతనికి శుచిరథుండు నతనికి వృష్ణిమంతుండు నతనికిసుషేణుండు నతనికి సునీథుండు నతనికి నృపచక్షుండు నతనికి సుఖబలుండు నతనికిఁ బరిప్లవుండు నతనికి సునయుండు నతనికి మేధావియు నతనికి రిపుంజయుండు నతనికి మృదువుండు నతనికిఁ దిగ్మండు నతనికి బృహద్రథుండు నతనికి వసుదానుండు నతనికి శతానీకుండు నతని కుదయనుండు నతనికి విహీనరుండు నతనికి దండపాణి, యతనికి నిమిత్తుండు నతనికి క్షేమకుండునుగలుగం గలరు. ఇట్లు బ్రహ్మక్షత్ర కారణంబును, దేవర్షి సత్కృతంబును నైన సోమవంశంబు క్షేమకుని నుండి నాశంబు నొందంగల దని చెప్పి శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె ॥ 450

॥ వరతపోధన యిక్ష్వాకువంశ్యులైన, భావిభూతలపతుల నేర్పఱుతువినుము ।
చటుల భారత రణమహీస్థలిని శాత, బాణహతుఁడయ్యె నాబృహద్బలుఁడు ఘనుఁడు॥

॥ ఆబృహద్బలునికి బృహత్క్షణుండు నతనికి నురుక్షయుండు నతనికి వత్సవ్యూహుండు నతనికిఁ బ్రతివ్యోముఁడు నతనికిఁ దివాకరుండు నతనికి సహదేవుండు నతనికి బృహదశ్వుండు నతనికి భానురథుండు నతనికిఁ బ్రతీతాశ్వుండు నతనికి సుప్రతీకుండు నతనికి మరుదేవుండు నతనికి సునక్షత్రుండు నతనికిఁ గిన్నరుండు నతనికి నంతరిక్షుండు నతనికి సుపర్ణుండు, నతనికమిత్రజిత్తు నతనికి బృహద్భ్రాజుండు నతనికిధర్మి, యతనికిఁ గృతంజయుండు నతనికి రణంజయుండు నతనికి సంజయుండు నతనికి శాక్యుండు, నతనికి శుద్ధోదనుండు నతనికి రాహులుండు నతనికిఁ బ్రసేనజిత్తు నతనికి క్షుద్రకుండు నతనికిఁ గుండకుండు నతనికి సురథుండు నతనికి సుమిత్త్రుండును గలిగెదరు॥ 452

గీ॥ పరమసువ్రత యిక్ష్వాకు వంశమవని, కలియుగమున, సుమిత్త్రుండుకడపలగను
నాశమొందెడు మగధ భూనాథవంశ, భావిభూతలపతుల నేర్పఱుతువినుము ॥

వ॥ మాగధవంశప్రభుండగు జరాసంధునకు సహదేవుండు, సహదేవునకుసోమాపి, సోమాపికి శ్రుతశ్రవుండు, శ్రుతశ్రవునకయుతాయువు, నయుతాయువునకు నిరమిత్త్రుండు, నిరమిత్త్రునకు సునేత్త్రుండు, సునేత్త్రునకు బృహత్కర్ముండు, బృహత్కర్మునకు సేనజిత్తు, సేనజితునకు శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు, విప్రునకు శుచి, శుచికి క్షేమ్యుండు క్షేమ్యునకు సువ్రతుండు, సువ్రతునకు ధర్మ్ముండు, ధర్మ్మునకు సుశ్రవుండు, సుశ్రవునకు దృఢసేనుండు, దృఢసేనునకు సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకుసత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకు రిపుంజయుండును బుట్టఁగలరు. వీరలు బార్హద్రథులు; రాజులై వెయ్యేండ్లు భూపాలనంబు చేయంగలరు. ఆరిపుంజయుని యమాత్యుండు మునికుండనువాఁడు స్వామియైన రిపుంజయునిం జంపి ప్రద్యోతుండను తనపుత్త్రునింబట్టంబు కట్టంగలండు. ఆ ప్రద్యోతునకు బలాకుండను పుత్త్రుండు గలుగు, వానికి విశాఖయూపుండు, వానికి జనకుండు, వానికి నందివర్ధనుండు, వానికి నందియుఁ గలుగుదురు. ఈ ప్రద్యోతవంశ్యులు నూటముప్పదియాఱేండ్లు భూమి పాలింతురు. తదనంతరంబ శిశునాభుండు, వానికిఁ గాకవర్ణుండు, వానికి క్షేమధర్మ్ముండు, వానికి క్షత్రౌజుండు, వానికి విధిసారుండు వానికి నజాతశత్త్రుండు, వానికి నర్భకుండు, వానికుదయనుండు, వానికి నందివర్ధనుండు, వానికి మహానంది, పుట్టెదరు. వీరు శిశునాభ వంశంబు భూపాలకులు. మున్నూట యిరువదాఱేండ్లు భూమిపాలించెదరు. అంత॥ 454

గీ॥ మునివరేణ్య మహాపద్ముఁడ నెడురాజు, ధరణియేకాత పత్రమైతనరుచుండఁ
దనదుశాసనమొరులకు దాఁటరాక, యుండఁబాలించుసత్క్షత్రులుప్పతిల్లి ॥ 4౬

వ॥ ఆమహాపద్మునకు సుమాల్యాదు లెనమండ్రు పుత్రులుపుట్టి నూఱేండ్లు భూమండలం బేలెదరు. తొమ్మండ్రు నందులను గౌటిల్యుండను బ్రాహ్మణుం సముద్ధరింపంగలండు. వారుపోయిన పిమ్మట మౌర్యులుపృథివి యనుభవింప గలరు. ఆకౌటిల్యుండు, చంద్రగుప్తునికి రాజ్యంబునకుఁ బట్టంబుఁ గట్ట గలండు, చంద్రగుప్తునకు బిందుసారుండు, నతనికి నశోకవర్ధనుండు, నతని సుయశుండు, నతనికిదశరథుండు, నతనికిసంయుతుండు, నతనికిశాలి శూకుండు నతనికి సోమశర్మ్మండు, నతనికి శతధన్వుండు, నతనికి బృహద్రథుండును గలిగెదరు, ఇట్టి మౌర్యులు పదుండ్రును నూటముప్పదేడు సంవత్సరంబుఁ భూమి యనుభవించెదరు. తదనంతరంబ శుంగులు భూమి యను భవించెదరు పుష్యమిత్రుని సేనాపతి స్వామింజంపి రాజ్యంబుచేయఁ గలఁడు. అతనికి నగ్నిమిత్రుండు, నతనికి సుజ్యేష్ఠుండు, నతనికి వసుమిత్రుండు, నతనికి నుదంకుండు నతనికిఁ బుళిందకుండు, నతనికి ఘోషవసుండు, నతనికి వజ్రమిత్రుండు, నతనికి భాగతుండు, నతనికి దేవభూతియుం గలిగెదరు. వీరు పదుపురు శుంగులుఁ నూటపండ్రెండేండ్లు భూమి ననుభవింపంగలరు. అంతట నిప్పసుంధరకణ్వు పాలుకాఁగలదు. శుంగ రాజైన దేవభూతి వ్యసనియై యుండ నతని యమాత్యుండు కణ్వ వసుదేవనామకుండు, నిజస్వామియైన దేవభూతిం జంపి యవని యనుభవింపఁగలఁడు. అతనికి భూమిమిత్రుండు, నతనికి నారాయణుండు నతనికి సుశర్మ్మండునుం గలిగెదరు. ఈ కాణ్వాయనులు నలువురును నలువదేనేండ్లు భూమి ననుభవింపంగలరు. ఆసుశర్మ్మని దద్భృత్యుండు నాంధ్రజాతీయుండు బలిరపుచ్ఛక నాముండు చంపి వసుధ యనుభవింప గలఁడు. తదనంతరం బాతని భ్రాత కృష్ణ నామధేయుండు రాజుకాఁగలఁడు అతనికి శ్రీశాతకర్ణి, యతనికిఁ బూర్ణోత్సంగుండు, నతనికి శాతకర్ణి, యతని లంబోదరుండు నతనికి పిలకుండు నతనికి మేఘస్వాతి, యతనికిఁ బటుమంతుండు, నతనికి నరిష్టకర్మ్మండు నతనికి హాలాహలుండు, నతనికిఁ బలలకుండు నతనికిఁ బుళిందసేనుండు, నతనికి సుందరుండు నతనికి శాతకర్ణి, యతనికి శివస్వాతి యతనికి గోమతిపుత్రుండు, నతనికి నలిమతుండు, నతనికి శాంతకర్ణి, యతనికి శివశ్రితుండు నతనికి శిరస్కంధుండు నతనికి యజ్ఞశ్రీయు నతనికి ద్వియజ్ఞుండు, నతనికిఁ జంద్రశ్రీయు నతనికిఁ పులమాపియునుఁ గలిగెదరు. వీరు నన్నూట యేఁబదియాఱేండ్లు భూమి యనుభవింపం గలరు ఆంధ్రభృత్యులేడ్వురును ఆభీరులు పదుండ్రును, గర్దభులును భూభుజులుగా

అనంతరంబ యెనమండ్రు యవనులు, పదునలుగురు తురుష్కారులు గ్గురు ముండీలు పదునొకండ్రు మానులునను వీరిందఱు వెయ్యి ట తొంబదేండ్లు భూమి యనుభవించెదరు. వీరు పోయిన కైంకిలు యవనులు నమూర్ధాభిషిక్తులు భూపతులు కాఁగలరు. వారలకు క్తి. వింధ్యశక్తికిఁ బురంజయుండు వానికి రామచంద్రుండు నత ండు నతనికి వంగుండు నతనికి నందనుండు నతనికి సునంది పుట్టెదరు. తయగునంది యశుండు శుక్రుండుప్రవీరుండును వీరుండును నూట వర్షంబులు భూమి యనుభవించెదరు. వారి పుత్రులు పదు మ్ముర్వురు లు ముర్వురు తదనంతరంబ పుష్యమిత్ర, పటుమిత్రులు పదుముర్వురు, లేడ్వురును కోసలయందుఁ దొమ్మండ్రును భూపతులు కాఁగలరు. వారె లు. మాగధయందు విశ్వస్ఫటిక సంజ్ఞుం డన్యవర్ణంబులఁ గల్పింపఁ అఖిల క్షత్త్రకులంబు నణంచి మగధులు గంగా ప్రయాగ సమీపం ద్మావతీ పురంబున, నుండి భూమి ననుభవింపఁగలరు. కోసలాంధ్ర తామ్రలిప్త సమతట పురములను దేవరక్షితయను వాఁడు రక్షింపఁ కళింగ మాహిష మహేంద్ర జనపదంబులను, భౌమపురంబును ను భవించెదరు. నైషధనైమిషక కాలకోశక జనపదంబులను మణి వంశబులను భవింపఁగలరు. త్రైరాజ్య ముషికజనపదంబులను కన యుఁడు భుజించును. సౌరాష్ట్రావంత్య శూద్రాభీర దేశములను నర్మదా మి విషయములను వ్రాత్యద్విజా భీరశూద్రాదు లనుభవించెదరు. ట దావికోర్వి చంద్రభాగా కాశ్మీర విషయంబులను వ్రాత్యమ్లేచ్ఛ దులనుభవించెదరు. వీరు కలియుగమున సకాలికులగు రాజులు కాఁ నినుము. 456

సాదులు నధికకోపులు సర్వకాలానృతాధర్మలోలమతులు।
గోవధాదిక పాపకర్తలు పరధన హరణస్వభావరుచులు ।
రకు లుదితాస్తమితప్రాయు లల్పతరాయుష్యు లధికకాము,
రంభులగుదురు భూపతుల్ వారేలుజన పదవాసులెల్ల ॥

వడి నన్యాయపథచరిష్ణు, లగుచు మ్లేచ్ఛుల నడవడి నధికకలుష నాశ మొందంగఁ గలరుపరమ, యోగసంపన్న! యక్కలియుగమునందు॥

కార్యంబులే వ్యవహారహేతువులుగా స్త్రీత్వంబే యుపభోగ హేతువుగా తామూలంబే వృద్ధిహేతువుగా బ్రహ్మసూత్రంబే బ్రాహ్మణత్వ వుగా లింగధారణంబే యాశ్రమ హేతువుగా నన్యాయంబే వృత్తి వుగా నభయప్రగల్భోచ్చారణంబే పాండిత్య హేతువుగా, స్నాన

మాత్రంబే ప్రసాధనహేతువుగా, స్వీకరణమాత్రంబే వివాహ
సత్క్రియ ధారణమాత్రంబే పాత్రంబుగా, దూరోదకము నయనోదక
తీర్థంబుగా నిట్లనేక దోషంబులుగలిగి కలివేళ భూమండలంబు
బుట్టు క్షీణంబులు కాఁగలవు. వినుము.

క॥ ఏజాతివాఁడైనఁగాని, భూజనములలోన బలిమిపొదలినవాఁడే।
రాజగు కలియుగవేళధ, రాజనములనోడిచికొని కరముగ్రకొనుచున్

వ॥ ఇవ్విధంబున ॥

ఉ॥ లోలవిహారశీలు లతిలోభులు క్రూరులునై నసీచభూ,
పాలకులేచఁ బీడవడిపాడియుఁ బంటయులేక భూప్రజల్ ।
శైలవనప్రదేశములచక్కి వసింతురుగాక కందముల్,
మూలఫలంబు లున్మధువులుస్థళ పుష్పములున్ భుజించుచున్ ॥

క॥ తరువల్క పర్ణచీరా, వరణులగుచు శీతవాత వర్షాత పదు
ర్భర పీడకోర్చిగాథా, తురత, నశరణత్వమందుదురు ప్రజలెల్లన్ ॥

గీ॥ ఏడనైనను నిరువదిమూఁడువత్స, రములు బ్రతుకఁడునరుఁడు ధర
గలియుగవసానమున నిట్లఖిలజగంబు, లనుదినంబును నాశంబునంద

వ॥ శ్రౌతస్మార్త ధర్మంబులు విప్లవంబునొందిన సచరాచరంబైన
ప్రాయంబైన కలియుగంబు నంతంబున ॥

సీ॥ అఖిలజగత్స్రష్టయై చరాచరగురుండై సర్వమయుఁడయి యప్రమే
యుడై బ్రహ్మామై సముద్యచ్ఛక్తిచేనొప్పు వాసుదేవుని యనిర్వాచ్యశై
యంశంబు శంబరాఖ్యగ్రామముఖ్యుఁడౌ విష్ణుయశుండను విప్ర
కల్కినాజనియించి కలుషాస్పదీభూతకలివసానోద్భూత కలితపా

గీ॥ కాఖిలమ్లేచ్ఛతతుల దీవ్యత్కరాగ్ర, జాగ్రదుగ్రలసన్మండ లాగ్ర
ధారఁజక్కాడిధారుణీస్థలమునందుఁ, బొందుగానిల్పుఁగృతధర్మముఁ

వ॥ అనంతరం బ శేషకల్యవసాననిశావసానంబున జనపదంబులయంద
ప్రజలకు విమల బుద్ధిజనించు, కృతయుగంబునకు బీజభూత
మనుష్యులకుఁ దత్కాలంబున నపత్యంబులుపుట్టి కృతయుగ ధ
వృద్ధిఁబొందుదురు. వినుము ॥

గీ॥ అబ్జుఁడర్కుండు తిష్యంబు ననురగురుఁడు, నేకరాశిస్థులయ్యెద
నాఁడెకృతము ప్రవేశించునవ్యధర్మ, జననకారణనిజసముచ్ఛ్రయము

వ॥ అతీతవర్తమానానాగత భూపాలుర నీకెఱింగించితి. పరీక్షిత్తుజన్మ
కొని నందాభిషేకపర్యంతంబు వేయునేఁబది వత్సరంబులు

ోపలన్ను బూర్వోదితులగు నిద్దఱినడుమ సమంబుగా నే నక్షత్రంబు గానం
బడు దానితోఁగూడి యీ సప్తర్షులు మనుష్యమానంబున నూఱేండ్లుండుదురు.
పరీక్షిత్తునికాలంబున సప్తర్షులు మఘానక్షత్రమున నుండుదురు. అదిమొదలు
ద్వాదశాబ్ద శతాత్మకంబైన కలిప్రవేశించి యుండు ॥ 468

వవసరసీజనేత్రుఁడు జనస్తవనీయుఁడు కృష్ణుఁడెన్నఁడే
వమున కేగు నాఁడె జగతింగలి వ్రెండెఁ దదీయదివ్య ప
ద్మవరజమంటి మేదిని శుభస్థితినుండెడునాఁడు చేర రా,
విరళ పాపయుక్తిగల యక్కలికిన్ మునిలోకపూజితా ॥ 469

గవంతుండైన పుండరీకాక్షుండు దివంబునకుంబోయిన కలిప్రవేశించిన
దనంతరంబ విపరీతంబులగు దుర్నిమిత్తంబులుచూచి యుధిష్ఠిరుండు పరీక్షిత్తు
భిషిక్తుంజేసి మహాప్రస్థానంబుచేసె. ఎన్నఁడేని సప్తర్షులు పూర్వాషాఢం
ప్రవేశించెదరు నాఁడనందుఁడు కడచును. అచ్చటనుండి కలిప్రవృద్ధంబగు.
ట్టి కలియుగ సంఖ్యవినుము ॥ 470

రయఁగ, లక్షత్రయమును, నఱువదివేలునగు మానుషాబ్దంబులు నీ।
ఱుంగుము, కలియుగమునకున్, సరిడెబ్బది రెండువేలు సంధ్యబ్దంబుల్ ॥ 471

తత్పరిణామంబగు కలియుగంబు నిశ్శేషంబైన కృతయుగంబు ప్రవేశించు,
యుగయుగంబున మహాత్ములగు బ్రాహ్మణక్షత్రియ వైశ్యులుగలరు. వారికులం
లు నామధేయంబులును ననేకంబులగుటంజేసి యెఱింగింపనైతినని చెప్పి
, పరాశరునకు మైత్రేయుం డిట్లనియె ॥ 472

రవవంశసంభవుఁడు దేవాపియు, నిక్ష్వాకుకులజుఁడై యొసఁగుమరుఁడు।
రమ యోగాభ్యాస పరతకలాపక, గ్రామంబునందుండి కలియుగంబు।
న్నచోఁగృతయుగ సమయంబునందు, క్షత్త్రప్రవర్తకులయ్యెదరు మునీంద్ర।
యుగముల మూఁటియందుర్విపాలింతురు, మనుతనూభవులీక్రమంబు వెలయ॥

యుగంబున నితరజాతులు ధరిత్రి, యేలుదురు నీకుఁ జెప్పితినెల్ల నృపుల।
శకర్తల సంక్షేపవర్ణనమున, నంతయును జెప్పనలవియెయ్యజనకైన ॥ 473

ధివిగీతల యర్థంబు వినుము ॥ 474

దినాభూమి మదీయపుత్రకుఁడు వీఁడేలంగలం డింకఁజం,
దవిద్వేషులఁ దద్ధరాస్థలముపేర్మింబెంపుతో నేలెదన్।
యంబొంతెదనంచు నయ్యుగ చతుష్కక్ష్మాపతిశ్రేణి దు
దమోహంబులఁ ద్రుంగెఁగాని పరమార్థజ్ఞానిగాఁ డెవ్వఁడున్ ॥ 475

గీ॥ ధరణిపై ఘోర సంగరస్థలములందు మడియు రాజులఁ జూచియిప్పుడఖిల
నహహా తమహాత్మనా నే ననర్థమైన, మమత నూరక మూఢులై సమసిరి

ఉ॥ ఎంతని యెంచవచ్చు ధరణీశుల మోహమహాతమంబు, వి
భ్రాంతిని నమాత్య భృత్యులను బౌరులఁ గెల్చి యనంతరంబ, వి
క్రాంతిని నరాతులం గెలిచి గహ్వరియంతయు నాక్రమించి ని
శ్చింతత నేలువారమని శీఘ్రము చెందుదు రుగ్రమృత్యువున్ ॥

వ॥ సాగర సంవృతంబైన భూమండలం బాక్రమించినను జిత్తశాంతికల్గు;
శాంతిగల్గి యాత్మజయంబుచేసి ముక్తిఫలంబు చెందవలయు ॥

గీ॥ తాతతండ్రులోకింతయుఁ ద్రవ్వినన్నుఁ గొంచుఁబోవుట లేదుగాఁ గుటిలు
దనయు లేటికి మన్నమత్తాలతాని, బద్ధులై కూలెదరు ఘోరయుద్ధభూమి

క॥ ఎన్నక తండ్రులఁ దమ్ముల, నన్నలనైనన్వధింతు రక్కటనాకై ।
మున్నేనర పతులైనను, నన్నుసతము చేసి నిలిచినారా యెందున్ ॥

గీ॥ మమతనఖిలోర్వి యేలినమనుజపతులు, పోవఁజూచియు నిలిచినభూమి
నిడిమదీయమహీస్థలి యేమయనుభ, వింతుమని నాశ మొందెద రెంతవి

ఉ॥ నామహి నీకు నేలనగునా, యిదె వేగనతిక్ర మించినా
నామద మోఘ సాయక,గణంబులమున్ను వధించికొందునా ।
భూమియటంచు దూతలఁ, బ్రభుత్వమునం బరరాజుపాలి కు
ద్దామతనంపువారిఁ గని, తాల్తుదయూరస మందహాసముల్ ॥

వ॥ అని యిట్లుతొల్లి యంసకుండనుముని జనకునకుం జెప్పిన పృథివీగీ
చెప్పి శ్రీపరాశరుండు మైత్రేయున కిట్లనియె ॥

క॥ ధరణిగీతార్థము విను,పురుషులహృదయముల మమత పొలియు, నుదయ
ధరశిఖరాయాధాహ, స్కరుఁగని హిమచయము పొలియుకై వడిమఱి

వ॥ ఇమ్మను వంశంబు నీకుఁ జెప్పితి, ఇందు భగవదంశ భూతులైన రాజ
వీరిచరితంబు విన్నన శేషపాప క్షయంబును బుత్రపౌత్ర ధనధా
రారోగ్యంబులును, నభివృద్ధియునగు, సూర్యసోమాన్వయసంభవులగు
జహ్ను, మాంధాతృ, సగరావిక్షిత రఘువులను, యయాతి నహుష
విన్నఁ బురుషునకు మమత్వాది దోషంబులు పొరయకుండు ॥

గీ॥ క్రతువులొనరించి దానధర్మములు చేసి, ఘోరరణముల వైరులఁ గూ
వసుమతియు నేలి మేదినీవరులు పొలిసి, పోయిరే కాక నిలిచిరే భూమిమీ

సీ॥ అఖిలలోకముల నవ్యాహతగతిఁబూన, వైన్యుండునిలిచెనే వసుధమీఁద ।
ఇలయేడుదీవులు నేలినకార్తవీ, ర్యార్జునుండుండెనే యవనిమీఁద ।
సార్వభౌమత్వ ప్రశస్తుఁడౌమాంధాతృ, ధరణీశుఁడుండెనే ధరణిమీఁద।
గంగావతరణవిఖ్యాతి మంతుఁడుభగీ, రథుఁడునిల్చెనె యుర్వరాస్థలమున ॥

గీ॥ గురుయశస్కులు సగరకకుత్స్థరామ, రావణయుధిష్ఠిరాది భూరమణులిపుడు ।
నామమాత్రావశేషులైనారుగాని, నిలిచియుండుటలేదు మానికులవర్య ॥ 487

వ॥ ఇది తెలిసికొని పండితుండు సమస్తవస్తువుల యందు మమత్వంబు నొందండని శ్రీపరాశరుం డానతిచ్చిన ॥ 488

శా॥ శ్రీమద్ద్వారవదేహ దేహభృదతిక్షేమాప వర్గప్రదో
ద్దామాశ్చర్యపదోహ దోహనవిధాంత స్తోషసంవర్ధిత।
ప్రేమప్రాపితమాహ మాహసమయ క్రీడార్థసంక్లిష్టభ
ద్రామాంగళ్య వివాహవాహవిత తీంద్రస్నేహమోహావహా ॥ 489

క॥ శాండిల్య కండుమునిమా, ర్కండేయాదిక మునీంద్రరక్షణచణమా ।
ర్తాండఘన మండలాంత, ర్మండితమణిసౌధ మధ్యమస్థిరనిలయా ॥ 490

వనమయూరము.

భానురమణీ విసరబద్ధమహితోద్య
చ్ఛ్రీచసహితసౌధ ఘన శృంగనిహితారియు
గ్భాసిరుచిదీప్తితనభఃకకుబిలాంతా
హాసరుచిరానన సుధాంశురుచికాంతా ॥ 491

గద్య॥ ఇది శ్రీసుభద్రా కరుణాకటాక్షవీక్షాలబ్ధ కవిత్వతత్వపవిత్ర వేంకటామాత్య పుత్త్ర, కందాళ శ్రీరంగాచార్య కృపాపాత్ర, సజ్జనమిత్ర, శ్రీహరిగురు చరణారవింద వందన పరాయణ కలిదిండి భావనారాయణ ప్రణీతంబైన శ్రీవిష్ణుపురాణంబునందు మనువంశావతారంబును, బురూరవ జన్మంబును, మరుత్తృణబిందుల చరిత్రంబును, రేవతీవివాహంబును, నిక్ష్వాకు చరితంబును, బురంజయో పాఖ్యానంబును, గువలయాశ్వ, యువనాశ్వ మాంధాతృల చరిత్రంబును, సౌభరిచరితంబును, పురుకుత్సత్రిశంకు సగరులచరితంబును, గపిల ప్రభావంబును, భగీరథుండు భాగీరథి దెచ్చుటయును, మిత్రసహ ఖట్వాంగుల చరితంబును, శ్రీమద్రామాయణ కథనంబును, నిమిచరిత్రంబును, జంద్రవంశ సూచనంబును, జంద్రునిచరిత్రంబును, బుధజన్మంబును జహ్నుప్రభావంబును గాధిచరితంబును, విశ్వామిత్ర, జమదగ్ని రాములజన్మ ప్రకారంబును, రజి

చరితంబును, నహుషయయాతుల చరిత్రంబును, యదువంశావతారం శశిబిందు జ్యామఘుల చరిత్రంబును, దేవాపిసత్రాజిత్తుల చరిత్రం స్యమంతకమణి ప్రభావంబును, నక్రూరవసుదేవాదుల జన్మప్రకారం గర్ణపాండవ శిశుపాల జన్మప్రకారంబును, శ్రీకృష్ణావతార సూచనం దుర్వసుద్రుహ్యాన్వయను పూరులవంశ ప్రకారంబును శంతను చరిత్రం దుర్యోధనాదుల జన్మ ప్రకారంబును, పాండవసంతాన ప్రకారంబును ష్యద్రాజ వర్ణనంబును, గలియుగరాజ కథనంబును, గలియుగలక్షణంబు బృథివిగీతలును ననుకథలంగల చతుర్థాంశంబునందుఁ జతుర్థాశ్వాసము

మంగళమహా శ్రీ

శ్రీ కృష్ణార్పణమస్తు.

శ్రీసీతారామార్పణ మస్తు॥



Printed at the Ananda Press Madras—1931.

# విష్ణుపురాణము.

## తప్పొప్పుల పట్టిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 6 | అధిక | నధిక |
| 1 | 12 | ప్రతిభతో | ప్రభలతో |
| 5 | 10 | ఒల్ల | నొల్ల |
| 5 | 16 | దక్షణంబ | దక్షిణంబ |
| 6 | 19 | దురిచ్చత | దుచ్చరిత |
| 7 | 6 | కోరలు | ఁగోరలు |
| 7 | 26 | ప్రేరితు | ఁబ్రేరితు |
| 10 | 27 | త్త్త్వం | త్త్వం |
| 13 | 8 | వెలు | వేల |
| 13 | 18 | నఁల | నల |
| 13 | 19 | బర్వితా | బర్విఁదా |
| 14 | 11 | నుష్ఠాన | నుష్ఠ్సాన |
| 18 | 30 | ఋూనికె | ఋూనిక |
| ,, | ,, | మీర | మీఱ |
| 20 | 30 | టచేసి | టఁజేసి |
| 21 | 10 | నపుట్టె | నఁబుట్టె |
| 21 | 15 | పద | పదు |
| 22 | 20 | నిర్వా | నిర్వాహ |
| 22 | 30 | నత్యంతి | నాత్యంతి |
| 28 | 12 | ప్రజా | ఁబ్రజా |
| 28 | 16 | చని | ఁజని |
| 29 | 25 | తెలిగన్నుగొ | దెలిగన్నుఁగొ |
| 30 | 16 | లుబూ | లుఁబూ |
| 30 | 27 | డక | డఁగ |
| 32 | 23 | క్షేక్షల | క్షీక్షల |
| 34 | 9 | డక్కప | డక్కఁబ |
| 34 | 30 | సిని | సినీ |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 37 | 23 | క్షత్రి | క్షత్రియ |
| 37 | 24 | స్నగా | స్నఁగా |
| 38 | 12 | అరా | అఠా |
| 38 | 21 | ఎండే | యెండే |
| 38 | 22 | ఎందే | నెందే |
| ” | ” | శత్రృ | శత్రు |
| 41 | 5 | జాను | జను |
| 42 | 7 | చుపా | చుఁబా |
| 42 | 8 | నేలజాగి | నేలఁజాఁగి |
| 43 | 24 | చ్చుచు | ర్చుచు |
| 44 | 3 | అని | యని |
| 45 | 12 | వినూ | విని |
| 46 | 14 | త్స్నచం | త్స్నఁజం |
| 46 | 16 | కిపా | కిఁబా |
| 52 | 4 | కేలి | కేలు |
| 52 | 7 | బల | బలు |
| 54 | 10 | యుపం | యుఁ, బం |
| 54 | 30 | లప్రే | లఁబ్రే |
| 55 | 4 | లచ | లఁజ |
| 55 | 10 | పాడుక్ | బాడుక్ |
| 55 | 21 | గపో | గఁబో |
| 56 | 15 | గంగకల్ల | గంగఁగల్ల |
| 57 | 11 | ల్లచి | ల్లఁజి |
| 58 | 16 | మాత్రపా | మాత్రఁబా |
| 61 | 16 | తరుణ | దరుణ |
| 62 | 5 | దాక్ష | ద్రాక్ష |
| 62 | 10 | వేడు | వేఁడు |
| 63 | 28 | తలపక్ | తలఁపక్ |
| 64 | 9 | చుఁడీ | పుఁడీ |
| 64 | 25 | యిష్ట | యష్ట |
| 65 | 16 | పద | పదు |
| 66 | 12 | తండ్రి | దండ్రి |
| 67 | 10 | పుట్టెప | పుట్టెఁబ |
| 69 | 20 | పతీ | పఁదీ |
| 72 | 21 | లక్లే | లఁగ్లే |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 73 | 24 | కఁరుడ | కఱుఁడ |
| 74 | 22 | లపె | లఁబె |
| 76 | 15 | మిటికిక్ | మింటికిక్ |
| 76 | 29 | గతిమా | గతిఁజూ |
| 77 | 17 | చుచె | చుఁజె |
| 79 | 15 | చత | చఁద |
| 79 | 17 | యుత | యుఁద |
| 79 | 18 | బెల్లత | బెల్లఁద |
| 94 | 9 | డుక | డుఁగ |
| 96 | 25 | క్షత్రియ | క్షత్త్రియ |
| 100 | 7 | నూరు అంగు | నూఱంగు |
| 100 | 21 | పుచు | చుచు |
| 104 | 19 | ల్లుక | ల్లుఁగ |
| 105 | 20 | జాము్న | సుము్న |
| 105 | 21 | దలఁచు | దలఁపు |
| 109 | 17 | ద్దైమంత | గ్ధేమంత |
| 110 | 3 | యుంతు | యుఁదు |
| 111 | 26 | కోరి | గోరి |
| 111 | 30 | చుప్రా | చుఁబ్రా |
| 118 | 22 | లప్ర | లఁబ్ర |
| 121 | 12 | టుప్ర | టుఁబ్ర |
| 121 | 13 | పైత్వ | పైఁద్వ |
| 121 | 15 | సుక | సుగ |
| 124 | 25 | సుత్పు | సుద్పు |
| 128 | 15 | పరుతు | పఱుతు |
| 150 | 28 | మెహి | మైహి |
| 154 | 20 | నన్నిధి | సన్నిధి |
| 154 | 23 | చు,కా | చుఁ,గా |
| 155 | 9 | నిపూ | నిబూ |
| 159 | 32 | పత్ర | పత్య |
| 160 | 20 | మానిని | మానుని |
| 160 | 28 | ప్రీహాలు | ప్రీహులు |
| 161 | 24 | కుత్పు | కుఁద్పు |
| 174 | 5 | వుపచార | యుపచార |
| 175 | 14 | ముజ్వ | ముజ్జ్వ |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 175 | 16 | ద్యోతి | ద్ద్యోతి |
| 182 | 4 | తముతో | దముతో |
| 199 | 7 | డుయ | డున |
| 199 | 11 | గృతియా | గృతిపుట్టె. ఆ |
| 207 | 7 | కెవ్వవి | కెవ్వని |
| 209 | 29 | యిద్దఱు | యిద్దఱి |
| 212 | 30 | పుత్రులు | పుత్రులు పుట్టిరి. |
| 216 | 1 | దలునోనంగు | దలనోసంగు |
| 228 | 20 | యనుపుత్ర | పుత్ర |
| 230 | 22 | యాడద | యాడఁద |
| 231 | 32 | బడెసె | బడసె |
| 235 | 4 | వారలకు | వారలలో |
| 235 | 11 | మాగధ | మగధ |
| 238 | 14 | దెంద | దెద |
| 239 | 17 | దీప్తిత | దీషిత |

